# శ్రీనాథ భాషాపరిశీలన

## [ వర్ణనాత్మక విశ్లేషణము ]



నాగార్జున విశ్వవిద్యాలయమువారి
'డాక్టరేట్' పట్టముతోపాటు
స్వర్ణపదక బహూకృతి నందిన
సిద్ధాంత గ్రంథము



డాక్టర్ నేతి అనంతరామ శాస్త్రి, ఎం. ఏ., పిహెచ్. డి.
ప్రధానాంధ్రోపన్యాసకులు - ప్రభుత్వ డిగ్రీకళాశాల,
రేపల్లె.

"Srinādha Bhāshā Pariseelana" Doctoral Thesis of
Dr. Neti Anantha Rama Sastry, Lecturer in Telugu,
Government Degree College, Repalle – 522 265.

---

ప్రథమ ముద్రణము :
మహాశివరాత్రి, 1982.

ప్రతులు : 1000

వెల : రూ. 60/–



ప్రతులకు :
అరుణా పబ్లికేషన్స్,
బి$_1$-82 పట్టాభిపురం, గుంటూరు-522 006.

ముఖ పత్రచిత్రణ :
శ్రీ శీలావీర్రాజు.

ముద్రణము :
పి. రామకృష్ణమూర్తి,
మేనేజింగుడైరెక్టరు,
వెల్‌కమ్ ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్,
బ్రాడీపేట, గుంటూరు-2 ఫోన్ : 26081

---

Paper used for the printing of this book was made available
by the Government of India at Concessional rates.

# GARJUNA UNIVERSITY



. DONAPPA, M A, Ph D.
GISTRAR 1/C

Nagarjuna Nagar
522 510
Telephone: 23225

NU/SL3/Res./81. dt. 24-1-1981.

**PROCEEDINGS OF THE VICE-CHANCELLOR**

Award of the First Telugu Professor of Nagarjuna University Acharya **Thoomati Donappa** Gold Medal to the best Ph D Thesis in Telugu.

Recommendations of the Sub-Committee appointed by the Syndicate dated 22-1-1981.

---

## ORDER

'he Vice-Chancellor is pleased to order that the f the "**First Telugu Professor of Nagarjuna Uni- Acharya Thoomati Donappa Gold Medal**" be awarded **lethi Anantha Rama Sastri**, Lecturer in Telugu, .. College, Repalle for his thesis entitled 'ESCRIPTIVE ANALYSIS OF SRINADHA'S GUAGE".

( by order )

*(Sd.)* T. DONAPPA
Registrar 1/C.

True copy

"శ్రీ భీమనాయక శివనామధేయంబుఁ
జింతింప నేర్చిన జిహ్వ జిహ్వ
దక్షవాటీ పురాధ్యక్ష మోహనమూర్తిఁ
జూడంగ నేర్చిన చూపు చూపు
దక్షిణాంబుధి తటస్థాయి పావనకీర్తి
చే నింప నేర్చిన చెవులు చెవులు
తారకబ్రహ్మ విద్యాదాత యాదవల
విరులు పూన్పఁగ నేర్చు కరము కరము
ధవళకర్ణ శేఖరునకుఁ బ్రదక్షిణంబు
నర్థిఁ దిరుగంగ నేర్చిన యడుగు లడుగు
లంబికానాయక ధ్యాన హర్ష జలధి
మధ్యమునఁ దేలియాడెడు మనసు మనసు"

ఆచార్య తూమాటి దొణప్ప, ఎం. ఏ., పిహెచ్. డి.,
ఆంధ్రశాఖాధ్యక్షులు
నాగార్జున విశ్వవిద్యాలయము,
నాగార్జున నగర్.

# ఆశీస్సు

పరిశోధన మనగా 'దసుకు' దగ్గర కూచుని గ్రంథపీఠికలూ, కేటలాగుల అనువర్ణనలూ అక్కడక్కడ చూచి అక్కడిది కొంతా, యిక్కడిదొక కొంతా చేర్చి, అంతనా పొంతనా కుదరని అతుకుల బొంతను కూర్చడంకాదు. ఇదొక తపస్సు. ఇదొక దీక్ష. మరీమరీ చెప్పాలంటే యిదొక మహాయజ్ఞం. దీనికి వలసిన అధికారం అందరికీ వుండదు; అవసరమైన సంభారాలు ఎక్కడపడితే అక్కడ దొరకవు. అయితే, యిదేమీ బ్రహ్మవిద్య కాదు. అన్నీ అమరితే అభ్యాసం కూసువిద్య.

సుసంస్కృతమయిన శిక్షణా, బహుగ్రంథ సేవనమూ, నిశిత పరిశీలనాదృష్టీ, సాపేక్ష సంబంధిశాస్త్రాల పరిచయమూ, వస్తు సంయోజనా దక్షతా, నిరంతర సాధనా, సత్యావిష్కరణ తత్పరతా, తనదేదో, పూర్వ తనులదేదో వింగడించి వివరించే ఆర్జవమూ పరిశోధకునకు తప్పనిసరిగా ఉండవలసిన లక్షణాలు. భావావిష్కరణ పటిష్ఠమయిన శబ్దప్రభుత్వం సరేసరి.

ప్రకృత సిద్ధాంత వ్యాసరచయిత డా. నేతి అనంతరామ శాస్త్రి తన తలపెట్టిన కృషికి అనువయిన అన్నిహంగులూ అమరిన సమీక్షకుడు. నాగార్జున విశ్వవిద్యాలయం నుంచి తన సిద్ధాంత వ్యాసరచనకు సువర్ణ పతకాన్ని బహూకృతిగా పొందిన విశిష్టత

శాస్త్రీది. విశిష్య, ప్రకృతరచన శ్రీనాథ భాషాపరిశీలనం. సాహితీ ప్రస్థానంలో జైత్రయాత్ర సాగించడంకంటె భాషాప్రస్థానంలో సారథ్యం వహించడం పరిశోధకులకు చాల బరువయిన పని అని ఉభయ ప్రస్థానాల తీరులు తెలిసిన విద్వత్పరిశోధకుల ఉవాచ.

శ్రీనాథుడు అటు నన్నయాది ప్రాచీనకవులకూ, యిటు పెద్దనాది ప్రబంధకవులకూ నడుమ సాహితీ సార్వభౌమకశ్రీ నందిన బ్రాహ్మీమయమూర్తి. కథన ప్రధానమయిన పురాణ రచనా ప్రక్రియకూ, వర్ణనా ప్రధానమయిన ప్రబంధనిర్మాణ ఫక్కికకూ మహాసేతువువంటిది శ్రీనాథుని ప్రౌఢ సాహితీసృష్టి. సంస్కృత ప్రాకృతశౌరసేనీ ముఖ్యభాషాపరిజ్ఞానపాటవమూ, పూర్వకవిముఖ్య భారతీసందర్భ సౌభాగ్య గౌరవమూ, కర్ణాటక్షితిపాలమౌక్తిక సభాగారాంతరాకల్పిత స్వర్ణస్నానగతి ప్రసిద్ధ హేలావిలాసము ద్వీపాంతర మండలికా భూపాలక మాననీయ పురుషార్థ శ్రీవరుడయిన అవచితిప్పయ్యసెట్టితోడి బాల్యసఖిత్వమూ శ్రీనాథుని ప్రౌఢ వాగ్వైభవానికి నేపథ్యాన్ని సవదరించిన అంశాలు.

తెలుగునేల నాలుగు చెరగులనేగాక తమిళ-కన్నడనాడుల వంటి ఇరుగుపొరుగు సీమలలోను పలుతడవలు తిరిగి మూలమూలల లోని గడసరి పలుకుబళ్ళు గుర్తించి స్వీయభణితికి వింతసొగసులను సంతరించి 'నాకవిత్వంబు నిజము కర్ణాటభాష' అని ఘంటాఘోషంగా ప్రకటించిన మహోద్ధతుడాయన. కైవార హేరాళాది దేశ్యశబ్దాలను సంస్కృత సమాసఘటితంగా ప్రయోగించడంలోనూ, 'తరుణాసీరి, తవాయి, రమణా, హురుముంజి, పంజార, కప్పలి, జోంగు, వల్లి, వలికా, సమ్మాన్'వంటి దేశాంతర ద్వీపాంతర భాషాపదాలను వాడుక చేయడంలోనూ అతనికతడే సాటి.

ఒక నిర్దిష్ట కాలానికి సీమితమయిన భాషాప్రయోగ ఫక్కిని శాస్త్రీయరీతిలో నిరూపించే పద్ధతికి వర్ణనాత్మక భాషా విజ్ఞానమని శాస్త్రకారుల పరిభాష. సాహిత్యపరంగానే కాక, భాషావిషయంగానూ శ్రీనాథుడొక యుగకర్త. శ్రీనాథ భాషా పరిశీలనమనగా ఇంచుమించు శ్రీనాథయుగంనాటి భాషాలక్షణాలన్నీ డా. శాస్త్రి చేసిన ఈ పర్యాప్త పరిశీలనంలో ఇమిడిపోయినట్లుగా భావించవచ్చు. శాస్త్రోపదిష్టమార్గంలో తన పరిశోధనను నిర్దుష్టంగా నిర్వహించి పెద్దల మెప్పులందినందుకు డా. శాస్త్రిని అభినందించక తప్పదు.

(సం) తూమాటి దోణప్ప



ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మ, ఎం. ఏ., పిహెచ్. డి.,
ఆంధ్రశాఖాధ్యక్షులు
మధురై కామరాజ్ విశ్వవిద్యాలయం,
మధుర.

## అభినందన

ఇతర విషయాలతో పాటు, ప్రౌఢకవిత్వమూ బహుభాషా వైదుష్యమూ పురాణాగమాది పరిజ్ఞానమూ స్ఫురణకు రాక తప్పవు, శ్రీనాథుడనగానే. పద్యసాహిత్యమునూ పదసాహిత్యమునూ ఆదర పూర్వకంగా దర్శించగలిగిన అమృతహృదయుడుఆ కవిసార్వభౌముడు. భాషమీద ఆ విద్యాధికారికి గల అధికారం అనిర్వచనీయ మనడం సత్యసన్నిహితం. ఆయన ఎంత గరీయః ప్రతిభుడో ఆయన విహరించిన భాషాప్రపంచం కూడా అంత విస్తృత మయింది. తత్సమ తద్భవాలతో పాటు తెలుగు తోబుట్టుభాషల మాటలు, అన్యదేశ్యాలు, చవిచక్కన కలనుడులు నానుడులు మొదలైనవి ఆయన కావ్యాలలో చుబ్బనచూరలు. ఆ సాహిత్య నిర్మాత కావ్య భాషకు ఆధునికభాషా శాస్త్రరీతిలో సంతరించబడిన వర్ణనాత్మక విశ్లేషణమే యీ పరిశోధన గ్రంథం.

సాధారణంగా సాహిత్యజిజ్ఞాసువులు కవితా రసాస్వాదన చేసినంతగా భాషాపరిశీలనకు పూనుకోరు. నిజానికి కవితా చాతురి భావమాధురి ఎంత ముఖ్యమైనవో, వాటిని విశదపరిచేందుకు తోడ్పడుతున్న భాషకూడా అంత ముఖ్యమయింది. ఈ దృష్టితో చూసినప్పుడు భాషాపరిశీలన తప్పనిసరి అనకతప్పదు. అంగీకరించకనూ తప్పదు. అయితే ఆకోవకు చెందిన గ్రంథాలు అంతగా వెలువడలేదు. శ్రీనాథపదప్రయోగ నైపుణిని సశాస్త్రీయంగా పరిశీలించి

అవగాహన చేసుకోడానికి బహుధా ఉపకరిస్తున్న యీ గ్రంథం ఆ కొరతను చాలావరకు తీరుస్తున్నదనవచ్చు.

ప్రధానంగా శ్రీనాథుని భాషాపరిశీలనకు సంబంధించిన గ్రంథమే అయినా, ఇందులో నన్నయాదికవుల భాషావిశేషాలు కూడా పరిశీలించడం జరిగింది. అంతేకాదు, శ్రీనాథుని కావ్యాలలో ప్రయుక్తమైన అన్యదేశ్యాలకు వ్యుత్పత్తి వివరింపబడడం ఈ రచనలోని మరొక విశేషం. అందువల్ల తెలుగుభాషా చారిత్రక వ్యాకరణ రచనకూ, సమగ్రాంధ్ర నిఘంటు నిర్మాణానికీ ఈ గ్రంథం ఎంతైనా ఉపకరిస్తుంది. శ్రీనాథుడు ప్రయోగించిన వైకృతములు, సమాసములు మొదలైనవి చోటుచేసుకున్న అనుబంధాలు కూడా తప్పక పరిశీలించదగినవి.

ఈ విషయాదికాన్ని అలవోకగా పరిశీలించినా, మిత్రులు డాక్టర్ నేతి అనంతరామశాస్త్రి చేసిన పరిశోధనలోని వైశిష్ట్యం తెలియకపోదు. ఇది ఒక ప్రశస్తమైన రచన కనుకనే, నాగార్జున విశ్వవిద్యాలయం వారిచే 1981 వ సంవత్సరంలో అత్యుత్తమ పరిశోధన గ్రంథంగా ఎంపిక చెయ్యబడడమే కాక ఆచార్య తూమాటి దోణప్ప స్వర్ణ పతకమును కూడా సంపాదించగలిగింది. ఇందుకు రచయితను అభినందిస్తున్నాను. మిత్రులు డాక్టర్ అనంతరామశాస్త్రి ఇంకా ఇటువంటి ఉద్గ్రంథాలు రచించి తెలుగుభాషకు పుష్టి కలిగిస్తారని ఆశించవచ్చు.

మధుర
8-2-82

(సం) చల్లా రాధాకృష్ణ శర్మ.

ఆచార్య జి. యన్. రెడ్డి, ఎం. ఏ., ఎం. లిట్., పిహెచ్. డి.,

కళాశాలాధ్యక్షులు,

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం,

తిరుపతి.

# మ న సా, వా చా

తెలుగు సాహిత్యచరిత్రకు సంబంధించి వెలువడ్డ గ్రంథాలు మనకు ఎన్నోవున్నాయి. ఆంధ్రసాహిత్యానికి సమగ్రచరిత్రను వ్రాసే ప్రయత్నం కూడా కొంతసాగింది. తెలుగు భాషాచరిత్రను తెలిపే గ్రంథాలు లేవనిచెప్పలేంకాని ముచ్చటగా మూడున్నాయని చెప్పవచ్చు. తెలుగు భాషాపరిణామ చరిత్రను-రెండువేల సంవత్సరాల చరిత్రను - సమగ్రంగా ప్రదర్శించే ప్రామాణిక గ్రంథం మాత్రం ఇంతవరకూ లేదు. అయితే సమగ్రాంధ్ర భాషాచరిత్రకు సామగ్రిని చేకూర్చే అనేక పరిశోధక వ్యాసాలు, కొన్ని సిద్ధాంత గ్రంథాలు తెలుగులోను, ఇంగ్లీషులోను ఇటీవల వెలువడివుండటం - ఇంకా వెలువడుతూ వుండడం - ముదావహమైన విషయం.

తెలుగు భాషాచరిత్రకు ప్రధానమైన ఆధారాలు రెండు :
1. తెలుగు శాసనాలు. 2. తెలుగు గ్రంథాలు. భాషాచరిత్రకు కావ్యభాషకన్న శాసనభాష బలీయమైన ఆధారం. కాని ప్రకటితమైన తెలుగు శాసనాలు సుమారు మూడువేలు మాత్రమే వుంటాయి. లభించిన శాసనాల్లో ఇది అర్ధభాగం మాత్రమే. తెలుగు కావ్య ప్రబంధాది గ్రంథాలు చాలవరకు పరిష్కరణ పూర్వకంగా ముద్రితమైవున్నాయి. వాటిలో నన్నయ, నన్నెచోడ, తిక్కన, శ్రీనాథాది కవుల కృతులకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ పదసూచికలను - వితండవాదులు కొందరు విమర్శించి వద్దన్నా -

ప్రచురించింది. ఆ పదసూచికలు ఆయా కవుల భాషా స్వరూప ప్రదర్శనోత్సాహకులకు, పరిశోధకులకు కరదీపికలు కాగలవని, భాషాచరిత్ర రచయితలకు సోపానప్రాయములుగా ఉపయోగ పడగలవని అకాడెమీ ఆశించింది. ఆ పదసూచికల ఆధారంగా కొన్ని సిద్ధాంత వ్యాసాలు కూడా వెలువడినాయి. అకాడెమీ 1966—71లో ప్రచురించిన శ్రీనాథ పదప్రయోగకోశ సంపుటాలను ఆధారంగా గ్రహించి ఇప్పటికి మూడు సిద్ధాంత వ్యాసాలు మూడువిశ్వవిద్యాలయాల్లో వేర్వేరుగా పుట్టినాయి అవి: (1) A Descriptive Grammar of Srinadha's Language, 1977, Sri Venkateswara University, (2) శ్రీనాథుని భాష - వర్ణనాత్మక విశ్లేషణం, 1978, నాగార్జున విశ్వవిద్యాలయం. (3) శ్రీనాథ కృతులలోని భాషావిశేషములు, 1981, ఢిల్లీ విశ్వవిద్యాలయం. పై మూడింటిలో మొదటిది ఇంగ్లీషులో వ్రాయబడింది అముద్రితంగా వుంది. మూడవది తెలుగులో వుంది కాని అది సంప్రదాయ వ్యాకరణ దృష్టితో వ్రాసిన సిద్ధాంతవ్యాసం అసమగ్ర పరిశీలన. అముద్రితంకూడా. ఇక రెండవ సిద్ధాంత వ్యాసం శ్రీనాథుని భాష - వర్ణనాత్మక విశ్లేషణం. 1977లో పూర్తి కావింపబడ్డ రచన ఆ సిద్ధాంతవ్యాసమే 'శ్రీనాథ భాషా పరిశీలన' పేరుతో మీచేతుల్లో వున్న గ్రంథం. ఇదొక ప్రామాణిక గ్రంథం. ఈ గ్రంథ రచనకు, గ్రంథ ప్రచురణకు అన్నివిధాలా అభినందనీయులైన భాషా పరిశోధకులు డా॥ నేతి అనంత రామశాస్త్రి గారు. ఈ గ్రంథాన్ని చదివిన తర్వాత - మిగిలిన రెండు సిద్ధాంతవ్యాసాలు అసూర్యంపశ్యలుగా వుండిపోయినా మునిగిపోయేది ఏమీ లేదని- ఆ రెంటిని కూడా చూసినవాణ్ణి కాబట్టి - నాఅభిప్రాయం. ఇంతకన్నా ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని మరొకవిధంగా చెప్పడం అనవసరం.

స్వయంకృషితో ఆధునిక భాషా శాస్త్రాన్ని అధ్యయనం చేసి దాని ఆయువు పట్టుల్ని పట్టుకొని, మెలకువల్ని తెలుసుకొన్న

పరిశోధకులు రామశాస్త్రిగారు. శ్రీనాథుని తెలుగు భాషను - తన్నిర్మాణ స్వరూపంలోని అన్ని పారల్లో ఆధునిక భాషాశాస్త్ర పరికరాలతో, పరిభాషతో, నిర్దుష్టంగా విశ్లేషించి ఈ గ్రంథంలో శాస్త్రీయంగా ప్రదర్శించిన విధానాన్ని భాషాశాస్త్రజ్ఞులు 'భేష్' అనక తప్పదు. శ్రీనాథ పదప్రయోగ కోశాన్ని ఆధారంగా గ్రహించినా, రామశాస్త్రిగారు శ్రీనాథ కృతులన్నింటినీ క్షుణ్ణంగా చదివి సూక్ష్మేక్షికతో పరిశీలించినారని ఈ గ్రంథంలోని ప్రతి ప్రకరణం చెప్పక చెబుతుంది.

ఆంధ్ర సాహిత్య చరిత్రలో శ్రీనాథుడొక యుగకర్త. తెలుగు భాషాచరిత్రలో కూడా శ్రీనాథుని స్థానం విశిష్టమైంది. దేశిపద ప్రయోగంలోను, తత్సమపద ప్రదర్శనలోను శ్రీనాథ మహాకవిది తనదైన ఒక ప్రత్యేకత కొంత కద్దు. ఆ ప్రత్యేకతను కూడా డా॥ రామశాస్త్రిగారు ఇందులో సోదాహరణంగా సందర్భోచితంగా గుర్తించి తెల్పడం ప్రశంసార్హమైన విషయం. శ్రీనాథుని భాషను గురించి ఈ గ్రంథంలో చెప్పక విడిచిపెట్టిన అంశం ఏదీ లేదని నాకు తోస్తుంది. శ్రీనాథ భాషాతత్త్వ జిజ్ఞాసువులకే కాక, తెలుగు భాషాచరిత్ర కారులకు కూడా ఇదొక ప్రమాణ గ్రంథం. శ్రీనాథేతర తెలుగు కవుల కృతుల్ని భాషాపరంగా పరిశీలించే పరిశోధకులకు ఈ గ్రంథ రచనా విధానం ఒక ఒరవడిగా వుండ దగింది. ఇట్టి ప్రమాణగ్రంథాన్ని రచించి ప్రచురిస్తున్న డా॥ రామశాస్త్రిగారిని మనసా, వాచా అభినందిస్తున్నాను.

తిరుపతి
28-2-82

(సం) జి.యస్. రెడ్డి

ఆచార్య చేకూరి రామారావు, ఎం. ఏ., పిహెచ్. డీ.,

భాషాశాస్త్రశాఖాధ్యక్షులు,

ఉస్మానియా విశ్వవిద్యాలయం,

హైదరాబాదు.

## భాషాగతి తర్కం : 'శాస్త్రీ'య కృషి.

అభిప్రాయప్రకటన సాధనాలన్నిట్లోనూ భాష మహిత్తమైనది. అందుకు కారణం అతి ఘటితమైన యంత్రాంగం (System) భాషకు ఉండటమే. ఈ యంత్రాంగంలో కొన్ని అంతరువులు, ఆ అంతరువుల్లో పరస్పర నిర్దిష్ట సంబంధమున్న అంశికాలు (Units) ఉంటాయి. ఇదంతా కంటికి కనిపించేదికాదు. అంతమాత్రంచేత ఊహాకందని బ్రహ్మ పదార్థమూ కాదు. బుద్ధికౌశల్యంచేత, పరిశీలనపాటవం వల్ల జిజ్ఞాసతో చేసే అన్వేషణ మూలంగా ఆ యంత్రాంగనిర్మాణాన్ని, అది పనిచేసే తీరును అంతా ఒక్కసారి కాకపోయినా, కొంతకొంత క్రమక్రమంగా గ్రహించగలుగుతాం. అట్లా గ్రహించటానికి తరతరాలుగా వివిధ దేశాల్లో భిన్నసంస్కృతులవారు ప్రయత్నిస్తున్నారు. వారందరి కృషి ఫలితంగా ఏర్పడిన విజ్ఞానాన్నే భాషాశాస్త్రం అని పిలుస్తున్నాం.

ఈ భాషాయంత్రాంగాన్ని బహుకోణాలనుంచి పరిశీలించవచ్చు. ఈ యంత్రాంగం సమాజావసరాలకు ఎట్లా ఉపయోగిస్తున్నది? ఈ యంత్రాంగాన్ని మనిషి ఎట్లా వయసుతోపాటు నిర్మించుకుంటాడు? ఇది ఒక భాషను వ్యవహరించే వాళ్ళందరికీ ఒకే రకంగా ఉంటుందా? ఉంటే ఎట్లాంటి భేదాలు ఉంటాయి? భిన్నభాషా వ్యవహర్తల యంత్రాంగాలు భిన్నమైనా, సామ్యాలెట్లాంటివి? ఈ యంత్రాంగం పక్షాలంలో ఎట్లాంటి మార్పుల్ని పొందుతుంది? ఈ ప్రశ్నలకు

సమాధానాలిచ్చే ప్రయత్నంతోనే భాషాధ్యయనభేదాలు మొదలయినై. అవే భాషాశాస్త్రంలో భిన్నశాఖలుగా ప్రవర్తిల్లినై.

భాషాయంత్రాంగన్ని ఒక స్వయంసంపూర్ణయంత్రంగా కూడ దర్శించవచ్చు. ఈ యంత్రం మామూలు వస్తూత్పాదన యంత్రంలాంటిది కాదు. సజీవయంత్రం. ఈ యంత్రాన్ని ఛేదించే శక్తులు కాలంలో ఉన్నై. ఈ ఛేదనయంత్రాలు నిరంతరం జరుగుతుంటై. ఈ యంత్రాలను నిరోధించేశక్తి భాషాయంత్రానికి లేదు. ఈ ఛేదన ప్రక్రియలో కొన్ని అంశికాలు ముక్కలు కావచ్చు. మరికొన్ని జారిపోవచ్చు అట్లా జరగటాన్ని అట్లాగే అనుమతిస్తే కొన్నాళ్ళకి ఈ యంత్రమే నామరూపాలులేకుండా పోవచ్చు. ఈ పరిస్థితులను తట్టుకోటానికి ఉన్న అంశికాల్లోనుంచే కొత్తవాటిని తయారుచేసుకొని వాటినన్నిటిని పరస్పరాపేక్షక నిర్దిష్టస్థానాల్లో సర్దుకొని భాషాయంత్రాంగం తన్నుతాను రక్షించుకొంటుంది సృష్టినాశాలు నిర్మాణచ్ఛేదనలు నిరంతరం జరుగుతూనే ఉంటై. యంత్రాంగచ్ఛేదన ప్రక్రియ ప్రతిక్షణం జరగుతున్నదే. ఏ నిర్దిష్టకాలంలో చూసినా భాషాంశికాలు (Linguistic units) పరస్పరాపేక్షక నిర్దిష్టస్థానాల్లో ప్రవర్తిస్తూ భాషాయంత్రాంగ నిర్మాణాన్ని పరిరక్షిస్తూనే ఉంటై. ఈ యంత్రాంగ నిర్మాణం (Structure) ఎప్పటికప్పుడు కొన్ని సూత్రాలమీద ఆధారపడి ఉంటుంది. సూత్రాలు మారుతుంటై. కొన్ని పాతసూత్రాలు మాయమయి కొత్త సూత్రాలు ఏర్పడుతుంటై. వీటి పరస్పర సంబంధాల్లోనూ మార్పులు వస్తుంటై. అంతేకాని అసలు సూత్రాలులేనిస్థితి ఉండదు. భాషాయంత్రాంగ స్థితికి - ఈ సూత్రాలే ఆధారాలు.

భాషను సజీవంగా నిలిపేది భాషాయంత్రాంగ నిర్వహణలో కనిపించే ఈ విరుద్ధ ప్రవృత్తుల పరస్పర సృష్టినాశాలమధ్య, నిర్మాణ,

ఛేదనలమధ్య సంఘర్షణే. దీన్నే భాషాగతితర్కం (Linguistic dialectics) అంటున్నాను ఇది అర్థం చేసుకుంటేనే భాషను సరిగ్గా అర్థం చేసుకోగలుగుతాం.

పరిశీలన సౌలభ్యంకోసం ఒక కాలపు భాషను, ఒక వ్యక్తి భాషను, స్వీకరించి పరిమితమైన భాషాయంత్రాంగాన్ని వర్ణిస్తాం. దీనికే వర్ణనాత్మకవ్యాకరణం అనేపేరు ప్రసిద్ధంగాఉంది. ఈ వ్యాకరణం మౌలికభాషకూ రాయొచ్చు. ఒకనాటి భాషకూ రాయొచ్చు. ఇట్లా భిన్నకాలాల భిన్నప్రాంతాల భాషాంతర్గత యంత్రాంగాన్ని వర్ణిస్తే ఆ భాషాగతితర్కం అర్థం అవుతుంది. ఆ భాషాపరిణామం తెలుస్తుంది. భాషాయంత్రాంగ విశ్వరూప సందర్శనానికి ప్రాతిపదిక ఏర్పడుతుంది.

ఈ పద్ధతిలో తెలుగుభాషను అర్థంచేసుకోటానికి ప్రయత్నాలు చాలా ఇటీవల ప్రారంభమయినై. బూదరాజు రాధాకృష్ణ, ఎ. కందప్పచెట్టి, కె. కె. రంగనాథాచార్యులు, వంటివారు దొరుకుతున్న శాసనాలను కాలక్రమానుసారంగా విశ్లేషించి లక్షణ ప్రదర్శన చేశారు. మరోపక్క కావ్యభాషను కూడా ఇట్లా విశ్లేషించటానికి మరికొందరు పరిశోధకులు ప్రారంభించారు. కె. నాగభూషణరావు నన్నయ్య భాషను, లింగమనేని బసవశంకరరావు నన్నెచోడుని భాషను విశ్లేషించి చూపారు ఆ వరసలో శ్రీనాథుడి కృతులలో భాషను బహుపరిశ్రమచేసి విశ్లేషించి భాషాపరిశోధక బృందంలో శాశ్వత స్థానాన్ని కల్పించుకున్నాడు నేతి అనంతరామ శాస్త్రి. శ్రీనాథుడికి పూర్వపు కవులలో చాలామంది భాష ఇంకా అస్పష్టంగానే ఉండిపోయింది. తిక్కనయ భాషావిశ్లేషణ పూర్తికానే లేదు. నిర్వచనోత్తరరామాయణం, 15 పర్వాల భారతం, నృసింహ, హరివంశపురాణాలు ఇంకా పరిశోధకుల కోసం వెతుక్కుంటూనే ఉన్నై. పండితారాధ్యచరిత్ర, బసవపురాణాలవంటి భాషోదధులు

అనవగాహాలుగానే ఉండిపోయినై. ఆపని ఇతరపనిమంతులకు వదిలి తానుమాత్రం శ్రీనాథ భాషాసముద్రపు లోతులు దర్శించి వచ్చాడు. ఆ కథాకథనమే ఈ గ్రంథం.

అనంతరామశాస్త్రి శ్రీనాథుడిభాషను మామూలుభాషలో చెప్పితే - చీల్చిచెండాడాడు. ఏ ఒక్క అంశమూ వదలలేదు. ఇట్లాటిపని చెయ్యాలంటే సూక్ష్మదర్శకత సంగతి అట్లాఉంచి ఎంత జబ్బపుష్టి కావాలి? ఎంత ఓపిక కావాలి? ఎంత ఓర్పు కావాలి? ఇవన్నీ ఉండబట్టే శాస్త్రి ఈపనికి పూనుకున్నాడు. భాషాచరిత్ర నిర్మాణానికి అత్యంతావశ్యకమైన ఈ పుస్తకాన్ని పనికొచ్చేపద్ధతిలో రచించాడు. అసలు సిద్ధాంతగ్రంథ సారాన్ని సింహావలోకనంలో 153 'పాయింట్లు'గా క్రోడీకరించాడు.. పరమప్రయోజనకరమైన నాలుగనుబంధాల్ని కూర్చాడు. (అయిదోది ఉపయుక్త గ్రంథసూచి. ఇది పుస్తకంలో ఉండాల్సిన భాగమే. దాని స్థానంలో 'లోకోక్తులు, నుడికారము' అన్న ఆరో అధ్యాయాన్ని (పే 345 - 364) అయిదో అధ్యాయంగా చేర్చి ఉండవచ్చు.) ఒక్కోసారి అనుబంధాలు అసలు పుస్తకంకన్నా ఎక్కువ ప్రయోజనకరంగా ఉంటై. జార్జి లేకాఫ్ (George Lakoff) వాక్యనిర్మాణక్రమంలో అప్రక్రమాల (Irregularity in Syntax) గురించి సిద్ధాంతగ్రంథం రాస్తూ ఆరు అనుబంధాల్ని చేర్చాడు. అసలు గ్రంథాన్నిమించి అవి భాషాపరిశోధకుల్లో బహుళప్రచారాన్ని పొందినై. ఒక అనుబంధంలో "క్రియలు, నామవిశేషణాలు ఒకే రకంగా ప్రవర్తిస్తాయి" అనిచేసిన అతని సిద్ధాంతంమీద భాషాపరిశోధకుల్లో ఎన్నో తర్జనభర్జనలు జరిగినై. అట్లాగే అనంతరామశాస్త్రికూడా మొదటి అనుబంధం లో శ్రీనాథుడి వైకృతపదాలు, వాటిమూలాలు చూపించాడు. సంస్కృత ప్రాకృతపదాలు తెలుగులోకి ఎట్లా, ఎన్ని, ఏ కాలానికి ప్రవేశించి నయో తెలుసుకోటానికి ఈపట్టిక ఎంతో ఉపయోగం.

రెండో అనుబంధం ఇంకా విలువైనది. శ్రీనాథుడు వాడిన తెలుగు సమాసాల్ని రెండంశాలు మొదలుకొని ఆరంశాలవరకూ ఉన్నవాటిని మొత్తం పట్టికగా కూర్చాడు. అంశాల సంఖ్య పెరుగుతున్నకొద్దీ సమాసాలసంఖ్య తరగటం మనం గమనించవచ్చు. నిజానికి వీటిలో ఇంకా కొన్ని భేదాలు సూచించవచ్చు. ఉదాహరణకు అలుక్సమాసాలను వేరుచేస్తే సమాసాలనుగురించి ఇంకా లోతుగా పరిశీలించవచ్చు. అలుక్సమాసాలు పేరుకు సమాసాలేకాని వాటిలో 'ఏకపదత్వం' కనిపించదు. అందువల్ల వాటిని వేరుచెయ్యాలి. అట్లాచేస్తే మూడంశాల సమాససంఖ్య ఇంకా తగ్గుతుంది. అట్లాగే సమాసాలను, సమానాధికరణ, వ్యధికరణ భేదాలుగా విడదీస్తే వాటిని గురించి కొన్నివిషయాలు చెప్పుకోవచ్చు. అయితే అన్నీ అనంతరామశాస్త్రి చేసిపెట్టాలనుకోవటం దురాశ. అరవైగుంజిళ్లు తీశావు ఇంకో ఆరు తియ్యరాదా? అనటంలాంటిది. ఇప్పటికి ఇతను చేసిందాన్ని ఉపయోగించుకొని ఇంకా ఎన్నో చెయ్యొచ్చు. మూడో అనుబంధంలో తెలుగు సంస్కృత శ్లిష్టాశ్లిష్ట ధాతువుల పట్టిక ఇచ్చాడు. ఈ పట్టిక సంశ్లిష్ట ధాతువులేర్పడే తీరు గమనించటానికి ఉన్నధాతువుల వ్యాకరణాన్ని, అర్థభేదాల్ని గ్రహించటానికి ఉపయోగిస్తుంది. నాలుగో అనుబంధంలో వ్యాకరణ పరిభాషాపదాలు, వాటి ఆంగ్ల సమాలు ఉన్నై.

అసలు పుస్తకంలో వర్ణనలూ, సంధులూ, నామాలూ, క్రియలూ, వాక్యాల గురించిన విశేషాలు వివరించాడు. కొన్ని సంస్కృత శబ్దాలను ఆనాడు ఎట్లా ఉచ్చరించేవారో తెలుసుకోటానికి తెలుగుపద్యాల్లో యతినియమం చాలా ఉపయోగకారి. జ్ఞానం అనే శబ్దాన్ని ఈ నాడు 'గ్నానం' అని చాలామంది ఉచ్చరిస్తున్నారు. శ్రీనాథుడి కాలానికి కూడా ఇట్లాంటి ఉచ్చారణ ఉండేదని చెప్పటానికి అనువైన ప్రయోగం "జ్ఞానేంద్రియ జ్ఞానకళలారు

సొరుగా" (కాశీ 1-139) అనేది చూపించి తిక్కనలోనూ ఇట్లాంటి ప్రయోగాలు ఉన్నయ్యన్నాడు. అట్లాగే 'స్నానం' అనేమాట ఇప్పటివారిభాషలో 'స్తానం' అనే ఉచ్చారణతో ఉంది. ఈ రకమైన ఉచ్చారణ లేకపోతే "స్నానముచేసి ధౌతపరిధానము గట్టి" అనేచోట యతి సరిపోదు. ఈ విషయంకూడా ఈపుస్తకం(పే.16)లో చెప్పాడు.

శబ్దరూపవైవిధ్యం అచ్చుల, హల్లుల మార్పులవల్ల ఏర్పడిన రూపవైవిధ్యాన్ని పట్టిక కూర్చాడు. వీటిని ఇంకా పరిశీలిస్తే గణాల కోసం కవులు కల్పించుకున్న వాటిని భాషలో సహజంగా మారిన వాటిని వేరుచెయ్యొచ్చు. రూపవైవిధ్యాన్ని పరిశీలిస్తే ఎన్నో రకాల మార్పులు శ్రీనాథుడి భాషలో ఎట్లా ప్రవర్తిల్లిందీ తెలుసుకోవచ్చు. స్వరసమీకరణంవల్ల 'చనవు>చనువు', 'పసవు>పసుపు' అని నామాల్లోనూ, 'ఉరలు>ఉరులు, తొరగు>తొరుగు, నలగు>నలుగు' అని క్రియల్లోనూ మార్పు వచ్చింది. ధాతువుల్లో జరిగిన ఈ మార్పువల్ల నేటిభాషలో అన్నీ ఉన్మధ్యాలుగామారి అప్పటికే భాషా యంత్రంలో ప్రవర్తిస్తున్న స్వరసమీకరణ సూత్రానికి విషయాలు అయినై. రెండు మూడక్షరాలమాటల్లో పూర్వ పరిసరంలో 'ఇ' వర్ణ బలంవల్ల పదాంత'అ'వర్ణం'ఎ'వర్ణంగామారినరూపాలు నేటిభాషలో చాలాఉన్నై. ఉదా॥ గాడిద>గాడిదె, తడిక>తడికె. దీన్ని స్వరతాలవ్యీకరణం అనొచ్చు. ఇట్లాంటి మార్పు శ్రీనాథుడి కాలానికే ఉన్నట్టు 'ఒరిమ>ఒరిమె, తీగ>తీగె,' అనే ప్రయోగాలవల్ల తెలుస్తుంది. అట్లాగే మూడక్షరాల మాటల్లో చివరి వ్యంజనం శ్వాసమైతే, నడిమి నాదంకూడా శ్వాసంగా మారిన రూపాలు నేటి భాషలో చాలాఉన్నై. 'అదుకు>అతుకు, బ్రదుకు>బ్రతుకు.' ఈ రకమైన మార్పు శ్రీనాథుడి కాలానికే ఉన్నట్టు 'బ్రతుకు' అనే ప్రయోగంవల్ల తెలుస్తుంది. నేటి తెలంగాణా భాషలో కనిపించే పదమధ్య 'నలడరట'ల మీది అజ్లోపం శ్రీనాథుడి భాషలోనూ

కనిపిస్తుంది. అంతేకాక ఇది ఆ కాలానికి రెండుపదాలమధ్య జరిగే సంధిసూత్రంగాకూడా విస్తరించినట్లు, 'ఏడ్వూరు, చెవుడ్పడు, చన్కట్టు, ఎదుర్కట్టు ఆనవాల్పట్టు' వంటి ప్రయోగాలవల్ల తెలుసుకోవచ్చు.

నానురూపవిజ్ఞానంలో శ్రీనాథుడు ప్రయోగించిన అరబ్బీ, పార్సీ, మరాఠీభాషాపదాలన్నీ వ్యుత్పత్తులతో, అర్థాలతో సహా ప్రదర్శించాడు శాస్త్రి. భాషావిషయంగా ఆనాటికి ఎన్ని అన్య దేశ్యాలు చేరినయ్యో తెలియటమేకాక శాస్త్రి చేర్చిన టిప్పణివల్ల ఆనాటి సంస్కృతీ విశేషాలుకూడా తెలుస్తున్నై.

'పట్టి' అనే విభక్తి ప్రత్యయం నేటిభాషలోలాగా శ్రీనాథుడి కాలంలోకూడ అన్నంతక్రియమీద వచ్చినపుడు హేత్వర్థబోధకం అవుతుందని 'నీబోటి పుణ్యవతులు గలుగబట్టి' [కాశీ ౭.౯౩] 'సురలు నసురులు సంప్రీతిఁ దరువంబట్టి' [కాశీ ౬.౭౦౩] వంటి ప్రయోగాలవల్ల తెలుస్తుంది (పే.: ౧౧)

'చు' వర్ణాంతమైన రెండక్షరాలధాతువుల్లో చివరవచ్చే 'చు' ఈ నాటి భాషలో 'యు' గా మారింది. ఉదా॥ కాచు > కాయు, తూచు > తూయు, దాచు > దాయు, దోచు > దోయు, ఈ రకమైన మార్పు శ్రీనాథుడికాలానకే ఉన్నట్లు, అది కావ్యభాషకు ఎక్కినట్లు, 'మోచు > మోయు. రాచు > రాయు' వంటి ప్రయోగాలవల్ల తెలుస్తున్నది. ఈనాటిభాషలో ఇట్లా మారినధాతువుల ప్రయోగం నాగరికంగా ఒప్పుకోరు.

ఇట్లా శ్రీనాథుడిభాషను తరచి తరచి ఎంతో శ్రమకోర్చి ఎన్నో విశేషాలు సేకరించాడు శాస్త్రి. "నేనుసైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను." అన్నట్లుగా తానుసైతం

సారుగా" (కాశీ 1-139) అనేది చూపించి తిక్కనలోనూ ఇట్లాంటి ప్రయోగాలు ఉన్నయ్యన్నాడు. అట్లాగే 'స్నానం' అనేమాట ఇప్పటివారిభాషలో 'స్తానం' అనే ఉచ్చారణతో ఉంది. ఈ రకమైన ఉచ్చారణ లేకపోతే "స్నానముచేసి ధౌతపరిధానము గట్టి" అనేచోట యతి సరిపోదు. ఈ విషయంకూడా ఈపుస్తకం(పే.16)లో చెప్పాడు.

శబ్దరూపవైవిధ్యం అచ్చుల, హల్లుల మార్పులవల్ల ఏర్పడిన రూపవైవిధ్యాన్ని పట్టిక కూర్చాడు. వీటిని ఇంకా పరిశీలిస్తే గణాల కోసం కవులు కల్పించుకున్న వాటిని భాషలో సహజంగా మారిన వాటిని వేరుచెయ్యొచ్చు. రూపవైవిధ్యాన్ని పరిశీలిస్తే ఎన్నో రకాల మార్పులు శ్రీనాథుడి భాషలో ఎట్లా ప్రవర్తిల్లిందీ తెలుసుకోవచ్చు. స్వరసమీకరణంవల్ల 'చనవు>చనువు', 'పసవు>పసుపు' అని నామాల్లోనూ, 'ఉరలు>ఉరులు, తొరగు>తొరుగు, నలగు>నలుగు' అని క్రియల్లోనూ మార్పు వచ్చింది. ధాతువుల్లో జరిగిన ఈ మార్పు వల్ల నేటిభాషలో అన్నీ ఉన్మధ్యాలుగామారి అప్పటికే భాషా యంత్రంలో ప్రవర్తిస్తున్న స్వరసమీకరణ సూత్రానికి విషయాలు అయినై. రెండు మూడక్షరాలమాటల్లో పూర్వ పరిసరంలో 'ఇ' వర్ణ బలంవల్ల పదాంత'అ'వర్ణం'ఎ'వర్ణంగామారినరూపాలు నేటిభాషలో చాలాఉన్నై. ఉదా॥ గాడిద>గాడిదె, తడిక>తడికె. దీన్ని స్వరతాలవ్యీకరణం అనొచ్చు. ఇట్లాంటి మార్పు శ్రీనాథుడి కాలానికే ఉన్నట్లు 'ఒరిమ>ఒరిమె, తీగ>తీగె, అనే ప్రయోగాలవల్ల తెలుస్తుంది. అట్లాగే మూడక్షరాల మాటల్లో చివరి వ్యంజనం శ్వాసమైతే, నడిమి నాదంకూడా శ్వాసంగా మారిన రూపాలు నేటి భాషలో చాలాఉన్నై. 'అదుకు>అతుకు, బ్రదుకు>బ్రతుకు.' ఈ రకమైన మార్పు శ్రీనాథుడి కాలానికే ఉన్నట్లు 'బ్రతుకు' అనే ప్రయోగంవల్ల తెలుస్తుంది. నేటి తెలంగాణా భాషలో కనిపించే పదమధ్య 'సలడరట'ల మీది అజ్లోపం శ్రీనాథుడి భాషలోనూ

కనిపిస్తుంది. అంతేకాక ఇది ఆ కాలానికి రెండుపదాలమధ్య జరిగే సంధిసూత్రంగాకూడా విస్తరించినట్లు, 'ఏడ్వూరు, చెపుడ్పడు, చనక్కట్టు, ఎదుర్కట్టు ఆనవాల్పట్టు' వంటి ప్రయోగాలవల్ల తెలుసుకోవచ్చు.

నానురూపవిజ్ఞానంలో శ్రీనాథుడు ప్రయోగించిన అరబ్బీ, పార్సీ, మరాఠీభాషాపదాలన్నీ వ్యుత్పత్తులతో, అర్థాలతో సహా ప్రదర్శించాడు శాస్త్రి. భాషావిషయంగా ఆనాటికి ఎన్ని అన్య దేశ్యాలు చేరినయో తెలియటమేకాక శాస్త్రి చేర్చిన టిప్పణివల్ల ఆనాటి సంస్కృతీ విశేషాలుకూడా తెలుస్తున్నై.

'పట్టి' అనే విభక్తి ప్రత్యయం నేటిభాషలోలాగా శ్రీనాథుడి కాలంలోకూడ అన్నంతక్రియమీద వచ్చినపుడు హేత్వర్థబోధకం అవుతుందని 'నీబోటి పుణ్యవతులు గలుగబట్టి' [కాశీ ౨.౧౩] 'సురలు నసురులు సంప్రీతిఁ దరుసంబట్టి' [కాశీ ౬.౭౩] వంటి ప్రయోగాలవల్ల తెలుస్తుంది (పే.౧౦౦)

'చు' వర్ణాంతమైన రెండక్షరాలధాతువుల్లో చివరవచ్చే 'చు' ఈ నాటి భాషలో 'యు' గా మారింది. ఉదా॥ కాచు > కాయు, తూచు > తూయు, దాచు > దాయు, దోచు > దోయు, ఈ రకమైన మార్పు శ్రీనాథుడికాలానికే ఉన్నట్టు, అది కావ్యభాషకు ఎక్కినట్టు, 'మోచు > మోయు. రాచు > రాయు' వంటి ప్రయోగాలవల్ల తెలుస్తున్నది. ఈనాటిభాషలో ఇట్లా మారినధాతువుల ప్రయోగం నాగరికంగా ఒప్పుకోరు.

ఇట్లా శ్రీనాథుడిభాషను తరచి తరచి ఎంతో శ్రమకోర్చి ఎన్నో విశేషాలు సేకరించాడు శాస్త్రి. "నేనుసైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను." అన్నట్లుగా తానుసైతం

భాషాచరిత్రకు అవసరమైన సంభారాల్ని తనవంతుగా కూర్చి పెట్టాడు ఇంతవిలువైన కృషిచేసి భాషా పరిశోధకులకందించిన అనంతరామశాస్త్రిని అభినందిస్తున్నాను.

నిజానికి ఈ పుస్తకానికి ఏ పీఠికా అక్కర్లేదు. (నాగార్జున విశ్వవిద్యాలయం వారు ఈ 'థీసిస్'ను ఉత్తమమైందిగా గుర్తించి స్వర్ణపతకాన్ని బహూకరించారు. నన్ను 'పీఠిక రాయమన్నప్పుడు ఆ మాటేఅన్నాను. ఆంధ్రాయూనివర్శిటీలో M. A తెలుగు కలిసి చదువుకున్నాం గనుక నన్ను మన్నన చేసే ఉద్దేశంతో ఈపీఠిక రాయమన్నాడనుకుంటున్నాను. ఇంకో విశేషంకూడా ఉంది. మా క్లాసువాళ్ళలో భాషాపరిశోధనలో తలదూర్చింది మేమిద్దరమే. నాకులేని పట్టుదల, పరిశ్రమచేసేశక్తి మా శాస్త్రికి ఉన్నై గనుక తానుచేసే కృషికి ఇది ప్రారంభంగానే పరిగణించి తన పరిశోధన మహాప్రస్థానాన్ని సాగించవలసిందిగా కోరుతున్నాను

హైదరాబాదు,
1982 ఫిబ్రవరి 22
మహాశివరాత్రి.

(సం) చేరా.



ఆచార్య పి. యస్. సుబ్రహ్మణ్యం, ఎం. ఏ., పిహెచ్. డి.,
భాషాశాస్త్ర శాఖాధ్యక్షులు,
అన్నామలై విశ్వవిద్యాలయం,
అన్నామలైనగర్.

# ఒ ర వ డి

డా॥ నేతి అనంతరామశాస్త్రిగారి "శ్రీనాథ భాషాపరిశీలన" తెలుగు భాషాచరిత్రకు సమగ్రంగా రచించడానికి తోడ్పడే గ్రంథాలలో ఒకటి. ఇదికేవలం భాషావర్ణనకిమాత్రమే పరిమితంకాక ఇందులో శ్రీనాథుడు వాడిన ఆదత్తపదాలచరిత్ర, ఆయన కవిత్వానికి అలంకార ప్రాయంగా వాడిన లోకోక్తులు, నుడికారం మొదలైన విషయాలు క్షుణ్ణంగా పరిశీలించబడ్డాయి. శ్రీనాథుని ప్రయోగరీతిని నన్నయ నన్నెచోడాది తత్పూర్వకవుల ప్రయోగరీతితో పోలుస్తూ సాగిన వర్ణన ప్రాచీన వైయాకరణుల మతాలనీ, ఆధునికభాషాశాస్త్ర సిద్ధాంతాలనీ అనుసంధించుకొన్నది. 'ఇరువై' వంటి వ్యావహారిక రూపాలు (పేజీ 150) శ్రీనాథుడి లేఖని ఆమోదముద్ర పొందడం వ్యావహారికభాషపై మన పూర్వులకు చిన్నచూపు లేదని చెప్పడానికి నిదర్శనం.

కవిసార్వభౌముడి కర్ణాటభాషను కర్ణపేయంగా వర్ణించిన ఈ గ్రంథం ఇతరకవుల గ్రంథాలకు వ్యాకరణాలు వ్రాసే పరిశోధకులకు ఒరవడి కాగలదని నమ్ముతున్నాను.

అన్నామలైనగర్,
3-2-82.

(సం) ప్ర. శ్రీ. సుబ్రహ్మణ్యం.

**Dr. K Mahadeva Sastry,** M A., D Litt ,
Retired Professor of Telugu.
**Sri Krishnadevaraya University,**
**ANANTAPUR.**

## OPINION

I have gone through your book on 'Srinadha's language and find that it is exceedingly well done both in the analysis of the subject matter and presentation. It gives us a total picture of the literary language of the 15th c., the central period in the growth of Telugu and one in which the classical literary tradition of the Kavi-traya was given a fixity by Srinadha. The meterial will be useful for preparing a comprehensive Historical and comparative grammar of the Telugu language

I congratulate you on the neat production of this work which is a valuable addition to the grammatical literature in Telugu.

Anantapur,
31-12-82.

(Sd) K. Mahadeva Sastry.



**Dr. N. Siva Rama Murthy, M. A., (Tel & ling) Ph. D.,**
Deputy Director,
**International Institute of Telugu,**
**HYDERABAD**

## COMMENDATION

I have gone through the thesis entitled 'A descriptive analysis of Srinadha's language (Srinadha Bhasha Pariseelana). I am very much impressed by the work done by Sri Anantha Rama Sastry. The grammatical analysis and the presentation in general are good. As we are aware that Srinadha wrote a number of kavyas unlike many other ancient poets The quantum of data much more larger when compared to poets like Nannaya and Nannechoda etc. In addition we find a variety of styles in Srinadha's works. Sri Sastry has analysed the intricacies of Srinadha's language and presented them in a neat manner.

The following findings of Sri Sastry are of interest to the scholars and students in Linguistics

1. The less frequency of forms containing geminated S
2. The non-availability of cluster, with the consonants TA, SA, NA, LA, RA.
3. The usage of praasa and yati between Ṛ-RU, and Ṛ -- RI respectively.
4. The usage of saardhabindu and nirbindu words in praasa.
5. The usage of EENI as drtapiakritika as well as kala.

6. The Sanskritic PA>VA.
7. The usage of Sandhi with words ending in A of Sanskrit equivalents.
8. The usage of certain spoken forms.
9. The rarity of I>A in prakrit equivalents.
10. The Sandhi change B>V due to Kannada influence.
11. The abundant usage of loan words.
12. The usage of double plurals like miiralu, vaaralu, and peerantaandruru, pekkandruru and illaandruru.
13. The usage of plural form to indicate honour.
14 The rare usage form like vaandru.
15. The usage of vaadu, viiddu, evvaadu, adi etc. in honorific sense also.
16. The frequent of usage of positions like KUURCI and also the usage of KORAKU, KINDA, DAAKA, PAYI, MIIDA etc.
7 The usage of KANNA and KANTE as free variants.
18. The usage of vairi samaasas.
19. The usage of some of the verbs as reflexives even without the auxilary verb KONU

Some of the points mentioned above indicate the poet's description. The description of the nouns and verbs is quite good.

I congratulate Sri Sastry for commendable work.

Hyderabad,
18-2-82.

(Sd) N. Sivarama Murthy.

# అవతరణిక

ఆంధ్రవిశ్వవిద్యాలయంలో బి. ఏ (ఆనర్సు) 1961 లో పూర్తయినతర్వాత, అక్కడే పరిశోధక విద్యార్థిగా చేరి పరిశోధన చెయ్యాలనే తలంపు నాకు కలిగింది. అప్పట్లో ఆంధ్రశాఖాధ్యక్షులుగా నున్నవారు నన్ను నిరుత్సాహపరచిన కారణంగా మచిలీపట్నం హిందూకళాశాల తెలుగుశాఖలో ఉద్యోగిగా చేరాను. అప్పట్నించి నాకు పరిశోధనచెయ్యాలనే కోరికఉంది. కానీ అవకాశాలు లభించలేదు.

1966లో ఆంధ్ర, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయాలవారు కళాశాలల్లో పనిచేసే అధ్యాపకులు అధ్యాపక విద్యార్థిగా చేరి పరిశోధన చేసుకోవటానికి అవకాశాన్ని కల్పించారు. ఈ అవకాశాన్నైనా వినియోగించుకుందామనే ఆలోచన కలిగింది ఇంతలో విజయవాడ ప్రభుత్వ కళాశాలనుంచి 1966లో అనంతపురానికి నాకు బదిలీ అయింది. అనంతపురం ప్రభుత్వకళాశాలలో పనిచేస్తున్నప్పుడు, ఆచార్య జి. యన్. రెడ్డిగారితో పరిచయం కలిగింది. ఆపరిచయాన్ని పురస్కరించుకొని నాకు పరిశోధనపై ఉన్నఆసక్తిని చెప్పి వారి పర్యవేక్షణలో పరిశోధన చెయ్యటానికి నాకు అవకాశం ఇప్పించాల్సిందిగాఅడిగాను.అడిగినవెంటనే వారు అంగీకరించారు.'రాయలసీమ వాడుక భాషలోని క్రియాపదాల నిర్మాణం' అనే విషయాన్ని నా పరిశోధనాంశంగా గ్రహించాను. దీనికి సంబంధించిన సాధనసామగ్రిని సేకరిస్తున్న సమయంలో (1968) ప్రభుత్వంవారు నన్ను విజయవాడ కళాశాలకు బదిలీచేశారు.యూనివర్శిటీ ప్రాంతంమారటం,రాయలసీమ ప్రాంతం దూరమవటంతో నాపరిశోధనకు అంతరాయం కలిగింది. కొంత నిరుత్సాహమే కలిగినప్పటికీ, సత్కార్యాన్ని ఆరంభించి మధ్యలో విడిచిపెట్టటం సమంజసం కాదనే భర్తృహరి ఉపదేశం స్ఫురణకు వచ్చింది.

తిరిగి 1972జూలైలో ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ఆంధ్ర శాఖాధ్యక్షులు, గురువర్యులైన తూమాటి దోణప్పగారితో పరిశోధన విషయం ప్రస్తావన చేయటం జరిగింది సాహిత్య విషయంపైగాక కావ్యభాషావిషయంపై పరిశోధన చెయ్యాలనే నాఅభిరుచిని వారికి సూచించాను. అప్పటికే నన్నయ, నన్నెచోడుల భాషపై సిద్ధాంత గ్రంథాలు వెలువడ్డాయి. కవిత్రయం తర్వాత భాషావిషయంలోనూ, ప్రక్రియా వైవిధ్యంలోనూ, గ్రంథప్రాచుర్యంలోనూ, స్వతంత్ర పదప్రయోగంలోనూ, తననేర్పు సామర్థ్యాన్ని చూపి ఆంధ్రవాఙ్మయాన్ని ఆపోశనపట్టినవాడు శ్రీనాథుడొక్కడే ననేభావంతో, శ్రీనాథునిభాషపై పరిశోధన చెయ్యాలనే నా అభిప్రాయాన్ని చెప్పినప్పుడు నా కుతూహలాన్ని గుర్తించి నా అభ్యర్థనను అవ్యాజానురాగంతో ఆదరించి నాపరిశోధనకు పర్య వేక్షకులుగా ఉండటానికి అంగీకారం తెల్పి అంకురార్పణ చేశారు ఆచార్య తూమాటి దోణప్పగారు.

విజయవాడ ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రోపన్యాసక వృత్తిలో ఉంటూ, 1972 జూలైలో ఆంధ్రవిశ్వవిద్యాలయ కళాశాలలో అధ్యాపకవిద్యార్థిగా చేరి 'శ్రీనాథునిభాష-వర్ణనాత్మకవిశ్లేషణము'అనే అంశంపై పరిశోధన ప్రారంభించాను. విషయాన్ని సేకరించే నిమిత్తం కొన్ని విశ్వవిద్యాలయాల, ఇతర గ్రంథాలయాల్లోని గ్రంథాలను పరిశీలించటం జరిగింది. అంతేగాక కొంతమంది ఆచార్యులను, మిత్రు లను స్వయంగా కలుసుకొని ఈవిషయంపై సంప్రదించి సలహాలను తీసు కోవటంకూడా జరిగింది. సాహిత్య అకాడమీవారు 'శ్రీనాథ పదప్రయోగ కోశం' మొదటి రెండు సంపుటాలను నాకోసమే ముద్రించారా అన్నట్లు అప్పుడే వెలువరించారు. ఈగ్రంథం నా పరిశోధన పూర్తయ్యేవరకు ఎంతో ఉపయోగించిందనే చెప్పాలి. దాన్ని ఆధారంగా తీసుకొని శ్రీనాథుడు వాడిన ప్రతిపదాన్ని ఒక్కొక్క

కార్డుపై రాసుకొని, వాటిని అకారాది క్రమంలో పెట్టుకొని, నామాలు, సర్వనామాలు, సంఖ్యావాచకాలు, విశేషణాలు, క్రియలు, అవ్యయాలుగా వింగడించుకొని పరిశీలించాను. అప్పుడు శ్రీనాథుని భాషలో సాధారణ నియమాలతోపాటు విశేష నియమాలుకూడా ఉన్నట్లు స్ఫురించాయి. వాటిని ఒకచోటచేర్చి సూత్రనిర్మాణం చేసుకొని రాసుకోవటం జరిగింది. సెలవుల్లో వాల్తేరుకు వెళ్ళి దోణప్పగారితో పై విషయాల్ని చర్చించి సలహాలను తీసుకోవటం జరుగుతుండేది. ఈవిధంగా నాలుగేళ్లు గడిచింది. ఇంతలో అనుకోకుండానే 1976లో ఆచార్య దోణప్పగారు నాగార్జున విశ్వవిద్యాలయానికి రావటంతో నా 'రిజిష్ట్రేషను' కూడా ఆంధ్రవిశ్వవిద్యాలయం నుండి నాగార్జున విశ్వవిద్యాలయానికి మార్చుకోవలసి వచ్చింది. దోణప్పగారి రాకతో నాపరిశోధన కార్యక్రమం వేగాన్ని పుంజుకొని కొంత సులభమైంది కాని నాసిద్ధాంతగ్రంథానికి తుదిమెరుగులు దిద్దుతున్న సమయంలో 1977 ఆగష్టులో ప్రభుత్వంవారు నన్ను విజయవాడ నుండి మాచర్లకు బదిలీచేశారు ఆసమయంలో ఆప్తమిత్రులు స్ఫూర్తిశ్రీగారు కొండంత అండగా నిలిచి సహకరించారు. అంతేగాక ఇతోధిక ప్రేరణ ప్రోత్సాహాలనిచ్చి, నేనురాసిన ప్రతిప్రకరణాన్ని అత్యంత వాత్సల్యంతో పరిశీలించి, ఎప్పటికప్పుడు తులలేని సూచనలు చేస్తూ, నాపరిశోధన కార్యక్రమానికి చేయూతనిచ్చారు ఆచార్య దోణప్పగారు. కొంతకాలం సెలవుపెట్టి గుంటూరులో టైపుచేయించి ఎట్టకేలకు 1977 డిసెంబరులో ఈపరిశోధన నిబంధనాన్ని నాగార్జున విశ్వవిద్యాలయానికి పిహెచ్.డి పట్టము నిమిత్తం సమర్పించటం జరిగింది. 1979వ సంవత్సరంలో నాగార్జున విశ్వవిద్యాలయం వారి 'డాక్టరేట్' పట్టంతోపాటు 1981వ సంవత్సరంలో ఇది అత్యుత్తమ పరిశోధన గ్రంథమని ఎంపికచేసి 'ఆచార్య తూమాటి దోణప్ప' స్వర్ణపతకాన్ని బహూకరించారు.

అప్పటినుంచీ దీన్ని వెలుగులోకి తీసుకురావాలనే తపన కలిగింది అడిగిన వెంటనే ఆంధ్రప్రదేశ్ విద్యాసాంస్కృతికశాఖ వారు రూ ౬000/- ఆర్థికసహాయం చెయ్యటంతోనూ, ప్రభుత్వం కోటాపేపరు ఇవ్వటానికి అనుమతించడంతోనూ పుస్తకాన్ని ముద్రించటానికి నిర్ణయించుకున్నాను. అప్పుడు ఈ సిద్ధాంతగ్రంథంలో కొన్ని చేర్చి, కొన్నిచోట్ల సవరించి, ముద్రణకు సిద్ధం చెయ్యటం జరిగింది. మొత్తంమీద అనేక వ్యయప్రయాసలకు లోనై నప్పటికీ 'శ్రీనాథభాషాపరిశీలన' అనేపేరుతో ఈగ్రంథం వెలువడుతున్నది. ఈ అనుశీలనము సహృదయపాఠకుల మన్ననలకు పాత్రమవుతుందని విశ్వసిస్తున్నాను.

**నమస్సుమాంజలి :**

పరిశోధన ప్రారంభించినప్పటినుంచి గ్రంథముద్రణ పూర్తయ్యే వరకు తోడ్పడ్డ ఆచార్యులు, పెద్దలు, మిత్రులు, సంస్థలగూర్చి ముచ్చటించటం అత్యవసరం.

నా పరిశోధనకి అవకాశాన్ని కల్పించి, ప్రోత్సహించి, పర్యవేక్షించి, ఆరంభంనుంచి అంతంవరకు అనేకామూల్య సలహాల నిచ్చి, ఆదరించి, ఈసిద్ధాంతగ్రంథానికి 'ఆశీస్సు' అభివ్యక్తీకరించిన పూజ్యులు ఆచార్య తూమాటి దోణప్ప గారికి నాకృతజ్ఞతా నమోవాకాలు.

ఏ సందేహం వచ్చినా తీర్చేవారు, మార్గ నిర్దేశకులు, ఈపరిశోధనక్రతువులో ఆధ్వర్యవం వహించినవారు, తమ పనులు చాలా ఉండికూడా స్వయంగా పుస్తకానికి ప్రూఫులు చూచినవారు సదాచార నిధియైన'స్ఫూర్తిశ్రీ' గారికి నాహృత్పూర్వక ప్రణామాలు

తిరుపతిలో ఉన్నన్నిరోజులూ యూనివర్శిటీ హాస్టల్సు ధామములో నాకు ఆశ్రయమిప్పించిన సౌజన్యమూర్తులు ఆచార్య

జి. యస్. రెడ్డిగారు. వాల్తేరులో తోడునీడై వచ్చి ఆశ్రయం కల్పించి ఆదరించిన శ్రేయోభిలాషి డా॥ జి. వి. యస్. ఆర్ కృష్ణమూర్తిగారు, విషయసమీకరణంలో సూచనలిచ్చి, ముద్రణానికి ముందు ఈ గ్రంథాన్ని పరిశీలించి అక్కడక్కడ చక్కనిసవరణలు సూచించి అభిమానించిన ఆత్మీయమిత్రులు ఆచార్య చేకూరి రామారావుగారు, అనంతపురం వెళ్ళినప్పుడు అండగానిల్చి పద పట్టికలు ఎలా తయారుచెయ్యాలో సూచనలిచ్చిన సహృదయులు కీ. శే. డా॥ కె. నాగభూషణరావుగారు, సంస్కృత వ్యాకరణ విషయంలో నాకుగలిగిన సందేహాల్ని విడమర్చిచెప్పిన గురుతుల్యులు మేడిచర్ల గోపాలకృష్ణమూర్తిగారు, ముద్రితగ్రంథాన్ని నిశిత దృష్టితో చదివి ముద్రారాక్షసాలను సూచించిన కవిమిత్రులు జి. సి. బసవరాజుగారు ప్రభృతులు - వీరుచేసిన సహాయం కృతజ్ఞతలతో తీరనిది.

పరిశోధన విషయాన్ని సేకరించే సందర్భంలో ఆంధ్ర, శ్రీవేంకటేశ్వర, ఉస్మానియా, శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయాల గ్రంథాలయాలు, హైద్రాబాదులోని ఆంధ్రసారస్వత పరిషద్గ్రంథాలయం, మద్రాసులోని ప్రాచ్యలిఖిత గ్రంథాలయం, వేటపాలెం లోని సారస్వతనికేతనం, పెదపాలెంలోని ఆర్యబాల సమాజం, గుంటూరు ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయం ఎంతో ఉపక రించాయి. పైసంస్థల అధికారుల తోడ్పాటు మరువరానిది.

ఈపరిశోధన చెయ్యటానికి ఆదరపూర్వకంగా అవకాశం కల్గించిన ఉన్నతవిద్యాశాఖాధికారికి, పరిశోధనార్థం అవసరమైన గ్రంథాలు కొనటానికి, ఆయా గ్రంథాలయాలను దర్శించటానికి ఆర్థికంగా రూ 500/- ఇచ్చిన యు.జి.సి కి, ఇది ఉత్తమమైన పరిశోధనగ్రంథంగా నిర్ణయించి, దీనికి ఆచార్య తూమాటి దోణప్ప పేరిటి స్వర్ణపతకం బహుమానంగా ఇచ్చి, దీనిప్రచురణకు అంగీక

రించిన నాగార్జున విశ్వవిద్యాలయానికీ, ఈ గ్రంథాన్ని అచ్చొత్తించ టానికి అభ్యర్థించినంతనే ఆర్థికసహాయం రూ 5000/– మంజూరుచేసిన ఆంధ్రప్రదేశ్ విద్యాసాంస్కృతిక శాఖకు, ఇంకనూ ఆర్థిక సహాయ మందించిన ప్రాజ్ఞులు, సాహితీ రసజ్ఞులు, వదాన్యులైన వై. బి రెడ్డి గారికి, యం. వి. ఆర్. ముత్యాలుగారికి, వి. కె. శర్మగారికి, పోలిశెట్టి సీతారామాంజనేయులుగారికి, ఆర్. వి. యన్ సుబ్బారావుగారికి నా ధన్యవాదాలు

అడిగినంతనే అవ్యాజానురాగంతో ఈ నా గ్రంథాన్ని పరి శీలించి 'అభినందన' అందించిన సాహిత్యవాచస్పతులు ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మ గారికి, 'మనసా వాచా' అభినందించిన బహు ముఖప్రతిభా భాస్వంతులు ఆచార్య జి. యన్. రెడ్డిగారికి, 'భాషా గతితర్కం : 'శాస్త్రీయ కృషి' ద్వారా అభిప్రాయం అందించిన ఆత్మీయమిత్రుడు, భాషాశాస్త్రకృషీవలుడు ఆచార్య చేకూరి రామారావుకు, 'ఒరవడి' ఒసగిన భాషాశాస్త్ర కోవిదులు ఆచార్య పి. యస్. సుబ్రహ్మణ్యం గారికి, 'అభిప్రాయం' ఇచ్చిన భాషాశాస్త్రనిష్ణాతులు ఆచార్య కోరాడ మహాదేవశాస్త్రి గారికి, 'ప్రశంస' తెల్పిన ఈ గ్రంథ న్యాయనిర్ణేతలలో ఒకరైన ప్రియమిత్రులు డా॥ యన్. శివరామమూర్తి గారికి నా మనస్సు మనస్సులు

ఔదార్యంతో వెచ్చని అభిమానాలు చూపిస్తున్న మా కళాశాలాధ్యక్షులు, సహృదయులు, సుహృదయులైన బి. ధర్మారావు గారికి, గ్రంథముద్రణ విషయంలో ఎప్పటికప్పుడు తొందరచేస్తూ ప్రోత్సహించిన హితైషి, మిత్రులు బి. సుబ్బారావు గారికి నా అభివాదాలు.

ముఖపత్రాన్ని తన అందమైన అక్షరమాలికతో అలంకరించిన ఆ ప్తులు శీలావీరాజు గారికి, సరికొత్త 'మైపు' నుపయోగించి, అచ్చు

తప్పులు విజృంభించకుండా అత్యంత శ్రద్ధవహించి ఈ సంపుటాన్ని సర్వాంగ సుందరంగా తీర్చి దిద్దినవారు వెల్‌కమ్ ప్రెస్ అధినేతలు పి. రామకృష్ణమూర్తి గారికి, వారి సిబ్బందికి, పరిశోధన, ముద్రణ సమయాల్లో అన్నివిధాల సహకరించిన నా సహధర్మచారిణి శ్రీమతి యన్. సావిత్రికి నా కృతజ్ఞతాసుమాంజలులు.

ఇంతమంది సహకరించి సాహాయ్యం చేస్తే ఈ పుస్తకం తయారయింది. ఇందులో నిజానికి నేను చేసిన పనేతక్కువ అందరినీ ఆనందాశ్రువులతో గుర్తుచేసుకుంటూ వీరందరికీ మనసారా కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను.

రేపల్లె,
మహాశివరాత్రి, 1982.

నేతి అనంతరామ శాస్త్రి.

# విషయానుక్రమణిక

## అనుబంధములు





# 0. ప్రవేశిక (Introduction)

0.1 ఆంధ్ర వాఙ్మయమున కవిత్రయము వారి తరువాత కొంచెె మించి మించుగా సమానమైన స్థానము నాక్రమించి యాంధ్రుల మన్ననలకు పాత్రుడు కాజాలినవాడు కవిసార్వభౌమ బిరుదాంకితుడైన శ్రీనాథుడు. బ్రాహ్మీదత్త వర ప్రసాదుడు, ఈశ్వరార్చనకళాశీలుడు, అభ్యర్హిత బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత బ్రహ్మజ్ఞాన కళానిధి, సకల విద్యా సనాథుడైన శ్రీనాథుడు పుంభావ సరస్వతి. ఆంధ్ర గీర్వాణ భాషలు అతని కనుసన్నల మెలగినవి. సంస్కృత వాఙ్మయ భాండాగారమునుకొల్లగొట్టి ఆంధ్రవాఙ్మయమునకు పుష్టిని, తుష్టిని చేకూర్చినాడు ఈతడు క్రీ.శ 1360 – 1450 సంవత్సరముల మధ్యకాలము వాడు ఆనసుయమున కొండవీడు, రాజమహేంద్రవరమును పరిపాలించిన రెడ్డిరాజుల యాస్థానమున నీతడుండెను.

0.2 సంప్రదాయ సాహిత్యమైన మార్గ కవితా మార్గము ననుసరించిన స్వతంత్ర కవి కవిత్రయము వారి తరువాత నాంధ్రమున భాషా సౌష్ఠవమొసగ రచించిన కవి శ్రీనాథుడే. అన్యదేశ్యప్రయోగము, వైకృతపద నిర్మాణము, కారకములలోని వైచిత్రి, క్రియల సొంపు, నూతనపదముల సృష్టి మొదలగు నన్నింటిని యుద్దండతతో నడపెను. కొన్ని శబ్దములకు నర్థములను తానే సృజించుకొని యున్నాడు. అట్టి పదములకర్థములు నిఘంటువులలో కూడ దొరకవు ఇతడు శాస్త్ర పారంగతుడగుటచే కాశీఖండాదుల యందు పాతంజల యోగశాస్త్ర మంత్రవిషయము లను పెక్కింటిని పొందు పఱచియున్నాడు. ఆ విషయములు శాస్త్రపరిచయమున్న వారలకు దప్ప తక్కిన వారలకర్థము కావు ఈతని గూర్చి దగ్గుపల్లి దుగ్గన తన నాచికేతోపాఖ్యాన గ్రంథమున

"సంస్కృత ప్రాకృత శౌరసేనీ ముఖ్య
భాషా పరిజ్ఞాన పాటవంబు
పన్నగపతి సార్వభౌము భాషిత మహా
భాష్య విద్యా సమభ్యాస బలము
పక్షపాద కణాద పక్షిలోదీరిత
న్యాయకళా కౌశలాతిశయము

"శ్రుతి పురాణాగమ స్మృతి సాంఖ్య సిద్ధాంత
కలిత వ్యుత్పత్తి గౌరవంబు
పూర్వకవి ముఖ్య విరచితాపూర్వ కావ్య
భావరస సుధా చర్వణ ప్రౌఢతయును
గండళింపంగ గాశికాఖండ నైష
ధ ప్రముఖ వివిధ ప్రబంధములొనర్చి"

అని పేర్కొనుటచే శ్రీనాథుడు గడించిన విజ్ఞానవిస్తృతి యెంతో బోధపడును. శ్రీనాథుడు సాంఖ్యాది సిద్ధాంతములను, శైవ వైష్ణవాగమములను, పాతంజలాది యోగములను, న్యాయ వైశేషికాది దర్శనములను కూలంకషముగ నెఱిగినవాడు

03 శ్రీనాథుని గూర్చియు, తత్కృత కావ్యములను గూర్చియు నమూల్యములైన గ్రంథములు, వ్యాసములు రచించిన వారనేకులున్నారు. ఇన్ని రచనలున్నను శ్రీనాథునికి సంబంధించిన పెక్కు విషయములింకను వివాద గ్రస్తములును, సందేహాస్పదములునై యున్నవి

మనకుపలబ్ధములైన శ్రీనాథ విరచిత గ్రంథములీక్రింద పేర్కొనబడుచున్నవి.

1. శృంగార నైషధము [క్రీ. శ 1395]    2. హరవిలాసము [క్రీ.శ. 1400]
3. భీమ ఖండము [క్రీ.శ. 1430]    4. కాశీఖండము [క్రీ.శ 1433]
5. శివరాత్రి మాహాత్మ్యము [క్రీ.శ. 1445]    6. క్రీడాభిరామము
7. పలనాటివీర చరిత్ర [బాలచంద్రుని యుద్ధము]    8. చాటువులు

వీనియందు చివరి మూడింటి కర్తృత్వము వివాదగ్రస్తము.[1] అయినను క్రీడాభిరామ, పలనాటివీర చరిత్రములు రెండును శ్రీనాథ కృతములని ప్రాజ్ఞులైన

---

1. కీ శే. వేటూరి ప్రభాకరశాస్త్రి : శృంగార శ్రీనాథము, పుట 249-251
కీ శే. కాటూరి వెంకటేశ్వరరావు : తెలుగుకావ్యమాల, పుట 66-68.
కీ శే. పింగళి లక్ష్మీకాంతము : తెలుగు విజ్ఞాన సర్వస్వము, సంపుటము 8. పుట 597 - 609.
ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము : ఆంధ్రసాహిత్యచరిత్ర సంగ్రహము, పుట 57-61.
ఆచార్య దివాకర్ల వెంకటావధాని : సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము, పుట 571-572.

పెక్కుమంది పెద్దల విశ్వాసము. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారిచే ప్రచురించబడిన శ్రీనాథ పద ప్రయోగ కోశము సంపుటము 1–2 [1966–1971] లకు సంపాదకులైన ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు పై గ్రంథముల నన్నింటిని శ్రీనాథ కృతములుగా నంగీకరించిరి. ఇట్టి సుప్రసిద్ధ విమర్శకాభిప్రాయము ననుసరించియు, లోకములో బహుజన ప్రచారము ననుసరించియు, ఈ రెండు గ్రంథములను శ్రీనాథ కర్తృకములుగనే సంభావించితిని. వీనితోపాటు శ్రీనాథునివిగ ప్రఖ్యాతిగాంచిన చాటువులను, కొన్ని శాసనపద్యములను కూడ పరిగ్రహించితిని.

0.4. ఈ మధ్యకాలమున పలు విశ్వవిద్యాలయములయందు శాసనకాలమందలి భాషను, సాహిత్యమునందలి భాషను, విశ్లేషించు విషయమున పరిశోధన అధికముగ జరుగుచున్నవి. 1937వ సంవత్సరమున కీ.శే. డా॥ చిలుకూరి నారాయణరావుగారు ప్రాఙ్నన్నయ, నన్నయ కాలములనాటి భాషనుగూర్చి పరిశోధనచేసి ఆంధ్రభాషా చరిత్రము గ్రంథమును రూపొందించిరి. ప్రాఙ్నన్నయ, నన్నయ యుగముల వాఙ్మయ భాషావిషయములపై డా॥ దివాకర్ల వేంకటావధానిగారు, ప్రాచీనాంధ్రమందలి శాసనభాషపై (క్రీ.పూ 200– క్రీ శ 1100) డా॥ బూదిరాజు రాధాకృష్ణగారు, మధ్యయుగమందలి శాసనభాషపై (క్రీ శ 1100 – 1600) కీ శే డా॥ ఎమ్. కందప్పచెట్టిగారు, అర్వాచీనాంధ్ర శాసనభాషపై (క్రీ.శ 1600 1900) డా॥ కె.కె రంగనాథాచార్యులుగారు, నన్నయభాష – వర్ణనాత్మక విశ్లేషణమను నంశముపై కీ.శే. డా॥ కె. నాగభూషణరావుగారు, నన్నెచోడుని కుమారసంభవము నందలి భాషపై డా॥ యల్. బసవశంకరరావుగారు పరిశోధన చేసిరి.

0.5 నన్నయ, నన్నెచోడుల తర్వాత ఆంధ్ర సాహిత్యమున శ్రీనాథుడు భాషను స్వతంత్రముగ ప్రయోగించుటలో ప్రసిద్ధుడు. కావున మనకుపలబ్ధము లగుచున్న శ్రీనాథుని గ్రంథములను, చాటువులను, గ్రహించి ఆధునిక భాషా శాస్త్రానుగుణముగా వర్ణనాత్మక విశ్లేషణమును గావించితిని. ఇది ప్రధానముగ వర్ణనాత్మక విశ్లేషణమైనను, అక్కడక్కడ పూర్వయుగములకు సంబంధించిన భాషా స్వరూపము తులనాత్మక ప్రయోజనము నుద్దేశించి రేఖా చిత్రముగ ప్రదర్శింపబడినది. ఇందు ముఖ్యముగా నన్నయ – నన్నెచోడ – తిక్కనల కాలములో ప్రవర్తితమయిన భాషను గుర్తించుట జరిగినది. దీని వలన తెలుగు భాష, చారిత్రికముగ నెట్లు పరిణతి చెందినదో కొంత వరకైనను తెలిసికొని చారిత్రిక వ్యాకరణమును వ్రాయుటకు దోహదకారికాగలదు. ప్రతిశతాబ్దము నందలి భాషను లక్షణము

నేర్పఱిచినగాని ఆంధ్ర భాషా చరిత్రమును సంపూర్ణముగ వివరించుటకు వీలుకాదు ఇది కేవలము భాషా శాస్త్ర పరిశోధనాంశమైనను అవసరమైన సందర్భములలో సంప్రదాయ వైయాకరణుల మార్గమును స్వీకరించుట జరిగినది.

0 6. మొత్తముపై నీ సిద్ధాంత గ్రంధము ఆఱు విభాగములుగాను, అనుబంధ విముగము ఆఱు విభాగములు గాను నిర్వహింపబడినది.

మొదటి విభాగము వర్ణ విజ్ఞానము. ఇందు శ్రీనాథుని భాషయందలి వర్ణ వ్యవస్థను, వర్ణముల వ్యాప్తి వివరములును, శబ్దరూపవైవిధ్యమున అచ్చుల దీర్ఘత యందలి రూపాంతరతను, అచ్చుల గుణము ననుసరించిన రూపాంతరతను, హల్లుల యందలి రూపాంతరతను, సోదాహరణముగ నిరూపించుట జరిగినది.

రెండవ విభాగమున సంధులలో వచ్చు మార్పులు ముఖ్యముగా నాల్గు విధములుగా వివరింపబడినవి. ఉదంత, అదంత ఇదంతములలో జరుగు సంధి మార్పులనేకాక ఆగమాదేశ ప్రత్యయములు చేరికచే కలుగు మార్పులను, ఆమ్రేడిత సంధిని గూర్చి, సమాసములలోని పూర్వరూపమును పరిరక్షించు విషయమును గూర్చి యిందు చర్చింపబడినది.

మూడవ విభాగము నామ రూప విజ్ఞానము నామ ప్రాతిపదికలు, కృత్తద్ధిత ప్రత్యయముల మార్పులు, తత్సమ పది, వైకృతపదములు, అన్యదేశ్యముల నిర్మాణము, సర్వనామ, సంఖ్యావాచక, విశేషణ, లింగవచన, విభక్తుల సమాసములు విశ్లేషణ పూర్వకముగ ప్రదర్శింపబడినది.

నాల్గవ విభాగము క్రియా రూప విజ్ఞానము. ఇందు క్రియా వ్యవస్థ సామాన్య, సంశ్లిష్ట, సంయుక్త ధాతునిర్మాణము, సార్వనామికానుబంధములు, సామాన్య సమాపక క్రియలు, సంయుక్త సమాపక క్రియలు, అకర్మక - సకర్మక - ప్రేరణార్థకములు, అసమాపక క్రియలు, క్రియా విశేషణములు, పదకల్పములు మొదలైన విషయములను గ్రహించి శ్రీనాథుని భాష యాధారముగ విశ్లేషించుట జరిగినది.

ఐదవ విభాగమున వాక్య విజ్ఞానము సామాన్య, సంశ్లిష్ట, సంయుక్త వాక్యముల విభజన, పదక్రమము, విశేష్య విశేషణములు విభక్తిప్రత్యయములలో సమరూపతను పాటించుట, యత్తత్పదక ప్రయోగములను వానిటలో

సంస్కృత పద్ధతిని గ్రహించుట మొదలైన విషయములను గూర్చి స్థూలముగ వివరింపబడినది.

శ్రీనాథుడు ప్రయోగించిన కొన్ని ముఖ్యమైన లోకోక్తులను, నుడికారములను ఆఱవ విభాగమున వివరించుట జరిగినది

తదుపరి ఈ సిద్ధాంత గ్రంథమున సూచించిన విభాగముల ముఖ్యమైన సారాంశము సింహావలోకనమున [153] సంగ్రహింపబడినది

శ్రీనాథుని రచనలలోని వైకృతపదములు - వాని మాతృకలతో కూడిన పదపట్టిక మొదటి అనుబంధములోను, రెండు - మూడు నాలుగైదు అంశముల సమాసముల విభజన రెండవ అనుబంధములోను, అచ్చిక సామాన్య, సంశ్లిష్ట, సంయుక్త; తత్సమ సంశ్లిష్టధాతువులు వాని అర్థవివరణము మూడవ అనుబంధములోను, గ్రంథమున ప్రయోగించిన పారిభాషికపదముల మూలములు నాలుగవ అనుబంధములోను. ఈ పరిశోధనకుపకరించిన ఆంధ్రాంగ్లభాషాగ్రంథముల వివరము ఐదవ అనుబంధములోను, ఈ గ్రంథమున వాడిన గ్రంథసంకేత, సంజ్ఞావివరణ పట్టికలు సంకేతపదవివరణమను ఆఱవ అనుబంధములోను సమగ్రముగా నిరూపింప బడినది.

0.7. నా పరిమితమైన శక్తితో అపరిమిత పాండిత్యముగల కవిసార్వభౌముని భాషను పరిశీలించుటకు పూనుకొంటిని. సాహసమేకాని సహృదయులకు ఆపెద్దకొండ ఈ చిన్ని అద్దమందు కొంచెమైనను కనిపించినచో నాప్రయత్నము సార్థకమగును.



# 1. వర్ణ విజ్ఞానము
## (PHONOLOGY)

### 1.0 వర్ణ వ్యవస్థ :

శ్రీనాథుని కావ్యభాష ననుసరించి వర్ణనిర్మాణ రీతులను రెండు విభాగములుగ విభజింపవచ్చును.

1. దేశ్య తద్భవ పద ఘటకములయిన వర్ణములు
2. తత్సమ పద ఘటకములయిన వర్ణములు

1.1 మొదటి విభాగము నందలి వానిని శ్రీనాథుని కావ్యభాష ననుసరించి యీ క్రింది విధముగ గుర్తింప వచ్చును

1. హల్లులు : 21

| | ఓష్ఠ్యములు | దంత్యములు | దంతమూలీయములు | మూర్ధన్యములు | తాలవ్యములు | కంఠ్యములు |
|---|---|---|---|---|---|---|
| స్పర్శము | ప<br>బ | త<br>ద | | ట<br>డ | | క<br>గ |
| స్పృష్టోష్మము | | | | | చ<br>జ | |
| అనునాసికము | మ | | న | ణ | | |
| ఊష్మము | | స | | | | హ |
| పార్శ్వికము | | | ల | ళ | | |
| తాడితము | | | ర | | | |
| కంపితము | | | | ఱ | | |
| అంతస్థము | వ | | | | య | |

**2. అచ్చులు : 10**

| | అగ్రస్వరము | పశ్చాత్ స్వరము |
|---|---|---|
| సంవృతము | ఇ | ఉ |
| అర్ధ సంవృతము | ఎ | ఒ |
| అర్ధ వివృతము | — | — |
| వివృతము | — | అ |

హ్రస్వాచ్చులకు దీర్ఘాచ్చులకు మధ్య అర్థభేదకత్వముండుట వలన దీర్ఘము ప్రత్యేక వర్ణముగ పరిగణింపబడినది. దీనినిబట్టి శ్రీనాథుని కావ్యభాషలో 21 హల్లులు, 10 అచ్చులతో కూడిన దేశ్య తద్భవ వర్ణమాల ఉన్నది

**3.** సంధ్యక్షరములు **:** అ – ఇ; అ – ఉ అచ్చుల యొక్క అనుక్రమము (Sequence) ఐ, ఔలుగా రూపొందినది. ఐ (అయ్) ఔ (అవ్) లకు అర్థ భేదకత్వము లేనందువలన నివి ప్రత్యేక వర్ణములు కావు. సంధ్యక్షరములు (Diphthongs) దేశ్యములలో అ, ఇలు అ, ఉ లు సన్నిహితముగా ఏకవర్ణస్ఫూర్తి కలుగునట్లు ఉచ్చరింపబడగా ద్విస్థానీయములైన ఐ, ఔలు ఏర్పడినవి. శ్రీనాథునిభాషలో వీనికి లక్ష్యములు:

| | |
|---|---|
| ఐ : సకల లోకాహ్లాద సంధానహేతువై | [కాశీ 4-182] |
| అయి : వ్యాకులుడయి నిజాంతర్గతంబున | [కాశీ 3-79] |
| ఔ : ఆచరించినం బావన మౌనె | [కాశీ 4-177] |
| అవు : దిక్పవమాన మదక్షిణంబవు గాక | [శృ. నై 2.13] |

ఇవి ఈ భాషకు నిసర్గవర్ణములుకావు. సంస్కృతమున కివి నిసర్గములు

1.1.1. రెండవ విభాగము నందలి వర్ణములు : ఈ క్రింద చూపబడు మహాప్రాణములైన స్పర్శములు, ఊష్మములు, హకారము తత్సమ పద ఘటకములుగా ప్రయోగ వశమున తెలుగులోనికి ప్రవేశించినవి.

1. హల్లులు : ఫ ధ ఠ ఛ ఖ
భ ధ ఢ ఝ ఘ
స ష శ హ

2. అచ్చులు : ఌ ఋ

1.1.2. వర్ణముల వ్యాప్తి వివరములు :

శ్రీనాథుని అచ్చికభాషనే ప్రధానముగా తీసికొనుటచే తత్సమము నందలి వర్ణవ్యాప్తిని గూర్చి ఇందు వివరించుటలేదు.

శ్రీనాథుని భాషలోని దేశ్య తద్భవ హల్వర్ణముల వ్యాప్తి నీ క్రిందివిధముగ గుర్తింపగలము

1 ఙ-, యి-, ళ- వర్ణములు తప్ప మిగిలిన హల్లులన్నియు పదాదియందు వచ్చును 2 అచ్చుల మధ్య హల్లులన్నియు వచ్చును. 3. తెలుగున హలంత వర్ణములు లేవు కాని -ను, -లు, -రు వర్ణములలోని ఉత్తు లోపించి ఉచ్చారణ సౌకర్యమునకై పదాంతమందు వచ్చుట కలదు 4. పదాది దీర్ఘాచ్చులకు పరముగ పూర్ణబిందుయుత హల్వర్ణము లేదు. 5. పదాది దీర్ఘాచ్చులలో / ఊ / కు తప్ప మిగిలిన వానికిపరముగా ద్విరుక్త హల్లులు లేవు. 6. / ఙ / వర్ణము తప్ప మిగిలిన హల్లు లన్నియు పదమధ్యమున ద్విత్వము పొందును 7 / ట /, / హ /, / ఙ /, / ళ /, / ఱ / వర్ణములతో హల్సంయోగము లేదు.

1.1 2 1. శ్రీనాథుని భాషలో సకార ద్విత్వముతోడి రూపములు అరుదుగా కనిపించు చున్నవి

లెస్స : మనువు లెస్సెయుండె బో మానవతికి [హర 4-28]
దిస్స : దిస్సమొలవేల్పు పార్వతీదేవి వట్టి [కాశీ 2-38]

లెస్స (తద్భవ) < లేశ్యా (సంస్కృత) ; దిస్స (తద్భవ) < దిశా (సంస్కృత) [1]

ధ్వన్యనుకరణ శబ్దములందు సకారద్విత్వముతోడి రూపములు కలవు

ఉస్సురను [కాశీ 7-45] ; ఇస్సిస్సియగు [హర 3-10]
బుస్సుమను [హర 4-87] ; త్రుస్సను [భీమ 5-119]

1 1 2 2 శ్రీనాథుని భాషలో నీ క్రింది హల్వర్ణములతో రేఫము పదాది యందు సంయుక్తత పొందును.

1. టి దొణప్ప : తెలుగులోని వైకృతపదాలు; తెలుగుభాషా చరిత్ర, 1974. పుట 312.

1. స్పర్శము - తాడితము

/ ప్ర- / : ప్రొద్దు [కాశీ 6-24]
/ బ్ర- / : బ్రతుకు [భీమ 2-159]
/ త్ర- / : త్రాడు [హర 6-40]
/ ద్ర- / : ద్రొబ్బు [శివ 3-61]
/ క్ర- / : క్రొత్త [భీమ 4-123]
/ గ్ర- / : గ్రద్ద [శృ నై. 7-107]

2. ఊష్మము + తాడితము

/ స్ర- / : స్రుక్కు [హర 6-65]

3. అనునాసికము + తాడితము

/ మ్ర- / : మ్రొక్కు [భీమ 6-41]

4 అంతస్థము + తాడితము

/ వ్ర- / : వ్రాఁత [భీమ 2-8]

1 1 3 వర్గము లందలి హల్లులకు ముందు వర్గానునాసికలు పరమైన యెడల లేఖనమున అనుస్వారము గుర్తింపబడును ఈ విషయములో సంస్కృత శబ్దములకున్న విలువే తత్సమ శబ్దములకును కలదు ఇది వర్గానునాసికములకు పర్యాయ వర్ణమే కాని ప్రత్యేక వర్ణము కాదు. నకారము తరువాత పరుష సరళములతో సంయోగము చెందునపుడు పూర్ణానుస్వారముగా మారును.

1.1 4 తత్సమపద ఘటకముగా తెలుగున గానవచ్చు శ్వాస మహాప్రాణమైన విసర్గము హవర్గమునకు సవర్ణముగా గుర్తింప బడుచున్నది. ఇది సిద్ధ సమాస శబ్దముల మధ్య వచ్చును హవర్ణము అజ్మధ్యస్థముగాను, విసర్గ హల్పూర్వముగాను ఉండును అప్పుడది కంఠ్యముగాని (జిహ్వామూలీయము) ఓష్ఠ్యము (ఉపధ్మానీయము) గాని అగును

అంతఃకరణము [కాశీ 6-54] ప్రాతఃకాలము [కాశీ 3-17]
దోఃప్రతాప [శృ నై. 1-51] పౌనఃపున్యము [కాశీ. 3-81]

దుఃఖము [కాశీ 2-143] స్రోతఃపూరము [కాశీ 3-17]

1 1.5. ఋ, ౠ ల ఉచ్చారణ ఎట్టిదో తెనుగువారు మఱచినట్లు కానవచ్చును. ఋ, ౠ లను అచ్చులను గుర్తించుటకు లేఖనమునందు తెలుగున ప్రత్యేకమైన చిహ్నములు ముద్రణ ప్రతులందు కలవు. ఈ ధ్వనులు తత్సమముల ద్వారమున ఈ భాషలోనికి ప్రవేశించినవి. కాని ఈ ధ్వనుల ఉచ్చారణమును నిర్ణయించుట కష్టము. ప్రాచీనమైన తెనుగులో వీనికున్న విలువ సంస్కృతములో అచ్చునకున్న విలువ వంటిదే యని చెప్పుట సంశయమే. నన్నయకు పూర్వమందలి శాసనభాషలో 'ఋ' అనెడి అచ్చు సాధారణముగా రి/రు గా వ్రాయబడినది.

ఉదా : ప్రిథివీదేశ [గుంటూరుజిల్లా -7th C.A D భారతి-వాల్యూం 24]
ప్రిథివి రాజ్యం [కడపజిల్లా - 8th C A D El. xxviii-240]
పితృహితార్థము [vi-649-గుంటూరు 1160 A.D ]
పితురు పితామహులకున్ [x-442 గుంటూరు 1277 A.D.]
గర్భగృహము [x-569, గుంటూరు 1398 A.D.V - 749]
కోదండ రుషి గోత్రం [xvi-217 1556 A D.]

ఈ శాసన ప్రయోగముల ననుసరించి రి/రు వర్ణోచ్చారణము ఉన్నటులు తెలియుచున్నది.

నన్నయ భారతములో ఋ-రి యతి రివర్ణోచ్చారణమును సూచించును ;

ఉదా : 'ఋత్విజులండని విచారించి పూజించితే' [సభా 2-11]

తరువాతి కవులు నన్నయ ననుసరించి ఋ-రి యతిని పాటించిరి. కాని శాసన భాషను బట్టి, కవి ప్రయోగములలో అప్రయత్నముగా దొరలిన ఋ-రు యతిని బట్టి క్రమ క్రమముగా 12 వ శతాబ్ది నుండి రువర్ణోచ్చారణము ఈ ధ్వనికి కలిగినదని ఊహింపవచ్చును.[2]

పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రము నందు :

'రు రు వర్ణదేహంబు ఋగ్వేదమునకును' [పండిత - 523 పే]

2. తొడరెడు నదివోలె-ధృత ఫేన వితతుల [భార - అరణ్య - 3 338] అను పాఠము నన్నయ యందు కనిపించుచున్నది. ఇదియే సరియగు పాఠమనుకొనినచో ఋ కారమునకు రువర్ణోచ్చారణము నన్నయకు కూడ సమ్మత మనవచ్చును 'ధృత ఫేన' బదులు 'ధ్రువ ఫేన' అని ముద్రిత ప్రతులు.

పదాది యందలి ఋ, సంధియందు హల్లుగా ప్రవర్తించును. ఈ వర్ణము అచ్చునకు బదులు ఉచ్చారణలో ర్- ఉ గా గుర్తింప బడును. ఇట్టి స్థితియే ప్రాకృత భాష యందును కలదు. ఋ - రు లు యతిలో తిక్కన కలిపినటుల స్థిరపరుప వచ్చును. అంతేకాక నన్నయ వాడినటుల ఋ - రి లకును యతి వాడెను
'కృపుఁడును ద్రౌణియుంగడఁగి క్రీడిపయిన్ శరవర్షముల్' [భార.ద్రో . 5-5]

నన్నయలో ఋ- ర ల ప్రాస గలదు

ఉదా :- ఆ ఋషి పుత్రుఁడు గట్టిన
చీరలు .... .... .... [భార-అరణ్య 3-104]

ఇక శ్రీనాథుడు : ఆ ఋషులఁజూడ శివునకు ... .... ....
దార్ల పరిగ్రహ .... .... ....
దార పరిగ్రహమేకద .... ... ....
సారపు .... .... .... .... [హర 4-44]

ఇందు ఋ-ర లకు ప్రాస వాడబడినది. శ్రీనాథుడు కూడ నన్నయవలె ఋ- రి లకు యతి వేసెను

ఉదా : 'పృథుభుజాపీఠమున సంభరించుటయును' [భీమ 1-35]

సాధారణముగా ఆధునిక భాషలో నీ అచ్చులు రు, లు- అని ఉచ్చరింపబడుచున్నవి.

116 ర -ఱ ధ్వనుల విషయమున కూడ నీ విధమైన పరిణామమువే చూడగలము. ఈ రెండును క్రమముగా తాడిత కంపితములు కాని శకటరేఫ విషయమున కంపితోచ్చారణము మొదటిదాని కన్న హెచ్చుగా నుండును. మూలద్రావిడ భాషయందు రేఫమును, 'ఱ' వర్ణమునకు మూలమైన దంతమూలీయ తకారము (త్ర) స్పష్టముగా రెండు వర్ణములు ప్రాచీనమయిన తెలుగులో ఈ రెండు ధ్వనుల భేదము క్షీణించి నటులు ఈ క్రింద చూపబడు ఉధాహరణముల ననుసరించి తెలియుచున్నది.

| | |
|---|---|
| చెఱువు / చెరువు | తూఱ్పు / తూర్పు |
| ఎఱుగు / ఎరుగు | నూఱు / నూరు |

దీనినిబట్టి ఒకే శబ్దమున రెండు వర్ణములున్న స్థితిని గుర్తింపగలము [3]

[3] *K. Mahadeva Sastry : Historical Grammar of Telugu. 1969. P 45-46.*

రేఫ, శకటరేఫలు నన్నయభాషలో భిన్న వర్ణములుగ నుండినవి. అనగా వానికి భిన్నోచ్చారణ మున్నదని యర్థము ర కంటె ఱ అధిక కంపనము కలది (Moretrilled) నన్నయ నన్నెచోడుల గ్రంథములలో నీ ధ్వనులు ప్రత్యేక వర్ణములుగా యతి ప్రాసములలో స్పష్టముగా కన్పించుచున్నవి తిక్కన ఈ రెండు ధ్వనులకు ప్రాస స్థానమున సాంకర్య మొనర్చెను

ఉదా : తఱచుగఁ గూలిన కరులున్

గిరికొనియెన్ సమర మేదినీతలమెల్లన్ [భార-భీష్మ 1-136]

కాని కాలక్రమమున ఱ వర్ణము తన విలక్షణోచ్చారణమును కోల్పోయి సాధురేఫతో సమానముగా ఉచ్చరింపబడినది.

శ్రీనాథుని కాలము నాటికి శకటరేఫ జ్ఞానము కొందఱు పండితుల గ్రంథముల యందును, కవుల గ్రంథముల యందును కొలదిగా నిలచినది అప్పటినుండి లాక్షణికులు రేఫ, ఱకార నిర్ణయ పట్టికలు వ్రాయుటకు పూనుకొనుటయే దీనికి నిదర్శనము.

యతి ప్రాసములందు సునిబద్ధములైన శకటరేఫ యుతపదములే మనకు శకట రేఫ నిర్ణయమున సహాయకారులు కాగలవు రేఫ శకట రేఫముల గూర్చి పూర్వకవుల గ్రంథములందు మతభేదము కలిగినప్పుడు పూర్వకవుల ప్రయోగముల నుత్తరకవుల ప్రయోగముల కంటె ప్రమాణములుగ నంగీకరింపవలెను. రేఫ శకట రేఫలు శ్రీనాథుని కృతులలో యతిప్రాసలలో ప్రత్యేకముగా వాడిన ఉదాహరణములను గమనింతము.

యతిస్థానమున : రాజరఘురాములల్లాడ రమణసుతులు [భీమ 1-33]

రాజబింబాననానూత్న రత్నపేటి [భీమ 1-43]

ఱిక్కించుకొనియున్న ఱెక్క మొత్తము [శృ నై 2-5]

ఱవికయుఁబట్టు బుట్టముఁ చెఱంగు [శృ. నై. 6-131]

ప్రాస స్థానమున : పరఁగెడు .... .... ... గలుగం

గర యంత్రంబాడ .... .... ... న

న్నిరసాల .... .... .... బు

ల్సిరి యాలుని .... .... .... [హర 2-10]

తఱచగు .... .... .... లో
నిఱుకటమున .... .... ....ముం
దొఱఁగుట ... .. .... ర్థం
బఱచేతికి .. .... .... [శృ నై. 4-124]

సాధురేఫమునకు, శకటరేఫమునకు ప్రాసవేయుట కూడ శ్రీనాథునకు అభ్యంతరము కాదు.

ఉదా. 'తరుణి నిజ్ఞాన మీసూక్ష్మ మెఱఁగి కొనుము' [కాశీ 3-70]

11, 12 శతాబ్దముల కాలము నందలి తెలుగు శాసన భాషలో 'ఱ' వర్ణము తన ప్రత్యేకోచ్చారణ భేదమును పోగొట్టుకొన్నటుల ఆధారములు కలవు. ఇట్లు పోగొట్టుకొనుట ప్రాఙ్నన్నయ కాలముననే ఆరంభమైనది. కాలము గడచుకొలది యిది బలమును కూర్చుకొన్నది.[4] కూతురు శబ్దము సాధు రేఫతోనే నన్నయ, నన్నెచోడుల ముద్రిత గ్రంథములలో కన్పింపగా, 11 - 12 శతాబ్దముల శాసనములలో ఈ పదము నియతముగ శకట రేఫముతోనే వ్రాయబడినది.

శ్రీనాథునిలో రేఫ శకట రేఫములకు భేదక వ్యాప్తి (contrastive distribution) ఈ క్రింది ప్రయోగములలో గోచరించును.

అరుగు : వెళ్ళు [కాశీ 2-110] అఱుగు : జీర్ణమగు (భీమ 5-190)
నీరు : ఉదకము [హర 2-25] నీఱు : బూడిద (హర 5-56)

వాస్తవముగ శ్రీనాథుని కృతులలో కొన్ని శబ్దములు ఒకసారి రేఫముతోను, వేఱొకసారి 'ఱ' వర్ణముతోను ముద్రిత మయినవి.

| | |
|---|---|
| రంతు [శృ.నై. 7-151] | అఱంతులు [భీమ. 4-96] |
| ముందర [శృ నై. 1-109] | ముందఱ [కాశీ. 4-51] |
| తరిగొండ [శృ.నై 2-128] | తఱిగొండ [కాశీ. 6-18] |
| ఈరంబు [శృ.నై. 7-041] | ఈఱంబు [శృ.నై. 2-46] |

4 *K Mahadeva Sastri : Historical Grammar of Telugu, 1969 P. 42*

తరువాతి కాలపు వ్రాయసకాండ్రు తమ కాలములోని వర్ణక్రమమును ప్రాచీన గ్రంథములలో వ్రాయుట వలన నీ పరిస్థితి ఏర్పడి యుండును శాసనములలో శకట రేఫము సంయుక్తాక్షరముల యందును కలదు. 'ఱ' వర్ణము సంయుక్తములో వచ్చిన రేఫమగును.[5] అని ప్రౌఢ వ్యాకరణకారుడు గ్రంథ ప్రయోగములను బట్టి నిర్ణయించెను. శ్రీనాథునిలో శకటరేఫము తరువాతి హల్లుతో సంయోగము చెందినపుడు సాధురేఫమగుటకు లక్ష్యములు లభించుచున్నవి.

ఉదా : చిఱుతొండ నంబి [హర 2-32] చిర్తొండనంబి [హర 2-29]

1.17. ఆంధ్రము నందలి తత్సమ, తద్భవేతరములగు హకారాది పదములలో పెక్కులు కన్నడము నుండి ఎరువు తెచ్చినవి హకారాది క్రియా వాచక పదములు తెలుగున రెండే రెండు. హత్తు, హెచ్చు అను ఈ రెండును కన్నడము నుండి ఎరువు తెచ్చిన పదములు. ఇవి తప్ప పదాది హకార ఘటిత క్రియా వాచక పదములు తెలుగున లేవు ఆంధ్రభాష యందలి హకారాది పదములలో రమారమి మూడింట రెండువంతులు తత్సమములు. మిగిలినవి తద్భవములు, కన్నడము నుండి గ్రహించినవి, అన్యదేశ్యములు, కృతకప్రామాణికములు, అవ్యయ, ధ్వన్యనుకరణములే తప్ప స్వతస్సిద్ధములు లేవని చెప్పవచ్చును. శ్రీనాథుని కృతులను పరిశీలింపగా నీ క్రింది హకారాది పదములు లభించినవి అందు

I. తద్భవములలో :

హరిదళము : పసుపుపచ్చని ధాతువిశేషము.

'నిద్రమేల్కాంచిన నెత్తమ్మి మొగడల పరువంపుఁ బుప్పొళ్ళు హరిదళములుగ' [కాశీ 1-123]

<సంస్కృత. హరితాల - ప్రాకృత. హరి ఆల అను శబ్దభవమై ఉండును

II. కన్నడ పదములలో :

హత్తు : జతచేయు, 'క్రొత్త లత్తుక హత్తించె' [శృ నై. 6-44]

<కన్నడ. హత్తు, పత్తు : జోడించు, జతకలుపు.

5. ప్రౌఢ- ముక్త. 2.

హదను : యుక్తసమయము

''బంధుకోటికిన్ హదనున మేలుసేఁత'' [శృ నై 3-14]

<కన్నడ. హదను, పదను : యుక్తము, తగినది, కార్యానుకూలము.

3. హుళిక్కి : అసత్యము, వ్యర్థము.

'ధనము నిప్పచ్చరము విద్యయు హుళిక్కి' [కాశీ 4-111]

<కన్నడ. హొళ్ళు, పొళ్ళు

4 హెచ్చు : అతిశయము; అతిశయించు.

'హెచ్చు గుందాడఁ బనిలేదు' [హర 4-22]

<కన్నడ. హెచ్చు, పెచ్చు, పెర్చు : అతిశయించు వృద్ధియగు

5. హేరాళము : ఆధిక్యము; సమృద్ధి

'హేరాళమై వర్షముల్ జడిగాఁబట్టి....' [హర 2-26]

'ఇంద్రాణితోఁగూడ హేరాళముగఁదీర్చె....' [హర 4-90]

'ధనము హేరాల మబ్బె' [కాశీ 7-254]

నిఘంటువులయందీ శబ్దము సంస్కృత సమముగా నిరూపితము కాని దీనికి మూలము కన్నడమునందలి హేరాళ, పేరాళ (ధారాళము, ఆధిక్యము, విస్తారము) శబ్దములు కావచ్చును

6 హొన్ను : బంగారము, బంగారునాణెము

'హొంబట్టురవిక' [ప. పీ పు. 65]

< కన్నడ. హొన్, పొన్ను: బంగారు, బంగారపు

## III అన్యదేశ్యములలో :

1. హజారము : కొలువుకూటము 'ఇంద్రుని హజారపుమేడ' [కాశీ 1-125]

<పారసి. హాజిరి : ఓలగమువారు, సభ్యులు.

హాజిర్ : సన్నిధినుండు, సేవకు సిద్ధముగానుండు.

2. హద్దు : అవధి, మేర

'దక్షిణ దిశ హద్దు తగ వివరింతు'. [ప.పీ. పు. 87]

<మరాఠీ హద్, హద్ద : మితి, మేర, సీమ
గుజరాతి. హద, హద్ద : మేర, అవధి

3. హురుముంజి : పారసీక జలసంధి చేరువలో ప్రసిద్ధి కెక్కిన రేవు పట్టణము.
'హురుముంజి బలుతేజి హరులు దెచ్చె' [హర. పీ 26]
<పారసి హర్మజ్, హుర్మోజ్ : పారసీక జలసంధిలో ఈ పేరుగల దీవి

IV కృతక ప్రామాణికములు : [Hyper Forms]
హారతి ; <ఆరతి. ప్రాకృత. ఆరత్తియ – సంస్కృత. ఆరాత్రిక.
'వరవిప్రకాంతలు వడితోడ వచ్చి – హారతు లిచ్చినారానంద మొదవ' [వ. వీ. పు. 71]

V ప్రాణము>మహాప్రాణము :

కొన్ని అకారాది పదములు ఊనికవలన మహాప్రాణములుగా మారుట కని పించును అరియు భాషలో స్థిరపడినవి. సూరి ప్రయోజనాపేక్షతో[6] ప్రక్రియా సౌలభ్యము నపేక్షించి విషయమును తలక్రిందులు చేసెను

అదను : [కాశీ 3–20] > హదను : [శృ నై 3-14]
ఎచ్చు : [హర 7–135] > హెచ్చు : [శృ నై. 7-115]

VI ప్రతి పదోక్తావ్యయములందు హకారము పదమధ్యము నందును పదాంతము నందును గోచరించును.

1. ఆశ్చర్యార్థకము . ఆహాహా! [హర 4 28] ఆహా! [భీమ 3-125]
2 సంబోధనము : ఓహో! [కాశీ 4–54]
3 ధ్వన్యనుకరణము : ఆహారవంబు [కాశీ 7–17]

1 1 8 వర్గహల్లునకు పూర్వము వర్గానునాసికముగా లేఖనమున అనుస్వారము వాడ బడు చున్నది. ఇతర తత్సమ ధ్వనులకు ముందుగల యీ యనుస్వారమునకు

6. బాల–ప్రకీర్ణ. 10

సంస్కృతమున నున్నట్టి విలువయే కలదు దేశ్య శబ్దములలో దీర్ఘముమీద అను స్వారమును తేల్చి పలుకుచుండిరి. ఉదా : తోఁట, కూఁతురు. దేశ్యశబ్దములలో దీర్ఘముమీది అనుస్వారము లోపించుట నన్నయనాటి అభ్యాసము తత్సమములయందు అట్టి లోపమురాదు కావుననే నన్నయప్రాసములయందు బిందుయుతము లైన దేశ్య తత్సమ శబ్దములను కలిపి వాడడు. ఒక పాదమున దేశ్యశబ్దమును వాడి రెండవపాద మున తత్సమ శబ్దమును వాడె ననుకొందము. అట్టియెడల నాటి అభ్యాసమునుబట్టి దేశ్యమునందలి అనుస్వారము లోపించును. తత్సమమునందట్లు కాదు. అప్పుడు సబిందు నిర్బిందుకములకు ప్రాసవేసినట్లగును ఇది నన్నయ కిష్టముకాదు. కావుననే ఆయన ప్రాసస్థానమునందు దీర్ఘముమీద పూర్ణబిందువు కలిగిన దేశ్య తత్సమములను వాడుకొనుట కానరాదు.

నన్నయ్య సంప్రదాయమునకు భిన్నముగా నన్నెచోడుడు ప్రాస స్థానములో నట్టి దేశీయ తత్సమ శబ్దములలోనున్న అనుస్వారమును ఏకము చేసెను.

ఉదా : వీంగు నపారసత్వ .... .... ....వా
మాంగమునందు .... .... .... తద్దయుం,
లోంగాని పేర్మితో.... .... . వే
దాంగుననంతు ... .... .... [కు సం 1-4]

ఇట్టివి నన్నెచోడునిలో (5.141, 6.157, 8 88, 10.155, 12.68) ప్రాసస్థానమున కలవు

దేశ్యశబ్దములలో దీర్ఘాచ్చుమీది అనునాసికము ఉచ్చరింప బడెడిది. తరువాతి కాలమున లోపింపనటుల కన్పించుచున్నది దీనినిబట్టి నన్నెచోడుడు నన్నయకంటె భిన్నమండలమునకు చెందినట్లు చెప్పవచ్చును మాండలిక భిన్నత్వముగల ఈ లక్షణము శతాబ్దముల తరబడి అధునిక భాషవరకు ఉన్నది.

ఉదా : ఆంబోతు; గోంగూర.

పూర్ణబిందువు ఉచ్చారణలో భ్రష్టమైన కారణముచేత తిక్కనాదులు సార్ధబిందు నిర్బిందు ప్రాస నుపయోగించిరి శ్రీనాథునియందును సార్ధబిందు నిర్బిందుప్రాస యీ క్రింది ప్రయోగములలో కన్పించుచున్నది.

'చీఁకటి తప్పనం బరుల .... .... ....
లోకము మాట తీపులకు .... .... ....
బోకడఁబెట్టి ప్రాణమొక .... .... ....
పైకొని చేరి తన్నుభయ .... .... ....' [శృ నై. 7-42]

తీఁగెసాఁగ [కాశీ 6-41] అనుచోట సార్ధబిందుకమైన పదము
తీగె రసంబున [హం 1-18] అని నిర్బిందుకముగ ప్రాసయందున్నది

1 1.9 తెలుగున విలక్షణమైన ద్రుత నకార ధ్వని కలదు. ఈ ద్రుత నకార రూపము అర్థమున కెట్టి మార్పు లేకుండగనే కొన్నియెడల లోపించును. కొన్ని స్వతంత్ర రూపములకును, కొన్ని అస్వతంత్ర రూపములకును అంతమందు చేరును. భిన్నస్థానములందు వచ్చుచున్న దీని వర్ణ విధేయాంశము విలువ యీ క్రింద సూచించినట్లుండును.

అచ్చులకు ముందు 'న్' అని, అవసానమునందుకాని, హల్లులముందుకాని 'న్ - ను' అని పర్యాయ రూపములను కలిగియున్నది

ఉదా :- చేయన్ - ఏగెను : చేయనేగెను.
చేయన్ - రమ్ము : చేయఁరమ్ము
చేయన్ - ఏగెన్ · చేయనేగెన్, చేయనేగె

ద్రుతనకారము తర్వాతవచ్చు క, చ, ట, త, ప లు గ, జ, డ. ద, బ లుగా రూపాంతరము పొందును

ఉదా : చేయన్ + కోరితిని : చేయంగోరితిని

ద్రుతమంత మందుగల శబ్దములను ద్రుతప్రకృతికములని తెలుగు వైయాకరణులు వ్యవహరించిరి ద్రుతప్రకృతికములు కాని శబ్దములను కళలందురు [7] 'ఏనిన్' అను శబ్దము ద్రుతప్రకృతికము కాని 'ఉన్' అను సముచ్చయముతో కూడి "ఏనియున్" అని యైనపుడు 'ఏని' అనునది కళగానే కన్పించును అందువలన ఏని శబ్దము ద్రుత ప్రకృతికముగను, కళగను కూడ వాడినటులు తెలియుచున్నది ఇట్టిస్థితి నన్నెచోడ, తిక్కనలయందు కలదు 'ఏనియున్' అనుదానికి 'ఏనిన్-ఉన్' అనునది భావిత రూపము. (expected form)

7. బాల - సంజ్ఞా - 12, 18.

ఉదా : సలిల ప్రవేశంబు సమ్మతించెదవేని నంబుధీశ్వరు [శృ నై. 4-75]
సురలూఅటఁబొంది యెంతయేనియుం జిత్తములోని [శృ.నై. 7-36]

1.1 10 క్ష-జ్ఞ అను సంయుక్త హల్లులు ఉచ్చారణ విషయమున ప్రత్యేకముగా గుర్తింపదగినవి

కంఠ్యవర్ణములైన క, ఖ, గ, ఘ ల తోను, ఊష్మములైన శ, ష, స ల తోను క్షకారము యతిస్థానములో వాడబడినది

ఉదా : సమ్మాథ మంధర క్ష్మాధరంబు [శృ నై. 5-96]
క్షోద సమన్వితంబుగ విశుద్ధహిరణ్మయ భాజనంబులం [శృ నై. 6-125]
క్షోణి నవశ్యమున్ భవదిషు ప్రహతిన్ [శృ నై 7-192]

నన్నయ భాషలో క్షకారము కంఠ్యవర్ణములైన క, ఖ, గ, ఘ, ల తోనే యతిలో గుర్తింప బడినది ష వర్ణమునకు సరిపడునటులు స్పృష్టోచ్చారణము కలిగి నటుల తర్వాత కనుగొందుము.

ఒకప్పుడు మొదటి అంశమునకే (first element) ప్రాధాన్యమిచ్చి దాని తోనే యతిని పాటించుట జరిగియుండును తరువాత రెండవ యంశమునే ప్రధానముగా నెంచి దానితో యతిని పాటించుట సాగించియుందురు ఇట్లు సంయుక్తాక్షరమున రెండంశములకును విడివిడిగా ప్రాధాన్యము పాటింపబడి యుండును ఆధునిక భాషలో రెండుచ్చారణలును కలవు.

జ్ఞకారమునకు సంబంధించినంత వరకు దీనికి మొదటి అంశమైన 'జ' వర్ణము చ ఛ, జ, ఝ లతో మైత్రిని పొందినటుల గుర్తింపవచ్చును ఇంకను సంయుక్తము నందలి రెండవ అంశమైన ఞ వర్ణము దానికి సవర్ణము తో మైత్రిని పొందుచున్నది.

ఉదా : జ్ఞానాజ్ఞాన కృతంబులైన యఘముల్ సర్వంబు [భీమ 4-28]

నన్నయ జ్ఞకారమునకు అందలి మొదటి అంశమైన చ, ఛ, జ, ఝ లతో యతిని గుర్తించెను తిక్కన శ్రీనాథాదులు తద్భవరూపమును బట్టి జ్ఞ కారమునకు 'క' కారముతో యతి వేసిరి

ఉదా : జ్ఞానేంద్రియజ్ఞాన కళలౌరుసౌరుగా [కాశీ 1-139]

వ్యావహారిక భాషయందు జ్ఞకారోచ్చారణము గ్న, గ్నె, గ్య, గ్గ, గ్గె - లుగా మాండలికతను పొంది వివిధ ధ్వనులతో వినబడుచున్నది

ఉదా : యజ్ఞము - యగ్నము ; విజ్ఞప్తి - విగ్నప్తి

తద్భవములలో జ్ఞకారమునకు గకారము వచ్చును

ఉదా : ప్రజ్ఞ - పగ్గె ; సంజ్ఞ - సన్న, సైగ

ఇంకను 'అగ్న' యొక్క లేఖనమును పోల్చి చూడనగును.[8]

1.1.11 'అ్రదుచు' అను పదములోని సంయుక్త రూపము నందలి ద్వితీయ వర్ణమైన రేఫము ఒక్కొక్కప్పుడు శిథిలోచ్చారణము కలది. ఛందస్సులో నిది తేలిక యక్షరమే కాని బరువైన అక్షరము కానట్లు తెలియుచున్నది. అనగా సంయుక్తాక్షరమునకు పూర్వమందున్న 'అ' గురువగుటలేదు.

ఉదా :- నీర మండూస్వనంబున నింగి య్రదువ.... [శివ 1-60]

కటము ల్రదువంగ, మీసాలు గత్తరిల్ల........ [శృ నై. 7-46]

అవనీధ్రంబుల భంగి నింగి య్రదువన్ హాహా నినాదంబులన్.

........ [హర 7-175]

1 1.12 శ్రీనాథుని భాషలోని కొన్ని విశిష్ట ప్రయోగము లీ క్రింద పొందుపరుపబడినవి.

1. శ్రీనాథుడు అఖండ యతి నిస్సంశయముగా ఆదరించినాడనుటకు నిదర్శనములు కలవు సంధివశమున నేర్పడినప్పటికి సిద్ధరూపము లోనున్న అక్షరమునకే ఉచ్చారణమున బలముండుటచేత అఖండ యతికూడ ఆదృతమై యుండును.

ఉదా:- వెస వసుధా స్థలంబునఁ గవీంద్రులు ... .... [భీమ. 1-12]

ప్రతి వసియించు గోవుల ఖురాగ్రములందు........ [కాశీ. 2-18]

కాశి యణిమాది సిద్ధులకాటపట్టు ... .... [కాశీ. 2-50]

2 ప్రాచీన భాషయందు 'ము' విభక్తి స్థానమున పు బు, వు మున్నగు రూపము లుండుట కన్పట్టును. ఆ సామంజస్యమును బట్టి ము విభక్తికి పు, పు, బు,భు

8· *SII - XVI-60 Gtr. 1517 A. D.*

లతో యతి సమంజసమే యగును. నన్నయాదులట్లు పాటించిరి. అనంతర కాలమున విభక్తి యైనను కాకపోయినను ము వర్ణముతో, దానితో మైత్రికల మొ, మోలతో పు, పు, బు, భు లకు యతిని పాటించుట జరిగినది. శ్రీనాథుడును అట్లు ప్రయోగించెను.

ఉదా : పోక క్రమాంకుల సొంపు మురువు కొనగ [కాశీ 1-91]

భువన బీజంబు కైవల్య మోక్షదాయి [భీమ 5-50]

3. శ్రీనాథునికి బిందుపూర్వక సకార, శకారములకు ప్రాస వేయుట మిక్కిలి అభిమతము.

ఉదా : సంసార భ్రమ యించుకేనియును మత్స్వాంతంబునన్ లేదు మీ వంశం బీపరిపాటిదే .... .......... [హర 2-11]

ఎఱ్ఱాప్రగడ హరివంశమున [పూర్వ 9-87] కూడ నిట్టివి కన్పడుచున్నవి

4. 'స్త్నానముఁజేసి ధౌత పరిధానము కట్టి' [హర 2-37] ఇచ్చట స్త్నాన శబ్దమును కొందఱైనను 'స్త్నానముగా' ఉచ్చరించుట వ్యవహారములో నుండి యుండునని ఈ ప్రయోగమును బట్టి యూహింప వచ్చును. ఇప్పటికిని అట్లు పలుకువారు లేకపోలేదు. కావుననే సకార, నకార మధ్యస్థమైన తకారమునకు ప్రాధాన్యమిచ్చి 'పరిధానము' లోని 'ధా' తో యతి వేయుట సంభవించి యుండును. అప్పకవి దీనిని తద్భవ వ్యాజ యతిగా పరిగణించి సమర్థించెను. నిజమునకు 'స్త్నానము' అను శబ్దము 'తానము'గా మారుటకు మూలమున తకారముండి యుండవలెను గదా!

5. 'ఎడపఁదడపఁ దనూభవుండెచట నుండు' [కాశీ 4-85] ఇది నేటి వ్యవహారమున 'అడప దడప' అని కలదు.

పై ప్రయోగములను బట్టి నాటి వర్ణముల ఉచ్చారణమును గ్రహించుట సులభము.

## 1.2.0 శబ్దరూపవైవిధ్యము :

ఒక శబ్దము చారిత్రిక కారణముల వలన గాని, మరే ఇతర కారణముల వలన గాని భిన్నరూపములుగా పరివర్తన చెందును భాషా వ్యవహారములో ఒకే శబ్దము యొక్క రూపభేదములు ఏకకాలములో ప్రవర్తించుట అరుదు కాదు. ఛందస్సౌందర్యాది గుణములచే ప్రేరితమైన సాహిత్యమునందు ఇట్టి రూపభేదముల ప్రవర్తన మిక్కుటముగా నుండును.ఈ రూపభేదము స్వరహ్రస్వ దీర్ఘభేదములనుగాని వ్యంజన ద్విరుక్తి అద్విరుక్తి భేదములనుగాని, సమీపోచ్చారణగతమైన స్వరవ్యంజన భేదములనుగాని పురస్కరించుకొని ఉండును. ఈ రూపభేదములను చారిత్రికదృష్టితో నధ్యయనము చేయువారికి నుపయోగించునను భావముతో అట్టివానిని శ్రీనాథునిభాష యాధారముగా పొందుపరుచుచున్నాను.

### 1.2.1. అచ్చుల దీర్ఘత యందలి రూపాంతరత :
(Variation of Vowel Length)

అ- : ఆ -

| | | | |
|---|---|---|---|
| అతఁడు | [హర 4-64] | ఆతడు | [హర 2-11] |
| అరయు | [కాశీ 2-151] | ఆరయు | [శృ నై 4-9] |
| అవల | [శృ నై. 2-66] | ఆవల | [శివ 3-99] |

-ఆ- : - అ -

| | | | |
|---|---|---|---|
| అట్టహాసము | [కాశీ 7-32] | అట్టహసము | [భీమ 1-109] |
| మోసాల | [కాశీ 2-41] | మోసల | [హర 5-52] |

ఇ- : ఈ-

| | | | |
|---|---|---|---|
| ఇతఁడు | [కాశీ 5-179] | ఈతఁడు | [కాశీ 4-155] |
| విడెము | [ప. పీ. 33] | వీడెము | [శృ.నై. 6-141] |
| విద్యము | [ప. పీ. 65] | వీద్యము | [కాశీ 2-81] |

-ఇ- : -ఈ-

| | | | |
|---|---|---|---|
| ఇంగిలికంబు | [భీమ 2-29] | ఇంగిలీకంబు | [క్రీడా 273] |

ఉ- : ఊ-

| | | | |
|---|---|---|---|
| పువు | [శృ.నై 1-80] | పూవు | [శృ.నై. 1-70] |

-ఏ- : -ఎ-

| | | | |
|---|---|---|---|
| గన్నేరు | [శృ.నై.8-103] | గన్నెరు | [క్రీడా 42] |
| తంగేటి | [కాశీ 7-203] | తంగెటి | [శివ 4-34] |

ఓ- : ఒ-

| | | | |
|---|---|---|---|
| జోహారు | [భీమ 2-50] | జొహారు | [భీమ 2-112] |

### 1.2.2. అచ్చుల గుణము ననుసరించి రూపాంతరత :
(Variation of Vowel quality)

-అ- : -ఇ-

| | | | |
|---|---|---|---|
| అదరిపాటు | [కాశీ 5-257] | అదిరిపాటు | [కాశీ 2-157] |
| కలపి | [శృ.నై 6-120] | కలిపి | [శివ 3-121] |
| నెమలి | [శృ.నై. 3-159] | నెమిలి | [హర 5-38] |

-అ- : -ఉ-

| | | | |
|---|---|---|---|
| అవల | [శృ.నై. 2-66] | అవుల | [శృ నై 8-11] |
| ఉరలు | [శృ నై. 7-46] | ఉరులు | [శృ నై. 4-91] |
| చనవు | [భీమ 4-200] | చనువు | [కాశీ 5-127] |
| తొరఁగు | [శృ నై. 2-99] | తొరుఁగు | [భీమ 2-160] |
| నలఁగు | [కాశీ 3-22] | నలుఁగు | [భీమ 2-124] |
| పసపు | [భీమ 5-29] | పసుపు | [శృ.నై. 6-68] |

-అ- : -ఎ-

| | | | |
|---|---|---|---|
| గొజ్జఁగ | [భీమ 5-115] | గొజ్జెఁగ | [శృ.నై. 2-140] |
| సంపంగి | [హర 2-107] | సంపెంగ | [క్రీడా 101] |

-అ : -ఎ

| | | | |
|---|---|---|---|
| ఒరిమ | [శృ నై 6-81] | ఒరిమె | [కాశీ 7-165] |
| తీఁగ | [కాశీ 1-126] | తీఁగె | [శివ 2-46] |

-ఆ- : -ఎ-

| | | | |
|---|---|---|---|
| ఉయ్యాల | [శృ.నై. 2-5] | ఉయ్యెల | [శివ 2-46] |

అ- : ఒ-

| | | | |
|---|---|---|---|
| పదునాకండు | [కాశీ 4-12] | పదునొకొండు | [హర 2-15] |

-ఇ- : -అ-

| | | | |
|---|---|---|---|
| నమిలి | [క్రీడా 52] | నెమలి | [శృ.నై 3-159] |

-ఇ- : -ఉ-

| | | | |
|---|---|---|---|
| చెంచి (మల) | [శృ.నై. 1-42] | చెంచు (మల) | [భీమ 1-85] |
| నిగిడించి | [శృ.నై. 4-80] | నిగుడించి | [కాశీ 4-64] |

-ఇ : -ఉ

| | | | |
|---|---|---|---|
| కుంటి | [భీమ 5-22] | కుంటు | [కాశీ 1-121] |

-ఉ- : -ఇ-

| | | | |
|---|---|---|---|
| కానుక | [శృ.నై. 8-33] | కానిక | [కాశీ 7-152] |

ఉ- : ఒ-

| | | | |
|---|---|---|---|
| నుడుగు | [భీమ 2-155] | నొడుపు | [శృ.నై 3-84] |

ఎ- : అ-

| | | | |
|---|---|---|---|
| నెమలి | [శృ.నై. 3-159] | నమిలి | [భీమ 3-28] |

1.2.3. హల్లుల యందలి రూపాంతరత : (variation of consonants)

-క- : -గ-

| | | | |
|---|---|---|---|
| కంకటి | [క్రీడా 60] | కంగటి | [క్రీడా 275] |

-గ- : -క-

| | | | |
|---|---|---|---|
| మొగము | [శృ నై. 3-182] | మొకము | [హర 4-27] |

-గ- : -వ-

| | | | |
|---|---|---|---|
| జేగురించిన | [భీమ 4-184] | జేవురించిన | [హర 3-92] |

| | | | |
|---|---|---|---|
| తగులు | [కాశీ 4-81] | తవులు | [శృ నై 7-49] |
| తిగుచు | [శృ నై. 8-167] | తివుచు | [కాశీ 5-242] |
| మేళగించు | [భీమ 1-109] | మేళవించు | [శృ.నై. 3-102] |
| పాగలు | [కాశీ 7-185] | పావలు | [భీమ 2-127] |

-గ : -క

| | | | |
|---|---|---|---|
| ముసుఁగు | [హర 7-119] | ముసుకు | [క్రీ.పీ 65] |

-గ : -వ

| | | | |
|---|---|---|---|
| అగు | [హర 3-58] | అవు | [శృ నై. 7-185] |
| ఇరుగు | [హర 2-103] | ఇరువు | [భీమ 5-90] |
| తఱుగు | [కాశీ 3-32] | తఱువు | [శృ నై. 8-6] |
| దండుగు | [కాశీ 7-140] | దండువు | [శృ.నై. 7-192] |
| పొరుగు | [కాశీ 7-228] | పొరువు | [హర 1-27] |
| ప్రోఁగు | [హర 5-52] | ప్రోవు | [కాశీ 2-147] |

చ- : స-

చకార ఘటితములు ప్రాచీనములు సకార ఘటితములు అర్వాచీనములని శాస్త్రకారుల మతము

| | | | |
|---|---|---|---|
| చలుపు | [శృ.నై. 5-45] | సలుపు | [కాశీ 6-178] |
| చాఁగు | [శృ నై. 6-103] | సాఁగు | [కాశీ 4-71] |
| చాఁచు | [భీమ 4-123] | సాఁచు | [హర 4-24] |
| చొక్కు | [శృ.నై. 2-105] | సొక్కు | [భీమ 4-130] |

ట- : త-

| | | | |
|---|---|---|---|
| టక్కరి | [హర 2-47] | తక్కరి | [హర 6-125] |

-ట : -డ

| | | | |
|---|---|---|---|
| తగటు | [శివ 3-98] | తగడు | [భీమ 2-55] |

డ- : ద-

| | | | |
|---|---|---|---|
| డప్పి | [హర 7-60, 7-121] | దప్పి | [శృ. నై. 2-81, 4-52, 7-22] |

| | | | |
|---|---|---|---|
| డావల | [భీమ 3-21] | దావల | [శృ నై 8 133] |
| డొప్ప | [శృ నై 7-93] | దొప్ప | [కాశీ 2-49] |
| డిగి | [భీమ 2-25] | దిగి | [హర 6-102] |

-డ- : -ట-

| | | | |
|---|---|---|---|
| ఆడువారికి | [శివ 3-78] | ఆటదానికి | [కాశీ 6-221] |
| కోదండరాశి | [శివ 4-32] | కోదంటరాశి | [శివ 4-30] |

-డ- : -ణ-

| | | | |
|---|---|---|---|
| అడఁగు | [కాశీ 3-8] | అణఁగు | [భీమ 5-65] |
| పడఁతి | [శృ నై. 5-52] | పణఁతి | [శృ.నై 3-195] |
| ముడుఁగు | [కాశీ 3-6] | ముణుఁగు | [శృ నై 2-119] |
| వెడఁద | [కాశీ 6-70] | వెణఁద | [భీమ 3-212] |

-డ- : -ల-

| | | | |
|---|---|---|---|
| వెడలు | [కాశీ 6-193] | వెలలడు | [శృ.నై 4-24] |

-డ- : -ళ-

| | | | |
|---|---|---|---|
| పవ్వడించు | [కాశీ 2-98] | పవ్వళించు | [శృ.నై. 5-47] |
| కడవసము | [కాశీ 7-33] | కళవసము | [హర 4 11] |
| తావడము | [శృ నై. 8 170] | తావళము | [భీమ 2-36] |

-డ- : -ణ-

| | | | |
|---|---|---|---|
| అలరుఁబోఁడి | [హర 4-83] | అలరుఁబోఁణి | [శృ నై 2-110] |
| చిగురుఁబోఁడి | [భీమ 3-6] | చిగురుఁబోఁణి | [శృ.నై 3-198] |

-త- : -చ-

| | | | |
|---|---|---|---|
| చింతిలు | [శివ 1-63] | చించిలు | [శివ 3-15] |

-త- : -ద-

| | | | |
|---|---|---|---|
| బ్రతుకు | [భీమ 4 83] | బ్రదుకు | [కాశీ 6-76, 7-199, హర 3-90] |

-న- : -ణ-

| | | | |
|---|---|---|---|
| ప్రేంకనంబులు | [శివ 4-26] | ప్రేంకణములు | [హర 1-25] |

-ప- : -బ-

| | | | |
|---|---|---|---|
| తపసి | [శృ నై. 2 9] | తబిసి | [హర 7-55] |

-మ- : -వ-

| | | | |
|---|---|---|---|
| మామిడి | [హర 3-89] | మావిడి | [హర పీ 2] |
| నిమురు | [వ. వీ 77] | నివురు | [శృ నై. 2 105] |

-ర : -అ

| | | | |
|---|---|---|---|
| రేకు | [భీమ 5-101] | ఱేకు | [శృ.నై. 6-22] |
| రంతు | [శృ నై 7-151] | అంతులు | [భీమ 4-96] |

-ర- : -ళ-

| | | | |
|---|---|---|---|
| చివురుల | [భీమ 5-101] | చివుళుల | [శృ నై. 8-112] |

-ల- : -న-

| | | | |
|---|---|---|---|
| తెలుఁగు | [భీమ 1-63] | తెనుఁగు | [కాశీ 1-7] |
| ములుఁగు | [క్రీడా 226] | మునుఁగు | [శృ నై.3-189] |

-ల- : -ర-

| | | | |
|---|---|---|---|
| కావలము | [శృ నై. 8-196] | కావరంబు | [కాశీ 4-272] |

-ల- : -ళ-

| | | | |
|---|---|---|---|
| కలాసము | [హర 2-47] | కళాసము | [శృ నై 6-115] [హర 5-10] |

శ- : స-

| | | | |
|---|---|---|---|
| శిరియాలు | [హర 2-122] | సిరియాళసెట్టి | [హర 2-73] |
| శిరాలా<br>శిరాలు | [హర 2-116] | సిరాలసెట్టి | [హర 2-85] |

హ- : అ-

| | | | |
|---|---|---|---|
| హదను | [శృ నై. 3-14] | అదను | [కాశీ 3-20] |

1.2.4. ద్విరుక్తము/అద్విరుక్తము :
(Geminate/Non-Geminate)

| | | | |
|---|---|---|---|
| అప్పుడు | [హర 4-86] | అపుడు | [హర 2-11 |

| | | | |
|---|---|---|---|
| అవ్వల | [కాశీ 4-57] | అవల | [శృ నై. 2-66] |
| ఒయ్యారము | [భీమ 2-148] | ఒయారము | [హర 7-49] |
| కుప్పసము | [శృ నై 6-50] | కుపసంబు | [కాశీ 7-40] |
| నిద్దుర | [శృ నై 8-17] | నిదుర | [కాశీ 3-22] |

1.2.5 దీర్ఘాచ్చు + అద్విరుక్తము : హ్రస్వాచ్చు + ద్విరుక్తము :
(Long vowel + Non-Geminate) (Sho t vowel + Geminate)

| | | | |
|---|---|---|---|
| చేయి | [శృ నై 1-28] | చెయ్యి | [కాశీ 5-71] |
| తీయని | [శివ 3-62] | తియ్యని | [హర 3-32] |
| నోవు | [క్రీడా 88] | నొవ్వు | [శివ 4-67] |

1.2.6 ఐ : ఏ ల రూపములు :

| | | | |
|---|---|---|---|
| పై (నంటి) | [హర 2-89] | పేన్- | [హర 3-20] |
| మయిపై | [శృ నై 7-118] | మెయిమెయి | [కాశీ 4-68] |

1.2.7 ఐ : అయి ల రూపములు :

| | | | |
|---|---|---|---|
| ఐదు | [కాశీ 2-51] | అయిదు | [కాశీ 5-120] |
| పై | [హర 1-24] | పయి | [శృ నై. 1-47] |
| సైదోడు | [కాశీ 1 22] | సంబదోడు | [శృ నై. 1-12] |

1.2.8 ఔ : అవు ల రూపములు :

| | | | |
|---|---|---|---|
| ఔ | [కాశీ 6-68] | అవు | [హర 2-64] |
| దౌ | [శివ 3-106] | దవు | [కాశీ 6-286] |
| సౌరు | [కాశీ 7 181] | సవురు | [కాశీ 7-88] |

1 2 9 -ఇయ : -ఎ లతోడి రూపములు :

తద్భవములలో ఇయాంతము లు ప్రాచీనములు ఎదంతములర్వాచీనములు. దేశ్య పదములలో విపరీతము.

| | | | |
|---|---|---|---|
| కట్టియ | [భీమ 1-118] | కట్టె | [భీమ 2-19] |
| కత్తియ | [శృ నై 8-70] | కత్తె | [శృ.నై. 4-103] |
| కుంచియ | [భీమ 4 90] | కుంచె | [శృ నై. 6-111] |
| గద్దియ | [శృ నై 4-97] | గద్దె | [హర 3-40] |

| | | | |
|---|---|---|---|
| పూదియ | [శృ నై 8-159] | పూదెన్ | [శృనై. 8-167] |
| (తద్భవ) బూమియ | [శృ నై 3-98] | బూమి | [కాశీ 5-31] |
| (తద్భవ) బూరియ | [శృ నై. 6 124] | బూరె | [భీమ 2 6] |
| (తద్భవ) మల్లియ | [శృ నై 8-167] | మల్లె | [శృ.నై 8-162] |
| (తద్భవ) ముత్తియంబు | [శృనై 8-6] | ముత్తెంబు | [కాశీ 1-39] |
| (తద్భవ) వన్నియ | [శృ నై. 8-203] | వన్నె | [శృ నై 6 50] |

1.2.10. ఎత్త్వమురాని రూపములు :

| | | | |
|---|---|---|---|
| చక్కియ | [హర 7-40] | చక్కి | [శృ నై 6 7] |
| మట్టియ | [భీమ 1-41] | మట్టి | [కాశీ 7-236] |

1.2.11. సానునాసిక నిరనునాసిక రూపములు :

| | | | |
|---|---|---|---|
| తీఁగె | [కాశీ 6-41] | తీగె | [హర 1-18] |
| చీఁకటి | [శృ.నై. 7-42] | చీకటి | [వ. పీ 10] |

1.2.12. లోపదీర్ఘత : (Compensatory Lengthening)

కొన్ని మాటలలో ఊనిక తక్కువయగు నక్షరములు కొన్ని యెడల లోపించి పోవునని యెరుగుదుము అట్లు వర్ణలోపము వలన ఉచ్చారణ కాలమున ఏర్పడిన నష్టమును పూరించుటకు గాను దానికి పూర్వముననున్న యచ్చు దీర్ఘత్వము నొందును దీనినే పరిహార దీర్ఘత యనియు నందురు

| | | | |
|---|---|---|---|
| ఉబుసు | [భీమ 4-33] | ఊసు | [భీమ 5-15] |
| కళవసము | [హర 4-11] | కళాసము | [శృ.నై 6-115] |
| గారవము | [భీమ 5-38] | గారాము | [శృ నై 8-190] |
| మొగసాల | [కాశీ 4 105] | మోసాల | [కాశీ 2-41] |
| సగము | [హర 4-25] | సాము | [హర 5-25] |

1.2.13 పదాది హల్లోపము : (Loss of the word initial consonant)

| | | | |
|---|---|---|---|
| చిగురుఁబోఁడి | [కాశీ 7-182] | ఇగురుఁబోఁడి | [కాశీ 3-41] |
| హదను | [శృ.నై 3-14] | అదను | [కాశీ 3-20] |

1.2.14. మధ్యాక్షరచ్యుతి : (Loss of medial syllable)

| | | | |
|---|---|---|---|
| నిక్కువము | [శృ నై. 5-19] | నిక్కము | [శృ నై. 3-14] |
| పల్లెరము | [శృ నై. 6-112] | పల్లెము | [శృ నై 6-108] |
| ముదుసలి | [భీమ 2-110] | ముసలి | [శృ నై 1-109] |

1.2.15. స్వరభక్తి లేక స్వరవిశ్లేషము : (Anaptyxis)

కొన్ని రకముల హల్సంయోజనములు భాషాస్థితికి విరుద్ధమైనచో ఎరవు తెచ్చుకొనిన పదములలో నున్నట్టి సంయోజనములను ఒక అచ్చుచేత విడదీయుట స్వరభక్తి అందురు. ఏకభాషా పదములందును చారిత్రికముగా నిట్టి మార్పు జరుగవచ్చును. తెలుగులో కొన్ని తత్సమములు ఈ ప్రక్రియచే తద్భవములుగా మారుచున్నవి.

| | | | |
|---|---|---|---|
| చంద్రుఁడు | [కాశీ 4-217] | చందురుఁడు | [భీమ 4-127] |
| కన్య | [హర 4-9] | కన్నియ | [శృ నై 6-42] |
| నిద్ర | [కాశీ 1-127] | నిదుర | [కాశీ 3-22] |
| రాత్రి | [కాశీ 5-189] | రాతిరి | [హర 5-13] |
| సముద్రము | [కాశీ 4-222] | సందరము | [హర 6-82] |

1.2.16. వర్ణవ్యత్యయము : (Metathesis)

ఒక కాలమునాటి వర్ణసంయోజనము మరొక కాలమునాటి వ్యవహర్తలకు క్లిష్టముగా ననిపించుటచే ఆ సంయోజనము క్రమముగా మారుట వర్ణవ్యత్యయ మందురు. ఇట్టి మార్పు తెలుగు భాషాచరిత్రలో కొన్ని ధ్వనులమధ్య ఒకక్రమములోను మరి కొన్ని శబ్దములలో అపక్రమములోను జరిగినది.

| | | | |
|---|---|---|---|
| అనవుఁడు | [హర 1-137] | నావుఁడు | [శృ నై. 5-71] |
| అనక | [హర 1-14] | నాక | [కాశీ 1-101] |
| ఎలదీఁగ | [శృ.నై 3-177] | లేఁదీఁగ | [కాశీ 3-239] |
| నవ్వులాట | [శృ.నై. 7-169] | నవ్వటాల | [శృ.నై. 7-165] |
| నారికేళము | [భీమ 2-53] | నాళికేరము | [హర 6-56] |

1.2.17. పర్యాయరూపప్రాప్తి :

| | | | |
|---|---|---|---|
| ఏరు | [శృ.నై 2-38] | ఎవరు | [ప. వీ 25] |
| ఒర్రు | [శృ నై. 2-140] | ఒకర్రు | [శృ.నై. 3-98] |

### 1.2.18. మధ్యధ్వని లోపము : (Syncope)

పద మధ్యమందలి **డ**, న, ర, ఱ, ల మీది **అచ్చులగు** అ, ఇ, ఉ లకు లోపము కలుగును [9] ఇది కేవలము నామములకే కాక క్రియల యందును కనిపించును.

-అ- :

| | | | |
|---|---|---|---|
| తొలకరి | [హర 4-47] | తొల్కరి | [శృ నై. 6-121] |
| పాలకడలి | [శృ.నై. 2-92] | పాల్కడలి | [భీమ 4-110] |
| మెలఁత | [శృ నై. 3-160] | మెల్త | [శృ నై. 8-173] |
| వలచు | [హర 2-13] | వల్చు | [శృ.నై. 1-17] |

-ఇ- :

| | | | |
|---|---|---|---|
| ఉనికి | [భీమ 4-151] | ఉన్కి | [హర 3-20] |
| కలికి | [శృ నై. 2-141] | కల్కి | [కాశీ 6-209] |
| కూరిమి | [శృ నై. 2-75] | కూర్మి | [శృ నై 8 129] |
| తాలిమి | [కాశీ 6-29] | తాల్మి | [కాశీ 7-81] |
| వెలితి | [శృ.నై. 7-151] | వెల్తి | [భీమ 3-46] |

-ఉ- :

| | | | |
|---|---|---|---|
| అనువు | [శృ నై. [illegible]-12] | అన్వు | [కాశీ 5-319] |
| అలుక | [శృ నై. 8-74] | అల్క | [కాశీ 3-37] |
| ఎదురుకొను | [శివ 1-75] | ఎదుర్కొను | [హర 4-94] |
| ఏడుచు | [భీమ 2-116] | ఏడ్చు | [శివ 2-91] |
| కాలువ | [కాశీ 7-203] | కాల్వ | [భీమ 1-26] |
| చెఱువు | [కాశీ 6-294] | చెర్వు | [కాశీ 6-29] |
| చేరుచుక్క | [శృ నై. 6-44] | చేర్చుక్క | [కాశీ 7-148] |
| తునిమి | [కాశీ 7-96] | తున్మి | [కాశీ 6-39] |
| నలువ | [శృ.నై. 1-5] | నల్వ | [శివ 1-56] |
| పొరుగు | [హర 5-20] | పొర్గు | [హర 2-103] |
| మనుమఁడు | [శృ నై. 6-7[illegible]] | మన్మఁడు | [హర 7-125] |
| విలుతుఁడు | [శృ.నై. 2-95] | విల్తునకు | [భీమ 3-212] |

9. బాల. ప్రకీర్ణ - 17

పై ఉదాహరణములాధారముగా -ఉ- వర్ణముతోడి మధ్యధ్వని లు ప్తీకరణము విరిగాను, -ఇ వర్ణముతోడి, -అ-వర్ణము తోడి మధ్యధ్వని లు ప్తీకరణము విరళముగను కన్పించుచున్నది. -ఎ-వర్ణముతోడి మధ్యధ్వని లు ప్తీకరణము కానరాదు.

1.2.19. వర్ణసమీకరణము : (Assimilation)

ఒక వర్ణము సమీపవర్ణముతో పాక్షికముగాగాని, సంపూర్ణముగాగాని సన్నిహితముగా మారినచో దానిని వర్ణసమీకరణ మందురు

| | | | |
|---|---|---|---|
| కొలది | [హర 4-18] | కొద్ది | [ప పీ 25] |
| భక్తుడు | [హర 2-86] | బత్తుడు | [హర 2-77] |
| మృత్యువు | [శివ 4-57] | మిత్తి | [శివ 4-58] |

1.2.20. హాల్లోపము : (Haplology)

ఒక మాటలోని చివరి యక్షరము రెండవమాటకు మొదటి సజాతీయాక్షరమున్న యెడల లోపించుచున్నట్లు కనిపించును.

| | | | |
|---|---|---|---|
| అంత + దాక | : | అందాక | [హర 1-51] |
| మును + నీరు | : | మున్నీరు | [హర 3-65] |
| బొంత + దడము | : | బొందడము | [శృ నై. 7-61] |

1.2.21. స్వర సమీకరణము : (Vowel Harmony)

వర్ణసమీకరణమే స్వరముల మధ్య జరిగినపుడు దానిని ప్రత్యేకముగా స్వర సమీకరణమను పేరుతో వ్యవహరించుట భాషాపరిశోధకులయందు సంప్రదాయముగా కనిపించుచున్నది

1. పరాచ్ఛ ఆకర్షణ :

| | | | |
|---|---|---|---|
| అంకిలి + లు | | అంకిలులు | [భీమ 4-200] |

ఇదంతముల బహువచనములకు ఉత్వము కలుగును

| | | | |
|---|---|---|---|
| కలుగు + ఇ | : | కలిగి | [కాశీ 5-127] |
| తొడుగు + ఇ | | తొడిగి | [శృ నై. 6-22] |

ధాతుగత ఉకారమునకు ఇకారము కలుగును

| | | | |
|---|---|---|---|
| ములికి + లు | : | ములుకులు | [భీమ 3-212] |

తుది ఇత్వమునకే గాక ఉపోత్వమేత్వమునకు సయితము ఉత్వాకర్షణముచే ఉత్వము కలుగును.

2. పూర్వాచ్ఛ ఆకర్షణ :

| | | | |
|---|---|---|---|
| వాని + కు | : | వానికి | [హర 2-19] |

# 2. సంధి విజ్ఞానము
## [MORPHO-PHONEMICS]

2.0.0 సంధి యనగా కూడిక యని యర్థము. ఒక పదమునకు మరొక పదమును సన్నిహితముగా చేర్చి పలుకునపుడు భాషా సంప్రదాయమును బట్టి కొన్ని మార్పులు జరుగును. ఒక వర్ణమును పలుకునపుడు ముఖయంత్రము ఒక విధమగు ప్రయత్నమును గావించును. మరొక వర్ణమును పలుకుటకు ముఖయంత్రము తద్భిన్నమగు ప్రయత్నము గావింపవలసి వచ్చును. ఉచ్చారణత్వర యొక్కటి యీ ప్రయత్నమునకు సహకరించును. కావున 'కూడిక' యనునది యవశ్య లక్షణము. కాని, యిది అన్ని భాషలందు నొకే విధముగా నుండదు.[1]

సంస్కృతమున నుండు సంధి విధానము వేరు. అందలి సంధులు తెలుగు భాషా సంప్రదాయమునకు భిన్నములు. పూర్వ పదమందలి తుది వర్ణమును, పర పదమందలి తొలి వర్ణమును, సన్నికర్ష పొందినప్పుడు రెండింటికి బదులుగా పర పదాది వర్ణము నిలుచుట సంధి.[2] సంధి యనగా వర్ణసంయోగము అని సామాన్యార్థము. దీనిని సంహిత అనియు అందురు.[3]

తెలుగు భాషలో పదాదియందు 'ఙ, య, ళ' లు 'వు, వూ, వొ, వో' లు తప్ప మిగిలిన దేశీయములైన అచ్చు ల్వర్ణము లన్నియు వచ్చును బహువచనమున 'లు, రు' లకు నవశిష్టములగు 'ల్, ర్' వర్ణములును, ద్రుతమును తక్క హల్లులు తెలుగు శబ్దమునకు చివర నిలువవు. పదాదియందు వచ్చు 'ఋ, ౠ' వర్ణములు సంధిలో 'ర ల' లతో తుల్యము.[4]

పదాంతమున వచ్చు -ర, -ల వర్ణములు చాలవరకు బహుత్వ బోధకములై యుండును.

ఉదా :— /-ర్/ : జాతి ప్రజలకును దుర్దశలు సంధింతుర్ [హర 5-13]

/-ల్/ : చంచల్లీలల హస్తకంకణ మణిచ్ఛాయల్ [కాశీ 1-40]

---

1. 'స్వాత్విశ్రీ' - తెలుగు భాషాచరిత్ర - పుట. 213
2. పై దే - పుట. 213.
3. కోరాడ రామకృష్ణయ్య - సంధి - పుట 17.
4. బాల - ప్రకీర్ణ -1.

సాహిత్యస్థితి నొందునాటికే తెలుగు పదములు అజంతములుగా పరిణతిని సాధించుకొన్నవి. కావున అచ్సంధి అధిక ప్రాధాన్యము వహించుచున్నది. సంధి కార్యములు జరుగు సందర్భములు రెండువిధములుగా మనము గుర్తింపవచ్చును. ప్రాతిపదికకు విభక్తి ప్రత్యయము పరమైనపుడు సంధి జరుగవచ్చును లేదా విభక్తి సంబంధము లేని రెండు పదములకు సంధి జరుగవచ్చును అప్పుడొక వర్ణము కాని, షష్ఠీ విభక్తిక ప్రత్యయము గాని ఆగమమగును.[5]

1 ప్రాతిపదికకు ప్రత్యయమునకు మధ్య సంభవించు దానిని పదమధ్య సంధి యందురు. (internal sandhi)

ఉదా :- రెండవ తీర్థము [భీమ 3-66]

2. స్వతంత్ర శబ్దములమధ్య సంభవించు దానిని పదాంతసంధి యందురు. (external sandhi)

ఉదా :- అడియాస [కాశీ 2-111] : చదలేఱు [శృ నై 3-6]

2.1 0 సంధుల్లలో వచ్చు మార్పులను నాలుగు విధములుగా వర్గీకరింపనగును.

1. అచ్చు + అచ్చు (Vowel + Vowel)
2. అచ్చు + హల్లు (Vowel + Consonant)
3. హల్లు + అచ్చు (Consonant + Vowel)
4. హల్లు + హల్లు (Consonant + Consonant)

పై వానిలో మొదటిదానిని స్వరసంధి (vocalic) గాను, మిగిలిన వానిని హల్సంధులుగాను పేర్కొనవచ్చును.

## 2.1.1 అచ్చు + అచ్చు : (Vowel + Vowel)

స్వరసంహిత యందు (in vocalic junction) మొదటి పదమందలి అంత్యాచ్చు నియతముగా లోపించును.[6]

| | | | | |
|---|---|---|---|---|
| ఉదా :- | కదలు + ఇంచు | : | కదలించు | [హర 6-45] |
| | వాలు + ఇక | : | వాలిక | [శృ నై. 2-112] |
| | తూము + ఎండు | : | తూమెండు | [హర 1-17] |
| | జాల + అరి | : | జాలరి | [శివ 2-101] |

5. కోరాడ రామకృష్ణయ్య - సంధి - పుట 33. 6 బాల - సంధి - 11.

2.1.2. ఉదంతములు :

1. ఉత్తునకచ్చు పరంబగునపుడు సంధియగు [బాల. సంధి 1]

| | | |
|---|---|---|
| -ఉ + అ- > అ : నిజము + అయ్యెన్ | : నిజమయ్యెన్ | [భీమ 2-135] |
| -ఉ + ఆ- > ఆ : నీవు + ఆడెదు | : నీవాడెదు | [హర 7-57] |
| -ఉ + ఇ- > ఇ : ఆరతులు + ఇచ్చువారు | : ఆరతులిచ్చువారు | [క్రీడా 142] |
| -ఉ + ఈ- > ఈ : తాను + ఈతపంబు | : తానీతపంబు | [కాశీ 4 108] |
| -ఉ + ఉ- > ఉ . పేరు + ఉక్కునన్ | పేరుక్కునన్ | [శృ నై. 1-36] |
| -ఉ + ఊ- > ఊ: కుటుసము + ఊడ్చు | : కుటుసమూడ్చు | [భీమ 5-71] |
| -ఉ + ఎ > ఎ : మేను + ఎల్ల | : మేనెల్ల | [భీమ 2-91] |
| -ఉ + ఏ- > ఏ : ఎదురు + ఏల | : ఎదురేల | [భీమ 4-12] |
| -ఉ + ఒ- > ఒ : మడుగు + ఒల్లియ | : మడుగొల్లియ | [హర 4-81] |
| -ఉ + ఓ- > ఓ : మేలు + ఓగిరము | : మేలోగిరము | [హర 2-128] |

2 సాధారణముగా శ్రీనాథుని కావ్యభాషలో వాక్యావసానము నందలి ఉత్తు లోపించి సంధి నిత్యముగా జరుగుచుండును కాని ఈ క్రింద ప్రదర్శించిన రెండు ఉదాహరణముల యందు వాక్యాంతము పాదాంతము నగునపుడు సంధిలేక పోవుట గమనింపదగిన విషయము వాక్యము యొక్క యవసానమునందు సంధి లేకపోవుట దోషము కాదని వైయాకరణుల యభిప్రాయము [7] "నస్యాద్వాక్య విరామేతు సంధ్యభావోఽపి దోషకృత్" అని వికృతి వివేకము [8]

ఉదా :- 1 ధూళిపాళిక చుఱుకించెఁ దూర్పుదిక్కు/ఇంతి, వేగన్నులును <
తూర్పు దిక్కు + ఇంతి [శృ.నై. 4-25]

2 మధుకైటభారాతి మడుఁగు బొన్పు/ఏచకోరాక్షులు <
మడుఁగు బొన్పు + ఏచకోరాక్షులు [కాశీ 3-169]

2.1.3 అదంతములు :

1. అత్తునకు సంధి పాక్షికముగ నగును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| -అ + అ- > అ | : మేన | + | అల్లుఁడు : | మేనల్లుఁడు | [భీమ 2-52] |
| అయ | : మేన | + | అత్తలు : | మేనత్తలు | [హర 2-105] |
| -అ + ఇ- > ఇ | : వంట | + | ఇల్లు : | వంటిల్లు | [భీమ 3-51] |
| అయి | : వంట | + | ఇలు : | వంటయిలు | [కాశీ 6-221] |

7. బాల - సంధి. 55 8. వికృతి వివేకము - సంధి - 2.

-అ + ఉ- > ఉ : ఊరక + ఉండె : ఊరకుండె [కాశీ 4-228]
అయు: ఊరక + ఉండె : ఊరకయుండె [శివ 4-57]
-అ + ఊ- >ఊ : కోల + ఊఁదుకొని: కోలూఁదికొని [హర 2-88]
అయూ: తల + ఊఁచు : తలయూఁచు [కాశీ 5-168]
-అ + ఏ- > ఏ : ఎంత + ఏని ఎంతేని [శృ.నై. 1-109]
అయే : ఎంత + ఏని : ఎంతయేని [హర 1-20]
-అ + ఒ- > ఒ : ఇంత + ఒప్పునె : ఇంతొప్పునె [శృ.నై. 1-104]
అయొ : ఇంత + ఒప్పునె : ఇంతయొప్పునె [భీమ 5-78]
-అ + ఓ- > ఓ : ఏల + ఓరి : ఏలోరి [హర 7-59]
అయో: చెంచుల+ఓబయ్య : చెంచులయోబయ్య [వ వీ 7]

2. స్త్రీ వాచకములకు సంధి లేదు

-అ + ఈ- > అయీ : అతివ+ఈగర్వము : అతివయీగర్వము [కాశీ 4-226]

-అ + ఓ > అయో : వినత +ఓటువడి : వినతయోటువడి [కాశీ 6-54]

3. సంస్కృత సమముల యందలి అత్తునకు సంధి జరుగుట శ్రీనాథుని భాషలోని ప్రత్యేకత.

సీమ + అటు : సీమటు [భీమ 5-77]

"కుత్ర చిత్సంస్కృతీయోపి ప్రాణోవ్యత్ర భవేచ్చ్యుతిః" అని యధర్వణ కారిక.[9] సంస్కృతీయములందును, నొకానొకచో, నచ్చు చ్యుతమగునని దీని యర్థము

4. శ్రేష్ఠతను బోధించు అర్యాంబాద్యర్థక శబ్దములు పరములగునపుడు అచ్చులకు సంధి నిత్యము. [ప్రౌఢ - సంధి - 1]

శ్రీ ప్రెగడ + అన్న : శ్రీప్రెగడన్న [శృ.నై. 1-36]
భీమ + అయ్య : భీమయ్య [శివ 1-25]
గంగ + అమ్మ : గంగమ్మ [భీమ 4-175]

5. ఏవార్థక మందలి అత్తునకు సంధి కాదు.

అడిగినపుడ + ఇత్తునే : అడిగినపుడయిత్తునే [శృ.నై. 3-51]
అచిరకాలమునంద + ఏను అచిరకాలమునందయేను [కాశీ 3-245]

9. వికృతి వివేకము - సంధి - 8

6. వ్యతిరేక క్త్వార్థక మందలి అత్తునకు సంధి వైకల్పికము.

| | | | | |
|---|---|---|---|---|
| లేక | + ఉన్నాఁడు | : | లేకయున్నాఁడు | [శృ.నై. 4–23] |
| లేక | + ఉన్న | : | లేకున్న | [క్రీడా 48] |
| పాయక | + ఉండు | : | పాయకుండు | [కాశీ 5–335] |
| పాయక | + ఉండు | : | పాయక యుండు | [కాశీ 6–185] |

నన్నెచోడుని భాషలో సంధి నిత్యము.

| | | | | |
|---|---|---|---|---|
| కొల్వక | + ఎదలో | : | కొల్వకెదలో | [కు. సం. 10–96] |
| పాయక | + ఏర్పడి | : | పాయకేర్పడి | [కు. సం. 6–71] |

7 అది యవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగ నగు. [బాల–సంధి. 45]

| | | | | |
|---|---|---|---|---|
| నా | + అది | : | నాది | [హర 2–55] |
| నా | + అది | : | నాయది | [భీమ 2–120] |
| నీ | + అవి | : | నీయవి | [కాశీ 4–75] |
| ఎక్కడి | + అది | : | ఎక్కడిది | [శివ 1–104] |
| ఎక్కడి | + అది | : | ఎక్కడియది | [భీమ 2–50] |
| ఎక్కడి | + అవి | : | ఎక్కడివి | [హర 7–180] |
| అట్టి | + అది | : | అట్టిది | [కాశీ 1–76] |
| ఇట్టి | + అది | : | ఇట్టిది | [శృ.నై. 3–144] |
| ఎట్టి | + అది | : | ఎట్టిది | [భీమ 4–202] |

అది యవి శబ్దముల యత్తునకు ఉదంత తద్ధర్మ విశేషణముల మీఁద లోపము లేదు.

వచ్చు + అది : వచ్చు – ను + అది : వచ్చునది [హర 2–140]

## 2.1.4 ఇదంతములు :

1 ఇత్తునకు సంధి పాక్షికముగా నగు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| –ఇ + అ– > అ | : | గ్రుడ్డి + అవ్వ | : | గ్రుడ్డవ్వ | [హర 2–88] |
| అయ | : | గ్రుడ్డి + అవ్వ | : | గ్రుడ్డియవ్వ | [హర 2–47] |
| –ఇ + ఆ– > ఆ | | అరఁటి + ఆకు | : | అరఁటాకు | [భీమ 2–134] |
| ఇయా | : | అరఁటి + ఆకు | : | అరఁటియాకు | [భీమ 2–143] |
| –ఇ + ఇ– > ఇ | ; | అత్తవారి + ఇల్లు | : | అత్తవారిల్లు | [కాశీ 7–101] |

-ఇ + ఉ- > ఉ : వెండి + ఉంగరము : వెండుంగరము [హర 7-12]
-ఇ + ఊ- > ఇయూ : నోటి + ఊరుపు : నోటి యూరుపు [కాశీ 3-129]
-ఇ + ఎ- > ఇయె : కాశి + ఎక్కుడు : కాశి యెక్కుడు [భీమ 2-5]
-ఇ + ఓ- > ఓ : వెఱ్ఱిది + ఓ : వెఱ్ఱిదో [హర 7-55]
ఇయో: చల్ది + ఓగిరము : చల్ది యోగిరము [కాశీ 6-46]

2, ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగా నగు [బాల - సంధి- 5]

ఏమి : ఏమి + అనునో : ఏమనునో [భీమ 5-45]
ఏమి + అడుగఁదలఁచెద : ఏమియడుగఁదలఁచెద [కాశీ5-185]

సంధి నివారకమగు యడాగమముతో 33 పర్యాయములును, యడాగమ విరహితముగా 7 పర్యాయములు శ్రీనాథుని భాషలో ప్రయోగములు కలవు

మఱి : మఱి + ఏడకు : మఱేడకు [భీమ 2-156]
మఱి + ఏమి : మఱియేమి [శృ.నై. 3-144]
అది : అది + ఏటికి : అదేటికి [భీమ 5-143]
అది + ఇంత : అదియింత [కాశీ 7-50]

సంధి నివారకమగు యడాగమముతో 67 పర్యాయములు, యడాగమ విరహితముగా 8 పర్యాయములు శ్రీనాథుని భాషలో ప్రయోగములు కలవు.

ఇది : ఇది + ఏమి : ఇదేమి [ప. పీ. 119]
ఇది + ఏమి : ఇదియేమి [శృ నై. 2-142]

3. అవి, ఇవి, ఎద్ది, ఎవ్వి అను సర్వనామముల ఇత్తునకు సంధి లేదు.

అవి : అవి + ఎయ్యవి : అవియెయ్యవి [శృ నై. 7-137]
ఇవి : ఇవి + అంచు : ఇవియంచు [శృ.నై. 1-58]
ఎద్ది : ఎద్ది + ఎఱుగంగ : ఎద్దియెఱుగంగ [కాశీ 7-46]
ఎవ్వి: ఎవ్వి + అనినన్ : ఎవ్వియనినన్ [శృ నై. 4-50]

శ్రీనాథుని భాషలో అవ్వి, ఇవ్వి, అను సర్వనామములతో కూడి సంధి కావింపబడిన ప్రయోగములు కానరాలేదు.

4. క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు. [బాల-సంధి-6]

5)

ప్రథమపురుష బహువచనము :

ఉదా :- పోయిరి + అంబరమునకు : పోయిరంబరమునకు [శివ 1-106]

తెచ్చిరి + అర్మిలిన్ : తెచ్చిరర్మిలిన్ [హర 2-91]

విడిచిపోయిరి + ఒకపాటి : విడిచిపోయిరి యొకపాటి [కాశీ 7-77]

పొందిరి + అవిముక్తసీమ : పొందిరి యవిముక్తసీమ [కాశీ 3-232]

ఉత్తమపురుష బహువచనము :

నిండుకొల్వులో నిచ్చితిమి + ఇంతలోపలనె : నిండుకొల్వులో నిచ్చితి మింతలోపలనె [శృ.నై. 7-106]

వచ్చితిమి + ఇందఱమును . వచ్చితి మిందఱమును [కాశీ 2-69]

5. మధ్యమపురుష క్రియలందిత్తునకు సంధి యగును. [బాల - సంధి - 7]

1. మధ్యమపురుషైక వచనము :

ఓపితివి + ఏని : ఓపితివేని [శృ నై. 4-82]

పడసితివి + ఈశాను : పడసితివీశాను [హర 7-144]

మధ్యమ పురుష బహువచనము :

వరియించితివి + ఇంతియగాక : వరియించితి రింతియగాక [శృ.నై.7-103]

2. మధ్యమ పురుషైక వచన భూతకాల సమాపక క్రియయందలి పురుష ప్రత్యయము కొన్ని యెడల లోపించును.

అడిగితి + ఉక్కివైభవము : అడిగితుక్కి వైభవము [కాశీ 3-67]

ఆశ్చర్యమందితి + ఇపుడు : ఆశ్చర్య మందితిపుడు [శృ. నై. 6-28]

ఏతెంచితి + ఎట్లు : ఏతెంచితెట్లు [శృ నై. 4-2]

తలంచితి + ఏని : తలంచితేని [శృ.నై. 5-21]

నన్నయ తిక్కన భాషలలో భూతకాలిక రూపము నందలి 'ఇ' వర్ణ లోపము పై పద్ధతి ననుసరించు చున్నది. కాని నన్నెచోడుని భాషలో ఉత్తమ, మధ్యమ పురుషల సమాపక క్రియా రూపములోని 'ఇ' వర్ణము నిత్యముగ లోపించుచున్నది.

3. మధ్యమ పురుషేకార సంధి వైకల్పికముగ జరుగుచున్న సన్నివేశములు శ్రీనాథుని భాషలో ఒకటి రెండు సందర్భములు లేకపోలేదు. ప్రాచీన లాక్షణికులు, ప్రసిద్ధ విమర్శకులు, ఈ విషయమై భిన్నాభిప్రాయములను వెలిబుచ్చిరి. వాని నన్నింటిని సూక్ష్మముగ వివరించెదను.

ఉదా :- కూర్చుండిరి + ఒండొరుంగదిసి : కూర్చుండిరి యొండొరుంగదిసి [శృ నై. 3-78]

క్రియాపదముల ఇత్తునకు ప్రాచీన కాలము నుండియు సంధి కలుగుటయే సహజమై యుండెననియు, ఛందస్సౌకర్యము మొదలగు కారణములచే సంధి జరుగక యడాగమము వచ్చిన రూపము లిటీవలి కాలమున వాడుకలోనికి వచ్చినవనియుఁ దలంపఁ దగియున్నదని కోరాడవారి యభిప్రాయము.[10]

'కూర్చుండిరి' అనునది ప్రథమ పురుష బహువచనమే గాని, మధ్యమ పురుష బహువచనము కాదు. నన్నయ ప్రయోగము లాధారముగా కేతన దీనిని నిత్యముగా విధించినాడు; అని డా॥ శివకుమార్ అభిప్రాయము.[11]

ఆంధ్రశబ్ద చింతామణి యందు : ఉత్తమపురుష వ్యతిరిక్త క్రియాపదంబుల యందు హ్రస్వేకారంబునకు నిత్యముగా సంధి యగును. అని పూర్వులు వ్యాఖ్యానము చేయుచు ప్రథమోత్తమ పురుషంబులు కిమాది గణంబులోనివి గాన వాని యికారంబునకు సంధి వికల్పమని వ్రాసి దానికి ప్రోద్బలంబుగా :

"ప్రథమేచోత్తమేచైవ క్రియేతోవా భవేచ్ఛ్యుతిః

నిత్యమన్యస్య వికృతౌ క్త్వార్థితో నభవేత్సదా" అను వికృతివివేక కారికలను ప్రమాణముగా చూపిరి అప్పకవి తిమ్మకవ్యాదులును మూలసూత్రము నందు "అనుత్తమ పురుష క్రియాసు" అని యుత్తమపురుషను వర్ణించినందున మధ్యమ పురుషేకారంబునకుంబోలె బ్రథమ పురుషేకారంబునకు నిత్య సంధి రావలయును అనుచు పై శ్రీనాథుని ప్రయోగమును ఉట్టంకించిరి.[12]

---

10 కోరాడ రామకృష్ణయ్య : సంధి - 94.

11 డా॥ హరిశివకుమార్ : కేతన - సిద్ధాంత గ్రంథము, 1973 పుట 109.

12. కల్లూరి వేంకటరామశాస్త్రి : బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశిక. పుట 33.

శ్రీనాథుడు పై ప్రయోగములనే కాక, సీ క్రింది యుదాహరణములలోను మధ్యమ పురుషేకార సంధి వైకల్పికము కావించినాడు.

ఉదా : ఏగుదెంచితిరి + ఇందుకళాధర : ఏగుదెంచితిరి యిందుకళాధర [శివ 4-60]
సైరింపవైతి + ఈశాపమునకు : సైరింపవైతి యీశాపమునకు [కాశీ 6-23]
పల్కితివి + ఐనను : పల్కితివియైనను [హర 4-33]

దీనినిబట్టి వైకల్పికత్వము శ్రీనాథుని కాలమునకు సహజమని తెలియుచున్నది. ఈ విషయము సూరిచేసిన నిర్ణయమునకు [బాల - సంధి - 6, 7] కొంత భిన్నముగ నున్నది.

6. 1. క్త్వార్థంబైన యిత్తునకు సంధిలేదు. [బాల - సంధి - 8]

| | | | | |
|---|---|---|---|---|
| అరసి | + అరసి | : | అరసియరసి | [భీమ 5-28] |
| నిండి | + ఉండ్రు | : | నిండియుండ్రు | [హర 2-41] |
| నిండి | + ఉన్నది | : | నిండియున్నది | [శృ నై. 7-161] |

క్త్వార్థకేకారమునకు సంధి లేదని లాక్షణికులనుటయే కాని, యా సంధి వైకల్పికమనుటకు పదుమూడవ శతాబ్దము నుండియు కావ్యములందు ప్రయోగములు గలవు.[13]

| | | | | |
|---|---|---|---|---|
| అంది | + ఈక | : | అందీక | [కాశీ 5-161] |

ఇట్టివి నన్నెచోడునిలో : పొంగి + ఎఱగెడు : పొంగెఱగెడు [కు.సం. 11-172] ఇట్టివి నన్నయలో లేవు. ఈ విధముగ లోపించిన విలక్షణ రూపములు వ్యవహార భాషలోని వనుట స్పష్టము. ఈ విషయము శాసన భాష వలన నిర్ణయింప వచ్చును.

ఉదా :- వెళ్ళిచ్చిన (S II VI 724 Vizag 1399 A. D)

3. కొన్ని యెడల సంయుక్త ధాతువుల యందలి ఇ వర్ణము లోపించి సంధియగును.

| | | | | |
|---|---|---|---|---|
| తూఁగి | + ఆడు | : | తూఁగాడు | [శృ.నై. 3-67] |
| త్రుళ్లి | + ఆడు | : | త్రుళ్లాడు | [క్రీడా 129] |
| తొలఁకి | + ఆడు | : | తొలఁకాడు | [శృ.నై. 4-62] |
| వ్రేలి | + ఆడు | : | వ్రేలాడు | [ప వి. 118] |

13. చిలుకూరి నారాయణరావు : ఆంధ్రభాషా చరిత్రము, ప్రథమ, పుట352, 353.

ఇందలి పూర్వపదము ధాతువా ? క్త్వార్థకమా ? అను సందేహము కొన్ని సందర్భములలో కలుగు చుండును.

7\. 1. శ్రేష్ఠతా వాచకములైన ఆర్యాది శబ్దములు పరమైనచో ఇత్తునకు కొన్నియెడల సంధిరాదు.

పోలి + అయ్య : పోలియయ్య [క్రీడా -145]

2\. ఆర్యాద్యర్థములు పరమగునపుడు ఒకానొకచో ఎత్వము ఆదేశముగా వచ్చును.

పల్లి + అమ్మ : పల్లెమ్మ [క్రీడా - 145]

8\. షష్ఠీ సమాసము నందలి 'ని' వర్ణము మీది యచ్చునకు అచ్చు పరమగునపుడు కొన్నియెడల సంధియగును.

దీని + అంఘ్రులు దీనంఘ్రులు [శృ.నై. 3-202]
చిఱుతొండని + ఇంటికి : చిఱుతొండ నింటికి [హర 1-15]
మగని + ఆలు : మగనాలు [కాశీ 2-83]

9\. వ్యతిరేక ధాతుజ విశేషణమందలి 'ఇ' వర్ణమునకు సంధిరాదు.

పడని + అర్థంబును : పడని యర్థంబును [శృ నై 3-66]
అందరాని + అధికతరమైన : అందరాని యధికతరమైన [శృ నై. 2-3]
వినని + అట్లు : విననియట్లు [శృ నై. 5-114]

10\. తత్సమ నామములందలి ఇత్తునకు సంధికాదు

వాణి + అన్నిలవేణి : వాణి యన్నిలవేణి [శృ నై. 5-75]
భవాని + ఉబుసుపోవక : భవాని యుబుసుపోవక [కాశీ 6-161]
వేమక్ష్మాపతి + అంచిత : వేమక్ష్మాపతి యంచిత [భీమ 1-40]
కాశి + అవ్యవధానంబున: కాశి యవ్యవధానంబున [కాశీ 4-302]

తత్సమ శబ్దమునందలి ఇత్తునకు అచ్చు పరమగునపుడు శ్రీనాథుని భాషలోని క్రింది ప్రయోగముల యందు సంధి నిత్యముగా నగుచున్నది.

భూతి + అలదు : భూతలదు [శివ. 5-52]
ధూళి + అయ్యె : ధూళయ్యె [భీమ 4-143]

11\. అనుకరణ సంధిలోని 'ఇ' వర్ణమునకు సంధిరాదు.

జీవన్ భద్రాణి పశ్యతి + అను వేదవచనంబు : జీవన్ భద్రాణి పశ్యతి యను వేద వచనంబు [హర 2-78]

**2.1.5 ఎదంతములు :**

1. ఎదంతముల మీది అచ్చునకు ముందు యకారము అదనముగా వచ్చును.

-ఎ + అ- > ఎయ : తేనె + అనంటి పండ్లు : తేనె యనంటి పండ్లు [హర 6-56]
-ఎ + ఆ- > ఎయా : కుంచె + ఆడించు : కుంచెయాడించు [శివ. 4-75]
-ఎ + ఎ- > ఎయె : గద్దె + ఎక్కు : గద్దెయెక్కు [కాశీ 7-55]
-ఎ + ఏ- > ఎయే- : ఇదె + ఏను : ఇదెయేను [భీమ 2-158]

2. అన్ని దీర్ఘాచ్చులకు పరమైన అచ్చునకు ముందు యకారము అదనముగా వచ్చును.

-అ + అ- > ఆయ : నా + అదియే : నాయదియె [భీమ 2-120]
-ఆ + ఆ- > ఆయా : మా + ఆత్మ : మాయాత్మ [భీమ 5-53]
-ఈ + అ- > ఈయ : మీ + అంతవారలు ; మీయంతవారలు [శృ నై. 7-103]
-ఈ + ఆ- > ఈయా : నీ + అడుగులాన : నీయడుగులాన [శివ. 3-130]
-ఏ + అ > ఏయ : ఏ + అవకరంబు : ఏయవకరంబు [కాశీ 7-145]
-ఏ + ఆ > ఏయా : ఏ + ఆకునకు : ఏయాకునకు [హర 6-92]
-ఓ + అ- > ఓయ : ఓ + అన్నదమ్ములారా
; ఓఅన్నదమ్ములారా [భీమ 4-53]

**2.2.0 అచ్చు + హల్లు : (Vowel + Consonant)**

దూరవర్తి సర్వనామాంగము(remote demonstrative base) : ఆ
సమీపవర్తి సర్వ నామాంగము(proximate demcnatrative base) ; ఈ
ప్రశ్నార్థక సర్వ నామాంగము (interrogative base) ; ఏ

2 2.1 ఆ, ఈ, ఏ అను సర్వనామములు త్రికంబునాఁబడు. [బాల - సమాస 4]
త్రికముమీది యసంయుక్త హల్లునకు ద్విత్వము బహుళముగానగు [ ,, -14]
ఊష్మరేఫంబులకు ద్విత్వంబు కలుగదు.

ద్విరుక్తంబగు హల్లు పరంబగునపుడాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు.
[సమాస 13]

ఆ + కన్నియ : *ఆక్కన్నియ : అక్కన్నియ [శృ నై. 3-128]
ఆ + వేళ : *ఆవ్వేళ : అవ్వేళ [హర 3-82]
ఆవేళ [కాశీ 4-243]

| | | | | |
|---|---|---|---|---|
| ఈ + విధంబు | : *ఈవ్విధంబు | : | ఇవ్విధంబు | [హర 4-28] |
| | | | ఈవిధంబు | [హర 6-40] |
| ఏ + భంగి | : *ఏభ్భంగి | : | ఏభ్భంగి | [కాశీ 6-96] |
| | | | ఏభంగి | [కాశీ 2-109] |

1. ఊష్మ రేఫలు పరమైనచో :

| | | |
|---|---|---|
| ఈ + రహస్యంబు | : ఈ రహస్యంబు | [భీమ 6-41] |
| ఆ + శశాంకవదన | : ఆ శశాంకవదన | [శృ.నై. 5-191] |
| ఆ + సుభటుల | : ఆ సుభటుల | [శృ నై. 7-62] |
| ఆ + హరిణాక్షి | ; ఆ హరిణాక్షి | [శృ నై. 6-8] |

2. శ్రీనాథుని భాషలో -గ, -ట, -డ, వర్ణములతో ద్విత్వము నొందిన రూపములు లేవు.

3. మహాప్రాణ స్పర్శములతో (aspirated stops) సాధారణముగా ద్విత్వము నొందును.

| | | | |
|---|---|---|---|
| ఆ + ధాత్రీదేవుఁడు | : *ఆద్ధాత్రీదేవుఁడు | : అద్ధాత్రీదేవుఁడు | [కాశీ 7-234] |
| ఆ + భానుండు | : *ఆభ్భానుండు | : అభ్భానుండు | [కాశీ 4-261] |

4. సంధి నివారకమగు యకారము పైవానివలె ద్విత్వము పొందుచున్నది

| | | | |
|---|---|---|---|
| ఆ + అచ్చర | : *ఆయ్యచ్చర | : అయ్యచ్చర | [కాశీ 6-107] |
| ఈ + ఏవురము | : *ఈయ్యేవురము | : ఇయ్యేవురము | [కాశీ 7-103] |
| ఏ + అవి | : *ఏయ్యవి | : ఎయ్యవి | [కాశీ 5-22] |

5. క్షణము - అను శబ్దములోని క్షకారము పైందు హ్రస్వాచ్చు వచ్చును.

అక్షణమ నృపతి [శృ నై. 8-24] అక్షణంబ [శృ.నై. 4-39]

2.2.2 హల్లు పరమైనపుడు పదాంతములయి యసంయుక్తంబు లయిన డు, ను, లు, రు, ల యుత్వంబునకు, -టివర్గమందలి ఇత్తునకు లోపంబు పాక్షికము

-డ్ :

| | | | |
|---|---|---|---|
| /డ్గ/ : ఏడు + కడ | : ఏడ్గడ | [కాశీ 3-206] |
| /డ్నూ/ : ఏడు + నూఱు | ఏడ్నూఱు | [కాశీ 5-286] |
| /డ్ప/ : చెవుడు + పడు | ; చెవుడ్పడు | [శృ.నై. 4-28] |

-న్ :

| | | | | | |
|---|---|---|---|---|---|
| /న్క/ : | చను | + కట్టు | : | చన్కట్టు | [క్రీడా. 278] |
| /న్గ/ : | అను | + గృహంబు | : | అన్గృహంబు | [శృ.నై. 5-122] |
| /న్చ/ : | పెను | + చుట్టలు | : | పెన్చుట్టలు | [హర 7-44] |
| /న్త/ : | తార్కొను | + తారక | : | తార్కొన్తారక | [భీమ 3-93] |
| /న్ప/ : | అను | + పలుకు | : | అన్పలుకు | [కాశీ 6-127] |
| /న్బ/ : | అను | + బచ్చు | : | అన్బచ్చు | [శృ.నై. 8-159] |
| /న్భ/ : | అను | + భయంబు | : | అన్భయంబు | [శృ.నై. 3-143] |
| /న్మ/ : | వెను | + వెంట | : | వెన్వెంట | [కాశీ 3-199] |
| /న్స/ : | అను | + సభ | : | అన్సభ | [కాశీ 3-202] |

-ర్ :

| | | | | | |
|---|---|---|---|---|---|
| /ర్క/ : | ఎదురు | + కట్టు | : | ఎదుర్కట్టు | [కాశీ 6-262] |
| /ర్చ/ : | కారు | + చిచ్చు | : | కార్చిచ్చు | [కాశీ 4-118] |
| /ర్ప/ : | ఈరు | + పేను | : | ఈర్పేను | [కాశీ 6-79] |
| /ర్మ/ | అడుదురు | + మహి | : | అడుదుర్మహి | [శివ 3-9] |
| /ర్స/ : | భుజింతురు | + సురగణ | · | భుజింతుర్సురగణ | [కాశీ 3-183] |

-ఱ్ [>ర్] :

| | | | | | |
|---|---|---|---|---|---|
| /ర్క/ : | మాఱు | + కొను | : | మార్కొను | [భీమ 6-69] |
| /ర్త/ : | చిఱు | + తొండఁడు | : | చిర్తొండఁడు | [హర 2-50] |
| /ర్న/ : | ఆఱు | + నూఱు | : | ఆర్నూఱు | [కాశీ. 5-244] |
| /ర్ప/ : | నిఱు | + పేద | : | నిర్పేద | [శృ.నై. 7 89] |
| /ర్బ/ : | గిఱు | + బొట్టు | : | గిర్బొట్టు | [శృ.నై. 7-63] |
| /ర్మ/ : | మాఱు | + మొత్తు | : | మార్మొత్తు | [కాశీ. 2-80] |
| /ర్వ/ : | పదాఱు | + వన్నె | · | పదార్వన్నె | [శృ.నై. 6-60] |

-ల్ :

| | | | | | |
|---|---|---|---|---|---|
| /ల్క/ : | పాలు | + కడలి | : | పాల్కడలి | [భీమ 4-110] |
| /ల్గ/ : | వేలు | + గ్రంథములు | : | వేల్గ్రంథములు | [శివ 3-60] |

|ల్చ| : వేలు + చందములు : వేల్చందములు [శివ 3-60]
|ల్ప| : ఆనవాలు + పట్టు : ఆనవాల్పట్టు [భీమ 5-182]
|ల్మ| : పాలు + మాలు : పాల్మాలు [కాశీ 7-60]

-ట్ :

|ట్ర| : కాటి + తేఁడు : కాట్రేఁడు [శివ 3-83]

బహువచన శ్లిష్టమైన 'ళు' వర్ణము కొన్నియెడల ఉత్వద్విత్వములను కోల్పోవుట శ్రీనాథుని ప్రయోగములందు కనబడుచున్నవి.

|ళ్క్ర| గ్రుక్కిళ్లు + మ్రింగుచు : గ్రుక్కి-ళ్క్రింగుచు [కాశీ 4-123]
|ళ్వ| వసివాళ్లు + వాడుచు వసివాళ్వాడుచు [క్రీడా 86]

2 2 3 ప్రథమ మీది పరుషములకు గసడదవలు బహుళముగానగు.[బాల-సంధి-13]

1. పై సంధి గతములయిన మార్పులు కొన్నియెడల ప్రవర్తింపక అపవాదములుగా మిగిలిన సందర్భములు శ్రీనాథుని భాషలో కలవు.

క > గ : పట్టము + కట్టి : పట్టము గట్టి [భీమ 1-34]
అట్టు + కడుపు : అట్టు గడుపు [భీమ 4-82]
చ > స : కూర్మి + చుట్టము : కూర్మి సుట్టము [భీమ 2-29]
కాలు + చేయి : కాలుసేయి [కాశీ 3-84]
త > ద : దర్పణము + తక్క : దర్పణము దక్క [శృ.నై. 1-70]
ప > వ : మిన్నులు + పడచోటికిన్ : మిన్నులువడ్డ చోటికిన్ [భీమ 1-79]
ఎట్లు + పోనేర్తు : ఎట్లువోనేర్తు [కాశీ 2-112]

అపవాదము :

-క : నీవు + కలవాడు : నీవు కలవాడు [కాశీ 3-47]
-చ : పూజ + చేసె : పూజచేసె [భీమ 2-58]
-త : చీకఁటి + తప్పు : చీకఁటితప్పు [కాశీ-2-80]
-ప : పాలు + పెరుగు : పాలుపెరుగు [హర 6-56]
ప్రొద్దు + పుచ్చు : ప్రొద్దుపుచ్చు [హర 4-11]

ఈ గసడదవాదేశ సంధి యందు టకారము డకారముగా మారిన ప్రయోగములు శ్రీనాథుని భాషలో కానవచ్చుట లేదు.

2. పై యాకరణులు తెలుగుల మీఁది సాంస్కృతిక పరుషములకు గ స డ ద వ లు రావని తెల్పిరి. కాని శ్రీనాథుని భాషయందు పకారమునకు వకార మాదేశముగ వచ్చిన ప్రయోగము కన్పించుచున్నది.

ఎవ్వండు + పరించును : ఎవ్వండు వరించును [కాశీ 6_260]

నన్నయ భాషలో నీ విధమైన మార్పు లేదు. పూర్వ కావ్యములలోను, శాసనములలో నీ మార్పు కనిపించు చున్నది.

| | | | |
|---|---|---|---|
| ఇందు | + ప్రత్యక్షమై | ఇందు బ్రత్యక్షమై | [యుద్ధమల్లుని శాసనము] |
| ఏమి | + చిత్రము | : ఏమిసిత్రము | [కు. సం 5_88] |
| నీవు | + తపము | : నీవుదపము | [కు సం 6_7] |
| ఇట్లు | + తపము | : ఇట్లుదపము | [నిర్వ 5_8] |
| వీరల్ | + కోపించిన | : వీరల్గోపించిన | [ఉ. హరి 4_53] |

3. సంఖ్యావాచకముల మీద గ స డ ద వాదేశము.

| | | | |
|---|---|---|---|
| ఇరు | + కెలఁకులు | : ఇరుగెలఁకులు | [కాశీ 5-286] |
| నలు | + కడలు | · నలుగడలు | [శృ.నై. 8_12] |

4. ఏవార్థకము పిమ్మట నీమార్పు కనిపింపదు.

| | | | |
|---|---|---|---|
| దేవభూమియ | + కదా | : దేవభూమియకదా | [హర 4-24] |
| ఎక్కకయ | + చనిరి | : ఎక్కకయచనిరి | [శృ.నై 3_5] |
| జీవనస్థితికేన | + తావలంబు | : జీవనస్థితికేన తావలంబు | [శృ.నై. 1_107] |

5. కొన్ని అవ్యయముల తరువాత నీ మార్పు వైకల్పికముగ వచ్చును.

అట్లు : అట్లు + క్రొలువుకూటంబు [శృ.నై. 3_117]

అట్లు + సేయునే [హర 2_51]

అంత : అంత + త్రావియును [హర 6_129]
అంత + సూపె [భీమ 2-158]

ఇట్లు : ఇట్లు + చెప్పందొడంగె [హర 2_2]
ఇట్లు + దలంచి [హర 5_19]

ఇంత : ఇంత + పడుదురే [శృ.నై. 2_123]
ఇంత + సేయము [భీమ 6_98]

ఎంత : ఎంత + కాలము [కాశీ 2_143]

అప్పుడు : అప్పుడు + గొందఱు [శృ.నై. 6_32]
అప్పుడు + కట్టెదుర [హర 3_82]

ఇప్పుడు : ఇప్పుడు + పెట్టె శోధించి చూడన్ [కాశీ 4_105]
ఇప్పుడు + గొన్ని వాసరంబులు [కాశీ 1_100]

ఎప్పుడు : ఎప్పుడు + పెండ్లియాడు [హర 3_96]
ఎప్పుడు + గొలువంగ [భీమ 6_28]

ఎన్నడు : ఎన్నడు + గల్గు [కాశీ 6_23]
ఎన్నడు + చూతునో [కాశీ 2_158]

ఏమి : ఏమి + చేసెన్ [భీమ 1_14]
ఏమి + సేయుదు [కాశీ 4_111]

నన్నయ్యలో అట_, తరువాత-, నన్నెచోడునిలో అట_, ఇట_, పిమ్మట-, తిక్కనలో అట_, ఇట-, ఎట , అనుశబ్దముల తరువాత గ, స, డ, ద,వాదేశము నొందుట కలదు.

శ్రీనాథునిలో : అట + పోయి : అటవోయి [క్రీడా 55]
ఇట + పట్టి : ఇటవట్టి [శివ 2_106]

6. ద్వంద్వంబునంబదంబుపయి పరుషములకు గ, స, డ, ద వ లగు. [బాల-సంధి-15]

చ > స : కూడు + చీర : కూడుసీర [హర 2_51]
త > ద : తల్లి + తండ్రులు : తల్లిదండ్రులు [కాశీ. 5_161]
అన్న + తమ్ములు : అన్నదమ్ములు [భీమ 1_33]

దీని కపవాదముగా 'అప్పచెలియండ్రు' [క్రీడా. 244] అను ప్రయోగము కలదు

7. కొన్ని శబ్దపల్లవ క్రియలలో గ, స, డ, ద,వాదేశము వచ్చుచున్నది

| | | | | |
|---|---|---|---|---|
| అరుగు | + | తెంచు | : అరుగుదెంచు | [శృ నై. 5-88] |
| ఏఁగు | + | తెంచి | : ఏఁగుదెంచి | [కాశీ. 7-185] |

8. శబ్దపల్లవములలో నీ గసడదవాదేశము వైకల్పికముగ నగును

| | | | | |
|---|---|---|---|---|
| చూఱ | + | వోవు | : చూఱవోవు | [కాశీ 4-112] |
| చూఱ | + | పుచ్చన్ | : చూఱపుచ్చన్ | [భీమ 4-60] |
| ఒప్పు | + | తఱిగి | : ఒప్పుదఱిగి | [హర 6-30] |

2.2.4 పడ్వాదులు పరంబులగునపుడు మువర్ణకంబునకు లోప పూర్ణబిందువులు విభాష నగు. [బాల-సంధి-46]

| | | | | |
|---|---|---|---|---|
| భయము | + | పడు | : భయంపడు | [హర 7-174] |
| అద్భుతము | + | పడి | : అద్భుతంపడి | [హర 1-3] |
| విజయము | + | చేయు | : విజయంచేయు | [భీమ 2-152] |

1. పడునకు పూర్వమందున్న పదాంతమందలి 'వు' వర్ణము లోపించును.

| | | | | |
|---|---|---|---|---|
| అచ్చెరువు | + | పడు | : అచ్చెరువడు | [శృ నై 3 84] |

## 2.3.0 హల్లు + అచ్చు : (Consonant + Vowel)

ద్రుతమగు పొల్లు నకారము సంధిలో లోపించినపుడు అర్థము నందెట్టి మార్పును ఉండదు. ద్రుతాంతములయిన పదములు ద్రుతప్రకృతికములు. అవి కాని శబ్దములు కళలు.

2.3.1 ప్రథమేతర విభక్తి శత్రర్థక చువర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగును. [బాల – సంధి – 2]

| | | | | |
|---|---|---|---|---|
| నన్నున్ | + | ఇటు | : నన్నిటు | [కాశీ 7-156] |
| నన్నున్ | + | ఏక్రియ | : నన్నునేక్రియ | [శృ.నై. 3-104] |
| నాకున్ | + | అగునె | : నాకగునె | [శృ నై 2-71] |
| నాకున్ | + | ఇపుడు | : నాకునిపుడు | [కాశీ 2-104] |
| చేయుచున్ | + | ఉండె | : చేయుచుండె | [కాశీ 6-24] |
| చేయుచున్ | + | ఉండు | : చేయుచునుండు | కాశీ 1-76] |

2.3.2 ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు [బాల-సంధి-9]

| | | | |
|---|---|---|---|
| ఇంకన్ | + ఇట | : ఇంకిట | [శృ నై. 3-144] |
| ఇంకన్ | + ఏమి | : ఇంకేమి | [శృ నై. 4-23] |
| ఇంకన్ | + ఇక్కడ | : ఇంకిక్కడ | [హర 6-98] |

2.3.3 సముచ్చాయక - ఉన్ ప్రత్యయమునకు పూర్వమందలి - ఏనిన్ లోని ద్రుత మెల్లప్పుడు లోపించును.

| | | | |
|---|---|---|---|
| ఎంతయేనిన్ | + ఉన్ | : ఎంతయేనియున్ | [శృ.నై. 7-36] |
| ఎన్నడేనిన్ | + ఉన్ | : ఎన్నడేనియున్ | [కాశీ 1-108] |
| అయ్యనేనిన్ | + ఉన్ | : అయ్యనేనియున్ | [కాశీ 2-143] |

2.3 4 కొన్నియెడల ద్రుత నకారమునకు అచ్చు పరమగునపుడు ద్విత్వము కలుగును.

| | | | |
|---|---|---|---|
| చేయుచున్ | + ఆలిని | : చేయుచున్నాలిని | [శివ 1-3] |
| వినిపించెన్ | + అశరీరభారతి | : వినిపించె న్నశరీరభారతి | [భీమ 3-213] |
| దక్షవాటికిన్ | + అనిచిన | : దక్షవాటికి న్ననిచిన | [భీమ 6-10] |
| చెప్పినన్ | + ఇద్ధరణి | : చెప్పినన్నిద్ధరణి | [శివ 4-66] |
| సుతునిన్ | + ఉద్యుక్త | : సుతునిన్నుద్యుక్త | [శివ 1-1] |

2.3.5 ఆశీరర్థక -ఎడున్, -త ప్రత్యయములకు అచ్చుపరమగునపుడు మకారాదేశమగును. [బాల-క్రియ-28]

అయ్యెడున్ + అని దీవించిన : అయ్యెడుమని దీవించిన [హర 3-53]
పునస్సమాగమంబగుఁగాత + అని: పునస్సమాగమంబగుఁగాతమని [హర 4-50]
వాస్తవముగా నిందలి మకారమును చారిత్రకావశిష్ట రూపముగా నిర్ణయింపవచ్చును.

2.3.6 ద్రుతప్రకృతికములు, కళలు కొన్ని యెడల కాలాంతరమున మార్పు చెందుచున్నవి. బాల వ్యాకరణమున 'ఎల్ల' శబ్దము ద్రుత ప్రకృతికముగా చెప్పబడినది సమాసమునందు ద్రుతమునకు లోపమగును.

"ఎల్లయదియుఁ దెలియుడా" [కాశీ 3-102]

సర్వార్థకమైన 'ఎల్ల' శబ్దము ద్రుతమంతమందు గల యవ్యయము. ఈ ఎల్లయను దానికి సమాసము కాని యప్పుడు విశేష్యంబునకు పూర్వమున ప్రయోగము లేదు కాని శ్రీనాథుడు 'ఎల్లన్ శిష్యులు' అని ద్రుతముతో విశేష్యమునకు ముందు ప్రయోగించెను. కావున దీని నపవాద మనవచ్చును.

"ఏనొకండనే భిక్షనకున్ వత్తునో యెల్లన్ శిష్యుల గొంచువత్తునొ"

[భీమ 2-120]

2.3.7 కర్మధారయమున పెను శబ్దము తుది హల్లునకచ్చు పరమగునపుడు తఱచుగా ద్విత్వము కనబడును. [ప్రౌఢ-సంధి-9]

పెను + ఉద్ది : పెన్ + ఉద్ది : పెన్నుద్ది [కాశీ 4-237]

2.3.8 ధ్వన్యనుకరణ శబ్దములందలి అంతిమ హల్లునకు అచ్చు పరమైనపుడు ద్విత్వము కలుగును.

| | | | |
|---|---|---|---|
| ఉహ్ | + అనుచు | : ఉహ్హనుచు | [కాశీ 2-141] |
| ఘుక్ | + అని | : ఘుక్కని | [క్రీడా 50] |
| దిగుల్ | + అని | : దిగుల్లని | [శివ 3-128] |

ధ్వన్యనుకరణము నందు శబ్దము పునరుక్తమగును. అట్టి యెడల పూర్వాంగము తుదియచ్చునకు దీర్ఘము వచ్చిన రూపములు శ్రీనాథునిలో కొన్ని కనుపట్టును

వికావికలు [శివ 4-83] పికాపికలు [హర 3-10]

2.3.9 అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనంబగు. [బాల-సంధి-52]

ఆత్మార్థం పృథివీంత్యజేత్ + అనెడు : - పృథివీంత్యజేత్తనెడు [కాశీ 6-67]

2.3.10 అనుకరణంబునం దహమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాషనగు. [సంధి-53]

అతిసర్వత్రగర్హితమ్ + అనెడు: - సర్వత్ర గర్హితమ్మనెడు [శృ నై. 6-32]

పరోపకారార్థ మిదం శరీరమ్ + అనెడు : - శరీరమనెడు [హర 2-78]

2.3.11 విసర్గంబున కనుకరణంబున లోపంబగు. [బాల-సంధి-50]

నమస్తే నమః + అని : నమస్తే నమయని [భీమ 5-53]

2 3 12 ఉదంత నామంబున కనుకరణంబునందు వుగాగమంబగు [బాల-సంధి-54]

అత్యుచ్ఛ్రయఃపతన హేతుః + అనెడు : -హేతువనెడు [హర 6-32]

2.3.13 అనుకృతిని ఔకారము సంస్కృతములో వలెనే అవ్ అని మారుట శ్రీనాథుని భాషలో నొకచోట కనిపించుచున్నది.

దీప్తౌ + అనంగ : దీప్తావనంగ [కాశీ 5-10]

## 2.4.0 హల్లు + హల్లు (Consonant + Consonant)

తెనుఁగున నొకరీతి హల్సంధి కానవచ్చుచున్నది ఇది సంస్కృత మందలి హల్సంధి వంటిది కాదు తెనుఁగున పూర్వకాలమున తక్కిన ద్రావిడ భాషల యందు వలెనే కొన్ని శబ్దములు హలంతములుగా నుండెను అట్టివానిపై హల్లు పరమగు నపుడు ఆ హల్లునకు సంయోగము కలుగు చుండెను.

ఉదా: మూడ్ + నాళ్లు : మూన్నాళ్లు (కాశీ 2-72)

అట్లు కలిసిన రెండు హల్లులను నొక్కటియైన యెడల నా హల్లునకు ద్విత్వ మును, సాధారణముగా నా ద్విత్వాక్షరమున నొక హల్లునకు లోపమును కలుగు చుండెనని యూహించుట కవకాశము కలదు రానురాను ఈ మార్పు అజంతములపై 'హల్లుచేరునపుడును సంభవించెను' చెవుడు+పడు : చెవుడ్పడు [శృ నై 4-28] అప్పుడు పదాంతమందలి యచ్చునకు లోపము కలిగి పిమ్మట ముందటి వలెనే హల్సంధి యగు చుండెనని భావింపనగును.

2.4.1 ఈభాషలో ద్రుతమగు పొల్లు నకారము మాత్రమే శబ్దాంతమున వచ్చు చున్నది ఈ శీర్షిక క్రింద సంధిలో ద్రుత నకారము తరువాత వచ్చు పరుషములైన క, చ, ట, త, ప లు సరళములైన గ, జ, డ, ద, బ లుగా మార్పు చెందుచున్నవి. దీనినే సాంప్రదాయిక వైయాకరణులు సరళాదేశమనిరి ఇందలి అనునాసికము వైకల్పికముగ లోపించును. లోపించిన అనునాసికము లేఖనమున అర్ధానుస్వార ముగ గుర్తింపబడుచున్నది. [ఁ]

క > గ : నాకున్ + కృపసేయు : నాకుఁగృపసేయు [భీమ 1-23]

చేయన్ + కలండు : చేయంగలండు [కాశీ-6-68]

చ > జ : ప్రబంధంబుగన్ + చెప్ప : ప్రబంధంబుగఁజెప్ప [భీమ 1-30]
చేయన్ + చాలు : చేయంజాలు [భీమ 4-233]
త > ద : చందురున్ + తాల్చి : చందురుఁదాల్చి [భీమ 1-4]
మెఱుఁగున్ + తీగల : మెఱుఁగుందీగల [శృ.నై. 7-29]
ప > బ : ప్రౌఢిన్ + పరికింప : ప్రౌఢిఁబరికింప [భీమ 1-110]
బిడ్డలున్ + పోని : బిడ్డలుంబోని [భీమ 1-110]

2.4.2 కొన్ని యెడల నవర్ణంబు పరంబగునపుడు పూర్వ పదాంత్య డకారంబు నకారంబగు [ప్రౌఢ-సంధి-15]

మూఁడు నాళ్లు : మూఁడ్ + నాళ్లు : మూన్నాళ్లు [కాశీ 2-72]

2.4.3 క్రియాపదమునందలి తుది రేఫము హల్లు పరంబగునపుడు మీది హల్లుతో సంయోగము చెందును

చూచెదర్ + మనల : చూచెదర్మనల [కాశీ 3-204]

## 2.5.0 ఆగమ సంధులు (Augments in Sandhi)

సంయుక్త పద నిర్మాణమున నీ క్రింది వర్ణములు ఆగమములుగా వచ్చును. ఇంతకు పూర్వమే చెప్పబడినటుల సంధిలేని చోట నచ్చుకంటె పరమయిన యచ్చునకు ముందు యకారమాగమ మగుచున్నది. ఇదిగాక -న, -ము, -టు కంటె -పు, -రు, -అలి లు ఆగమములగుచున్నవి.

### 2.5.1 నకారాగమము

1. ఉదంత తద్ధర్మార్థక ధాతుజ విశేషణమునకు అచ్చు పరమగునపుడు నకారము వచ్చును.

చేయు + అపుడు : చేయునపుడు [భీమ 3-184]
వచ్చు + అంతకు : వచ్చునంతకు [శృ.నై. 2-35]
అగు + అట్టి : అగునట్టి [భీమ 2-20]

2. షష్ఠీసమాసమునందలి పదాంతమైన ఉత్తునకు అచ్చు పరమగునపుడు నకారము వచ్చును,

| | | | |
|---|---|---|---|
| నీదు + ఔదార్యంబు | : నీదు నౌదార్యంబు | [కాశీ 2-69] |
| రాజు + ఒజ్జల | : రాజు నొజ్జల | [శృ.నై. 4-129] |
| చెంచు + ఇంటికి | : చెంచు నింటికి | [కాశీ 5-71] |
| పురసంహరు + ఆనతి | : పురసంహరు నానతి | [కాశీ 7-34] |

కొన్నియెడల షష్ఠీ సమాసమునందలి పదాంతమైన ఉత్తునకు అచ్చు పరమైనను నకారమురాదు. అనగా పై సూత్రమునకపవాదము.

| | | |
|---|---|---|
| నిషధరాజు + అంతవాని | : నిషధరాజంతవాని | [శృ.నై. 2-92] |
| బిచ్చు + ఇల్లు | : బిచ్చింట | [పాం. మా 3-16] |

3. సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబగునపుడు నకార మాగమముగా నగును.

| | | |
|---|---|---|
| మోము + తమ్ములున్ | : మోముఁదమ్ములున్ | [భీమ 1-118] |
| గారాపు + పట్టపుదేవి | : గారాపుఁబట్టపుదేవి | [భీమ 1-4] |
| కంబంపు + కంబె | : కంబంపుఁగంబె | [హర 2-93] |

కొన్నియెడల పదాంతమైన ఉత్తునకు పరుషములు పరమైనను నకారము కలుగదు.

| | | |
|---|---|---|
| నిఱు + పేద | : నిఱుపేద | [శృ.నై. 4-73] |
| తొలు + చూపు | : తొలుచూపు | [కాశీ 3-22] |
| తొలు + కాఱు | : తొలుకాఱు | [కాశీ 1-90] |

ఈ క్రింది రూపమున పదాంతమైన ఉత్తు లేనప్పటికిని ఈ అగమము కలుగుచున్నది.

| | | |
|---|---|---|
| మై + తీగ | : మైదీఁగ | [కాశీ 4-206] |

4. ఉదంతస్త్రీ సమంబునకును నదంత గుణవాచకంబులకును దనంబు పరంబగునపుడు నకారమాగమము గా నగును.

| | | |
|---|---|---|
| ఉ : మొఱకు + తనంబు | : మొఱకుఁదనంబు | [భీమ 4-123] |
| వ్రేఁగు + తనంబు | : వ్రేఁగుఁదనంబు | [భీమ 2-110] |

| | | | | |
|---|---|---|---|---|
| ఆ: తియ్య | + తనంబు | : | తియ్యఁదనంబు | [శృ.నై. 2-81] |
| కమ్మ | + తనంబు | : | కమ్మఁదనంబు | [కాశీ 7-186] |

5 ఉదంతముల కందువర్ణకము పరంబగునపుడు నకారము ఆగమముగా నగు.

| | | | | |
|---|---|---|---|---|
| రాజబింబంబు | + అందు | : | రాజబింబంబునందు | [శృ నై. 2-13] |
| విదర్భదేశము | + అందు | : | విదర్భదేశమునందు | [శృ.నై. 3-18] |
| హృదయము | + అందు | : | హృదయమునందు | [శృ ;నై. 2-114] |

దీనికపవాదముగా నీ క్రింది ఉదాహరణము శ్రీ నా థు ని లో గలదు అందుపరమగునపుడు అత్వముతోడి నకారము అదనముగా వచ్చును

| | | | | |
|---|---|---|---|---|
| నిండుజవ్వనంబు | + అందు | : | నిండుజవ్వనంబున యందు | [కాశీ 1-7] |

6 ఉదంతములకు -కువర్ణకంబు పరంబగునపుడు నగాగమంబగు.

| | | | | |
|---|---|---|---|---|
| ధరణీధరనాయకు | + కు | : | ధరణీధరనాయకునకు | [భీమ 3-166] |
| నలు | + కు | : | నలునకు | [శృ నై. 6-111] |
| అరిందము | + కు | : | అరిందమునకు | [కాశీ 5-134] |

కొన్నియెడల -కున్ ప్రత్యయము పరమగుచున్నను నీ ఆగమము వచ్చుటలేదు. నిషధేంద్రు బచ్చు - కున్ [శృ నై 6 115] ; త్రాకు కున్ [క్రీ పీ 54]

ఇట్టిస్థితి నన్నయ, నన్నెచోడ, తిక్కన భాషలలో కలదు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| నన్నయలో | : | తాఁకు | + కున్ | : | తాఁకుకున్ | [భార 3-4-12] |
| నన్నెచోడునిలో | : | కౌను | + కు | : | కౌనుకు | [కు.సం. 8-160] |
| | | నభము | + కు | : | నభముకు | [కు సం. 11-168] |
| తిక్కనలో | : | ఆకసంబు | + కు | : | ఆకసంబుకు | [భార అ.శ.5-468] |

7. డుమంతంబునకు షష్ఠీవిభక్తి ప్రత్యయమైన కిన్ పరమైనపుడు నిగాగమము వచ్చును.

| | | | | |
|---|---|---|---|---|
| అల్లుఁడు | + కిన్ | : | అల్లునికిన్ | [శృ.నై. 6-96] |

ద్వితీయా -న్, తృతీయా -చేతన్, పంచమీ -కంటెన్ ప్రత్యయములకు పూర్వము డుమంతమునకు నిగాగమము వైకల్పికముగ వచ్చును.

ద్వితీయా : రమణు + న్ : రమణునిన్ [శృ.నై. 6-30]
తృతీయా : రాక్షసు + చేత : రాక్షసు-ని-చేత [కాశీ 7-13]
కాము + చేతన్ : కాము-ని చేతన్ [కాశీ 6-10]
పంచమీ : కైవల్యవిభు + కంటె : కైవల్యవిభు-ని-కంటె [కాశీ. 7-123]
కాలకంఠు + కంటె : కాలకంఠు-ని-కంటె [కాశీ 7-123]

### 2.5.2 ముగాగమము :

ధ్వన్యనుకరణ శబ్దమునకు 'అను' ధాతువు పరమైనచో ముగాగమంబగు.
[ప్రౌఢ. సంధి. 19]

| | | | | |
|---|---|---|---|---|
| బుస్సు | + | అంచున్ | : బుస్సుమంచున్ | [హర 4-27] |
| చిఱుబుఱు | + | అను | : చిఱుబుఱుమను | [హర 5-16] |
| చుఱు | + | అని | : చుఱుమని | [శృ.నై. 6-130] |
| తటాలు | + | అనం | : తటాలుమనం | [హర 2-47] |
| దడదడ | + | అనియె | : దడదడమనియె | [ప్ర. వీ. 47] |

### 2.5.3 టుగాగమము :

1. కర్మధారయంబులం దుత్తునకచ్చు పరమగునపుడు టుగాగమంబగు [సంధి-28]

| | | | | |
|---|---|---|---|---|
| నువ్వు | + | ఉండలు | : నువ్వుటుండలు | [హర 2-91] |
| మెఱుంగు | + | అద్దము | : మెఱుంగుటద్దము | [శృ.నై. 6- 13] |
| కొమ్ము | + | ఏనుంగు | : కొమ్ముటేనుంగు | [హర 3-25] |

2. కర్మధారయంబునందు పేర్వాది శబ్దముల కచ్చుపరంబగునపుడు టుగాగమము విభాషనగు [బాల- సంధి-29]

చిగురు + ఆకు చిగురాకు [కాశీ 6-202] చిగురుటాకు [భీమ 4-130]
పేరు + ఆమని : పేరామని [హర 5 93] పేరుటామని [శృ నై. 7-41]

శ్రీనాథునిలో నీక్రింది రూపములయందు టుగాగమము లేదు

| | | | | |
|---|---|---|---|---|
| అలరు | + | అమ్ము | : అలరమ్ము | [శృ నై. 1-83] |
| పొదరు | + | ఇల్లు | : పొదరిల్లు | [కాశీ 1-113] |
| పేరు | + | ఆఁకలి | : పేరాఁకలి | [కాశీ 4-118] |
| పేరు | + | ఓలగంబు | : పేరోలగంబు | [భీమ 3-212] |

| | | | | |
|---|---|---|---|---|
| తలిరు | + | ఆకు | : తలిరాకు | [కాశీ 3-13] |
| మడుగు | + | ఒల్లియ | : మడు గొల్లియ | [హర 4-71] |

3 ఉదంతేతరంబుల కచ్చు పరంబగునపుడు కొన్నియెడల టుగాగమంబగు.

| | | | | |
|---|---|---|---|---|
| పంచ | + | అరుంగు మీఁదటన్ | : పంచటరుంగు మీఁదటన్ | [హర 2-41] |
| పల్లె | + | ఊరు | : పల్లెటూరు | [శ్రీనాథునిచాటువు] |

4. షష్ఠీ సమాసముల యందును టుగాగమము వచ్చును

| | | | | |
|---|---|---|---|---|
| వేల్పు | + | ఏనిక | వేల్పుటేనిక | [హర 7-135] |

**2.5.4. పుగాగమము :**

తామరశబ్దమునకు ఆకు శబ్దము పరమగునపుడు పుగాగమంబగు. [ప్రౌ సం.8]

| | | | | |
|---|---|---|---|---|
| తామర | + | ఆకు | : తామరపాకు | [కాశీ 6-179] [శృ నై. 8-71] |

**2.5.5 రుగాగమము :**

1. పేదాది శబ్దంబుల కాలు శబ్దము పరంబగునపుడు కర్మధాయంబునందు రుగాగమంబగు. [బాల-సంధి-30]

| | | | | |
|---|---|---|---|---|
| ముద్ద | + | ఆలు | : ముద్దరాలు | [భీమ 1-4] |
| బాలెంత | + | ఆలు | : బాలెంతరాలు | [హర 2-93] |
| కోమ | + | ఆలు | : కోమరాలు | [భీమ 2-23] |
| జవ | + | ఆలు | : జవరాలు | [శృ.నై. 1-17] |

ఆలు శబ్దము పరంబగునపుడు గొడ్డు శబ్దమునందలి ఉత్వమునకు లోపంబగు.

| | | | | |
|---|---|---|---|---|
| గొడ్డు | + | ఆలు | : గొడ్రాలు | [శృ నై.7-138] |

కొన్నియెడల ఆలు శబ్దము పరము కాకున్నను నీయాగమము వచ్చును

| | | | | |
|---|---|---|---|---|
| గంగి | + | ఎద్దు | : గంగిరెద్దు | [ప వీ. 20] |
| చింపి | + | తల | : చింపిరితల | [ప.వీ 68] |

కర్మధారయంబునం దత్సమంబుల కాలు శబ్దము పరంబగునపు డత్వంబునకు ఉత్వంబును రుగాగమంబునగు. [బాల-సంధి-31]

| | | | | |
|---|---|---|---|---|
| అంధ | + | అలు | : అంధురాలు | [హర 2-123] |
| ప్రియ | + | అలు | : ప్రియురాలు | [ప పీ. 75] |

2. ధ్వన్యనుకరణ శబ్దములకు 'అను' ధాతువు పరమైనచో కొన్నియెడల రుగాగమ మగును.

| | | | | |
|---|---|---|---|---|
| కొంగొంగు | + | అనఁగ | : కొంగొంగురనఁగ | [హర 5-16] |

[కొంగలు చేయు ధ్వనికి అనుకరణము]

బొణుగు + బొణుగు + అనఁగ : బొణ్బొణుగురనఁగ [హర 5-116]

[చిప్పలు మొదలగునవొకదానికొకటి తగులునపుడు పుట్టుధ్వనికనుకరణము]

| | | | | |
|---|---|---|---|---|
| బుస్సు | + | అనఁగ | : బుస్సురనఁగ | [హర 5-16] |

### 2.5.6 అలిగాగమము :

అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునందగు. [బాల - సంధి-44]

| | | | | |
|---|---|---|---|---|
| అందున్ | + | భక్తి | : అందలి భక్తి | [హర 1-19] |
| అందున్ | + | వర్ణపద్ధతుల్ | : అందలి వర్ణపద్ధతుల్ | [భీమ 1-74] |

## 2.6.0 ఆదేశములు (Replacives)

శ్రీనాథుని భాషలో -పు. -ంపు, -ట్టు, -ంపు/ ఁపు. -ట్ట, అనువర్ణములు ఆదేశములుగా వచ్చును.

### 2.6.1 పుంప్వాదేశము :

1. కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపులగు. [బాల-సంధి-32]

| | | | | |
|---|---|---|---|---|
| అచ్చము | + | వెన్నెల | : అచ్చపు వెన్నెల | [శృ నై. 6 86] |
| సారము | + | ధర్మము | : సారపు ధర్మము | [హర 4-44] |
| కనకము | + | గొడుగు | : కనకంపు గొడుగు | [శృ నై 8-103] |
| విరుద్ధము | + | తపము | : విరుద్ధంపుఁదపము | [హర 7-22] |

2. కొన్నియెడల షష్ఠీసమాసము నందలి మువర్ణకంబునకును -పు/ -ంపు లు ఆదేశముగ వచ్చుచున్నవి.

ఉత్తమాంగము + మాంసము : ఉత్తమాంగపు మాంసము [హర 2-127]
కుటుసము + బొరలు : కుటుసంపుఁబొరలు [కాశీ 3-22]
నారికేడము + బోండాలు : నారికేడంపు బోండాలు [హర 6-55]

3. అచ్చిక కర్మధారయ సమాసములలో కొన్నియెడల పువర్ణకము లోపించుచున్నది.
కప్పురము + పీడెము : 'కప్పురపు పీడెము' అనుటకు మారు
'కప్పురి పీడెము' [శృ.నై. 6-141]
గంధము + పొడి : 'గంధపు పొడి' అనుటకు మారు
గంధవొడి [భీమ 1-118]

3.6.2 ద్విరుక్తటకారాదేశము :

కుఱు-, చిఱు, కడు-, నడు-, నిడు-శబ్దముల-అఱ ల కచ్చు పరంబగునపుడు ద్విరుక్తటకారంబగు. [బాల - సంధి 12]

| | | | | |
|---|---|---|---|---|
| చిఱు | + | ఎలుక | : చిట్టెలుక | [కాశీ 6-257] |
| చిఱు | + | ఈదులు | : చిట్టీదులు | [శివ 3-100] |
| కడు | + | ఎదురు | : కట్టెదురు | [భీమ 6-74 |
| నిడు | + | ఊర్పు | : నిట్టూర్పు | [శృ.నై. 1-70] |
| నడు | + | ఏట | : నట్టేట | [శృ.నై. 7-151] |

కుఱుతోడి ప్రయోగము శ్రీనాథుని రచనలో మృగ్యము దీనికపవాదముగ శ్రీనాథునిలో నీ క్రింది ప్రయోగము కలదు. 'నిట్రుపాసము' [భీమ 2-100]

దీనివిషయమై డా॥చిలుకూరి నారాయణరావు తమయభిప్రాయము నిట్లు వివరించిరి.[14]

"కుఱు, చిఱు, కడు, నడు, నిడు, శబ్దముల ఱ-డ- లకచ్చు పరంబగునపుడు ద్విరుక్తటకారంబగునని చిన్నయసూరి వ్రాసెను. ద్విత్వ శకట రేఫము నుచ్చారణము 'ట్ర' గా ద్రావిడభాషలందుండుననియు, తెనుగున ట్ర : ట్టయగుననియు శకట రేఫ-విచార సందర్భమునఁదెలుపఁబడెను హల్లుపై నచ్చు పరమగునపుడు ఆహల్లునకు-ద్విత్వము కలుగు ననియు మఱియొక సందర్భమునఁ దెలుపఁబడెను చిఱ్ + ఎలుక చిఱ్ఱెలుక* చిట్రెలుక: చిట్టెలుక యని శబ్దశాస్త్రము ప్రకారము చెప్ప

14. ఆంధ్రభాషా చరిత్ర, ప్రథమ సంపుటము. పుట 348.

వలెను. ఇట్లు నిడు శబ్దమునకు పూర్వరూపము 'నిఱ్' అనునది. నిఱ్ + ఊరుపు నిఱ్టూరుపు ; నిట్రూరుపు : నిట్టూరుపు అయినది.
ఇందుకు 'నిట్రుపాసము' [భీమ 2-100] అను అరూపమే నిదర్శనము."

## 2.6.3 -ంప/-ప్ర వర్ణాదేశము :

అమ్ము, పాము, వేము, నాము, ఇనుము, జనుము మున్నగు శబ్దములందలి ము వర్ణమునకు ఆదేశముగ సమాసములయందు ంప/-ంప వర్ణము వచ్చును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| అమ్ము | + | కోలలు | . | అంపకోలలు | [శృ నై 8-139] |
| పాము | + | తెరిత్రాండు | : | పాంపతెరిత్రాండు | [శృ.నై. 5-63] |
| వేము | + | ఆకు | : | వేంపాకు | [కాశీ 7-186] |
| నాము | + | తూలలో | : | నాంపతూలలో | [క్రీడా 123] |
| ఇనుము | + | సూదులు | . | ఇనుంప సూదులు | [కాశీ 3-158] |
| జనుము | + | శాకము | : | జనుంప శాకములు | [దా.మం. 1-128] |

## 2.6.4 -ట్ట వర్ణాదేశము :

ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలియచ్చుమీంది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారంబగు. [బాల - సంధి - 40]

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఎదురు | + | ఎదురు | : | ఎట్టయెదురు | [కాశీ 4 186] |
| నడుమ | + | నడుమ | : | నట్టనడుమ | [భీమ 4-110] |

## 2.6.5 ఇఱ్ఱింకులు :

అందదుకు ప్రభృతులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యములు. [బాల-సంధి-42]
ఇంకులు + ఇంకులు : ఇఱ్ఱింకులు [శృ.నై. 7-193, భీమ 2-77]
అని సూరిప్రకారము చెప్పవలెను. కాని 'ఇఱింకు' అనునది ఏకపదముగా కనిపించు చున్నది. ఊనికకై ద్విత్వమువచ్చినది.

'ఇంకు' అనుదానికి 'ఇరుంకు' అనునది ప్రాచీనరూపము. భృశార్థమున కేవలము బహువచన ప్రత్యయము 'లు' వచ్చి చేరి 'ఇరుంకులు' అనియై యుండును. పూర్వ స్వరాకర్షణము వలన 'రు' 'రి' గా మారి 'ఇరింకులు' అయి ఊనిక కొరకు

ద్విత్వమువచ్చి 'ఇఱ్ఱింకులు' అనియై యుండును. తెలుగున 'ఇరుకు' అనుశబ్దము కూడ కలదు వజ్ఝలవారు 'ఇరికించుటచే ఇంకుట'యను నర్థము గ్రహించి ఇరుకు + ఇంకు : ఇఱ్ఱింకు అయ్యెనని అభిప్రాయపడిరి. 'ఇఱ్ఱింకులు' అనుచోటనున్నది యొకటే శబ్దమనియు,ఆధిక్యము చెప్పుటకు బహువచనము నెనసెననియు భావించుట సమంజసమనిపించును. [15]

కన్నడమున 'ఇఱుకు' ధాతువు ఇకారోకార మధ్యమమై అనునాసికముతో గూడి యున్నది. ఇఱంకు/ఇఱింకు/ఇఱుంకు అనురూపములందు గలవు. దీనికి ప్రేరణార్థకమగు 'ఇసు' చేర్పబడినప్పుడు ఇఱికిసు/ఇఱుంకిసు/ఇఱుకిసు/ రూపములేర్పడు చున్నవి. ఈ రూపములన్నియు నాంధ్రములో వాడుకలో లేకపోయినను, ప్రాచీన కాలమునుండి కన్నడమున గనబడుచున్న యనునాసికములతో గూడిన రూపములే ఇంకు ధాతువులోని యనునాసికమునకు మూలకారణములని నిశ్చయింప వచ్చును ఇఱంకు/ఇఱింకు/ఇఱుంకు శబ్దములలోని మధ్య ఱకారము జాఱిపోవుట చేతనే 'ఇంకు' రూపముసిద్ధించినది. ఇంకు ధాతువునకుఁదొలిరూపము ఇఱుంకు లేదా ఇఱింకు అని చెప్పగలిగినప్పుడు అతిశయముగా ఇఱిఁకుటలు, ఇఱ్ఱింకులై యుండు ననుటకు సందియములేదు. ఇఱింకు శబ్దములోని 'ఱ' కారము ఇంకు ధాతువునకు మూలమైన ప్రాచీనంబగు ఇఱింకు ధాతువును సూచించు చిహ్నముగా గ్రహింప దగును. ఇప్పటి 'ఇంకు' లో 'ఱ'కారము కనబడకున్నను. 'ఇఱ్ఱిఁకు' లో గనబడు చుండుటయే ప్రాచీనకాలమున నదియొక ఱకారముతో గూడి 'ఇఱింకు'అను రూపమున నుండెననుటకు నిదర్శనమగుచున్నది. [16]

తుత్తు + తుమురు : తుత్తుమురు [శివ 1-97] (ముక్కలుగా, చూర్ణముగా) మొదలైనవిట్టివే

## 2,7.0 ఆమ్రేడితములు (Iteratives)

తెలుగున ఆమ్రేడిత సంధి అత్యంత సహజము. ద్విరుక్తమగుట సాధారణముగా భృశార్థమున జరుగును. అందువలన పలుకునప్పుడొక వేగముతో కూడికొని

15. స్ఫూర్తిశ్రీ : తెలుగు భాషాచరిత్ర. పుట 246, 247.
16. కోరాడ రామకృష్ణయ్య : సంధి. పుట 218-221.

యుండుట స్వాభావికము ఒక వ్యాపారమునకు పునఃపునరాగతమును సూచించును. అందుచే వ్యాపార నిర్వహణలో గల కాలాధిక్యమును సూచించును. ద్విరుక్తి అన్ని భాషాభాగములకు వచ్చును.

2.7.1 ద్విరుక్తి నొందిన శబ్దపల్లవములలో పూర్వాంగము లోపించును

వాదడచి + వాదడచి : వాదడచియడచి [కాశీ 5-89]

2.7.2 ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగానగు. [బాల-సంధి-41]

అప్పటికిన్ + అప్పటికిన్ : అప్పటికప్పటికి [శృ.నై.1-94]
అప్పటప్పటికి [కాశీ 2-63]
అంతకున్ + అంతకున్ : అంతకంతకు [శృ.నై. 2-110]
అంతంతకు [శృ.నై. 2-115]

2.7.3 కొన్నియెడల అంతిమాక్షర లోపంబు వైకల్పికముగనగు

నాఁడు + నాటికిన్ : నానాఁటికిన్ [కాశీ 1-115]
నాఁడునాఁటికిన్ [కాశీ 3-213]

2.7.4 ఆమ్రేడితము పరమగుచో మధ్యమ పురుష ప్రత్యయములకు లోపము కావచ్చును. అట్టియెడల కృత హ్రస్వమునకు దీర్ఘమగును. [ప్రౌఢ-సంధి-23]

లెమ్ము + లెమ్ము : లేలెమ్ము [శివ 1-80]
పొండు + పొండు : పోపొండు [భీమ 4-10]

## 2.8.0 సమాసమునందలి ప్రాచీన రూపములను పరిరక్షించుట : (Preservation of older forms in compounds)

సాధారణముగా ఒకభాషయందు సమాసము లందలి ప్రాచీనరూపములు సమాసములయందు నిలిచియుండును. అవి స్వతంత్ర రూపములగునపుడు మార్పుచెందును.

2.8.1 ఈ క్రింద కొన్ని రూపములు ఉదాహరింపబడినవి.

1. కెమ్ : స్వతంత్రరూపము – కెంపు
కెంగేలు [కాశీ 6-227] కెంజాయ [శృ నై. 8-156
8)

2. క్రొ : స్వతంత్రరూపము - క్రొత్త
క్రొ - క్కాఱు [శృ.నై. 3-88] క్రొవ్వాడి [శృ.నై. 3.99]

3. చెన్ : స్వతంత్ర రూపము - చెన్ను : వృత్తియందు మాత్రమే స్వతంత్ర రూపమునకు శోణార్థము.
చెంగలువ [శృ.నై. 2-141]

4. ని : స్వతంత్రరూపము — నిండు
ని - వ్వెఱ [శృ.నై. 4-105]

5. నె : స్వతంత్ర రూపము_నెఱ
నెమ్మనము [శృ. నై. 3-205] నెమ్మది [హర 5-32]

6. పు : స్వతంత్ర రూపము - పువ్వు/పూవు/పూ
పుప్పొడి [శృ.నై 2-140]

7. లే : స్వతంత్ర రూపము - లేఁత
లేఁ జందురుఁడు [కాశీ 5-101]
లేఁ దీఁగ [కాశీ 7-132]
లేఁ బెయ్య [కాశీ 2-104]

8. ఆ : స్వతంత్ర రూపము — ఆవు
ఆఁబోతు [కాశీ 2-104, 5-216]



# 3. నామరూపవిజ్ఞానము

## [NOUN MORPHOLOGY]

### 3.1.0. నామ ప్రాతిపదికలు : (Nominal stems)

తెలుగునందలి నామ ప్రాతిపదికలను దేశ్యములు, అన్యదేశ్యములని రెండు విధములుగ విభజింప వచ్చును. దేశ్యనామ ప్రాతిపదికలకు సాధారణముగ స్వాభావిక మైన ప్రత్యయమెట్టిదియు నంతమున చేరదు. అయినప్పటికిని కొన్ని నామ ప్రాతిపదికలకు లింగవచన సూచక ప్రత్యయములు చేరును.

మహదేకవచనము : -ండు
మహత్యేకవచనము : -అలు
మహతీతర అమహదేకవచనము : -ంబు, -మ్ము, -ము.

పైని వివరించిన మహదమహద్వాచక ప్రత్యయములే సర్వ సాధారణముగ తత్సమ నామప్రాతిపదికలకును చేరుచుండును. కాని -ఇ వర్ణమంత మందుగల మహద్వాచక ప్రాతిపదికలకును, -ఇ/-ఉ వర్ణమంత మందుగల మహతీతర అమహద్వాచక ప్రాతిపదికలకును పై ప్రత్యయములు చేరవు.

3.1 1 ప్రాథమిక (Primary) నిష్పన్న (Derivative) నామములని దేశ్యప్రాతిపదికలను రెండు వర్గములుగా విభజింపవచ్చును. ప్రాథమిక నామములందు ధాతు ప్రత్యయములను ప్రత్యేకముగ విశ్లేషింప వీలులేదు. క్రియా ధాతువుల నుండి గాని, నామ ధాతువులనుండిగాని నిష్పన్న నామములు కలుగవచ్చును.

ఏ భాషయందైనను కొన్నినామములు సహజసిద్ధములుగా నుండును. మరి కొన్ని నామములు క్రియాది ధాతువులనుండి నిష్పన్నములగును తెలుగుభాషలో సహజ సిద్ధమగు నామములకు ప్రకృతి ప్రత్యయవిభాగము చేయుట కుదరదు అట్లుచేయుటకు వీలైనవి కొన్నియున్నవి. కాని వానిసంఖ్య అత్యల్పము. అల్లుడు - తమ్ముడు వంటి నామములకు బహువచనమునందు అల్లురు - తమ్ములు అని ఏర్పడుటచేత ఏకవచన రూపములందలి చివరి - డు అను భాగమును సాంప్రదాయక వ్యాకర్తలు 'డుజ్'

వర్ణకముగా విభజించిరి. ఇట్టి పదములకు కొన్నిటికిమాత్రమే వర్తింపచేయగలిగిన ఈ ప్రక్రియకు తెలుగుభాషయందు విస్తృతిలేదు. లింగభేదము నెరుగుటకు అర్థమును గ్రహించుటతప్ప వేరొక యాధారమునులేదు. ఇట్టినామములను ప్రాథమిక(Primary) నామములని వ్యవహరింతురు.

### 3.1.1.1 ప్రాథమిక నామములు : (Primary nouns)

లింగవచన ప్రత్యయములు లేనివి

మహద్వాచకము : అన్న, కొడుకు, తండ్రి, మామ

మహతీవాచకము : అత్త, అమ్మ, అప్ప, తల్లి

మహతీతర అమహద్వాచకము : కన్ను, చెవి, చిలుక, పులి

లింగవచన ప్రత్యయములతో కూడినవి:

మహద్వాచకము : అల్లుఁడు, తమ్ముఁడు, బలియుఁడు

మహతీ వాచకము : ఇల్లాలు, కోడలు, చెలియలు

మహతీతర అమహద్వాచకము : ఒడ్డాణంబు, కంచమ్ము, చుట్టము

### 3.1.2 నిష్పన్న నామములు : (Secondary nouns)

క్రియా ధాతువులనుండి నిష్పన్నమైన నామములను సాంప్రదాయికముగా కృదంతములని వ్యవహరింతురు.

3.1.2.1 తెలుగుభాషలో పెక్కు క్రియలు ఎట్టిప్రత్యయము లేకయే నామవాచకములుగా వ్యవహృతములగును శ్రీనాథుని కృతులనుండి ఈక్రింది ఉదాహరణలు ద్రష్టవ్యములు.

| పదము | క్రియార్థము | | నామార్థము | |
|---|---|---|---|---|
| 1. అంటు | : కలియు | [కాశీ 3-32] | ముట్టికి | [క్రీడా 42] |
| 2 అదరు | : శోభిల్లు | [కాశీ 5-119] | సమయము | [హర 5-55] |
| 3 అదరు | : చలించు | [కాశీ 4-110] | బాధ | [హర 6-131] |
| 4. అలరు | : కలుగు | [హర 3-74] | పుష్పము | [క్రీడా 212] |

| పదము | క్రియార్థము | | నామార్థము | |
|---|---|---|---|---|
| 5. ఇగురు | సంతసించు | [కాశీ 7-244] | చిగురు | [భీమ 1-19] |
| 6. ఉడుకు | తాపమునొందించు | [హర 7-85] | వేడి | [హర 6-60] |
| 7. ఉబ్బు | బయలుపడు | [కాశీ 3-228] | సంతోషము | [కాశీ 2-8] |
| 8. ఉఱుము | గర్జించు | [హర 2-19] | గర్జన | [భీమ 3-91] |
| 9. ఎత్తు | సమర్పించు | [కాశీ 3-179] | పర్యాయము | [భీమ 4-28] |
| 10. ఒత్తు | అదుము | [శృ.నై 2-141] | ఒత్తిడి | [శృ.నై 2-5] |
| 11. ఒప్పు | ప్రకాశించు | [హర 2-3] | కాంతి | [శృ.నై 6-82] |
| 12 కందు | మలినమగు | [శృ.నై 1-70] | కళంకము | [శృ.నై 7-103] |
| 13. కట్టు | ధరించు | [హర 5-5] | కూర్పు | [హర 5-48] |
| 14. కదలు | బయలుదేఱు | [కాశీ 2-32] | చలనము | [కాశీ 3-84] |
| 15. కనలు | కోపించు | [కాశీ 4-267] | కోపము | [శృ.నై 1-94] |
| 16. కుందు | ఏడ్చు | [భీమ 2-31] | దుఃఖము | [శివ 3-5] |
| 17. కులుకు | పోయు, వేయు | [కాశీ 3-118] | విలాసము | [చా.మం. 1-122] |
| 18. క్రొవ్వు | బలియు | [కాశీ 1-49] | పుష్టి | [శృ.నై 8-153] |
| 19. చదువు | పఠించు | [కాశీ 4-199] | విద్య | [హర 5 32] |
| 20 చమురు | పొడిచేయు | [వ. వీ.5] | నూనె | [కాశీ 4-140] |
| 21. చల్లు | విక్షేపించు | [శృ.నై 4-123] | జలక్రీడా విశేషము | [హర 5-37] |
| 22. చాటు | వెల్లడించు | [కాశీ 5-274] | మఱుఁగు | [హర 4-11] |
| 23. చిక్కు | పట్టువడు | [శృ.నై 3-93] | బంధము | [శృ.నై 5 61] |
| 24. చినుకు | చిందు | [కాశీ 2-147] | వర్షబిందువు | [హర 2-21] |
| 25. చుట్టు | పరివేష్టించు | [హర 2-15] | వలయము | [శివ 2-4] |
| 26 చూపు | కలిగించు | [కాశీ 1-90] | దృష్టి | [శృ.నై 3-149] |
| 27. చేఁపు | పాలుస్రవించుటకున్ముఖమగు | [హర 2-101] | ఉన్ముఖమైనస్థితి | [హర 2-95] |
| 28. చొక్కు | పరవశమగు | [శృ.నై 2-105] | మోహము | [భీమ 4 130] |
| 29 జంకు | భయపడు | [హర 4-20] | సంకోచము | [హర 2-101] |
| 30. తగులు | ఆసక్తినొందు | [కాశీ 4-81] | ప్రేమ | [కాశీ 1-133] |

| పదము క్రియార్థము | | నామార్థము | |
|---|---|---|---|
| 31. **తడుపు : తడియఁజేయు** | [భీమ 3-4] | వస్త్రము | [కాశీ 2-75] |
| 32. **తనుపు :** తృప్తిపరచు | [కాశీ 3-226] | చల్లదనము | [శృ.నై 2-81] |
| 33. **తన్ను :** పాదతాడనము చేయు | [కాశీ 7-87] | పాదతాడనము | [శృ.నై 7-170] |
| 34. **తాఁకు :** కలియు | [కాశీ 2-108] | ఘట్టన | [హర 7-45] |
| 35. **తుఱుము:** [కొప్పున పుష్పాదులు] గుచ్చు | [కాశీ 4-5] | స్త్రీధమ్మిల్లము | [శృ.నై 6-44] |
| 36. **నవ్వు :** హసించు | [శృ.నై 6-33] | హాసము | [శృ.నై 2-26] |
| 37. **నోము :** వ్రతముచేయు | [కాశీ 6-60] | వ్రతము | [కాశీ 3-215] |
| 38. **పండు :** ఫలవంతమగు | [భీమ 5-68] | పక్వమైనది | [భీమ 1-111] |
| 39. **పలుకు:** వచించు | [శృ.నై 3-144] | మాట | [హర 2-68] |
| | | శకలము | [శృ.నై 3-123] |
| 40. పొందు: అనుభవించు | [శృ.నై 1-106] | అనుకూల్యము | [పై.దే 4-129] |
| 41. పోరు : యుద్ధముచేయు | [శివ 1-97] | యుద్ధము | [కాశీ 6-239] |
| 42. బెగడు : భయపడు | [వ.వి 91] | భయము | [హర 7-79] |
| 43. బొంకు : అబద్ధమాడు | [కాశీ 7-116] | అసత్యము | [భీమ 6-80] |
| 44. బ్రదుకు: జీవించు | [హర 3-90] | జీవితము | [కాశీ 6-76] |
| 45. మట్టు : పదవేయు | [హర 7-44] | ఆధారము | [హర 6-40] |
| 46. మఱుఁగు : దాగు | [కాశీ 5-70] | చాటు | [శృ.నై 6-131] |
| 47. మాఱు : వేఱురూపము నందు | [హర 6-60] | రెండవసారి వడ్డించు నాహారము | [హర 6-125] |
| 48. ముట్టు : పూర్ణమగు | [భీమ 6-61] | సాధనము | [శివ 2-70] |
| 49. మెచ్చు : శ్లాఘించు | [హర 5-16] | అనురాగము | [భీమ 6-11] |
| 50. మొత్తు : కొట్టు | [భీమ 2-157] | దెబ్బ | [శివ 4-60] |
| 51. మ్రొక్కు : నమస్కరించు | [శృ.నై 8-13] | నమస్కారము | [హర 4-41] |
| 52. వెలుఁగు: ప్రకాశించు | [హర 4-52] | ప్రకాశము | [శృ.నై 7-169] |

3.1.2.2 క్రియా ధాతువులనుండి ఏర్పడిన నామవాచకముల రూపనిష్పత్తిలో కొన్ని సంధిగతమైన మార్పులు గోచరించుచున్నవి. కృత్ప్రత్యయము చేరుటకు

ముందు తరచుగా ధాతువులయందలి అంత్యాక్షరములు లోపించుటను గమనింతుము. నామవాచకములు ప్రాథమిక ధాతువులనుండి పరిణామము నొందినట్లు భావింపవచ్చును. [రూప] నిష్పాదక ప్రత్యయములు (Formative suffixes) చేరుటచే ఏర్పడినవి కావు.

ధాతుగతాచ్చు దీర్ఘీకరణము నొందినపుడు అంత్యహల్వర్ణము లోపించును. కొన్నియెడల ధాతువునందలి హ్రస్వము కృదంతమైనపుడు దీర్ఘము నొందును కొన్ని ప్రాథమిక ధాతువులు ద్వితీయావస్థయందు హ్రస్వమునొంది కృదంతము నందు మరల దీర్ఘము నొందును.

కుడు > కుడు[చు] > కూడు, చా > చ[చ్చు] > చా[వు]
నో > నొ[చ్చు] > నోపి, నొప్పి, నోవు, విడు > విడి[యు] > వీడు.

ధాతుగతాచ్చు దీర్ఘమగుటతోపాటు అంత్య హల్వర్ణము అఘోషీకరణము (devoicing) నొందుట.

| | | | | | |
|---|---|---|---|---|---|
| చెడు > చేటు | [కాశీ 7-92] | పడు > పాటు | [శృ. నై 3-84] |
| పొడు > పోటు | [శృ నై 3-10] | ముడు > మూట | [కాశీ 5-62] |
| మఱు > మాటు | [శృ. నై 2-35] | | |

## 3.1.2.3 నిష్పాదక ప్రత్యయములు : (Derivative Suffixes)

కృత్ప్రత్యయములు : సాధారణముగా కృత్తులీక్రింద సూచించు ప్రత్యయముల కలయికచే ఏర్పడుచుండును.

| | | | |
|---|---|---|---|
| 1. -అ : | అలుక | [< అలుగు] | [శృ.నై 8.72] |
| | ఎఱుక | [<ఎఱుగు] | [హర2-79] |
| | పాట | [<పాడు] | [హర 4-11] |
| | వంట | [<వండు] | [శివ-4-8] |
| 2. -అకము : | ఎసకము | [<ఎసగు] | [హర 5-50] |
| | వంటకము | [<వండు] | [కాశీ1-108] |
| 3. -అడ : | కట్టడ | [<కట్టు] | [భీమ 5-77] |
| 4. -అటము : | ఇఱుకటము | [<ఇఱుకు] | [శృ.నై 4-124] |

| | | | |
|---|---|---|---|
| 5 -అడము : | ముట్టడము | [<ముట్టు] | [కాశీ 5-301] |
| 6 -అమి : | ఓటమి | [<ఓడు] | [హర 7-52] |
| | కూటమి | [<కూడు] | [క్రీ.పీ 67] |

-అమి ప్రత్యయము వ్యతిరేకార్థమునందు కూడ వచ్చును.

| | | | |
|---|---|---|---|
| | నేరమి | [<నేర్చు] | [కాశీ 4-267] |
| | వినమి | [<విను] | [శివ 2-104] |
| 7. -అము : | కూటము | [<కూడు] | [హర 2-33] |
| | చుట్టము | [<చుట్టు] | [శృ.నై 7-105] |
| 8. -అరము : | ఉబ్బరము | [<ఉబ్బు] | [భీమ 3-57] |
| | దెప్పరము | [<దెప్పు] | [హర 1-21] |
| 9 -అవు : | ఉఱవు | [<ఉఱు] | [కాశీ 6 55] |
| | తగవు | [<తగు] | [శృ నై 8-55] |
| 10. -ఇ : | చేయి | [<చేయు] | [శృ.నై 1-28] |

అంత్య హల్వర్ణమైన -య్/-చ్ ద్విరుక్తి నొందినపుడు-ప్ వర్ణముగా మార్పు నొందుచున్నది

| | | | |
|---|---|---|---|
| | దప్పి | [<దయ్యు] | [శృ.నై 4-32] |
| | నొప్పి | [<నొచ్చు] | [శృ.నై 3-182] |
| 11. -ఇక : | అల్లిక | [<అల్లు] | [హర 2-108] |
| | అరయిక | [<అరయు] | [శృ.నై 1-52] |
| | ఆడిక | [<అడు] | [శివ 3-99] |
| | ఎన్నిక | [<ఎన్ను] | [కాశీ 2-91] |
| | ఏలిక | [<ఏలు] | [శృ.నై 2-65] |
| | కినుక | [<కినియు] | [శృ.నై 1-92] |
| | కోరిక | [<కోరు] | [కాశీ 3-113] |
| | నమ్మిక | [<నమ్ము] | [హర 2-117] |
| | పూనిక | [<పూను] | [శివ 1.85] |
| | ఫోలిక | [<ఫోలు] | [శృ.నై 5-56] |

12. -ఇకి/-కి : ఉనికి/ఉన్కి [<ఉన్] [శృ నై 8-126]
కూరికి/కూర్కి [<కూరు] [పై దే 3-116]
కోర్కి [<కోరు] [హర 2-63]
చూడ్కి [<చూచు] [శృ.నై 6-6]
పూన్కి [<పూను] [హర 7-119]
పోల్కి [<పోలు] [హర 4-89]

13. -ఇతము · పోరితంబు [<పోరు] [కాశీ 3 124]

14. -ఇడి : రాయిడి / రాపిడి [<రాయు] [శృ నై 3-149] [హర 6-61]

15. -ఇదము ; ఒప్పిదము [<ఒప్పు] [కాశీ 4-158]
పన్నిదము [<పన్ను] [శివ 2-94]

16. -ఇమి/-మి : కలిమి/కల్మి [<కలుగు] [శృ నై 1-49]
కూరిమి/కూర్మి [<కూర్చు] [శృ.నై 7-4]
తాలిమి/తాల్మి [<తాల్చు] [భీమ 5-163]
నేరిమి [<నేర్చు] [శృ. నై 7-166]

17. -ఉక : తునుక [<తునియు] [ప.వి. 109]

18. -క : ధాత్వంతమందలి -గు, -చు, -వులను తొలగించి -క ప్రత్యయము వచ్చును.

అలుక [<అలుగు] [శృ.నై 8-46]
ఎఱుక [<ఎఱుఁగు] [కాశీ 6-10]
కడఁక [<కడఁగు] [హర 6-59]
కణఁక [<కణఁగు] [భీమ 3-134]
కలఁక [<కలఁగు] [క్రీడా 248]
కాఁక [<కాఁగు] [శివ 4-67]
నడక [<నడచు] [భీమ 3-46]
పోక [<పోవు] [శృ నై 7-42]

| | | | |
|---|---|---|---|
| | మలఁక | [<మలఁగు] | [శృ నై 5-63] |
| | మూఁక | [<మూఁగు] | [భీమ 4-60] |
| | మొలక | [<మొలచు] | [శృ.నై 6-82] |
| | రాక | [<వచ్చు] | [శృ.నై 5-142] |
| | వంక | [<వంగు] | [భీమ 3-216] |
| | వీఁక | [<వీఁగు] | [కాశీ 7-173] |
| 19. | -కడ/-గడ : చేరుగడ | [<చేరు] | [శృ.నై 7-102] |
| | నిలుకడ | [<నిలుచు] | [కాశీ 2-107] |
| | పోకడ | [<పోవు] | [కాశీ 5-48] |
| 20. | -కలి : వినుకలి | [<విను] | [శృ నై 4-18] |
| 21. | -కువ : అడఁకువ | [<అడఁగు] | [శివ 4-52] |
| | తక్కువ | [<తగ్గు] | [భీమ 1-118] |
| | తేఁకువ | [<తెగు] | [క్రీడా 134] |
| | పెక్కువ | [<పెరుగు] | [భీమ 1-118] |
| | పెనకువ | [<పెనగు] | [హర 7-179] |
| | వేకువ | [<వేగు] | [శృ.నై 6-20] |
| 22. | -గర : విడుగర | [<విడుచు] | [కాశీ 6-125] |

23. -ట : ట పరమగుచో అంత్య వర్ణలోపము :

| | | |
|---|---|---|
| అలమట | [<అలమరు] | [హర 2-102] |
| ఆట | [<ఆడు] | [భీమ 5-41] |
| ఊఁట | [<ఊఁఱు] | [కాశీ 3-225] |
| చెమట | [<చెమరు] | [హర 1-21] |
| తివుట | [<తివురు] | [శృ.నై 2-5] |
| పంట | [<పండు] | [శృ.నై 8-201] |
| పాట | [<పాడు] | [శృ నై 2-113] |
| మంట | [<మండు] | [శివ 4-65] |

| | | |
|---|---|---|
| వంట | [<వండు] | [కాశీ 6-221] |
| వేసట | [<వేసరు] | [శృ.నై 5-163] |

24. -టు : టు పరమగుచో ఆద్యక్షరము శేషించి దీర్ఘము నొందును

| | | |
|---|---|---|
| ఏటు | [<ఏయు] | [భీమ 3-212] |
| కాటు | [<కఱచు] | [శృ.నై 8-47] |
| చేటు | [<చెడు] | [కాశీ 7-92] |
| చోటు | [<చొచ్చు] | [భీమ 3-44] |
| పాటు | [<పడు] | [శృ.నై 3-84] |
| పోటు | [<పొడుచు] | [భీమ 2-88] |
| వ్రేటు | [<వ్రేయు] | [హర 1-26] |

25 -డు :

| | | |
|---|---|---|
| అమ్ముడు | [<అమ్ము] | [హర 4-37] |
| ఎక్కుడు | [<ఎక్కు] | [భీమ 2-5] |
| మాపుడు | [<మాయు] | [శృ.నై 7-141] |

26. -త :

| | | |
|---|---|---|
| పొగడ్త | [<పొగడు] | [శివ 1-45] |
| ఆవులింత | [<ఆవులించు] | [కాశీ 3-22] |
| గిలిగింత | [<గిలిగించు] | [హర 2-95] |

27. -ఁత :

| | | |
|---|---|---|
| అలఁత | [<అలయు] | [శివ 3-25] |
| ఈఁత | [<ఈఁదు] | [కాశీ 1-60] |
| ఊఁత | [<ఊఁదు] | [కాశీ 4-211] |
| కూఁత | [<కూయు] | [కాశీ 4-64] |
| చేఁత | [<చేయు] | [శృ.నై 2-80] |
| మ్రోఁత | [<మ్రోయు] | [ప.పీ. 5] |
| రోఁత | [<రోయు] | [కాశీ 5-207] |
| వ్రాఁత | [<వ్రాయు] | [భీమ 2-8] |

| | | | |
|---|---|---|---|
| 28. –న : | | | |
| | దీవన | [<దీవించు] | [కాశీ 2–85] |
| | మన్నన | [<మన్నించు] | [హర 3–94] |
| 29. –పము/–పెము : | | | |
| | తిరిపెము | [<తిరియు] | [కాశీ 7–52] |
| | పొలపము | [<పొలయు] | [శృ.నై 6–80] |
| | మురిపెంబు | [<మురియు] | [శృ.నై 2–56] |
| | వలిపము | [<వలియు] | [భీమ 1–118] |
| 30. –పు : | | | |
| | అదల్పు | [<అదల్చు] | [భీమ 4–60] |
| | ఓర్పు | [<ఓర్చు] | [కాశీ 2–83] |
| | చూపు | [<చూచు] | [హర 3–82] |
| | మఱపు | [<మఱచు] | [కాశీ 7–44] |
| 31 –పురము . | కాపురము | [<కాచు] | [హర 2 88] |
| 32. –బడి : | చెల్లుబడి | [<చెల్లు] | [హర 4–8] |
| 33. –వ : | | | |
| | చేరువ | [<చేరు] | [శృ.నై 6–113] |
| | తెగువ | [<తెగు] | [భీమ 2–88] |
| | దిగువ | [<దిగు] | [భీమ I–114] |
| | విలువ | [<విలుచు] | [హర 3–83] |
| 34 –వడి . | నడవడి | [<నడచు] | [ప.పీ 63] |
| | లేవడి | [<కలుఁగు] | [శృ నై 1–109] |
| 35. –వి . | ఈవి | [<ఇచ్చు] | [ప.పీ 25] |
| | తనివి | [<తనియు] | [శృ.నై 7–190] |
| | తెలివి | [<తెలియు] | [భీమ 5–182] |
| | విరివి | [<విరియు] | [కాశీ 4–296] |

| | | | |
|---|---|---|---|
| 36. | -వు : ఉలివు | [<ఉలియు] | [భీమ 2-110] |
| | కొలువు | [<కొలుచు] | [హర 6-73] |
| | చావు | [<చచ్చు] | [హర 2-62] |
| | నోవు | [<నొచ్చు] | [క్రీడా 88] |
| | తడవు | [<తడయు] | [శృ.నై 1-78] |
| | నగవు | [<నగు] | [హర 4-19] |
| | ననువు | [<ననుచు] | [భీమ 1-114] |
| | నిలువు | [<నిలుచు] | [భీమ 3-185] |

పై ముప్పది ఆఱింటిలో -ఇకి, -క, -టు, -త, -పు, -వి, -వు, అను ప్రత్యయములు ఆదేశములుగను, మిగిలినవి ఆగమములుగను వచ్చినవి. నన్నెచోడునిలో విశేషముగ -ఇకె, వడ, -వలి అను ప్రత్యయములును, తిక్కనభాషలో -అనము, -అపి, -అఱ/అఋ -ఇగ, -ఇకము, -ఇయ, -ది, -దము, -దల, -పి అను ప్రత్యయము లంతములుగా గల కృదంతరూపములును గలవు.

శబ్దపల్లవము నందలి - కొనునకు అమూర్తనామమైన -కోలు, -పడునకు -పాటు వచ్చును.

| | | |
|---|---|---|
| ఎత్తికోలు | [<ఎత్తికొను] | [శృ నై. 1-83] |
| తడబాటు | [<తడబడు] | [శివ 4. 60] |
| తత్తఱపాటు | [<తత్తఱపడు] | [కాశీ 2-49] |
| సిగ్గుపాటు | [<సిగ్గుపడు] | [శృ.నై 3.84] |
| పొరపాటు | [<పొరపడు] | [వ.వి 31] |
| వీడుకోలు | [<వీడుకొను] | [శృ నై. 2-106] |

### 3.1.2.4 ఇతర నామములనుండి నిష్పన్నమైన నామవాచకములు :

ఈ ప్రత్యయములను తద్ధిత ప్రత్యయములని యందురు ఇవి ప్రత్యేకమైన అర్థమున వచ్చును. అనగా త్వార్థ, స్వార్థ, భావార్థ, పరిమాణార్థ, మతుబర్థ, దష్న్నార్థములందు వచ్చును.

1. -అ : చెలువ [శృ.నై. 2-13] మతుబర్థము
2. -అడ : ఇల్లడ [కాశీ 4-267]

3. -అడి : ఆఱడి [హర 3-10] స్వార్థము

4. -అటము : ఇఱుకటము [శృ.నై 4-124] స్వార్థము

5. -అము : చెలువము [శృ.నై 6-39] స్వార్థము

6 -అరి :

జాలరి [శివ 2-101] జూదరి [కాశీ 4-99] టక్కరి [హర 2-47]
తక్కరి [హర 6-125] తిరివరి [కాశీ 7-52] తెరువరి [కాశీ 1-92]
నేర్పరి [శివ-1-22] మతకరి [కాశీ 7-92] ఇవి మతుబర్థములు.

7. -అలు : చెలియలు [క్రీడా 244]

8. -ఆఁడు : కఱదలాఁడు [కాశీ 2-160] గజ్జులాఁడు [హర 7-61]
బిరుదులాఁడు [భీమ 2-7] ఇవి మతుబర్థములు

9. -ఆలు : ఇల్లాలు [హర 7-125]

10. -ఆడి : వన్నెఁలాడి[చా.మం. 1-122] మతుబర్థము [స్త్రీ]

11. -ఇ : కడలి [భీమ 4-110] బిత్తరి [శివ 4-59]
మిటారి [క్రీడా.పీ 66]

కొన్నియెడల కులవాచకముగాను వచ్చుచున్నది. కుమ్మరి [ప.పీ 69]
కమ్మరి [ప.పీ 44] మతుబర్థములు

12. -ఇక : నాడిక [కాశీ 2-128]
వాలిక [కాశీ 6-70] స్వార్థము

13. -ఇఁడి : కట్టిఁడి [శివ 2-98] బలువిఁడి [ప.పీ 28]

14. -ఇమి : కడిమి [హర 7-83] చెలిమి [శృ.నై 3.159]
పోఁడిమి [కాశీ 3-99] మగఁటిమి[భీమ 5-112]
వేఁడిమి [శివ 3-28] భావార్థములు

15. -ఇదము: ఒప్పిదము [కాశీ 4-158] స్వార్థము.

16. -ఈఁడు : అటమటీఁడు [కాశీ 7-60] ఆగడీఁడు [అర 5-10] ఉక్కడీఁడు [శృ.నై 7-41] బానసీఁడు [వ వీ 100] మిండగీఁడు [క్రీడా 243] వెగ్గలీఁడు [కాశీ 5-116] సంగడీఁడు [కాశీ 4-68] మతుబర్థములు

17. -ఉక : ఎమ్మొక [కాశీ 5-73] నెలఁతుక [భీమ 2-126] పొలఁతుక [శృ నై 5-40] స్వార్థము

18. -ఉడు : చెవుడు [భీమ 4-69] అభావార్థము

19. -ఎఁడు : చిప్పెఁడు [హర 6-128] తూమెఁడు [హర 1-17] పట్టెఁడు [కాశీ 7-136] పరిమాణార్థము

ఈ క్రిందివానిలో -ఎడు పరమగుచో 'లి' వర్ణలోపమగుచున్నది

గుప్పెఁడు [గుప్పిలి] [క్రీడా 146] దోసెఁడు [దోసిలి] [చా.మం. 1-126]
పిడికెడు [పిడికిలి] [భీమ 6-15] పుడిసెఁడు [పుడిసిలి] [హర 6-129]

20. -ఏసి : అంతలేసి [శృ నై -6-135] ఇంతలేసి [కాశీ 2-104] ఏడేసి [భీమ 3-37] పదేసి/పదియేసి [కాశీ 3-187]

21. -కత్తియ/-కత్తె : కటారి కత్తియ [క్రీడా 92] కుంటెన కత్తియ [క్రీడా 274] మతుబర్థము.

కొన్నియెడల - కత్తె ప్రత్యయము సంస్కృతంబుల మీద కనబడుచున్నవి

కోపగత్తె [క్రీడా 129] మిశ్రసమాసము. కత్తియలోని 'క' వర్ణమునకు 'గ' వర్ణము వచ్చినది.

నెచ్చెలికత్తె [శృ నై 8-68] వేడుకకత్తె [కాశీ 3-107]
పొందుకత్తె [వ వీ. 97] రట్టుకత్తె [క్రీడా. 171]
చెలికత్తియ [శృ నై 4-99] చెలియలికత్తియ [కాశీ 5-336]
బోటికత్తియ [శృ నై 3-136] స్వార్థము [స్త్రీ]

22. -కాఁడు : కసవుకాఁడు [కాశీ 6-262] గగ్గులకాఁడు [కాశీ 7-88] గుఱికాఁడు [హర 6-79] చెలికాఁడు [శృ నై 3-46] పందెకాఁడు [క్రీడా 99] విలుకాఁడు [శృ. నై. 2-135]

వేఁటకాఁడు [శృ నై 3-90]
వేడుకకాఁడు [శృ నై 6-5] స్వార్థము [పుం]

తద్ధిత రూపముపై మరొక ప్రత్యయము ఈ క్రింది రూపములో కనిపించుట విశేషము

చెలిమికాఁడు [కాశీ 1-121]

కాఁడు లోని -కా ప్రత్యయమునకు -గా వచ్చుట.

23. -గాఁడు : జీతగాఁడు [ప.పీ 30] స్వార్థము
పందెగాండ్రు [క్రీడా 227]

కొన్ని యెడల -గాడు ప్రత్యయము సంస్కృత సమములయందు కాన వచ్చుచున్నది

కోవగాఁడు [భీమ 4-13] మిశ్రమసమాసము మతుబర్థము [పు]

24. -కారము : చెలికారము [శృ. నై 2-50] చలపకారము [కాశీ 7-37] భావార్థము
నుడికారము [భీమ 1-15] స్వార్థము

25. -టి : ఒంటి [శివ 3-125] భావార్థము
ఒండు - అంత్యవర్ణము లోపించును.

26. -త : స్త్రీవాచ్యమగునపుడు కులవాచకమునకు వచ్చును.

సాలెత [చా.మం. 1-133] అలవత [కాశీ 3-110]

-త పరమగునపుడు ఎత్వము వచ్చును.

చెంచెత [<చెంచు] [హర 7-52]
జోగెత [<జోగు] [హర 2-94]
మాలెత [<మాల] [శివ 3-39]

కులవాచకము కాని నామములకును -త ప్రత్యయము వచ్చును.

అప్పుడును ఎత్వము వచ్చుచున్నది గుబ్బెత [<గుబ్బ] [క్రీడా 124]

27. -తనము : ఒఱ్ఱదనము [శృ.నై. 6-130] కటికితనము [శృ నై 3-54]
కలితనము [భీమ 1-89] కలికితనము [శృ.నై 7-160]
కల్లతనము [కాశీ 4-90] కుంచెనతనము [శృ.నై 3-66]
కొయ్యతనము [కాశీ 4-94] గబ్బితనము [భీమ 2-57]
గోరతనము [కాశీ 4-91] చక్కదనము [భీమ 2-55]
తబిసితనము [హర 7-62] తియ్యదనము [శృ.నై 2-81]
పెద్ద తనంబు [శృ.నై 8-79] బాగతనము [భీమ 4-98]
వెఱ్ఱితనము [ప.వీ 59.100] వ్రేగుదనము [భీమ2-110]
గయాళితనము [చా మం 1-130] తద్ధితముపై తిరిగి ప్రత్యయము చేరినది.

ఈ క్రింది రూపమున 'తన' వర్ణము పరమగునపుడు సార్వనామిక రూపమునకు లోపము కలుగుచున్నది.

పెల్లాకొన్నతనాన [భీమ 2-120] మంచితనము [శివ 3-78]

28. -న : ఒయ్యన [శృ.నై 3-205] కమ్మన [శివ 2-47]
చామన [కాశీ 3-133] తెల్లన [శృ నై 8-129]
నల్లన [కాశీ 4-3] ప్రన్నన [హర 3.78] భావార్థము
మెత్తన [కాశీ 2-44] వ్రేకన [కాశీ 6-199]
ఉల్లన [శృ.నై 2-122, విన్నన [భీమ 6-62] భావార్థము

29. -షోతు : షోమరిషోతు [శృ.నై 1-17] తాచ్ఛీల్యార్థము.

30. -బంటి : కుత్తుకబంటి [శృ.నై 3-32] చంకలబంటి [క్రీడా. 171]
పుక్కిటబంటి [హర 4-14] దఘ్నార్థము

31. మాత్రము అను ప్రత్యయము సాంస్కృతికము. ఇది దేశ్య శబ్దములకును వ్యాపించుట కానవచ్చును.

-మాత్రము : అంతమాత్ర [శృ.నై 3-182]

32. -మి : పేర్మి [శివ 3-128] వేడిమి [శివ 3-28]
తాల్మి [భీమ 5-163] కూరిమి [శృ.నై 7-166]

33 -ఱికము : కన్నెఱికము [భీమ 2-62] పెద్దఱికము [కాశీ 5-89]
రాచఱికము [శివ 2-90] భావార్థము

34. -వాఁడు : కులవాచకముల నుండి నిష్పన్నమైన మహద్వాచక నామములు.

రాచవాఁడు [శృ.నై 6-65] వెలివాడవాఁడు [కాశీ 7-242]

అన్యవిశేషణములకును - వాఁడు చేరును.

బడుగువాఁడు [శృ నై 8-148]

35. -అది : మహతీవాచక రూపములందు

కాఁపుది [చా.మం. 1-134] అగసాలిది [శ్రీ.శృం 29]

## 3.1.3 భావార్థకములు (Verbal nouns)

స్వార్థమునందు ధాతువునకు -టవర్ణకము చేర్పగా భావార్థక మేర్పడును. వ్యతిరేక భావార్థకమునందు ధాతువునకు -అమి అను ప్రత్యయము చేరును.

-ట : అగుట [<అగు] [శృ.నై 1-87] ఆడుట [<ఆడు] [కాశీ 7-166]
చేయుట [<చేయు] [హర 2-47] ఉంట [<ఉండు][శృ.నై 4-67]

నన్నయలో కొలదిగా కన్పించు -డు వర్ణముతోడి భావార్థక ప్రయోగములు శ్రీనాథుని నాటికి పూర్తిగా అంతరించినవని చెప్పవచ్చును ఆధునిక భాషలో -డు అంతమున వచ్చు రూపములు వ్యవహార విదూరములు. -టవర్ణాంతములు సహజములు.

### 3.1.3.1 వ్యతిరేక భావార్థకములు :

-అమి : అబ్బమి [క్రీడా 175] ఓర్వమి [భీమ 5-148]
ఓపమి [శృ.నై 3-41] చూడమి [క్రీడా 286]

## 3.2.0 తత్సమ పద నిర్మాణము (Formation of Tatsamas)

సంస్కృతమున శబ్దము ననుసరించి లింగవిభజన రూపొందగా తెలుగున అర్థము ననుసరించి లింగ[వాచక] విభాగ మేర్పడినది. లింగనిర్మాణమున నిట్టి భేద ముండుటచే సంస్కృత ప్రాతిపదికలకు తెలుగు లింగబోధకప్రత్యయములు చేరి తత్సమము లేర్పడుచున్నవి. సంస్కృతమునందలి ప్రకృతులు తత్సమమునందు ప్రకృతులగునపుడు కొన్ని యెడల కొన్ని మార్పులకు లోనగును. వానిని గమనించిన యెడల తత్సమ పదముల రూపసాధన క్రమము సుకరముగా తెలియును. శ్రీనాథు భాష యాధారముగా తత్సమ పదనిర్మాణమిట సూచింపబడును.

## 3.2.1 అజంత ప్రాతిపదికలు

### 3.2.1.1 అకారాంత మహద్వాచకములు :

సంస్కృతము నందలి పుంలింగ ప్రాతిపదికలు సాధారణముగ తెలుగున మహద్వాచకములై -ండు|-ఁడు అను లింగబోధక ప్రత్యయములను చేర్చుకొనును అప్పుడు స్వరసామరస్యముచే (Vowel Harmony) ప్రాతిపదికాంతమైన అకారము నకు ఉకారము వచ్చును.

ఉదా:- కూచిమార -> కూచిమారు - ఁడు [కాశీ 2-66]

త్రిణయన -> త్రిణయను - ఁడు [కాశీ 2-150]

ఇంద్ర -> ఇంద్రు - ండు [హర 7-25]

దేవ -> దేవు - ఁడు [కాశీ 5-90]

తులనాత్మకముగా పరిశీలించిన శాసన భాషయందలి 'దేవడు' అను రూపము తరువాతికాలమున 'దేవుఁడు' గా మార్పు నొందినది. నన్నయ, నన్నెచోడుల భాషయందు ప్రాతిపదికాంతమైన అకారము ఉకారము నొందని రూపములు కొలదిగా కలవు.

ఉదా:- గరుడండు - [కు సం. 4-23]

ఇంతేగాక నన్నెచోడ, తిక్కన, భాషలో 'గరుడుఁడు' అను రూపమునకు తోడు 'గరుడి' [కు సం. 2-71, నిర్వ.రా 2-37] అనువిశిష్ట ప్రయోగములు కలవు కాని శ్రీనాథునిభాష యందిట్టి రూపములు కానరావు

కొన్ని తిర్యక్కులును, జడవాచకములును మహద్వాచక ప్రత్యయము చేరగా మానవీకరణము పొందుచున్నవి (Personification)

ఉదా:- గరుడుండు [కాశీ 2-107] ద్విజముఖ్యుఁడు [శృ.నై 2-8]
శీతాచలేంద్రుండు [హర 4-60]

శ్రీనాథుని భాషలోని యీ క్రింద నుదాహరించెడు తత్సమ శబ్దములకు -ండు/-ఁడు అను లింగబోధక ప్రత్యయము చేర్పబడక ప్రాతిపదికాంతమైన అకారము ఉత్వము నొందుచున్నది.

కాళిదాస-కాళిదాసు [భీమ 1-7] నన్నయభట్ట-నన్నయభట్టు [కాశీ 1-13]
మూర్ఖ - మూర్ఖు [భీమ 5-196] వృద్ధ - వృద్ధు [హర 2-49, 2-123]

ప్రాతిపదిక ఎట్టిమార్పును చెందక మహద్వాచక ప్రత్యయమైన -ండు/-ఁడు చేరనిరూపము శ్రీనాథునిలో కలదు

తాత -తాత [తండ్రి] [కాశీ 7-74]

ప్రాతిపదికకు మహద్వాచక ప్రత్యయము చేరియు, చేరకయు నీ క్రింది రూపము ఏర్పడుచున్నది.

పూషుండు : నీవు పూషండనుపేరి [భీమ 3-212]

పూష : పూష మకరస్థుఁడైన యప్పుడు [కాశీ 3-93]

3 2.1.2 ఇకారాంత మహద్వాచకములు :

సంస్కృతము నందలి ఇకారాంత పుంలింగ ప్రాతిపదికలు తత్సమములగు నపుడు ఎట్టిమార్పును పొందవు. లింగబోధక ప్రత్యయమేమియు చేరదు

ఉదా:- ముని - [శృ.నై. 3-33] మరీచి [కాశీ 4-261] హరి [కాశీ 3-186]

### 3.2.1.3 ఉకారాంత మహద్వాచకములు :

సంస్కృతమునందలి ఉకారాంత పుంలింగ ప్రాతిపదికలు తత్సమములగు నగుపుడు -వు వర్ణకముగాని -ండు/-ఁడు ప్రత్యయముగాని అంతమందు చేరును.

-వు : గురు-వు [హర 1-18] ప్రభు-వు [హర 3-39]
-ండు : గురు-ండు [కాశీ 2-95] ప్రభు-ండు [కాశీ.పీ. 32]
వటు-ండు [హర 4-15]
-ఁడు : శంభు-ఁడు [కాశీ 2-5] గురు-ఁడు [కాశీ 1-50]

మను, రాహు, కేతు శబ్దములు తత్సమములగునపుడు మహద్వాచక ప్రత్యయమైన -ండు/-ఁడు చేరిన రూపములు కానరావు. వీనికెల్లప్పుడు -వు వర్ణ మంతమందు చేరును.

ఉదా:- మను-వు [శృ.నై. 7-72] రాహు-వు [శృ.నై. 2-123]
కేతు-వు [హర 6-126]

ఈ క్రింది మహద్వాచక రూపములకు -ఁడు ప్రత్యయమే చేరును

విధు-ఁడు [భీమ 2-42] విభు-ఁడు [భీమ 1-51]

### 3.2.1.4 ఋకారాంత మహద్వాచకములు :

ఋకారాంత పుంలింగ సంస్కృత ప్రాతిపదికలు తత్సమములగునపుడు ప్రథమైక వచనమునందలి దీర్ఘాచ్చు హ్రస్వమగును.

కర్తృ -> కర్తా [ప్ర.ఏ] : కర్త [హర 2-102, కాశీ 3-186]
భర్తృ -> భర్తా [ప్ర.ఏ] : భర్త [కాశీ 1-75]
వక్తృ -> వక్తా [ప్ర.ఏ.] : వక్త [కాశీ 1-8]
శ్రోతృ -> శ్రోతా [ప్ర.ఏ.] : శ్రోత [కాశీ 1-8]

ఈ క్రింది మహద్వాచకములకు వైకల్పికముగ లింగబోధక ప్రత్యయము చేరును.

సవితృ - > సవితా [ప్ర.వ.] : సవిత [శృ.నై 8-29]
సవితృ - సవితృ-ఁడు [కాశీ 2-72]

3.2.1.5 మహతీ వాచకములు :

సంస్కృతమునందలి ఆకారాంత, ఈకారాంత స్త్రీలింగ ప్రాతిపదికల యందలి దీర్ఘాచ్చులు తత్సమ ప్రాతిపదిక లైనపుడు హ్రస్వములగును.

'నామంబుల తుదిదీర్ఘంబునకు హ్రస్వంబగు' [బాల-తత్సమ-54]
-ఆ : భార్యా > భార్య [హర 1-8] రంభా > రంభ [హర 7-137]
అంబికా > అంబిక [హర 3-96]
-ఈ : గౌరీ > గౌరి [హర 4-10] లక్ష్మీ> లక్ష్మి [శృ.నై 8-129]

సంస్కృతము నందలి ఇకారాంత స్త్రీలింగ ప్రాతిపదికలు ఎట్టిమార్పును లేకయే తెలుగున మహతీవాచకములగుచున్నవి.

-ఇ : రతి - > రతి [శృ.నై 3-116]

దీర్ఘాచ్చు అంతమందుగల ఏకాచ్క సంస్కృత ప్రాతిపదికలు తత్సమము లగునపుడెట్టి మార్పునుపొందవు.

శ్రీ [కాశీ 2-67] స్త్రీ [హర 4-43]

ఊకారాంత స్త్రీలింగ ప్రాతిపదికయందలి దీర్ఘాచ్చు హ్రస్వమై -వు వర్ణమునకు బదులు -వ వర్ణము చేరురూపము శ్రీనాథుని భాషలో గలదు. నన్నయ యందును ప్రయోగమిట్లే కలదు.

ఉదా:- కద్రూ > కద్రు -వ [కాశీ 6-16]

'కద్రువ నాగమాత' [బాల-తత్సమ-51]అని నిపాతమును సూరి విధించెను.

3.2.1.6 మహతీతరామహద్వాచకము :

1. అదంతములు :

అదంత సంస్కృత ప్రాతిపదికలు ఏలింగమందున్నను తెలుగున అమహద్వాచకములను తెలియజేయునపుడు -ంబు/-మ్ము/-ము అను ప్రత్యయములు చేరును.

-ంబు : దాన - > దాన - ంబు [భీమ 5-72]

కాల - > కాల - ంబు [శివ 1.60]

-మ్ము : వర్ణ - > వర్ణ - మ్ము [భీమ I-34]

దర్ప - > దర్ప - మ్ము [భీమ 1-34]

-ము : ధర్మ - > ధర్మ - ము [హర 4-44]

గృహ- > గృహ- ము [శృ నై 5-123]

అకారాంత ప్రాతిపదికలైన 'రూప'- 'శరణ'- 'నగర'- శబ్దములకు -ము/-ంబు ప్రత్యయములు చేరును. అటుల -ము/-ంబు ప్రత్యయములు చేరనియెడల ప్రాతిపదికాంతమందలి అకారము ఉకారముగా మారును. అపుడింక ఏ ప్రత్యయము చేరదు.

రూప - ము [కాశీ 4-152] రూప - ంబు [భీమ 3-53]

రూప - > రూపు [హర 4-3]

శరణ - ము [భీమ 4-81] శరణ - > శరణు [హర 6-46]

నగర - ము [కాశీ 2-136] నగర - > నగరు [భీమ 5-41]

అకారాంత ప్రాతిపదికలైన యీ క్రింది శబ్దములకు -ము/-ంబుగాని -వు ప్రత్యయముగాని చేరును. -వు ప్రత్యయము చేరుచో ప్రాతిపదికాంతమందలి అకారము ఉకారముగా మారును.

ధర్మంబు [భీమ 4-109] ధర్మ - > ధర్మువు [శృ.నై. 2-129]

నాగము నాగ - > నాగువు [శృ.నై 8-154]

సంస్కృత శబ్దములు కొన్ని తెలుగున అమహద్వాచకములగునపుడు -ము/-ంబు ప్రత్యయములు చేరియు, లేక ఏ ప్రత్యయము చేరక కేవల ప్రాతిపదిక తోడి రూపములు కన్పించు చున్నవి.

ఉదా : ప్రయాగ-ము [కాశీ 3-94] ప్రయాగ [కాశీ 1-8]

ప్రశ్న -ంబు [భీమ 5-163] ప్రశ్న [శృ.నై 4-50]

'అభిలాష', 'మిష' శబ్దములకు తత్సమమున -ము ప్రత్యయమే చేరు చున్నది. -మ్ము, -ంబు లతోడి రూపములు శ్రీనాథునిభాషలో కానరాలేదు.

అభిలాష-ము [శృ.నై 3-53] మిష-ము [శృ.నై. 1-86]

అకారాంత సంస్కృత నపుంసక లింగములైన మిత్ర, ప్రధాన ప్రభృతి శబ్దములకు మహద్వాచకమున ఉత్వమును -ఁడు, ప్రత్యయము చేర్చబడును. అటుల కానియెడల -ము ప్రత్యయము వైకల్పికముగ చేరును.

మిత్రు -ఁడు [కాశీ 3-186] మిత్ర-ము [కాశీ 6-59]
ప్రధాను -ఁడు ప్రధాన-ము [హర 4-64]
శరణు -ఁడు శరణ -ము [కాశీ 6-47]

అకారాంత పుంలింగ మహద్వాచకమయిన ప్రధానశబ్దము నందలి తుది అత్వము కొన్నియెడల ఇత్వము నొందును

ప్రధాని : పిల్లలమఱ్ఱి మహాప్రధాని [హర.పీ 30]

2. ఇదంతములు :

ఇదంత సంస్కృత ప్రాతిపదికలు తెలుగున మహతీతరా మహద్వాచకములగునపుడెట్టి మార్పునుపొందవు.

భక్తి [హర 3-36] శుద్ధి [హర 3-13]

సంస్కృతమునందలి ఆకారాంత, ఈకారాంత ప్రాతిపదికల యందలి దీర్ఘాచ్చు మహతీతరా మహద్వాచకమున హ్రస్వమగును.

-ఆ : ఘటికా > ఘటిక [భీమ 2-135] కరుణా > కరుణ [హర పీ. 30]
రేఖా > రేఖ [హర 7-16] శయ్యా > శయ్య [కాశీ 2-81]
-ఈ : ధరిత్రీ > ధరిత్రి [హర 2.84] పీఠీ > పీఠి [హర 3-13]

3. ఉదంతములు :

ఉదంత సంస్కృతప్రాతిపదికలు తెలుగున మహతీతరామహద్వాచకము లగునపుడు -వు ప్రత్యయము చేరును

కమండలు -> కమండలు-వు [హర 2-87] ధేను->ధేను-వు [కాశీ 2-106]
ఊరు -> ఊరు-వు [హర 7-126] హేతు->హేతు-వు [హర 7-19]

సంస్కృత శబ్దమైన 'ద్యుః' తత్సమము లగునపుడు శ్రీనాథునిలో సప్తమ్యర్థ రూపములుగా నిష్పన్నములగుచున్నవి.

దివి [<ద్యుః] [హర 7-30]

4. ఓకారాంతములు :

ఓకారాంత 'గో' శబ్దమునకు తత్సమమునందు 'వు' ప్రత్యయముచేరును.
గో-వు [కాశీ 2-26]

## 3.2.2 హలంత ప్రాతిపదికలు :

చాలవఱకు సంస్కృత ప్రథమైకవచన రూపమునుండియే తత్సమ ప్రాతిపదిక లేర్పడుచున్నవి. కొన్నియెడల ద్వితీయైకవచనము నందలి తుది మవర్ణమును కోల్పోయి తత్సమ ప్రాతిపదికగా వ్యవహృత మగుచున్నది. సకారాంత సంస్కృత ప్రాతిపదికలు తత్సమమునందు కూడ ప్రాతిపదికలుగా వ్యవహరించును. అజంత ప్రాతిపదికల విషయమున నవలంబించిన పద్ధతులనే హలంత నామప్రాతిపదికల యందును అనుసరింప వలసియున్నది.

### 3.2.2.1 పుంలింగ ప్రథమైక వచనము :

1. నకారాంత ప్రాతిపదికలు :

నకారాంత ప్రాతిపదికల ప్రథమైక వచనరూపము నందలి తుదిదీర్ఘము హ్రస్వమై వాచకప్రత్యయము చేరును.

పూతాత్మన్ > పూతాత్మా : పూతాత్ముఁడు [కాశీ 4-74]

కొన్నియెడల సంస్కృత ప్రథమైకవచనముయొక్క తుదిదీర్ఘము హ్రస్వమగుటచేతనే తత్సమ రూపము సిద్ధించును.

బ్రహ్మన్ > బ్రహ్మా : బ్రహ్మ [హర 7-20]
శివశర్మన్ > శివశర్మా : శివశర్మ [కాశీ 4-56]
లోకసాక్షిన్ > లోకసాక్షీ : లోకసాక్షి [కాశీ 3-186]

రాజశబ్దము తుదిదీర్ఘము హ్రస్వమై ఉదంతత్వము నొందును.

రాజన్ > రాజా : రాజు [శృ నై 2-50]

2. జకారాంత ప్రాతిపదికలు :

జకారాంత ప్రథమైకవచనము తుదిహల్లునకు ఉగాగమము ద్విత్వము వచ్చును.

వణిక్క్ > వణిక్కు [శృ. నై 6-115]

3.2.2.2 పుంలింగ ద్వితీయైక వచనము :

1. జకార, తకార, దకార, సకారాంత ప్రాతిపదికలు :

జకార, తకార, దకార, సకారాంత ద్వితీయైకవచన రూపములందలి తుది మకారము లోపించి ప్రాతిపదికాంతమైన అకారము ఉదంతత్వమునొంది వాచక ప్రత్యయము చేరును.

జ : భూభుజమ్ > భూభుజు-ండు [కాశీ 4-202]
త : మఘవంతమ్ > మఘవంతు-ండు [శృ.నై 3-28]
జాంబవంతమ్ > జాంబవంతు-ండు [శృ.నై 8-126]
భాగ్యవంతమ్ > భాగ్యవంతు-ండు [హర 4-64]
భాస్వంతమ్ > భాస్వంతు-ండు [హర 7-113]
ద : సుహృదమ్ > సుహృదు-ండు [శృ.నై 2-30]
స : అంగిరసమ్ > అంగిరసు-ండు [హర 4-61]

సకారాంత సంస్కృత ప్రాతిపదికలు తత్సమమునందు కూడ ప్రాతిపదికలుగ వ్యవహరించును. అట్టియెడల చివరి సకారమునకు లోపము కలుగును. పిదప ప్రాతిపదికాంతమైన అకారము ఉదంతత్వము నొంది, వాచక ప్రత్యయము చేరును.

పురూరవస్ > పురూరవు_ండు [హర-7-125]

కొన్నియెడల సంస్కృత ప్రాతిపదిక యందలి తుది సకారము ఉదంతమై ద్విత్వము నొందును.

విశ్రవస్ > విశ్రవస్సు [కాశీ 4-138]

**3.2.2.3 స్త్రీలింగ ప్రథమైక వచనము :**

సకారాంత ప్రాతిపదికల తుది సకారము వైకల్పికముగ లోపించును

అప్సరస్ > అప్సరల్[1] [భీమ 5-31]

**3.2.2.4 స్త్రీలింగ ద్వితీయైక వచనము :**

సకారాంత ప్రాతిపదికల ద్వితీయైక వచనమందలి తుది వర్ణము లోపించి తత్సమ ప్రాతిపదిక యగును.

అప్సరసమ్ -> అప్సరస [హర 5-48, భీమ 5-41]

3.2.2.5 నపుంసక లింగ ప్రథమైక వచనము :

చకారాంత ప్రాతిపదికల ప్రథమైక వచనమునందలి తుదిహల్లునకు ఉత్వద్విత్వములు వైకల్పికముగ నగును.

వాక్ -> వాకు [హర 7-8] వాక్కు [శృ.నై 2-3]

తకారాంత ప్రాతిపదికల ప్రథమైక వచనమునందలి తుదిహల్లు లోపించి -ము/-ంబు ప్రత్యయము చేరును.

జగత్ -> జగ-ము [శృ.నై 1-14] జగ-ంబు [శృ.నై 2-136]

దకారాంత ప్రాతిపదికల ప్రథమైక వచనమందలి తుదిహల్లునకు ఉత్వ ద్విత్వములు కలుగును.

మరుత్ -> మరుత్తు [కాశీ 7-210]

మహత్ -> మహత్తు [హర 5-15]

1. అచ్చం -ల్ అనుపాఠాంతర మున్నది.

తనూనపాత్ -> తనూనపాత్తు [కాశీ 3-206]
యోషిత్ -> యోషిత్తు [శివ 5-5]
ఉపనిషత్ -> ఉపనిషత్తు [కాశీ 2-69]
పరిషత్ -> పరిషత్తు [కాశీ 7-238]

నకారాంత ప్రాతిపదికల ప్రథమైక వచనమందలి దీర్ఘాచ్చు హ్రస్వమై లింగబోధక ప్రత్యయము వైకల్పికముగ చేరును.

మహిమన్ - మహిమ [భీమ 1-107] మహిమ-ము [భీమ 1-113]
మహిమ-ంబు [భీమ 1-82]

ప్రేమన్ -> ప్రేమ [భీమ 1-103] ప్రేమ-ము [శృ.నై 7-22]
ప్రేమ-మ్ము [హర 7-131] ప్రేమ-ంబు [శృ.నై 2-86]

శకారాంత సంస్కృత ప్రథమైకవచన ప్రాతిపదికల తుదిహల్లునకు ఉత్వద్విత్వము కలుగును. ఆకారాంత స్త్రీలింగశబ్దమునుండి రూపాంతరము లేర్పడవచ్చును.

దిక్ ->దిక్కు [హర 2-123] దిశా > దిశ [భీమ 4-46]

సకారాంత శబ్దము తత్సమములగునపుడు ఈ క్రింది పరిణామముపొందును.

1. కొన్నియెడల సకారాంత శబ్దముల తుదిహల్లునకు ఉత్వము వచ్చును.

శిరస్ -> శిరసు పూగగన గంగ [కాశీ 3-124]
మనస్ -> మనసు [భీమ 5-148] తపస్ -> తపసు [భీమ 4-44]

2. కొన్నియెడల సకారాంత శబ్దముల తుదిహల్లునకు ఉత్వద్విత్వములు కలుగును.

శిరస్ -> శిరస్సు [శృ.నై 8-145]

3. కొన్ని సకారాంత శబ్దముల తుదిహల్లు లోపించి లింగబోధక ప్రత్యయములు చేరును.

మనస్ -> మన-ము [శృ.నై 7-161] మనం-బు [శృ.నై 1-78]
శిరస్ - > శిర-ము [కాశీ 7-85] శిర-ంబు [హర 4-96]

తపస్ -> తప-ము [హర 7-15]

4. కొన్ని సకారాంత శబ్దముల తుదిహల్లులోపించి -వు వర్ణ మదనముగా చేరును.

అయుస్ -> అయు-వు [శృ.నై 3-135]

**3.2 2.6 నపుంసకలింగ ద్వితీయైక వచనము :**

శ్రీనాథునిభాషలో దకారాంత ప్రాతిపదికములగు శబ్దములు రెండు మాత్రమేకన్పించుచున్నవి. ఉదా :- ముద్, సంపద్

1. కొన్ని దకారాంత ప్రాతిపదికల ద్వితీయా విభక్త్యేకవచము తుది హల్లు లోపించి వాచక ప్రత్యయము చేరును.

ముద్ -> ముదమ్ -> ముద-ంబు [శృ.నై 6-5, కాశీ 3-23]
సంపద్ -> సంపదమ్ -> సంపద [భీమ 5-54]

ఇది స్త్రీలింగశబ్దమగుటచే తెలుగున ప్రథమైక ప్రత్యయలోపము జరుగును.

హకారాంత ప్రాతిపదికల ద్వితీయైకవచనము తుదిహల్లు లోపించి లింగబోధక ప్రత్యయము చేరును.

మధులిహమ్ -> మధులిహ-ము [కాశీ 1-28]

3.2.3 శ్రీనాథుని భాషలో నీక్రింది తత్సమరూపములు అపాణినీయములు. మహాకవి ప్రయోగంబుల సాధుత్వంబున 'స్థితస్య గతిశ్చింతనీయా' అను వాచోయుక్తి యనుసరణీయమని యెఱుగ వలయును.

1. గీష్పతి : బృహస్పతి

గీః పతిః, గీర్పతిః : గీర్‌పతి అనురూపములు పాణిని సమ్మతములు.
గీష్పతియేమి చెప్పెన్ [శృ నై 4-28]

2. ముష్టాముష్టి : ముష్టితో ముష్టినిగ్రహించి పోరాడుట.
'ముష్టీముష్టి' అనుట సమ్మతము.
ముష్టాముష్టిని బాహా బాహిఁ గచాకచి [కాశీ 5-150, హర 7-86]

3. బాహాబాహి : బాహువుతో బాహువును గ్రహించి పోరాడుట.

'బాహూబాహవి' అనుట సాధువు. బాహాశబ్దమునే గ్రహించి యున్నచో ఈరూపము సాధువే యగును.

ముష్టాముష్టిన్ బాహాబాహిఁ గచాకచి [కాశీ 5-150, హర 7-86]

4. కానినేయుఁడు : కన్యసంతానము.

'కన్యాయాః కనీనచ' అని పాణినీయము. కానీనుఁడు అనుట యుక్తము.

కాశికాపట్టణము మీఁదఁ గానినేయ [భీమ 2-114]

కార్య సంసిద్ధిఁబొందెడు కానినేయ [భీమ 3-214]

5. గృహయాళువు : గ్రహించు స్వభావము కలవాడు.

గ్రహ్ + అప్ = గ్రహ + ణిచ్ = గ్రహ్ + ణిచ్ = గ్రహ్ + ణిజ్ + ఆలుచ్ ; గ్రహ్ + అయ + ఆలుచ్ = గ్రహయాలుః ఇతిప్రక్రియా

ఆమోద గ్రహయాళువుల్ పొలసె [భీమ 5-95]

6. పతయాళువు : పడెడు స్వభావము కలవాడు.

'స్పృహి, గృహి, పతి, దయి, నిద్రా, తంద్రా, శబ్దేభ్యః ఆళుచ్'.[2]

'ఆద్యాస్త్రియః చురాదౌ అదంతాః' - వృత్తి.

గ్రాహింపంబతయాళు నిష్ఠుర [భీమ 4-58]

7. బాఁలకి : బాలిక, చిన్నవయసుది.

బాలిక అనుట సాధువు.

బాలకి ! సదృశములె వలలఁబడు మత్స్యంబుల్ [క్రీడా 91]

8. ప్రౌఢిమ : ప్రౌఢత్వము

సంస్కృతభాషలో ప్రౌఢి శబ్దమేకాని యిది గానబడదు. 'ఇమనిచ్' ప్రత్యయముచేరి 'ప్రౌఢిమ' యనురూపమును శ్రీనాథుడు విలక్షణముగ ప్రయోగించెను.

---

2. కౌముది : కృదంత....3.2.158

'గంభీర వాక్ప్రౌఢిమన్' [శృ.నై 1-12]

9. గాణాపత్యము : గణపతికి సంబంధించినది.

'గాణపతము' అనియుండవలెను. గణపతిశబ్దము అశ్వపత్యాది గణములో నిపతింపబడుటచే అణ్ ప్రత్యయమువచ్చి గాణపతమ్ అని కావలయును. దీనికంటె ణ్యత్ ప్రత్యయము రానేరదు.

'గాణపత్యోమంత్రః' ఇతితుప్రామాదికమేవ[3]

3.2 3 1 ఈక్రింది తత్సమరూపముల యందెట్టి వ్యాకరణదోషములు లేకపోయినను శ్రీనాథునకభీష్టములైన విశిష్ట ప్రయోగములగుటచే వేరుగా ప్రదర్శింపబడు చున్నవి.

| | | |
|---|---|---|
| 1 అక్షయ్యము | : క్షయింప జేయుటకు శక్యముకానిది | [కాశీ 6-125] |
| 2. అదసీయము | ; దీని సంబంధమైనది. | [శివ 2-47] |
| 3. కలశీసుతుడు | . కలశసుతుడు అనుట ప్రచురము. | [కాశీ 4-304] |
| 4 కంఠేకాలుడు | : కంఠమునందు నల్లదనము కలవాడు. | [భీమ 4-202] |
| 5. కార్తికీవేళ | : కార్తిక మాసపు వేళ | [భీమ 3-25] |
| 6. పణినాపత్యము | : పాణిని | [శృ.నై 8-19] |
| 7. పుష్పంధయము[4] | ; భ్రమరము | [భీమ 1-106] |
| 8. పాణింధమము | . కొలిమితిత్తి | [భీమ 2-110] |
| 9. నందని | : కుమార్తె 'నందన' అనుట ప్రసిద్ధము. | [భీమ 4-27] |
| 10. యాయజూకుడు | : యజమానుడు | [కాశీ 4-7] |
| 11. వీవాదము | : వివాదమనుట ప్రచురము | [హర 7-59] |
| 12. సాత్కరించు | ; అధీనపఱుచు | [శృ.నై 8-108] |

3.2.3.2 ఈక్రింది అమహద్వాచకములకు లింగబోధక ప్రత్యయమైన -మువర్ణము లోపించుచున్న విశిష్ట రూపములు.

---

3. కౌముది ; తద్ధిత - 1076

4. ఈరూపము వ్యాకరణ విరుద్ధమని సూ. ని. 5 సంపుటము, పుట 552.

ఊష్మ [ఊష్మము] ఊష్మ జగ త్త్రియంబునున్ [హర 6-63]
భీభత్స [బీభత్సము] పొలసుకంపున బీభత్సపొడమఁజేయ [కాశీ 6-41]
కంఠకోణచిహ్న [చిహ్నము] గుఱుతయ్యె నీ కంఠకోణచిహ్న [భీమ 4-72]
లలామకున్ [లలామము] మానవతీ జనతాలలామకున్ [శృ.నై 8-33]
వ్యవహారచిహ్న [చిహ్నము] వ్యవహారచిహ్నకు [భీమ 4-72]

3.2 3.3 ఈ క్రింది పుంలింగ మహద్వాచక రూపములకు బహువచనము పరమగు నపుడు వు వర్ణము లోపించుచున్నది.

బంధులు [బంధువులు] [భీమ 1-50]
ఉదకబిందులు [ఉదకబిందువులు] [భీమ 5-189]
పుంద్రేక్షు [పుంద్రేక్షువులు] [భీమ 1-110]

3.2 3.4 ఈ క్రింది రూపములను శ్రీనాథుడు తనకాలమునాటి వ్యావహారిక భాష నుండి గ్రహించి ప్రయోగించెను

1. ఇరువై నాలుగు మూళ్ళమేర [కాశీ 1-53] ఇరువదినాలుగు మూరలమేర అని యుండవలెను.

2. ఎంత జడుడైన గానీ [శృ నై 6-23] కానిమ్ము అనవలయును.

3 ఏమికొంకక పెట్టు [హర 2-29] ఏమియును అనవలయును.

4 మోహింపఁజేతురు [శృ.నై. 2-88] చేయుదురు అనియుండవలెను.

5 వినీ వినని భంగి [శృ.నై 6-33] వినియును వినని అనియుండవలెను.

## 3.3.0 వైకృత పదనిర్మాణము (Formation of Vaikritas)

ఐతిహాసిక కాలములో విజేతలయిన ఆర్యభాషా వ్యవహర్తల రాజకీయాధికారము, వైదిక జైన బౌద్ధమతముల సంసర్గము, ఆర్యభాషా సంస్కృతులు కారణములుగా సంస్కృత ప్రాకృతభాషల ప్రభావము తెలుగుపై చాల ఎక్కువగ పడినది. ఈముద్ర ఆనాటితో ఆగిపోలేదు. నాటినుండి నేటివరకు ఆభాషల అధికారము తెలుగుపై అవిచ్ఛిన్నముగా చెల్లుబడి అగుచున్నది. అనుస్యూతమైన ఈప్రభావము కారణముగ కొన్నివేల ఎరవు పదములు శాబ్దికమైన మార్పులుపొంది, పొందక తెలుగున ప్రవేశించినవి. శాబ్దిక పరిణామముపొందని పదములు తత్సమములని శాస్త్రకారుల మతము.

సాధారణముగా తెలుగులోని తద్భవములను నిరూపించు సందర్భమున మాతృకలను గురించి తెలుగు వ్యాకర్తలలో రెండు మతములున్నటుల గోచరించుచున్నవి. కేతన, విన్నకోటపెద్దన, కూచిమంచి తిమ్మన మొదలైనవారు తద్భవములకు మాతృకగా సంస్కృతమును మాత్రమే పేర్కొని సమీపమాతృక అయిన ప్రాకృతమును పూర్తిగా విస్మరించిరి. చింతామణికర్త, చిన్నయసూరి మొదలైనవారు సమీపమాతృకగా ప్రాకృతమునుకూడ పేర్కొనిరి. చిన్నయసూరి నిరూపించినటులుగా తద్భవములను సంస్కృతభవములని, ప్రాకృతభవములని వేర్వేరుగ వివక్షించుట శాస్త్రీయమైనదృష్టి.

వైకృతములకును వాని సమీప మాతృకలకునుగల ముఖ్యమైన ధ్వని పరిణామములు శ్రీనాథుని భాషననుసరించి దిగువప్రదర్శితములు.[1] ఆద్యప్రకృతి యగు సంస్కృతమును, ద్వితీయ ప్రకృతియగు ప్రాకృతమును తెలుగునకు సమీపమాతృకలు గావున ప్రాకృతసమ, ప్రాకృతభవ సంబంధి ధ్వని పరిణామములు ఒకప్రకరణమునందును సంస్కృతభవ సంబంధి ధ్వని పరిణామములు మఱియొక ప్రకరణమునందును వేర్వేఱుగా వివృతములు. ఈ ప్రకరణమునందు ఆచార్య టి. దొణప్పగారి వైకృతపద నిరూపణము అను అముద్రిత సిద్ధాంతగ్రంథము నందవలంబించిన పద్ధతులు ఆధారముగా గ్రహింపబడినవి.

---

1. శ్రీనాథుని రచనలలోని వైకృతపదములు సమీపమాతృకలతో కూడిన పట్టిక అనుబంధమును పొందుపరుప బడినది.

## 3.3.1 ప్రాకృతసమ, ప్రాకృతభవముల ధ్వనిపరిణామము

పరిణామమునందును ప్రాధాన్యమునందును ప్రాకృతసమ, ప్రాకృతభవములు ప్రథమ స్థానీయము లగుట వలన తత్సంబంధి ధ్వనిపరిణామ ప్రక్రియ ప్రథమతః ప్రపంచితము.

### 3.3.1.1 పదాదివర్ణములు : స్వరములు

1. (i) పదాద్యచ్చులలో ప్రాయికముగా మార్పు కనిపించదు.

| సంస్కృతము | ప్రాకృతము | తెలుగు | |
|---|---|---|---|
| అంగార- | ఇంగాల- | ఇంగలము | [కాశీ 3-154] |
| అటవీ | అడవీ | అడవి | [కాశీ 6-221] |
| ఆకాశ- | ఆకాస- | ఆకసము | [శృ.నై 3-69] |
| ఈర్ష్యా | ఈసా | ఈసు | [హర 3-95] |
| ఉజ్జ్వన | ఉజ్ఝణమ్ | ఉజ్జన | [కాశీ 4-81] |
| భూమికా | భూమియా | బూమియ | [కాశీ 6-61] |
| ఏకస్థ- | ఎక్కట్ఠ | ఎక్కటి | [కాశీ 1-100] |
| అభ్యవహార | ఓగిర- | ఓగిరము | [కాశీ 4-133] |

(ii) ఈక్రింది ఉదాహరణలలో మార్పు కనిపించుచున్నది

| | | | |
|---|---|---|---|
| అంగులీయక | అంగులీయ- | ఉంగరము | [హర 5-45] |
| అంగుష్ఠ- | అంగుట్ఠ- | ఉంగుటము | [శృ.నై 8-115] |

2. ఈక్రింది ఉదాహరణలో తాలవ్యహల్లుతో కూడిన అకారము తాలవ్య స్వరమైన ఎకారముగా మారినటుల గుర్తింపవచ్చును.

| | | | |
|---|---|---|---|
| త్యక్త- | చత్త- | చెత్త | [హర 7-12] |

3. సమీప మాతృకలోని ప్రథమ స్వరముగానున్న ఇత్వము తెలుగున ఎత్వముగా మారినది.[సంవృతమైన స్వరము అర్ధసంవృతముగా మారినది.]

| సంస్కృతము | ప్రాకృతము | తెలుగు | |
|---|---|---|---|
| దిశా | దిసా | దెస | [శృ.నై 5-31] |
| విష్ణుః | విణ్హు- | వెన్నుఁడు | [భీమ 2-39] |

4. అ-<ఒ- : సమీప మాతృకయందలి పదాది ఒకారము తెలుగున అకారముగా నిల్చును.

| | | | |
|---|---|---|---|
| యౌవనమ్ | జొవ్వణమ్- | జవ్వనము | [శివ 2-17] |

5. ఈ-< ఇ-: ఇచటి పదాది ఇకారము ద్విత్వవర్ణమునకు పూర్వస్వరము. సమీప మాతృకయందలి ద్విరుక్తత తెలుగున తొలగుట వలన తత్పూర్వ స్వరము దీర్ఘమయినది.

| | | | |
|---|---|---|---|
| ఋష్టిః | ఇట్ఠి | ఈటె | [ప.వీ. 109] |

6. ఉ-<అ- : సమీప మాతృకయందలి పదాది అకారము తెలుగున ఉకారముగా నిలుచును.

| | | | |
|---|---|---|---|
| అంగులీయక | అంగులీయ- | ఉంగరము | [హర 5-45] |

7. ఏ-<ఆ- : సమీప మాతృకయందలి ఆకారము తెలుగున ఏగా మాఱుట చాల విరళమగు ధ్వనిపరిణామము.

| | | | |
|---|---|---|---|
| రామా | లామా [మాగధీప్రాకృతము] | లేమ | [హర 1-25] |

8. ఏ-<ఎ- : ద్విరుక్తతకు పూర్వమందున్న హ్రస్వమగు ఎకారము తెలుగున ద్విరుక్తతను గోల్పోయి పదాది హ్రస్వము దీర్ఘమగుట.

| | | | |
|---|---|---|---|
| ఏకాన్త- | ఎక్కంత- | ఏకతము | [భీమ 4-33] |

9. ఒ-<అ- : సమీప మాతృకయందలి పదాది అకారము తెలుగున ఒకారముగా మాఱును. ఉభయోష్ఠ్య వ్యంజనములమీది అకారము ఓష్ఠ్య స్వరమగు ఒకారముగా మాఱుట శాస్త్రీయము.

| సంస్కృతము | ప్రాకృతము | తెలుగు | |
|---|---|---|---|
| ప్రస్తర- | పత్థర- | పొత్తరము | [శివ 2-56] |
| బర్బరః | బబ్బరో | బొబ్బర- | [భీమ 3-57] |
| బ్రహ్మన్ | బంభ | బొమ్మ | [కాశీ 1-45] |

10. రేఫాదియగు సమీప మాతృకకు పూర్వమొక అచ్చునిల్చుట. పదాది రేఫ మేర్పడని ప్రాచీనదశలో రేఫాది రూపములను ఇతర భాషలనుండి ఎరవు తెచ్చునెడల ఈ రేఫమునకు ముందొక యచ్చును వచ్చుట సంప్రదాయముగా నుండెడిది. ప్రాకృతభవములలో 'అరఁగు' సంస్కృతభవములలో 'అరదము'ను ఇట్టిమార్పునకు లోనయి యేర్పడినట్టివి.

| | | | |
|---|---|---|---|
| రంగ- | రంగ- | అరంగు[వేదిక] | [శృ.నై 3-106] |

11. పదాది 'స' లోపము :

| | | |
|---|---|---|
| సర్షపః | సరిసవ, సస్సవ, సాసవ- ఆవ- | [శృ.నై 7-118] |

ఈధ్వని పరిణామము సూత్రబద్ధమగుట కష్టము. ప్రాకృత 'సాసవ' రూపదశకును తెలుగు 'ఆవ'రూప దశకును నడుమనుండిన యంతరువులను వ్యక్తపరుచు రూపములు లభ్యమయినగాని దీని నిజస్వరూపము బోధపడదు.

12. పదాది హకారలోపము : సమీప మాతృకయందలి పదాది హకారము లోపించి అజాది రూపముగా తెలుగున నేర్పడుట

| | | | |
|---|---|---|---|
| హస్త- | హత్థ | అత్తెము(తొడుగు) | [క్రీడా 226] |
| హింగులి | హింగుల | ఇంగిలికము | [భీమ 2-29] |
| హిమ- | హిమ- | ఇవము | [కాశీ 1-137] |

### 3.3.1 2 అపదాది వర్ణములు : స్వరములు :

1. -ఇ-<-అ- : సమీప మాతృకయందలి ప్రథమేతర వర్ణముమీది అకారమునకు పరముగా తాలవ్యమగు యకారము ఉన్నప్పుడు స్వర సామరస్యము వలనను వైకృతములలో అట్టిఅకారము ఇకారముగా మారును.

| సంస్కృతము | ప్రాకృతము | తెలుగు | |
|---|---|---|---|
| కటకమ్ | కడయం- | కడియము | [ప.పీ 9] |
| వటకమ్ | వడయం | వడియము | [కాశీ 7-186] |
| వీటక- | వీడయం | వీడియము | [క్రీడా 287] |

2. -ఓ-<-ఓ- :

| | | | |
|---|---|---|---|
| ఆపోశన- | ఆపోషణ- | ఆపోసనము | [శృ.నై 5-68] |

ఇట్టి ప్రథమేతర దీర్ఘస్వర ఘటిత శబ్దప్రయోగములు శ్రీనాథుని ప్రౌఢ వాక్పాటవమునకు నిదర్శనములుగా స్వీకరించుట యుక్తము.

3. పదమధ్య అచ్చులలోని కొన్ని విశేష పరిణామములు :

(i) పదమధ్య ఇత్వము అత్వముగా మారిన రూపములు.

| | | | |
|---|---|---|---|
| శిథిల | సఢిలో | సడలు | [కాశీ 7-33] |

(ii) పదమధ్య ఉత్వము అత్వముగా మారిన రూపములు.

| | | | |
|---|---|---|---|
| అంగులీయక- | అంగులీయ- | ఉంగరము | [హర 5-45] |

(iii) పదమధ్య ఉత్వము ఇత్వముగా మారిన రూపములు.

| | | | |
|---|---|---|---|
| అందుకా | అందుయ | అందియ | [భీమ 5-31] |

(iv) పదమధ్య అత్వము ఉత్వముగా మారిన రూపములు.

| | | | |
|---|---|---|---|
| శణ- | సణ- | జనుము | [చా మం. 1-128] |

(v) పదమధ్య అత్వము ఎత్వముగా మారిన రూపములు.

| | | | |
|---|---|---|---|
| కంచులికా | కంచులిఆ | కంచెల | [శృ.నై 6-22] |

4. (i) ద్రావిడభాషలలో పదమధ్య దీర్ఘస్వరములు చాల అరుదు. ప్రాకృత భవములలో పదమధ్య దీర్ఘస్వరము తెలుగులో హ్రస్వమగుటకు కొన్ని ఉదాహరణలు. [వీనిని ప్రాచీన తద్భవములుగా చెప్పవచ్చును.]

| సంస్కృతము | ప్రాకృతము | తెలుగు | |
|---|---|---|---|
| అంగార- | ఇంగాల- | ఇంగలము | [కాశీ 3-154] |
| అమావాస్యా | అమావస్సా | అమవస | [కాశీ 3-197] |
| ఆకాశ- | ఆకాస- | ఆకసము | [శృ.నై 3-69] |
| కూర్పాస- | కుప్పాస- | కుప్పసము | [శృ.నై 6-50] |

(ii) పదమధ్య దీర్ఘస్వరములైన ఊ, ఓలు కూడ తెలుగున హ్రస్వ అకారముగా మారును.

| | | | |
|---|---|---|---|
| అనుకూల- | అనుగూల- | అనుగలము | [కాశీ 6-60] |
| ఆందోల- | ఆందోల- | అందలము | [ప.పీ 64] |
| సంతోష- | సంతోస- | సంతసము | [శృ.నై 4-113] |

(iii) పై ధ్వని పరిణామరీతికి విపరీతముగ, అపదాది దీర్ఘస్వరములు నిలిచి పోయిన క్రింది రూపములను అర్వాచీన తద్భవములుగా పరిగణింప వచ్చును

| | | | |
|---|---|---|---|
| భండాగార- | భండార,భండాఆర- | బండారము | [ప.పీ 20] |
| శృంగార- | సింగార- | సింగారము | [క్రీడా 65] |

3.3.1.3 పదాది వర్ణములు : వ్యంజనములు

1. సమీప మాతృకయందలి నాదవత్ స్పర్శములు తెలుగున శ్వాసవత్స్పర్శము లగుట ప్రాచీన తద్భవముల లక్షణము.

| | | | |
|---|---|---|---|
| గోష్ఠః | గొట్ఠ- | కొట్టము-గోశాల | [ప.పీ 44] |
| దోరః | దోరో | తోరము - వ్రతసూత్రము | [క్రీడా 42] |

2. క-<ఘ- : ఈసూత్రమున కుదాహృతమగు పదము వైకృతమగుట వివాద గ్రస్తము. ఇది దేశ్యమును కావచ్చునని బరో మొదలగువారి యభిప్రాయము.[2]

| | | | |
|---|---|---|---|
| ఘాసః | ఘాస- | కసవు | [కాశీ 7-208] |

2. Dravidian Etymological Dictionary : P. 916.

3. గ-<క- : సమీప మాతృకయందలి పదాది నాదవత్స్పర్శ ఘటిత రూపములను సయితము శ్వాసవత్ స్పర్శ ఘటిత రూపములుగా ఎరవు తెచ్చికొనుట తెలుగున ప్రాచీన భాషాలక్షణము. పదాది నాదవత్ స్పర్శ ఘటిత రూపములను మార్పులేకుండ యథాతథముగా గ్రహించుట ద్రావిడ భాషా వికాసములోని రెండవదశ. శ్వాసవత్ స్పర్శ ఘటితరూపములను నాదవత్ స్పర్శ ఘటిత రూపములుగా స్వీకరించుట మూడవదశ.

| సంస్కృతము | ప్రాకృతము | తెలుగు | |
|---|---|---|---|
| కంథా | కంథా | గంత | [హర 2-193] |
| కర్ణికార- | కణ్ణిఆర- | గన్నేరు | [శృ.నై 8-103] |
| కరకః | కరగ- | గరగ : జలపాత్ర | [హర 2-123] |
| కూశ్మాండ- | కుమ్హండ- | గుమ్మడి | [హర 2-99] |
| కుబ్జక- | కుజ్జగ- | గొజ్జగ | [భీమ 5-115] |

4. గ-<ఖ- : ఈధ్వని పరిణామము చాల అరుదు. పరిమిత పదములందు మాత్ర మిది ప్రవర్తితము.

| | | | |
|---|---|---|---|
| ఖని | ఖణి | గని | [శృ.నై 4-30] |

5. ప్రాచీన ద్రావిడభాషలో సకారములేదని విజ్ఞుల మతము.[3] ప్రాచీన దశలో స్పృష్టోష్మ శ్వాసవత్ స్పర్శముగానుండి అనంతర కాలమున దంతమూలీయోష్మముగా పరిణతినందిన సకార ఘటితరూపములు దేశ్యములు. ఆర్యభాషలనుండి ఎరవుతెచ్చిన పదములలోని సకార ఘటిత రూపములు కొన్ని. ద్రావిడభాషలలో సకారములేని ప్రాచీనదశలో సకార ఘటిత రూపములను ఆర్యభాషలనుండి ఎరవు తెచ్చునపుడు ఉచ్చారణలో సకారమునకు సమీపమగు చకారము సకార స్థానములో ఉచ్చరితమయి యుండుట సాధారణము. ప్రాచీన తద్భవములలో సకారము కనిపింపదు. దానిస్థానమున చకారము కనిపించును.

(i) సమీప మాతృకలోని పదాది సకారము తెలుగులో చకారముగా మారిన రూపములు.

---

3. B. Krishna murthi ; Telugu Verbal Bases : P. 20-23.

| సంస్కృతము | ప్రాకృతము | తెలుగు | |
|---|---|---|---|
| శష్కులీ | సక్కులీ | చక్కిలము | [భీమ 6-58] |
| శర్కరా | సక్కరా, సక్ఖరా | చక్కెర | [భీమ 1-61] |
| శ్యామా | సామా | చామ | [శృ.నై 2-113] |
| శుక్రః | సుక్క | చుక్క | [శృ. నై 6-22] |
| సిందూరమ్ | సిందూరం | చెందిరము | [భీమ 5-123] |

(ii) అనునాసికమునకు పరముగా కూడ ఈధ్వని పరిణామము ప్రవర్తిత మయినది.

| | | | |
|---|---|---|---|
| హంసః | హంసో | అంచ | [శృ.నై 1-102] |
| అంశుక- | అంసుయ- | అంచు | [శృ.నై 7-153] |
| కాంస్యమ్ | కంసం | కంచము | [హర 6-128] |
| కాంస్యః | కంసో | కంచు | [శృ.నై 1-103] |

(iii) ద్విరుక్తలో సకారము చకారముగా మారినది. ప్రాచీన దశాలక్షణ మును తెలుపుధ్వని పరిణామమిది.

| | | | |
|---|---|---|---|
| నిశ్రేణిః | నిస్సేణి | నిచ్చెన | [వ.పీ 30] |
| వైశ్యః | వెస్సో- | బచ్చు | [శృ.నై 8-159] |

(iv) ప్రాచీన ద్రావిడభాషా నిసర్గ నిర్మాణరీతికి విజాతీయమగు లక్షణమును ప్రదర్శించునవి ఈ సకార ద్విత్వ ఘటిత రూపములు. ద్విరుక్తయందు నేటికిని శిష్ట వ్యవహారమునందు చకారమే వ్యవహృతము సమీప మాతృకయందు సకార ద్విత్వమున్నను దానిని చకార ద్విత్వముగ మార్చి వైకృతముగా రూపొందించుట ప్రాచీన భాషాస్థితికి ముఖ్యలక్షణము. కాని సకార ప్రభావము గాఢమయిన శ్రీనాథునిదశలో సకారద్విత్వ ఘటిత రూపములును యథాతథముగా వైకృతములయినవి.

| | | | |
|---|---|---|---|
| దిశా | దిస్స- | దిస్స(మొల) | [కాశీ 2-38] |
| లేశ్యా | లెస్సా | లెస్స | [శృ.నై 4-85] |

ఇవికాక విస్సన [చా.మం. 1-138] విస్స-విశ్వవంటి వ్యక్తివాచకములు, బుస్సుమను [హర 4-27] ధ్వన్యనుకరణములును కలవు.

v) సకారాదులు చకారాదులుగ మారి నాదతను పొందినరూపములు కొన్ని కనిపించుచున్నవి. వీని చకారాదిరూపములు గ్రంధస్థము కాలేదు సమీప మాతృకయందలి పదాది సకారము వైకృతములందు జకారమగును

| సంస్కృతము | ప్రాకృతము | తెలుగు | |
|---|---|---|---|
| శమీ | సమీ | జమ్మి | [శా] |

6. సమీప మాతృకయందలి శ్వాసవత్ స్పర్శములు నాదవత్ స్పర్శములుగా మారుట అర్వాచీనకాల లక్షణము

| | | | |
|---|---|---|---|
| చక్రవాకీ | చక్రవాఈ | జక్కవ | [భీమ 1-118] |
| చక్రిన్ | చక్రి | జక్కి: తిరుగలి | [కాశీ 2-75] |
| తూణమ్ | తోణ ;తూణ | దొన | [శృ నై 8-185] |
| షంక్తిః | పంతి | బంతి | [హర 2-130] |
| పార్శ్వస్థ | పాసట్ఠ | బాసట | [కాశీ 7-133] |
| పూరికా | పూరిఆ | బూరియ | [శృ నై 6-124] |

7. ర <ర : రకారాది రూపములన్నియు ప్రాకృతసమములు తెలుగున రకార ఘటితరూపములు అన్యదేశ్యములని తెలుగు లాక్షణికుల తీర్పు

| | | | |
|---|---|---|---|
| స్థావ | రావ | రావు | [శృ.నై 6-108] |

8. సమీప మాతృకలోని మహాప్రాణ వర్ణములు అల్పప్రాణములుగా మారును.

(i) పదాది పరిణామమునకు :

| | | | |
|---|---|---|---|
| భారః | భారో | బరువు | [హర 7-83] |
| స్థాలీ | ధాలీ:పాకపాత్రము దాలి | | [శృ నై 2-118] |

(ii) అజ్మధ్యములోని పరిణామమునకు :

| | | | |
|---|---|---|---|
| పృథివి | పుఢవీ | పుడమి | [హర 2-21] |
| సౌభాగ్య | సోభగ్గ | సొబగు | [శృ.నై 8-61] |

(iii) ద్విరుక్త స్థితికి :

| సంస్కృతము | ప్రాకృతము | తెలుగు | |
|---|---|---|---|
| అప్సరా | అచ్ఛరా | అచ్చర | [హర 2-138] |
| లక్ష్మి | లచ్ఛీ | లచ్చి | [భీమ 4-127] |
| ఉపాధ్యాయ- | ఉవజ్ఝాయ- | ఒజ్జ | [శృ నై 4-129] |

(iv) అనునాసిక వర్ణములకు పరముగా వచ్చిన మహాప్రాణములు తెలుగున అల్పప్రాణములుగా మారుటకు నిదర్శనములు.

| | | | |
|---|---|---|---|
| శంఖ- | సంఖో | సంకు- | [క్రీడా 224] |
| సంధ్యా | సంఝా | సంజ | [భీమ 2-29] |

9. i) న-<ణ- : మూర్ధన్యానునాసికమగు ణకారము పదాదియందు లేదు. ప్రాచీన ద్రావిడమునందలి అపదాది ణకారము సయితము నకారముగా మాఱుట కలదు. సమీప మాతృకలలోని ణకారము వైకృతములందు నకారముగా మాఱుట సుసంగతము.

| | | | |
|---|---|---|---|
| న్యాయ- | ణాయ- | నాయము | [శృ.నై 4-59] |
| నారాచ- | ణారాచ- | నారసము | [హర 7-54] |
| స్నిగ్ధ- | ణిద్ధ | నిద్దము | [కాశీ 1-39] |
| నిర్భరమ్ | నిబ్భరమ్ | నిబ్బరము | [శృ.నై 2-107] |
| నియమః | ణిఅమ | నేమము | [శృ.నై 1-90] |

ii) సమీప మాతృకలోని అపదాది ణకారము తెలుగులో నకారముతో వర్ణ సంయోగము (Phonemic merger) పొందిన రూపములకు కొన్ని ఉదాహరణలు.

| | | | |
|---|---|---|---|
| ఆజ్ఞప్తిః | ఆణత్తి | ఆనతి | [హర 2-65] |
| భోజనమ్ | భోఅణం, భోయణం | బోనము | [హర పీ. 14] |
| మాణిక్య- | మాణిక్కం | మానికము | [శృ.నై 6-122] |

iii) ద్విరుక్త ణకారము కూడ తెలుగులో ద్విరుక్త నకారముగా మారును.

| సంస్కృతము | ప్రాకృతము | తెలుగు | |
|---|---|---|---|
| యజ్ఞః | జణ్ణో | జన్నము | [హర 1-1] |
| పూర్ణిమా | పుణ్ణిమా | పున్నమ | [శృ.నై 1-50] |
| వర్ణికా | వణ్ణిఆ,వణ్ణియా | వన్నియ | [శృ నై 8-203] |

iv) హకారము ద్వితీయ వర్ణముగా ఏర్పడిన సంయుక్తతలోని ణకారము తెలుగులో ద్విరుక్త నకారముగా పరిణమించినది.

| | | | |
|---|---|---|---|
| విష్ణుః | విణ్హు- | వెన్నుఁడు | [భీమ 2-39] |
| శ్లక్ష్ణ- | సణ్హ- | సన్నము | [హర 3-69] |

v) -ణ-<-ణ : 'ణ', 'న'గా మారక నిలిచినవి ఈ క్రింది ఉదాహరణములు.

| | | | |
|---|---|---|---|
| జ్ఞాన- | ణాణ- | జాణ | [భీమ 5-128] |
| రాజ్ఞీ | రాణీ | రాణి | [కాశీ 3-90] |
| విజ్ఞానమ్ | విణ్ణాణం | విన్నాణము | [క్రీడా 291] |

10 సమీప మాతృకలోని జకారము తెలుగులో అరుదుగా దకారముగ మారును.

పదాది ధ్వనిపరిణామమునకు :

| | | | |
|---|---|---|---|
| యమల- | జమల | దంట(<జంట) | [ప వీ 111] |

11. ప-<భ- : అరుదైన ధ్వని పరిణామమిది క.త మ పడ : యుద్ధము. తె పడవ . యుద్ధము. ఇట్లు పడవాలును దేశ్యముగా నిరూపింపనగునేమో ?

| | | |
|---|---|---|
| భటపాలః | భడవాలో | పడవాలు |

[అల్పసేనకు అధిపతి] [శృ.నై 7-3]

12. బ-<మ- : బకారాది దేశ్యక్రియలు ప్రాచీన ద్రావిడమునందలి మకారాది రూపములనుండి ఏర్పడినవని శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తిగారి నిర్ణయము [4] కొన్నియెడల సంస్కృత మకారాది శబ్దములందు నీమార్పు

4 Bh. Krishna murti : Telugu Verbal Bases. P.28, 449,450.

కనిపించుచున్నది కావున వైకృతములందలి ఈమార్పు దేశీయ ధ్వనిపరిణామ సూత్రముల కనుగుణమని నిశ్చయించుట యుక్తము

| సంస్కృతము | ప్రాకృతము | తెలుగు | |
|---|---|---|---|
| మహానస- | మహాణస | బానస (ము) | [ప.వీ 44] |

13. బ-<వ- : ఈధ్వని పరిణామము తెలుగున కన్నడ ప్రభావమువలనను, ప్రత్యేకముగను ఏర్పడి యుండవచ్చునని పరిశీలకుల అభిప్రాయము.[5]

| | | | |
|---|---|---|---|
| వైశ్య- | వెస్స- | బచ్చు | [శృ నై 8-159] |
| వాపీ | వాపీ | బావి | [ప.వీ. 54] |

14. ర-<ర- : రేఫము దంతమూలీయము కావున ద్రావిడభాషలలో ప్రాచీన దశలో పదాది యందుండదు.[6] కాని అర్వాచీన దశలో రేఫాదిపదములు మార్పులేకుండ వైకృతములుగా స్వీకృతములు.

| | | | |
|---|---|---|---|
| రాజ- | రాచ- | రాచ | [శృ.నై 1-32] |
| రాజ్ఞీ | రాణీ | రాణి | [కాశీ 3-90] |
| ఋక్ష- | రిక్ఖ | రిక్క- | [శృ నై 8-161] |
| రిక్త- | రిత్త | రిత్త | [భీమ 1-33] |

15. ల-<వర్ణప్లుతి :

| | | | |
|---|---|---|---|
| అలక్తక- | అలత్తక- | లత్తుక | [శివ 2-71] |

16. వ-<బ- : ఈధ్వని పరిణామము ద్రావిడభాషా వికాసమున అంగీకృతము.[7] కాని ఉదాహృతరూపము సహజముగా సిద్ధించిన సిద్ధరూపమువలె కాక కృతకముగా కల్పించిన సాధ్యరూపమేమోయని సందేహము.

| | | | |
|---|---|---|---|
| బీభత్సః | బీభచ్ఛో | విచ్చుండు | [హర 7-41] |

---

5 పైదే - పుట 27

6 Caldwell : A Comparative Grammar of the Dravidian : P 143,144

7. Caldwell : C G.D., P 161 also T.V.B., P.20

17. స-<చ- : తాలవ్య స్పృష్టోష్మ మగు చకారము దంతమూలీయోష్మ సకారముగా పరిణమించుట కర్ణాటాంధ్రభాషలకు పరిమితమయిన విశిష్ట మాండలిక పరిణామము సమీప మాతృకలోవలె తెలుగునందును చకారముండగా దానిస్థానమున సకారము పల్కుట ఇచటివిశేషము. చకారము పరుషవర్ణము. సకారము ఊష్మవర్ణము. పరుషము ఊష్మముగా మాఱుట సహజము.

| సంస్కృతము | ప్రాకృతము | తెలుగు | |
|---|---|---|---|
| చర్మకార- | చమ్మార- | సంబరి | [భీమ 3-57] |
| చూడా | చూడగ- | సూడిగము | [కాశీ 5-148] |

3.3.1.4 అపదాది వ్యంజనములు [అజ్మధ్యములు]

1. -త-<-త- : అజ్మధ్యముగా 'త'నిలుచుట ప్రాకృతమున విపరీతము కావున ఈధ్వని పరిణామము చాల అరుదు

| | | | |
|---|---|---|---|
| ఆమంత్రణ | ఆమంతణ | ఆపెత | [శివ 2-65] |
| కృత | కత- | కతము | [కాశీ 2-163] |

2. -బ-<-ప- : ఈ పరిణామమునకు లక్ష్యమొక్కటే చిక్కినది కావున పరిణామ ప్రక్రియ చింత్యము

| | | | |
|---|---|---|---|
| కూర్పాస- | కుప్పాస- | కుబుసము | [భీమ 5-71] |
| | <తె కుపసము, కుప్పసము | | |

3. -వ-<-మ- : సమీప మాతృకలోని అజ్మధ్య మకారము తెలుగులో వకారముగ కనిపించుచున్నది. [ద్రావిడభాషలలో వ, మలు పరస్పరము వినిమయ వర్ణములు.

| | | | |
|---|---|---|---|
| హిమ- | హిమ- | ఇవము | [కాశీ 1-137] |

3.3.1.5 అపదాది వ్యంజనములు : అనునాసిక యుక్తస్పర్శములు [<

ఈ విభాగమునందు అనునాసికములకు పరముగానుండు స్పర్శవర్ణముల ధ్వని పరిణామవిధానము వివరింపబడుచున్నది.

1. -ంక-<-ంక :

| సంస్కృతము | ప్రాకృతము | తెలుగు | |
|---|---|---|---|
| వక్ర | వంకర- | వంకర | [భీమ 4-77] |
| శుల్క- | సుంక- | సుంకము | [శృ.నై 5-103] |

2 -ంగ-<-ంగ- :

| | | | |
|---|---|---|---|
| అంగార- | ఇంగాల- | ఇంగలము | [కాశీ 3-154] |
| హింగు | హింగు | ఇంగువ | [హర 2-120] |

3. -ంట-<- బిందుపూర్వక టకారము :

| | | | |
|---|---|---|---|
| ఘంటా- | ఘంటా | గంట | [కాశీ 5-307] |

4. -ండ-<- బిందుపూర్వక డకారము :

| | | | |
|---|---|---|---|
| మండక- | మండక- | మండెగ | [భీమ 2-142] |

5. -ంత-<- బిందుపూర్వక తకారము :

| | | | |
|---|---|---|---|
| పంక్తిః | పంతి | బంతి | [శృ నై. 8-198] |
| మంత్రణ- | మంతణం | మంతనము | [శృ నై 7-137] |

6. -ంద-<- బిందుపూర్వక దకారము :

| | | | |
|---|---|---|---|
| అందుక | అందుయ- | అందియ | [కాశీ 4-145] |
| సందేహ- | సందేహ- | సందియము | [శృ నై 3-163] |

7. -ంప-<- బిందుపూర్వక పకారము :

| | | | |
|---|---|---|---|
| చంపక- | చంపగ- | సంపెంగ | [శృ.నై 5-92] |
| ఝంపా | ఝంపా | జంపె | [కాశీ 4-298] |

8. -ంబ-<- బిందుపూర్వక పకారము :

| సంస్కృతము | ప్రాకృతము | తెలుగు | |
|---|---|---|---|
| సంపుట- | సంపుడ- | సంబెల | [శివ 2-56] |

కాని 'సంపుడ'లోని ద్వితీయస్వరమగు 'ఉ'- సంబెలలోని ద్వితీయ స్వరమగు 'ఎ'గా మాఱుట విలక్షణమయిన పద్ధతి. సమీపమాతృక సరియయినది కాదేమో అని శంక.

9. -ంబ-<- బిందుపూర్వక బకారము :

| | | | |
|---|---|---|---|
| శంబలమ్ | సంబలం | సంబడము | [కాశీ 4-61] |

3.3.1.6 అపదాది వ్యంజనములు : ద్విరుక్తములు

1. -చ్చ-<-చ్ఛ- :

| | | | |
|---|---|---|---|
| అప్సరా | అచ్ఛరా | అచ్చర | [హర 2-138] |
| ఇచ్ఛా | ఇచ్ఛా | ఇచ్ఛ | [శృ.నై 3-132] |

2. -జ్జ-<-జ్ఝ- :

| | | | |
|---|---|---|---|
| ఉపాధ్యాయ | ఉవజ్ఝా, ఒజ్ఝా | ఒజ్జ | [శృ.నై 4-129] |
| వేధ్య- | వేజ్ఝ- | బెజ్జము | [కాశీ 5-104] |

3. -ట్ట-<-ట్ఠ- :

| | | | |
|---|---|---|---|
| కాష్ఠికా | కట్ఠిఅ | కట్టియ | [భీమ 1-118] |
| శ్రేష్ఠి, | సెట్ఠీ | సెట్టి | [హర.పీ. 2] |

4. -త్త-<-త్థ- :

| | | | |
|---|---|---|---|
| అస్తమిత- | అత్థమించు- | అత్త(మిల్లు) | [హర 5-40] |
| ప్రస్తర- | పొత్థరం | పొత్తరము | [శివ 2-56] |

5. -ద్ద-<-ద్ధ- :

| | | | |
|---|---|---|---|
| స్నిగ్ధ- | ణిద్ధ- | నిద్దము | [కాశీ 1-39] |
| ముగ్ధా | ముద్ధా | ముద్ద(రాలు) | [భీమ 1-4] |

6. -న్న-<-ణ్ణ- :

| సంస్కృతము | ప్రాకృతము | తెలుగు | |
|---|---|---|---|
| పూర్ణిమా | పుణ్ణిమా | పున్నమ | [క్రీడా 204] |
| వర్ణికా | వణ్ణిఆ | వన్నియ | [శృ నై 8-203] |
| సంజ్ఞా | సణ్ణా | సన్న | [హర 2-121] |

7. -ప్ప-<-ప్ఫ- :

| | | | |
|---|---|---|---|
| ఆస్ఫాల- | అప్ఫాల- | అప్పళించు | [శివ 1.51] |

8. -బ్బ-<-బ్భ- :

| | | | |
|---|---|---|---|
| దర్భ- | దబ్భ | దబ్బ | [హర 7-12] |
| నిర్భర- | నిబ్భర- | నిబ్బరము | [శృ.నై 2-107] |

9. -మ్మ-<- బిందుపూర్వక భకారము

| | | | |
|---|---|---|---|
| కూష్మాండః | కుంభండ- | గుమ్మడి | [హర 2-99] |
| బ్రహ్మన్ | బంభ- | బొమ్మ | [క్రీడా 42] |

10. -ళ్లి-<-ల-

| | | | |
|---|---|---|---|
| చూలక- | చోలియం | చొళ్లియము | [భీమ 5-112] |

11. -వ్వ-<-వ- : సమీప మాతృక యందలి రెండవయక్షరము వకారమై దానికి పూర్వము దీర్ఘస్వరమున్నచో వకారము ద్విరుక్తమగును.

| | | | |
|---|---|---|---|
| ధావ- | ధావ- | దవ్వు | [భీమ 2-64] |

12. బిందులోపము : సమీప మాతృక బిందు ఘటితమయి యుండగా వైకృతము నిర్బిందుక మగుట.

| | | | |
|---|---|---|---|
| ఆమంత్రణ- | ఆమంతణ- | ఆమెత | [శివ 2-65] |
| ఏకాంత | ఎక్కంత- | ఏకతము | [శృ.నై 4-91] |

**13.** బింద్వాగమము (i) : నిర్బిందుకమగు సమీప మాతృక వైకృత మున సబిందుక మగుట.

పూగ- పూగ- పోఁక [భీమ 1-96]

**14.** బింద్వాగమము (ii) : సమీప మాతృకయందలి గకారాంతములగు కొన్నిపదములలో గకారమునకుముందు బిందువు ఆగమముగా వచ్చును.

మండక- మండగ- మండెంగ [శృ నై 6-134]

## 3.3.2 సంస్కృతభవముల ధ్వని పరిణామము

వీనిలో చాలభాగము సహజ రీతులలోకంటె కృతక మార్గములలో నెక్కుడుగా నేర్పడినట్లు స్పష్టపడుచున్నది.

1. విప్రకర్ష లేక స్వరభక్తి (Anaptyxis) వలన నేర్పడిన రూపములు.

| తెలుగు | | సంస్కృతము |
|---|---|---|
| కసుమాలము | [కాశీ 7-208] | కశ్మల |
| జాతర | [శివ 4-8] | యాత్రా |
| చందురుఁడు | [శృ.నై 8-133] | చంద్రః |
| రాతిరి | [చా మం 1-132] | రాత్రి |

2. పదాది యకారలోపము : సంస్కృత భవములలోని ఒక విశిష్ట లక్షణము. తెలుగున సంస్కృత భవములలో పదాది యకారము లోపించిన రూపములు చాల స్వల్పము.

ఉవిద [శృ నై 3-124] యువతీ

### 3.3.2.1 పదాదివర్ణములు : స్వరములు

1. అ-> రేఫమునకు ముందుచేరెడి 'అ'- ప్రాచీన ద్రావిడభాషలో రేఫాది రూపము లుండవనియు, రేఫాది రూపములను తక్కిన భాషలనుండి ఎరవు తెచ్చునపుడు రేఫమునకు ముందొక అచ్చుచేరుట సర్వసాధారణము,

| తెలుగు | | సంస్కృతము |
|---|---|---|
| అరదము | [శృ.నై 6-88] | రథ- |

2. పదాది హకారలోపము :

| | | |
|---|---|---|
| ఇంగిలీకము | [భీమ 2-29] | హింగులి |

3. ఎ-<ఇ- :

| | | |
|---|---|---|
| వెనకయ్య | [కాశీ 4-206] | వినాయకః |

4. ఐ-<అవి- :

| | | |
|---|---|---|
| ఐదువ | [కాశీ 7-161] | అవిధవా |

5. ఒ-<ఉ- :

| | | |
|---|---|---|
| దొండ | [కాశీ 3-23] | తుండీ |
| మొకము | [హర 4-27] | ముఖ- |

7. అపదాది దీర్ఘస్వరము హ్రస్వమైన రూపములు :

| తెలుగు | | సంస్కృతము |
|---|---|---|
| కస్తురి | [శృ నై 7-11] | కస్తూరీ |
| వెనకయ్య | [కాశీ 4-206] | వినాయకః |

3.3.2.2 పదాదివర్ణములు : వ్యంజనములు

1. జ-<య- : ప్రాకృతములలో ప్రసిద్ధమగు ధ్వనిపరిణామ మిది. తెలుగున య-జగా పరిణమించుట దుశ్శకమగు ధ్వనిపరిణామము అయినను వీనిని ప్రాకృత భవము లనుటకు కొన్నిచిక్కులున్నవి. అందువలన సంస్కృత భవములుగానే పరిగణితములు.

| తెలుగు | | సంస్కృతము | ప్రాకృతము |
|---|---|---|---|
| జతనము | [కాశీ 5-61] | యతన- | జయణ |
| జంత్రము | [హర 1-22] | యంత్ర- | జంత- |

| తెలుగు | | సంస్కృతము | ప్రాకృతము |
|---|---|---|---|
| జాతర | [శివ 4-8] | యాత్రా | జత్తా |
| జోదు | [శృ.నై. 3-34] | యోధః | జోహ |

2. ప- < ప్ర- : సంస్కృత భవములలో పదాది రేఫఘటిత సంయుక్తము నందలి రేఫము లోపించుట విభాష.

పయనము [హర 2-27] ప్రయాణమ్

3. మహాప్రాణములు అల్పప్రాణములైన రూపములు కొన్ని :

| | | | |
|---|---|---|---|
| గడియారము | [హర 7-135] | ఘటికారమ్ | — |
| దట్టి | [కాశీ 4-197] | ధట్టీ | — |
| దూపము | [భీమ 2-45] | ధూప- | ధూప- |
| బొజుంగు | [ప.వీ 40] | భుజంగః | భుయంగో |

3.3.2.3 అపదాది వర్ణములు : వ్యంజనములు

1. -క-<-త- :

ఆకతాయి [హర 5-10] ఆతతాయిన్ —

ఇచ్చట అజ్మధ్యమగు తకారము కకారముగా పరిణమించిన దనుటకంటె 'ఆకతాయి'లోని కవర్ణము విభేదనమువలన సిద్ధించినదనుట యుక్తియుక్తము

3.3.2.4 అపదాదివర్ణములు : అనునాసిక యుక్తములు

1. -ంద్ర-<- సంయుక్తాక్షరమునకు స్వరభక్తియు తత్పూర్వాక్షరమున స్వరలోపమును :

సందరము [హర 6-82] సముద్రః

2. బింద్వాగమము :

బంటు [కాశీ 5-65] భట-

3. కేవలము పదములేకాక సంస్కృతములో ప్రసిద్ధముగా వాడుకలోనున్న కొన్ని ప్రత్యయములుకూడ తెలుగులోనికి వచ్చుట ఒకవిశిష్ట పరిణామము.

## 3.4.0 అన్యదేశ్యములు (Loan words)

తెలుగుభాషను చారిత్రకముగా పరిశీలించిన ప్రాచీన దశలో తత్సమ తద్భవ పదజాలము ఎక్కువగా చేరినటులు చెప్పవచ్చును. తిక్కనలో అక్కడక్కడ కన్పించినను శ్రీనాథుని కాలమునుండి అన్యదేశ పదజాలము మన కావ్యములలో ఎక్కువగా వాడుకలోనికి వచ్చినది అన్యదేశ ప్రయుక్తియందు శ్రీనాథుడు ప్రథముడు కాకపోయినను ప్రముఖుడు. మూలభాషనుండి సంక్రమించినవి దేశ్యములు. తదితరములు అన్యదేశ్యములు. మహమ్మదీయుల వరిపాలనాకాలములో అరబ్బీ, పారశీక భాషాపదములు తెలుగువారి రాజకీయ, సాంఘిక రంగములలో వ్యవహారము లోనికి వచ్చినవి.

పదుమూడవ శతాబ్దమువరకును జనసామాన్యమునకు అరబ్బీ, పారశీక శబ్దములతో నంతగా పరిచయము కలుగలేదనియే చెప్పవచ్చును. మహమ్మదీయులు అల్లాయుద్దీన్ దండయాత్రతో పదుమూడవ శతాబ్దాంతమున దక్షిణ హిందూదేశమున చొరబడిరి. నాటనుండియు వారి శబ్దజాలము కొలదికొలదిగ తెనుగున ప్రవేశింప మొదలిడినది. ఆ మహమ్మదీయ పాలకులతో మంచిసంబంధము కలిగియుండుటకు కనీసము కొందరు ముఖ్యోద్యోగులు వారి రాజభాషఅయిన పర్షియను నేర్చుకొనవలసి వచ్చినది వీరభద్రారెడ్డి మంత్రిఅయిన బెండపూడి అన్నయామాత్యులు (క్రీ.శ. 1420) పర్షియను, అరబ్బీ, టర్కీభాషలను నేర్చుకొనినాడని శ్రీనాథుడు భీమఖండములో చెప్పెను. [భీమ 1-73]

"పారసీకాద్యన్యదేశ భాషలనుండి ప్రత్యక్షముగా గాని పరోక్షముగా మరాఠీ భాషా ముఖమునగాని తెలుగున జేరినపదములును, మరాఠీభాషకు నిసర్గములయి సంసర్గ వశమున తెలుగున ప్రవేశించిన పదములును అన్యదేశ్యములని యీ వ్యాసమున పరిమితార్థమున ప్రయుక్తము శ్రీనాథ కాలమునాటికి ఉర్దూ అలు చూలు లేని సోమలింగము. మరాఠ్వాడా - తెలుగునాడులకు గల సంబంధబాంధవములు ఇక్ష్వాకుల తాతముత్తాతల నాటివి తెలుగు-మరాఠీలు భౌగోళికముగా పరిసర భాషలు. శాతవాహన చక్రవర్తులనాడు ఇంచుమించు నాలుగువందల సంవత్సరములపాటు

మరర్వాడా, తెలుగునాడులు ఒక గొడుగుక్రింద కలిసిమెలిసి యుండిన విషయము జగమెరిగినచరిత్ర"[1] తొలినాళ్ళలోని ఆదాన ప్రదానములకు మహారాష్ట్రి ప్రాకృతము ప్రముఖపాత్ర వహించినట్లు చరిత్ర. అనాదియును, అవిచ్ఛిన్నమును అయిన ఇట్టి సమీప సంసర్గ సంబంధమువలన ఈరెండు ప్రాంతములలోని వ్యవహారభాషలు పరస్పరము ప్రభావితమై యుండుట నిర్వివాద విషయము ఈసంసర్గము కారణముగా తెలుగు పదములెన్నో మరాఠీనోళ్ళలో నలుగుడుపడి వ్యావహారిక రూపములుగా కోశముల కెక్కియు పండితసమ్మతిని బడసి సాహిత్యస్థాయిని సంపాదించియు అక్షర రూపమున చిరస్థాయి పొందినవి.

3.4.1 ఈదిగువ సూచించినవి శ్రీనాథప్రయుక్త అన్యదేశ్యములు. పద పట్టికలోని ప్రధానారోపములు69. వీని రూపాంతరములు 7. మొత్తము ఆరోపములు 76. కుండలీకరణమునందు వాని రూపాంతరములను కూడ సూచించుటయైనది[2]

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | అపరంజి | 2. | అరబీ | 3. | అసలు |
| 4 | ఆసివారు | 5 | కత్తలాని[3] | | [ఖత్తులాణము] |
| 6. | కప్పలి | 7. | కమరు | 8 | కాకితము[4] |
| 9 | కిచ్చడి | 10 | కుందనము | 11 | కుల్లా[5] |

---

1. టి దొణప్ప : భాషా చారిత్రక వ్యాసావళి, పుట 147
2 పై దే-పుట 171.
3. పూర్వ ముద్రణ పాఠములను తాళపత్రప్రతుల పాఠములన బరిశీలింపగా కత్తులాణ, కర్తలాణ, కత్తలాని, కత్తులాని అను పాఠాంతరములు ముద్రిత గ్రంథములను, ఖత్తులాణి, ఖత్తులాణ అను పాఠాంతరములు తాళపత్ర ప్రతులయందును కలవు కత్తులాని ఖత్తులాణ ఘటితములే మూలపాఠములనియు, బ్రౌను దొరగారొసంగిన వ్యుత్పత్తి సుసంగతమనియు, కర్తలాణ శబ్దనిర్వహణకు శ్రీ ర కర్త కూర్చిన నైషధీయ పాఠము అగ్రాహ్యమనియు తాత్పర్యము
4 సంస్కృతమున 'కాఘజ్' పారసి మూలకముగా మోనియర్ విల్యమ్సునందు ప్రదర్శితము.
5 కుల్లాయి, కుళ్ళా(యయి)పదము ఆర్వాచీన సాహిత్యమున విరివిగా ప్రయుక్తము చూ. కుల్లా.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 12. | కోహళి[6] | 13. | ఖర్చు | 14. | ఖుసి |
| 15. | గంజాయి | 16. | గసగస | 17. | గాగరా |
| 18. | గులాము | 19. | గొంగడి | 20 | గోవ |
| 21. | చబుకు[7] | 22. | చామలా | 23. | చావడి |
| 24. | చికిలి | 25 | జబ్బు | 26. | జరి |
| 27. | జలపోసనము | 28 | జోఁగు | 29. | డమామి |
| 30. | డేరా | 31. | తరుణాసీరి | 32. | తవాయి |
| 33. | తాయెతు | 34. | తేజీ | 35. | త్రాసు[8] |
| 36. | తుర్కల | 37. | దుకాణము | 38. | పంజార |
| 39. | పంజా | 40. | పండువా | 41. | పరాకు |
| 42. | పారసి | 43. | పేషణి | 4 4. | బరాబరి |
| 45. | బాఁకు | 46. | బాజారు | 47 | బిబ్బి |
| 48. | బొందిలి | 49. | మసీదు | 50. | ముఖమల్లు |
| [ముఖమాలు] | | 51. | మైజారు | 52. | మోళము |
| 53. | రమణా | 54. | రావు | 55. | రోజు |
| 56. | లాహిరి | 57, | లుంగ | 58. | వలికా |
| 59. | వల్లి | 60. | సన్నాయి | 61. | సమ్మాను |
| 62. | సరిహద్దు | 63. | సహా | 64. | సురతాణి |

[సురతాణ, సురత్రాణ, సురధాణీ, సురధాణ, సురధాని[9]]

---

6. 'కులాహ్' అను పారసిపదము వర్ణవిపర్యయమున కుహ్లా > కొహ్లీ > కోహళి అయి యుండ వచ్చునేమో ?

7. చబుకు గ్రామ్యమని, పారసి జన్యమని-కాంబెల్-పుట 224

8. త్రాసు దేశ్యమని బ్రౌణ్యము-పుట 467.

9. ఈ రూపాంతరములన్నియు వాస్తవముగా నాఁటి వ్యవహారానుగుణములో లేక లేఖక ముద్రాపక కల్పితములో నిర్ధారించుట దుస్సాధము.

65. సొగటాలు 66. సేబాసు 67. హజారము
68. హద్దు 69. హొరుముంజి

3.4.2 ఈ క్రింద సూచించినవి అరబ్బీ పారశీకాద్యన్యసీమలలోని భాషలకు విసర్గములయి ప్రత్యక్షముగా పారసీనుండిగాని. పరోక్షముగా మరాఠీ భాషా ముఖమున గాని ఎరవుపదములుగా తెలుగునకు వచ్చినవి. ఏవి ప్రత్యక్షముగా వచ్చినవో, ఏవి పరోక్షముగా వచ్చినవో స్పష్టముగా తూఁచిచెప్పుటకు ఉపలబ్ధసామగ్రి చాలదు.

| | | |
|---|---|---|
| 1. అపరంజి | 2. అరబీ | 3. అసలు |
| 4. అసివారు | 5. కత్తిలాని | 6 కమరు |
| 7. కాకితము | 8. కుందనము | 9. కుల్లా |
| 10. ఖర్చు | 11. ఖుసి | 12. గసగస |
| 13. గులాము | 14. చబుకు | 15. చికిలి |
| 16. జబ్బా | 17. జరి | 18. జలపోసనము |
| 19. తాయెతు | 20. తేజీ | 21. త్రాసు |
| 22. దుకాణము | 23. పంజా | 24 పారసి |
| 25. పౌజు | 26. బరాబరి | 27. బాజారు |
| 28. బిబ్బీ | 20. మసీదు | 30. ముఖమల్లు |
| 31. మైజారు | 32. మోళము | 33. రోజు |
| 34. లాహిరి | 35. లుంగ | 36. సన్నాయి |
| 37. సరిహద్దు | 38. సహా | 39. సురతాణి |
| 40. సేబాసు | 41. హజారము | 42. హద్దు |
| 43. హొరుముంజి | | |

3.4.3 మరాఠీభాషకు నిసర్గములయి తెలుగున ఆదేయములగు అన్యదేశ్యము లివి.

| | | |
|---|---|---|
| 1. కిచ్చడి | 2. గంజాయి | 3. గాగరా |
| 4. గొంగడి | 5. గోవ | 6. ఢమామి |

7. డేరా 8. పరాకు 9. పేషణి
10. బాఁకు 11 బొందిలి 12 రావు
13. సొగటాలు

3.4 4 తక్కినవానికి సమీప మాతృక లివి :

1 కప్పలి 2. జోగులు [మలయా భాషలోనివి]

3. తరుణాసీరి 4. తవాయి 5 రమణా [బర్మాకు చెందినవి.]

6. సమ్మాను-[చీనీ భాషా జన్యము పరోక్షముగా మలయాభాషనుండి ఆదేయము]

7. వలికా 8. వల్లి 9. జలనోంగి 10 జాళవా 11. పంజార 12. పండువా- ఈ పదముల మూలము మృగ్యము

3.4.5 మరాఠీ, పారసీ, అరబీభాషలలో ప్రవర్తితములై తెలుగున ప్రవేశించి శ్రీనాథ ప్రయుక్తమైన అన్యదేశ్యములకు వ్యుత్పత్తి వివరణము లీయబడినవి.

1. అపరంజి : పుటముపెట్టిన బంగారము 'గురుతైన యవరంజి గొప్పముత్తెపు నత్తుమోవిపై' [క్రీ పీ 62] < పారసి : ఆఫ్రంజ్ = పడమటి సీమవారు పరంగులు; ఆఫ్రంజ = ఈజిప్టుదేశములోని ఒకపట్టణము ఆఫ్రంజీ = పాశ్చాత్యుడు; వారి రాకపోకలతో ఎక్కువగా వాడుకకెక్కిన ఒకదినుసు మేలిమిబంగారము అపరంజి < అరబ్బీ: ఆవ్రంజియ = విలాతి సీమకు సంబంధించిన [బ్రౌణ్యము, రివైజ్డ్, పు 1404]

2. అరబీ : అరబ్బీదేశపు భాష 'అరబీ తురుష్కభాష....' [భీమ 1.73] < పారసి, అరబ్ = కౌశల్యము, నేర్పు, ధార్మికత్వము, ప్రతిభ, అక్కఱ.

3. అసలు : మూలము, మొదలు.'అమ్మ నీయల్లుని నసలేనెరుంగ- [ప వీ 73] < మరాఠీ : అసల్, అస్సల్ = పురాతనము, మూలము; అసలీ = మౌలికము. అరబీ: అస్ల్ = మూలము; వాస్తవము.
పారసి: అస్ల్ = ప్రాచీనము, అస్లాఫ్ = పూర్వులు; పితృదేవతలు; ఇస్లాఫ్ = సంచకర మిచ్చుట.

4. అసివారు : వాహ్యాళి, సవారీమార్గము. 'ఎవ్వాఁడు నలువతేరెక్కి యష్టాదశ ద్వీపాళి యసివారు దిరిగె లీల' [కాశీ 4-194] 'అస్వార్' అను పారసిపదము దీనికి అసలు మాతృక <మరాఠీ. అసివార = రౌతు, అశ్వారోహకుడు.

5. కత్తలాని : ఖత్లానదేశపు గుఱ్ఱము A horse brought from khat-lan [(బ్రౌణ్యము.] 'అమర వల్లభుహరితో ల్లనుస మాడంజాలెడు - తెల్లని యొక కత్తలాని తేజీహయమున్' [శృ నై 6-96] < పారసి: ఖత్లాన్ = బదఖ్షాన్ దేశములోని 'ఖత్లాన్' అను మండలము ఇది పద్మరాగములకు ప్రసిద్ధి. ఖత్లానీ = ఖత్లాన దేశసంబంధి: ఖతలాన దేశపు మేలిజాతి గుఱ్ఱము. అరబీ. ఖత్ల్ = కుటిల ప్రచారము.

6. కమరు : ఒడ్డాణము, మొలనూలు. 'కటి మండలము మీఁద వజ్రాల కమరు గర్వంబుసూప' [కాశీ 3_240, 7-148 శివరా 2 3;2.26] <మరాఠీ: కమర, కంబర, కమ్మర = నడుము, కటిస్థలము కమ్మర్ బొంద్ = వడ్డాణము పారసి: కమర్ = నడుము, కమర్ బంద్ వడ్డాణము.

7. కాకితము : లేఖ, పత్రము. 'కాకితమందలి వర్ణ పద్ధతుల్' [భీమ 1-74] < మరాఠీ: కాగద్ = కాకితము, పేపరు. పారసి కాఘజ్, కాఘిజ్ = కాగితము, లేఖ, పత్రము సంస్కృతమున 'కాఘజ్' పారసి మూలకముగా మోనియర్ విల్యమ్సున ప్రదర్శితము

8. కిచ్చడి : నానా వస్తువులు చేర్చివండు చిత్రాన్న విశేషము [శ. ర; సూ.ని] 'చారులుఁ దియ్య కూరలుఁ బచ్చడులుం గిచ్చడులును' [కాశీ 7.185] < మరాఠీ: ఖిచడీ, ఖిచిడీ. పారసి: కిచ్రీ = పప్పు, బియ్యము, వెన్న-వీనితో తయారుచేయు భారతీయుల వంటకము.

9. కుందనము : మేలిమి బంగారు. 'కుందనపుఁ బైఁడి కంటకముబోలు ?' [శృ.నై 6-106] 'పదియారు వన్నెకుందనపుఁ దగడు' [భీమ 2-55] < మరాఠీ: కుందన. గుజరాతీ: కుందన్ = మేలిమిబంగారు. పారసి:

కుందన్ = పరిశుద్ధలోహము. కన్నడమునందలి 'కుందణ, కుందన' పదములు దేశ్యములని కిట్టెల్ కన్నడ నిఘంటువు పు 441

10. కుల్లా : పటరచిత మకుటము 'కుల్లావెట్టితిఁ గోకసుట్టితి....' [శ్రీనా• చాటువు] < పారసి: కులాహ్ = నల్లగొఱ్ఱెపిల్ల తోలుతో కూచిగా చేసి ముస్లిము సాధువులు, దర్వేషులు ధరించెడి టోపి కులాహ్ = రాజు, ప్రభువు.

11. కోహళి : శిరాచ్ఛాదనము. 'మౌళింగోహళి సంఘటించన క్రియన్ మధ్యాహ్నవేళన్' [హర 7-109] తొడుగు, గొంగెన అను నర్థముల 'కోహళె' కన్నడ కుమారవ్యాస భారత ప్రయుక్తము. మరాఠీ: ఖోళ = ఆచ్ఛాదనము, పొది: గుజరాతీ, ఖోళీ = గొంగెన: పరుపుగలీబు

12. ఖర్చు : వ్యయము 'అన్నపు ఖర్చున కాకుపోకులకు' [వ.పీ 69] < మరాఠీ: ఖర్చ = వ్యయము. ఖర్చణేఁ = ఖర్చుచేయు. పారసి: ఖర్చ్ = ఖర్చు, ఖర్చ్ = ప్రయాణ సంబంధమైన వ్యయము. రోవెల < అరబ్బీ.

13. ఖుసి : సంతోషము, విలాసము, 'ఖుసిమీఱన్ సురధాణి నిండు కొలువై కూర్చున్నచో' [హర పీ. 22] < మరాఠీ: ఖుశీ, ఖుశ, ఖూశ(ష) = ఆనందము, సుఖము. పారసి: ఖుసీ.

14. గంజాయి : గంజాయి ఆకుతో చేసిన మత్తుపదార్థము 'గంజాయి దినఁగ నుత్కంఠఁ జేసినవాఁడ' (శివరా. 3-62) < మరాఠీ: గాంజా

15. గసగస[10] : ఒక దినుసు మసాలా విత్తులు 'గసగస యొసక మెసఁగె [కాశీ 3-23] 'గసగసలు' [పైది 7-186] < పారసి: ఖష్ ఖాష్ = గసగసాలు :

16. గాగరా : స్త్రీలు కట్టుకొను పావడ. 'వన్నెలగాగరా జిలుగు వట్రువ కుచ్చెళులందు' [శ్రీనా చాటువు] < మరాఠీ: ఘాగ్రా = స్త్రీలపావడ. ఘాగ్రీ = పిల్లల మొలనూలిగంట

---

10. నల్లమందు విత్తులు అని ఆంధ్రపద పారిజాతము : 184
The minute Seeds of the poppy plants This is Corrupted from the Arabic name 'Khash Khash' Ainsl 1.326 [ప్రౌఢ్యము ప్రథమ ముద్రణము, పు 204]

17. గులాము : సేవకుడు, సేవకురాలు. నీచురాలు 'లంజె తల్లియె యిదియు గుల్లాముగాక' [క్రీడా 265] < మరాఠీ: గులామ = కొండెగాఁడు, నీచుడు, తొత్తుకొడుకు, బానిస పారసి: గులామ్ < అరబ్బీ

18. గొంగడి : కంబళి 'గొంగడి మేలు పచ్చడము' [చా.మం. 1–128] < మరాఠీ: ఘొంగ = దుప్పటి ఘొంగడీ

19 చబుకు : కొరడా, చేఱుకోల 'వాజిశవంబుల వడిమీద నెక్కి చబుకుల గొట్టుచు చనుమను వారు' [ప.వీ 118] < మరాఠీ; చాబూక = కొరడా పారసి: చాబుక్ = కొరడా చాబుక్ బాజీ = చబుకుతో కొట్టుట.

20. చామలా : ఒకరకమైన కడియములు 'చామలా కడియముల్' [ప.వీ72] < మరాఠీ: శామల = అబిసీనియాదేశపు సోమాలి

21. చావడి : కొలువు కూటము, రచ్చ, కార్యస్థానము. 'పెద్ద సావళ్ళ-చేరిభాషింపుచు [ప.వీ 28] <మరాఠీ: చావడీ = కొత్వాలు చావడి. రచ్చ బండ. చాహవడీ [వేళాపూర్ శిలాశాసనము]<సం. చౌహాట [మరాఠీ వ్యుత్పత్తి పదకోశము, పు 276]

22. చికిలి : మెఱుఁగు, పదను. 'చెఱుసానఁ బట్టించి చికిలిచేయించిన గండ్రగొడ్డలి' [కాశీ 1-121] 'చికిలి చేసిన యడిదంబు' [శివరా 4-74] చికిలి చేసిన తామ్రంపుఁ జెంబుఁ బూని' [వీధి-17]<మరాఠీ: సికల = మెఱుఁగు గుజరాతీ : సికల్ = మెఱుగు, పారసి: సక్కాల్ = మెరుగు పెట్టువాడు, అరబ్బీ:సక్ల్ = మెఱుఁగు

23. జబ్బు : అలసము, మందము. 'జబ్బించుకలేని యొడలు' [శ్రీనాథుని చాటువు]<మరాఠీ: జబూన = పేదవడిన పారసి. జబ్బ్ = కృశించుట చిక్కిపోవుట, వట్టిపోవుట, శుష్కించుట. <అరబ్బీ: దేశ్యమని కిట్టెల్.[11]

24. జరి : వెండి బంగారముల మొలాము. 'జరిగొన్న వెలిపట్టు జన్నిదంబుల తోడ రత్నాల తారహారము ధరించి' [శివ 2-90] 'జరిగొన్న వెలిపట్టు

11. కిట్టెల్ కన్నడ నిఘంటువు, పు 636

జన్నిదంబుల' [క్రీడా 42] <పారసి: జర్, జరీన్ = బంగారు, ధనము జర్ తార్ = బంగారు పోఁగుతో చేయబడిన. జర్ (= బంగారు) + తార్ (= దారము) తెలుగున 'జరతారు' 'జలతారు'గా పరిణమించుట వర్ణ విభేదనము (dissimilation)

25. జలపోసనము[12] : బంగారుపై పూఁత. 'బంగారు జలపోసనముతోడి ప్రన్నని పట్టు తోరము ధరించి' [క్రీడా 1-42]
'పైఁడి జలపోసనపు కనీసంపు పట్టుబంతి' [కాశీ 6-161]
'పసిఁడి జలపోసనము తోడనెసక మెసఁగు' [హర 5-56]
<పారసి: జర్‌పోష్ = బంగారు లేసు పని. జర్ (= బంగారు) + పోష్ (= ఆచ్ఛాదనము, పూఁత.)

26. డమామి[యీా] : డిండిమము డంకాకంటె చిన్నది యయిన చర్మ వాద్యము. 'డమాయీాలు' [ప.వీ 4]<మరాఠీ: ధమామి

27. డేరా : గుడారము. 'జగడంపు డేరాలు' [ప.వీ 36]<మరాఠీ: డేరా = గుడారము

28. తాయెతు : దండనో మెడనో మొలనో కట్టుకొను రక్షాభూష. 'మేనికి రక్షయై మించు తాయెతులు. [ప వీ 17] దంట తాయెతులు [ప వీ 72] <మరాఠీ: తావీజ = రక్షాభూష. పారసి: త వీజ్ = తాయెతు, రక్షాబంధము అరబ్బీ. త అవీజ్ = శరణుకోరుట రక్షణార్థము సర్వేశ్వరుని ప్రార్థించుట

29. తురక : ఇస్లాము మతానుయాయి. 'తురకల మశీదు' [క్రీడా 149] <మరాఠీ. తురక = మ్లేచ్ఛుఁడు, తురుష్క జాతీయుఁడు. పారసి: తుర్క = ఒకజాతి. 'తురుష్క' పదము క్రీ పూ. మున్నూటేండ్ల నాఁటి ప్రాకృత భాషాగ్రంథములందు కన్పట్టుటవలనను, తెలుగునందలి 'తురక'కు సమీపమాతృకను నిర్ధారించుట కష్టము.

---

12 జలపోసనము = జలకము (<సం. జలమ్) + పోసనము' అను వ్యుత్పత్తి (శ.ర, పు 423 ఆంధ్రవాచస్పత్యము, పు 1295 సూ ని III పు. 407)

30. తేజి(జీ) : మేలుజాతి గుఱ్ఱము 'హురుముంజి బలుతేజి హరులు దెచ్చె' [హర పీ 26] 'తెల్లనియొక కత్తలాని తేజీ హయమున్, [శృ. నై. 6-96] 'పడివాగెతేజీలు పల్లకీజోళ్ళు' [ప పీ 4] < మరాఠీ : తేజీ = అరబ్బీదేశపు గుఱ్ఱము, పారసి · తాజీ, తేజ్ తాజి = అరబ్బీదేశపు గుఱ్ఱము తాజియాన్ = అరబ్బీ గుఱ్ఱములు.

31. త్రాసు : తక్కెడ 'ఎవ్వాఁడు త్రాసుపైఁ గల్గె చందమునవంచె' [భీమ 2-77] < మరాఠీ : తరాజూ = త్రాసు. పారసి.తరాజూ = తుల, తూకము, సమానత, న్యాయము

32 దుకాణము : అంగడి. 'దుకాణము మీఁదనున్న' [శ్రీనా చాటువు] 'దుకాణముపై బొందిలిదొర్తు నిల్చె' [శ్రీనా. చాటువు] <మరాఠీ : దుకాణ (న); పారసి. దుకాన్, దుక్కాన్ అరబ్బీ: దుక్కాన్, దుకానీ = దుకాణదారుఁడు.

33. పంజు : ప్రకాశించు, రత్నములు చెక్కిన. ప్రకాశము 'పంజుమంచము డిగ్గ మంజుఘోష' [హర 7-132] <పారసి పంజ్ = జ్యోతి' ప్రకాశము పంజ : ఐదుప్రేళ్ళనుపోలిన కాగడా.

34. పరాకు : ఉపేక్ష, నిర్లక్ష్యము. దమయంతి..... పరాకు వహించి' [శృ నై 5-106] రాకుమారుని చూచు పరాకు కతన' [శృ నై 6-63] 'ఒక్క కోమలి పరాకున నుండఁగ' [శృ నై 6-113] 'పరాకయ్యె నేనిఁ ప్రాణవల్లభ [శృ నై 7-16] <మరాఠీ: పరాఖ్, పరీఖ్ = శోధన, ఏకాగ్రత, పర్యవేక్షణ

35. పారసి[13] : ఇరేనియను భాషాకుటుంబమునకుచెంది, పారసీకదేశమున ప్రచుర వ్యవహారము కల ఒకభాష. 'పారసి భాషవ్రాసినన్' [భీమI-74] < మరాఠీ ఫారశీ(సీ) = పారసిభాష, పారసివాఁడు. పారసీకము

13. పారశీక శబ్దభవమని వైకృత దీపిక, పు 77

సంస్కృతీకరణ రూపమని మరాఠీ వ్యుత్పత్తి పదకోశము (పు 526) అరబీలు · ఫర్స్=పశుపాలన.

36. పేషణి : దూత, 'పేషణి హనుమంత బిరుదాంకులగు రాచవారికి' [శృ.నై 1-32]<మరాఠీ : పేషణ= నియోగించుట. పేషణీ = రాయబారి<సంస్కృత - ప్రేషణ=పంపుట, ఆదేశము. ప్రాకృత: పేషణ= నియోజనము, ఆజ్ఞ, ఆదేశము.

37. ఫౌజు : సేన, పటాలము 'ఫౌజుపై నడిచిరి' [ప వీ 114] <మరాఠీ: ఫౌజ=దండు, సేన పారసి . ఫౌజ్=సేన సర్‌ఫౌజ్ = దళవాయి, సేనాపతి. అరబ్బీ. ఫౌజ్=తెలుగున 'ఫౌజు'ను సబిందుకముగ కొందరు పఠించుటకు హేతువు. ఇది పుంజ శబ్దభవముగా భావింపబడుట. నిర్బిందుకముగా స్వీకరించుట యుక్తియుక్తము.

38. బరాబరి : ప్రభుదర్శనము నిమిత్తము గుమిగూడు ప్రజలను బగళము చేసి ఎచ్చరిక దెలుపుట.'పటువేత్రకుల్ బరాబరి యొనరించి [ప.వీ 15] 'చెలగి బరాబరుల్ జేసిరి' [పై ది. 46] < మరాఠీ: బరోబర = సదృశము, సమానము.పారసి · బర్-ఆ-బర్=సమత, సదృశము, స్పర్థ, బర్-ఆ-బరీ= సమత్వము, సాదృశ్యము,

39. బాఁకు : మొలను దోపుకొను వంకీకత్తి. 'అలరాజు బాఁకున కవతారమొంది' [ప.వీ 2] 'పరశువుల్ బల్లెముల్ బాఁకు కాటార్లు' [పై ది 28] 'బాఁకుల రొమ్ములు పరియలుచేసి' [పై ది. 111] < మరాఠీ : బాఁక. బాక=వంకర, వంపు

40. బాజారు : విపణి వీధియందలి జనము. 'బాజారే తిరిగిచూచి పక్కన నవ్వెన్' [శ్రీనా. చాటువు] < మరాఠీ: బాజా(ఝా)ర=అంగడివీధి, సంత పారసి: బాజార్ సంత, సంతరోజు, బేరము బాజారీ=బజారునకు సంబంధించిన వర్తకుడు.

41. బిబ్బీ : తురుష్కుల యంతఃపుర స్త్రీ. 'బిబ్బీలకుఁ గాక కలవె పృథివీ స్థలిపై' [శ్రీనా. చాటువు]<మరాఠీ : బిబి=ముస్లిము స్త్రీ యవనకన్య పారసి బీవీ సత్కుల ప్రసూత యగు స్త్రీ<తుర్కీ.

42. బొందిలి : బొందిలీజాతి 'బొందిలి భామ గోమునన్' (శ్రీనా. చాటువు] 'దుకాణముపై బొందిలి దోర్తునిల్చె ముఖచంద్రస్ఫూర్తి శోభిల్లగన్' [శ్రీనా. చాటువు]<మరాఠీ . బుందేల్ వింధ్యపర్వత పరిసరములందలి ఒకదేశము.

43. మసీదు : ముస్లిముల ప్రార్థన మందిరము 'కర్తారుఁడుండు తుర్కుల మసీదు' [క్రీడా 149]<పారసి . మస్జిద్=ప్రార్థన మందిరము, మసాజిద్=మసీదులు, ప్రణిపాతము నందలి సప్తావయవములు. చేతులు, కాళ్లు, మోకాళ్ళు, నుదురు. అరబ్బీ : మస్జిద్=పూజాస్థలము మజూద్= సర్వాంగాలింగిత నమస్కారము

44. ముఖమల్లు/ముఖమాలు : ఒత్తుగా మెత్తగానుండు ఒకతరహా పట్టు గుడ్డ, దేశాంతర వస్త్రవిశేషము 'ముఖమల్లు గుడ్డలు మునుగొనితెచ్చి [పవీ 17] 'పైగప్పె ముఖమాలు పరిపులువేసి' [పైద 30]<పారసి : ముఖమల్, మిఖ్మల్=వెల్వెట్‌తో చేసిన, వెల్వెట్‌వంటి

45. మైజారు : పైటకొంగు, 'మైజారుకొంగు దడిసిన బాజారే తిరిగిచూచి పక్కున నవ్వెన్' [శ్రీనా. చాటువు] < పారసి: మిజర్=మొలకు కట్టుకొను వస్త్రము మై (=మేను) + జాఱు=ఒడలినుండి జాఱెడునది కాఁబోలను భ్రాంతితో మన నిఘంటుకారులు చేసిన విఱుపు.

46. మోళము : వెండి, బంగారము లోనగువానిపై పూఁత, 'క్రొత్తపైడి మోళముగటారి భీమన్నృపుఁడిచ్చె' [శృ నై 6-94] <మరాఠీ: ములామా= ధాతువులపై పూఁత, ములమ్మా=పైపూఁత పారసి : ములమ్మా = మోలామ మల్,అమ్=పూఁత లమ్మా = ప్రకాశించుట.అరబ్బీ : మూలమ్మఅ.

4 . రావు : నాఁటి వెలమదొరల పట్టపు పేరు, పేరుచివర చేర్చు గౌరవ సూచకమగు పదము. నేడు సర్వవర్ణములవారి నామముల చివర చేర్చఁబడు చున్నది 'రావు సింగ మహీపాలు దీవిశాలు' [శ్రీనా చాటువు] 'రావు సింగజన పాలునకే' [శ్రీనా. చాటువు] 'రావు సింగ వసుధావరుఁడు' [శ్రీనా చాటువు] <మరాఠీ రాఓ రావో = ప్రభువు, రాజు.

48. రోజు : దినము, 'అయిదు రోజులదాక' [వ.వీ 42]<మరాఠీ : రోజ. పారసి రోజ్ = దినము, పగలు, సూర్యుడు రోజన్ = రోజులు, రోజన = ప్రతిదినము, రోజ్ రోజు = దిన దినము ప్రాచీనపారసి: రౌచ = ఒకరోజు.

49. లాహిరి : మాదక ద్రవ్య సేవనము వలన కలుగుమత్తు మైకము. 'లాహిరి పట్టినభాతి మదంబెక్కిన మాడ్కి' [కాశీ 2-138] <పారసి: లహ్‌ర్, లహర్ = సారాయి మొదలైన నిషావస్తువులు అమ్మెడికొట్టు, సానికొంప. లహ్ = ద్రాక్ష సారాయము.

50. లుంగ : వస్త్రభారము, బట్టలమోపు 'వెలివట్టు జన్నిదంబుల లుంగ యంటులువాయంగ' [క్రీడా 42]<మరాఠీ: లుంగి = మొలను కట్టుకొను వస్త్రము. పారసి లుంగ, లుంగీ = గళ్ళగళ్ళ వస్త్రము. లుంగ్ = వస్త్రపు మడత.

51 సన్నాయి : నాగసరము 'శంఖ సమూహంబు సన్నాయిజోళ్ళు, [వ వీ 4] < పారసి : షాహ్‌నాయ్ = జయకాహళ, యుద్ధకాహళ షాహ్‌నాయ్ = ఒకవిధమైన వాద్యము, సంగీత సాధనము

52. సమ్మాను : చీనాదేశముల పద్ధతిలో నిర్మించిన ముక్కొయ్యపడవ. 'శరధింగప్పలి జోఁగువల్లి వలికాసమ్మానఁ దెప్పించు' [హర వీ 28] <మరాఠీ· సామాన = పరికరము లు, పనిముట్టు <పారసి : సామాన్ = వస్తువు, సాధనము <మలయా : సమ్మన్ = మూడు పలకల పడవ చీనీ : సంపన్ = మూఁడు పలకలతో అమర్చిన పడవ పెద్దఓడను అంటి పెట్టుకొనియుండు చిన్నపడవ సన్ = మూఁడు; పన్ = పలక, వూ-పన్ =

ఐదు పలకల పడవ 'సంపన్' అనునది సమీకరణమునొంది 'సమ్మన్' అయి 'సమ్మాను'గా పరిణమించినది

53. సరిహద్దు : పరిమితి, మేర, పొలిమేర, సీమ. 'చక్కఁగా మిరియాల సరిహద్దు దాటి [వ పీ 33] < మరాఠీ . సర్హద్ద= మేర, పొలిమేర. పారసి: సర్‌హద్ = అవధి, మేర, సీమ.

54. సహా : చక్రవర్తి, సార్వభౌముడు 'హరిహరరాయ ఫేరోజసహా సురధాణ గజాధిపాది భూవరులు' [హర పీ 24] < మరాఠీ : శహా = రాజు, సుల్తాను పారసి : షహ్ షాహ్ = అధిపతి, ప్రభువు షాహీ = రాజ సంబంధి, రాజ్యము, రాచరీవి

55. సురతాణ : రూ సురతాణి, సురత్రాణ, సురధాణ, సురధాణి, సురధాని = పాలకుఁడు, ఏలిక

1 'ధారా 'సురతాణ' దర్ప ధరణీ ధ్రనవీ' [కాశీ 6 309]
2. 'పండువా 'సురతాణి' పావడంబిచ్చిన' [భీమ 1-38]
3 'ధారా 'సురత్రాణ' ధాటీ సమారంభ' [భీమ 1-29]
4 'ధారా 'సురత్రాణ' కటక కుంభి కుంభకలహకారి [క్రీడా 243]
5 'ప్రబల ధారా 'సురత్రాణ' భద్రజాతి' [కాశీ.పీ 58]
6. 'ఫేరోజసహా 'సురధాణ' గజాధిపాది భూవరులు' [హర పీ 24]
7. 'ఖుసిమీఖన్ 'సురధాణి' నిండుకొలువై కూర్చున్నచో' [హర.పీ 22]
8 'పండువా 'సురధాని' పావడంబంపిన భద్రేభములు' [కాశీ 1-5]

ఒక భాష వేరొకభాషనుండి పదములను ఎరువు తెచ్చుకొనునపుడు స్వభాషా వర్ణ నిర్మాణమునకు అనుకూలమైన పద్ధతిలో పదములను మార్చుకొని తనలో ఇముడ్చుకొనును. పర్షియను 'సుల్తాను' పదమునకు రూపాంతరములైన సురతాణ, సురతాణి, సురత్రాణ, సురధాణి

సురధాణ, సురధాని మొదలగు ప్రయోగములకు సరియైన వివరణలిచ్చుట కష్టము

<పారసి : సుల్తాన్ = సార్వభౌముఁడు, చక్రవర్తి, సర్వాధికారి. సుల్తాన = చక్రవర్తిని, రాణి. సుల్తానీ = సామ్రాజ్యము, చక్రవర్తికి సంబంధించిన. <అరబ్బీ : సుల్‌తాన్.

56. సేబాసు : మెచ్చికోలును తెలుపు మాట 'మెప్పించెదవేనపుడు నిన్ను సేబాసందున్' [హర 7-64] >మరాఠీ : శాబాస = ప్రశంసార్థక పదము. పారసి : షహ్-బాష్ = స్తుతి, మేలుమేలని ఎలుగెత్తి కొనియాడుట.

57. సొగటాలు : జూదమాడెడు సారెలు 'జూద మాడుటకయి సొగటాలు కొన్ని....' [వ.వి 45] < మరాఠీ : సాగడీ, సాగడా = శకటసంబంధ మయిన.

58. హజారము : ఆస్థానము, మొగసాల 'ఇంద్రుని హజారపు మేడకుఁ బైఁడి కుండయైఁ' [కాశీ 1-125] <పారసి : హజిరాన్ = సభాస్తారులు. హాజిర్ = సన్నిధినుండు, సేవకుసిద్ధముగానుండు హాజిరీ = సభ్యులు. హుజ్రా = కొలువు కూటము, సభాస్థానము

59. హద్దు : అవధి, మేర. చక్కగా మిరియాల సరిహద్దు దాటి [వవి 33] 'దక్షిణదిశ హద్దు తగ వివరింతు, [పై ది. 87] <మరాఠీ : హద్ద = అవధి, మేర. పారసి : హద్ = మేర, పొలిమేర అవధి అరబ్బీ : హద్ = మితి, మేర.

60. హురుముంజి : పారసీక జలసంధి చేరువ తీరమునగల పెద్ద రేవు పట్టణము. క్రీస్తుపూర్వము నాలుగవ శతాబ్ది నుండియు ముత్యముల, గుఱ్ఱముల ఎగుమతికి ప్రసిద్ధి. క్రిందటి దినములలో వాణిజ్య విషయక ముగా ప్రాచ్య పాశ్చాత్య ప్రపంచములకు కూడలి. ఇది పర్షియా సముద్ర తీరమునందలి 'ఆర్మోజా'యనునగరము 'చీని సింహళ తవాయి హురుముంజి చోటంగి, [హర. పీ 7] 'హురుముంజి బలుతేజి హరుల్లు

దెచ్చె, [హర. పీ 26] "ముక్కున హురుముంజి ముత్యాల ముంగర" [శ్రీనా. చాటువు].

<పారసి : హుర్ముజ్ = ఒకరేవుపట్టణము. ఉర్ముజ్ = ప్రతి పద్దివసాధిష్ఠాన దేవత. బృహస్పతి గ్రహము. మధ్యయుగపు ప్రభుత్వములు యుద్ధాశ్వములను విస్తారముగా ఇచ్చటనుండి దిగుమతి చేసికొనుచుండిరి దక్షిణ భారతములో ఉత్తమజాతి యశ్వములు లభింపవు. వానిని అరేబియా మొదలగు తురుష్క దేశములనుండి తెప్పించుకొనుచుండిరి.

3 4 6 అవచి సోదరులు సుగంధ ద్రవ్యములు దిగుమతి చేసిన దేశములు, దీవులు ఎక్కువ భాగము ఆంధ్రదేశమునకు తూర్పున ఉన్నవి ప్రాక్సముద్ర దేశములు, దీవులు, కొన్ని పశ్చిమ దేశములును గలవు. అందు కప్పలి, జోఁగు, వల్లి, వలికా నౌకల పేర్లు వల్లి, వలికా చల్లర నౌకలు ఈ క్రింద అన్యదేశ్యములకు వ్యుత్పత్తి వివరణము లీయబడినవి.

1. కప్పలి : సరకుల రవాణాకు ఉపకరించెడి ఒక దినుసు విలాతి ఓడ [హర పీ 29]

మలయా – కప్పల్ = [ఓడ]

స్వదేశీ ఓడ ఈ పదము తమిళ పద వికారము దీనికి నాలుగైదు తెరచాపలుండునట దీని అడుగుభాగము తుపానులకు నిలుచుటకై ముప్పేటగా కట్టెతో నిర్మించెడివారని వర్ణింపఁబడినది.[14]

2. గోవ : భారత దేశపు పశ్చిమ తీరపు రేవు పట్టణము ఇది గొప్ప వర్తక స్థానము. పశ్చిమ ఖండములనుండి వచ్చు సరకులన్నియు ఈ రేవుగుండ దేశములోనికి వచ్చును యుద్ధాశ్వములు, జవ్వాది వంటి సుగంధద్రవ్యములు ఈరేవు మూలమున దిగుమతి యయ్యెడివి పూర్వనామము గోమంతమఁట. [15]

'తరుణాసీరి తవాయి గోవ రమణా స్థానంబులం' [హర పీఠిక 28]
<మరాఠీ : గోవేఁ = గోవాపట్టణము

14. హంసవిలాసము : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ - పీఠిక, పుట - 25. 15 పైదే.

౩. జలనోంగి : మలయా ద్వీప కల్పమునందలి యొక ప్రదేశము. ఆఫ్రికా తూర్పు తీరమునందలి 'జీలాన్' రేవు పట్టణము కావచ్చును. జలనోంగి యను ప్రదేశమునుండి బంగారపు మొలకలు (పలుకు బంగారము) మన దేశమునకు వచ్చేడిది.

'జలనోంగి బంగారు మొలకదెచ్చె' [హర పీ 26]

4. జాళువా[16] మేలిమి బంగారు ?

'కమ్మవిలుకాని జాళువా బొమ్మ యనఁగ [శ్రీనాథుని చాటువు]

'చెలగుచు జాళువా చీరధరించి [వ.పీ 65]

దీని మూలము అవిజ్ఞేయము బ్రౌనుదొర యూహించినట్లు 'జాళువా' యనునది ఏదో యొక స్థలవాచక సంబంధికావచ్చును ఇంకను విచార్యము.

5. జోఁగు : వెదురు బద్దలను, పేప బెత్తములను పేర్చి అల్లిన తెరచాపలు మూఁడునుండి పండ్రెండు దాఁక అమర్చెడి పెద్ద ఓడ

'కప్పురపు జోఁగుఁ గంటిమి కంటిమనుచు' [శృ.నై 3-101]

'సుడివడ్డ ముత్యాల జోఁగు వోలె' [కాశీ 1-138]

'వడిచిక్కన జోఁగునుంబోలె' [కాశీ 2-98]

'శరధిన్ గప్పలి జోఁగు వల్లి వలికా' [హర పీ 28]

ఈ 'జోంగ్' జావనీ భాషలోనివి. ఈ ఓడల తయారీకి చీనావారు కారకులట. వీని తెరచాపలను అక్కఱ లేనిచో దింపివేయక చుట్టగా చుట్టి ఓడ కంబములకు కట్టివేయుదురు నాటు పడవలు, ఓడలు కొయ్య చీలల తోడను, కొబ్బెర పీచు పురులతోడను, బిగింప బడుచుండగా 'జోంగు'ల కొయ్య పలకలు ఇనుప చీలలతో బిగింపబడి బలిష్ఠముగా నిర్మింప బడు చుండెడివట. పదునాలుగవ శతాబ్ది వారగు 'ఇబన్-బతూతా' 'రషిద్-ఉద్-దీన్' మొదలగు విదేశపర్యటకులు 'జోంగు'లను గూర్చి విస్తరించి

---

16. Fine Gold Probably the name of a place – Thus 'జాళువా పసిడి' బ్రౌణ్యము-పుట 327.

వ్రాసిరి. మలక్కా మొదలగు ప్రాచ్య ద్వీపములలో భారతీయ వర్తకులు ముఖ్యముగా చోళమండల తీరమువారగు 'జెంతూ' [=తెలుగు] సెట్లు చాలమంది నివసించు చుండిరనియు కోటికి పడగలెత్తిన వీరు జోంగు' లను పేరుగల పెద్ద పెద్ద సొంత ఓడలను సరుకుల రవాణాకు వాడుచుండి రనియు బార్బోజా వ్రాతలు.[17] ఈ తెలుగు సెట్లలో నెల్లూరువారు, అవచి తిప్పయ్య సోదరులు చామసెట్టిప్రభృతులును ఉండవచ్చు. వ్యుత్పత్తి పరముగా చూచినచో సబిందుకము సాధుపారము సిర్బిందుకముగా కొందఱు ఉదాహరించుట పొరపాటు పండ్రెండు తెరచాపల వరకును గల ఓడలుండెడివి. చీనా-ఇండియా నడుమ మహాసముద్రముమీద వెళ్ళుట కనువైనవి ఈ భారీనౌకలు

6. ఢిల్లి : [హిం ఢిల్లీ] ఢిల్లీ పట్టణము, భారత రాజధాని

'పండువాఢిల్లి రాఢాది పట్టణములు' [హర పీ 29]

'ఢిల్లి సుల్తానునకు లేదు పల్లవోష్ఠి' [క్రీడా 185]

7. తరుణాసీరి : బర్మాదేశము దక్షిణ భాగమున, తన్నాసరి రాష్ట్రమున, తన్నాసరి నది యొడ్డున గల ఒక రేవుపట్టణము. 'తర్నాసరి' మలయా ద్వీప కల్పమున నొక రాష్ట్ర ప్రధాన నగరమని వేటూరివారి నిర్ణయము. మలయా భాషలో 'తనాసరి' యని వాడుక. 'తనాహ్సరి' అనగా 'ఆనంద సీమ' అని యర్థము. బర్మీలో 'త-నెన్-థారి', 'తనంగ్-సరి'అని వ్యవహారము. 'తన్నాస్సరి, తర్నస్సరి, దెనస్సరిమ్ ఉహ్నసరి' అను రూపములు ఉదాహృతములు [18]

'తరుణాసీరి తవాయి గోవ ......' [హర పీ 28]

8. తవాయి : బర్మాదేశము దక్షిణ భాగము సందలి తన్నాసరి రాష్ట్రమున తవాయినది తూర్పు ఒడ్డునగల ఒక రేవుపట్టణము. తవాయి జిల్లాకు ముఖ్యపట్టణము. మలయా ద్వీప కల్పమున నగల రేవుపట్టణమని వేటూరి వారు బర్మీ భాషలో నిది 'ధ-వే', 'ద వాయ్' అని వ్యవహృతము.

17. Hobson - Jobson, P. 472. 18. Ibid -P. 914.

బర్మీ పండితులు దీనికి పలురకముల వ్యుత్పత్తి చెప్పిరి. 'ధ-వాయ్' అనగా ఖడ్గములను కొనెడి చోటు.

'చీని సింహళ తవాయి హురుముంజి చోణంగి' [హర పీ 7]

'తరుణాసీరి తవాయి గోవ రమణా' [హర.పీ 28]

మలయా భాషలో 'తవాయ్'మూల రూపమున' సయామీ'భాషలోనిదట [19] నేటి 'తవాయి' పట్టణపు జనాభా 36 వేలకు పైబడి

9 పంజార : 'సుమాత్రా' ద్వీపమున' పఞ్జార్' అనుపేరు గలది. ఒండే, బోర్నియో ద్వీపమున 'పంజార్ మాసీన్' అను పేరు గలది. ఈ రెండు దేశములు కర్పూర వృక్షములకుఁ బ్రసిద్ధము లేయట. [20] ఇక్కడనుండి కర్పూరము దిగుమతి యయ్యెడిది

'పంజారఁగర్పూర పాదపంబులు దెచ్చె' [హర.పీ 26]

10. పండువా[21] . పదునాలుగు పదునైదు శతాబ్దులలో పశ్చిమ బంగాళమును పాలించిన సుల్తానుల రాజధానియగు 'పాండువా' పట్టణము. నేటి బంగాళ మున మాల్దా జిల్లాలోని ఇంగ్లీషు [<అంగ్రేజాబాద్] బజారునకు నాలుగున్నర కోసుల దూరమున నీ పట్టణమున్నది. దీనికి ఫెరూజాబాద్ అనియు నామాంతరము

'పండువా సురతాణి పావడంబిచ్చిన' [భీమ 1_38]

'పండువా సురధాని పావడంబంపిన' [కాశీ 1-35]

'పండువా ఢిల్లి రాఢాధి పట్టణముల యధిపతులు' [హర. పీ 29]

11. భోట : భూటానుగా తెలియ వచ్చుచున్నది. ఇది కస్తూరికి ఆకరము.

'భోటఁ గస్తూరికా పుటకోశములు దెచ్చె' [హర.పీ 26]

---

19 Hobson – Jobson – P. 904,

20 వేటూరి ప్రభాకరశాస్త్రి : హరవిలాసము - పీఠిక, పుట 7

21. 'పండువాయను దేశము' అని సూ.ని. సంపుటి 5, పుట 28.

12. యాంప : సింహళ ద్వీపమునందలి జాఫ్నాగా గుర్తించిరి. కట్టాణిది ముత్యము లిచ్చట లభించును.
'యాంప గట్టాణి ముత్యాలు దెచ్చె' [హర.పీ 26]

13. రమణా : బర్మాలోని ఇరావతీ నది ముఖ ద్వారమున గల ప్రాంతము. 'రమన్యా'యని ప్రాచీన వ్యవహారము. పెగూ దేశమందలి నగరము. కస్తూరి ఇచ్చటనుండి దిగుమతి చేసెడివారు.
'గోవ రమణా స్థానంబులం జందనాగరు కర్పూర' [హర పీ 28]

14. వలికా : సరకుల రవాణాకు ఉపకరించెడి ఒక దినుసు విలాతి పడవ.
'శరధింగప్పలి జోగు వల్లి వలికా సమ్మాన్లదెప్పించు' [హర పీ 28]

15. వల్లి : సరకుల రవాణాకు ఉపకరించెడి ఒక దినుసు విలాతి పడవ.
'శరధింగప్పలి జోగు వల్లి వలికా సమ్మాన్లదెప్పించు' [హర పీ 28]

**3.4.** 0 అన్యదేశ్యములలో కొన్నిపదముల ధ్వనిపరిణామ మిచ్చట ప్రదర్శితము.

**3.4.7.1** స్వరవిశ్లేషము (Anaptyxis)

1. అసివారు < అస్వార్ 2. కత్తలాని < ఖల్లాన్ 3. కిచ్చడి < కిచ్‌రీ

**3.4.7.2** మధ్యమ స్వరలోపము :

త్రాసు < తరాజు

**3.4.7.3** మూర్ధన్యీకరణము : (Retroflexion)

4. మోళము < ములమ్మా 2. సురధాణి < సుల్తాన్

**3.4.7.4** సమాసములలో నొక యంగము అన్యదేశ్యముండుట :

1. అన్యదేశ్యము + తత్సమము :
తేజీ - హయము [శృ. నై 6 96] పేషణి - హనుమంత [శృ నై 1-32]

బర్మీ పండితులు దీనికి పలురకముల వ్యుత్పత్తి చెప్పిరి 'ధ-వాయ్' అనగా ఖడ్గములను కొనెడి చోటు.

'చీని సింహళ తవాయి హురుముంజి చోణంగి' [హర పీ 7]

'తరుణాసీరి తవాయి గోవ రమణా' [హర పీ 28]

మలయా భాషలో 'తవాయ్'మూల రూపమున 'సయామీ'భాషలోనిదట [19] నేటి 'తవాయి' పట్టణపు జనాభా 36 వేలకు పైబడి

9 పంజార : 'సుమాత్రా' ద్వీపమున 'పజ్జార్' అనుపేరు గలది. ఒండే, బోర్నియో ద్వీపమున 'పంజార్ మానీస్' అను పేరు గలది. ఈ రెండు దేశములు కర్పూర వృక్షములకుఁ బ్రసిద్ధములేయట [20] ఇక్కడనుండి కర్పూరము దిగుమతి యయ్యెడిది

'పంజారఁగర్పూర పాదపంబులు దెచ్చె' [హర.పీ 26]

10. పండువా[21] . పదునాలుగు పదునైదు శతాబ్దులలో పశ్చిమ బంగాళమును పాలించిన సుల్తానుల రాజధానియగు 'ఫాండువా' పట్టణము నేటి బంగాళమున మాల్దా జిల్లాలోని ఇంగ్లీషు [<అంగ్రేజాబాద్] బజారునకు నాలుగున్నర కోసుల దూరమున నీ పట్టణమున్నది. దీనికి ఫెరూజాబాద్ అనియు నామాంతరము

'పండువా సురతాణి పావడంబిచ్చిన' [భీమ 1-38]

'పండువా సురధాని పావడంబంపిన' [కాశీ 1-35]

'పండువా ఢిల్లి రాఢాధి పట్టణముల యధిపతులు' [హర. పీ 29]

11. భోట : భూటానుగా తెలియ వచ్చుచున్నది. ఇది కస్తూరికి ఆకరము.

'భోటఁ గస్తూరికా పుటకోశములు దెచ్చె' [హర.పీ 26]

---

19. Hobson - Jobson - P 904,
20 వేటూరి ప్రభాకరశాస్త్రి : హరవిలాసము - పీఠిక, పుట 7
21. 'పండువాయను దేశము' అని సూ.ని. సంపుటి 5, పుట 28.

12. యాంప : సింహళ ద్వీపమునందలి జాఫ్నాగా గుర్తించిరి. కట్టాణిది ముత్యము లిచ్చుట లభించును.
'యాంప గట్టాణి ముత్యాలు దెచ్చె' [హర.పీ 26]

13. రమణా : బర్మాలోని ఇరావతి నది ముఖ ద్వారమున గల ప్రాంతము. 'రమన్యా'యని ప్రాచీన వ్యవహారము. పెగూ దేశమందలి నగరము. కస్తూరి ఇచ్చుటనుండి దిగుమతి చేసెడివారు.
'గోవ రమణా స్థానంబులం జందనాగరు కర్పూర' [హర పీ 28]

14. వలికా : సరకుల రవాణాకు ఉపకరించెడి ఒక దినుసు విలాతి పడవ
'శరధింగప్పలి జోంగు వల్లి వలికా సమ్మాన్ల దెప్పించు' [హర పీ 28]

15. వల్లి : సరకుల రవాణాకు ఉపకరించెడి ఒక దినుసు విలాతి పడవ.
'శరధింగప్పలి జోంగు వల్లి వలికా సమ్మాన్ల దెప్పించు' [హర పీ 28]

**3.4.** 0 అన్యదేశ్యములలో కొన్ని పదముల ధ్వనిపరిణామ మిచ్చుట ప్రదర్శితము.

**3.4.7.1** స్వరవిశ్లేషము (Anaptyxis)

1. అసివారు < అస్వార్ 2. కత్తలాని < ఖత్లాన్ 3. కిచ్చడి < కిచ్ రీ

**3.4.7.2** మధ్యమ స్వరలోపము :

త్రాసు < తరాజు

**3.4.7.3** మూర్ధన్యీకరణము : (Retroflexion)

4. మోళము < ములమ్మా 2. సురథాణి < సుల్తాన్

**3 4.7.4** సమాసములలో నొక యంగము అన్యదేశ్యముండుట :

1. అన్యదేశ్యము + తత్సమము :

తేజీ – హయము [శృ. నై 6.96] పేషణి – హనుమంత [శృ నై 1-32]

2. అన్యదేశ్యము + తద్భవము :

పంజు-పంచము [హర 7.137] [పైడి] మోళము-కటారి [శృ నై 6-94]

3 తత్సమము + అన్యదేశ్యము :

వజ్రాల-కపురు [శివ 2 26]

4. దేశ్యము + అన్యదేశ్యము :

పసిడి-జలపోసనము [హర 5.56] పైడి-మోళము [శృ నై 6-94]

5 తమిళము + తత్సమము .

తిరు-నామము [శ్రీనా. చాటువు 132] తిరు-పతి [కాశీ 5 288]

3.4 8 సజాతీయ సోదరభాషలగు కన్నడ, తమిళముల నుండి ఎరవు తెచ్చిన పదములు శ్రీనాథునిలో కలవు. అందు హకారాది పదములలో పెక్కులు కన్నడము నుండి ఎరవు తెచ్చినవి [1.1 7]

3.4 8 1 కన్నడమునుండి వచ్చిన ఎరవు పదములు :

1. హజ్జ : పాదము, అడుగు.

'శర్వరీ సార్వభౌవు నొక్క హజ్జన గుజ్జురూపంబున' [భీమ 3.212]
<కన్నడ: హజ్జె, పజ్జె < ప్రాకృత: పజ్జ- < సంస్కృత : పాద్య = పాద సంబంధి.

2. హత్తు : జతచేయు, చేర్చు, కలుపు.

'హత్తెనొకచో విశాఖ వింధ్యాద్రియందు' [కాశీ 1.138]

'పీరంబులన్ హత్తి' [శివ 4 23]

'హత్తిన ముత్తియంబులతోడ' [భీమ 5.8]

కరంబుహత్తిన ముత్తియంబు' [శృ నై 8 14]

<కన్నడ: హత్తు < పత్తు = జోడించు, జత కలుపు [DED 3220, TVB 1234]

3. హాదను : యుక్త సమయము.

'హదనున మేలు సేఁత చతురానన సంభవ!' [శృ నై 3-14]

<కన్నడ: హాదను, పదను = యుక్తము, తగినది, కార్యానుకూలము [DED 3228]

4. హుళక్కి : అసత్యము, వ్యర్థము

'ధనము నిష్ప్రచ్ఛరము విద్యయు హుళక్కి' [కాశీ 4-114]

కన్నడ ; హొళ్ళు, పొళ్లు. హొళ్ళు + అక్కి [బియ్యము][DED3726]

5. హెచ్చు : అతిశయము, వర్ధిల్లు.

'హెచ్చు గుందాడఁ బనిలేదు' [హర 4-22]

'ఎల్ల సంసారులకుఁ గుందు హెచ్చు [శివ 3-5]

<కన్నడ : హెచ్చు, పెచ్చు, పెర్చు = అతిశయించు, వృద్ధియగు [DED 3615]

6. హేరాళము : ఆధిక్యము, సమృద్ధి.

'పెక్కు దినముల్ హేరాళమై వర్షములో [హర 2-26]

'ఇంద్రాణితోఁగూడ హేరాళముగఁదీర్చె' [హర. 4-90]

'ధనము హేరాలమబ్బె' [కాశీ 7-254]

'హేరాళముగఁజల్లె నెలనాఁగ యొక్కర్తు' [భీమ 5-115]

'వసియించున్ హేరాళ క్రీడా సంచారిణి' [భీమ 1-101]

<కన్న : హేరాళ, పేరాళ = ధారాళము, వెగ్గలము, విస్తారము (DED 3613)

సంస్కృతేతర పదములు సంస్కృత సమాసములలో ప్రయుక్తమగుట శ్రీనాథ రచనముల కన్పట్టు లక్షణము. శుద్ధ దేశ్యములగు పదములను సైతము సంస్కృత సమస్త పదములలో ప్రయోగించుట శ్రీనాథుని వచో విలాసములలో

నొక దినుసు. శ్రీనాథునకు సంస్కృత సమాసమున సంస్కృతేతర పదములను జేర్చునలవాటు కలదు. ఇట్లే హేరాళపదమును కూడ ప్రయోగించినాడు

7. హొన్ను : బంగారము

'హొన్నాళంపుఁ గరామూరి చాయల' [శివ 4-87]

'హొన్నాళంబు గండ గత్తెర' [క్రీడా 142]

'హొంబట్టు రవిక' [ప పీ 65]

<కన్నడ: హొన్, హొన్ను, హొం, పొన్, పొన్ను, పొం; బంగారు [DED 3723]

8. కైవారము : ఈ శబ్దము స్తుతిపరముగనే తమిళ కన్నడములయందు వాడఁబడుచున్నది. ఇది దేశ్యమేకాని తద్భవముగాదు

'కలి భూపాలుని యొద్ది పారకుల మీ కైవార దుర్భాషణంబులకుంగాని యతండు మెచ్చండు...." [శృ.నై 7-89]

ఆవేళను గంధర్వులు కైవారపదానుసార కమనీయముగా [హర 6-9]

<కన్నడ : 'కయ్‌పాట్, కైపాట్, కైవార' పదములున్నవి చేయెత్తి మంగళాశాసనము పలుకుట యని దీని యర్థము.

<తమిళ : 'కైవారమ్' అనుపదమిదే యర్థమున దేశ్యముగా ప్రయోగింపబడినది. 'కైవారిగళ్'అనగా నిలిచి చేయెత్తి రాజులను పొగడుటకు నియమితులయినవారని యర్థము.

9. కెడ్బెరసు : సంకీర్ణము, కలసినది.

'నానా మృగంబుల యెలుంగులతోడఁ గెడ్బెరసి' [కాశీ 1-93]

'రాజనందనుల యందియల మొరపంబుతోడఁ గెడబెరసి [శృ.నై 6-29]

కన్నడ : కెడబెరసు = కూడిక, కలయిక

3.4.8.2 తమిళము నుండి వచ్చిన ఎరవు పదములు :

1. తిరిపెము : భిక్షము, భిక్షుక వృత్తి.

'ఇది కట్టడ తిరిపెములకు' [కాశీ 7-52]

'తిరిపమున కిద్దఱాండ్రా' [శ్రీనా. చాటువు]

<తమిళము : తిరుప్పమ్ = తిరుగుచు [DED 2655]

2. తిరుచుట్టు : దేవాలయ ప్రాంగణము.

'ప్రదక్షిణంబు జేయునప్పుడు తిరుచుట్టు మాలికయందు' [భీమ 3-183]

<తమిళము: తిరుచుఱ్ఱు = దేవాలయ ప్రాంగణము.

3. తిరుచుట్టుమాలె : దేవాలయమున చిన్న దేవతల నుంచుటకై ఆవరణము చుట్టును కట్టిన కట్టడములు

'తిరుచుట్టుమాలెలోఁ దిరమైన గణపతి' [భీమ 3-31]

'మదన విధ్వంసి తిరుచుట్టు మాలెయందు' [భీమ 6-71]

<తమిళము: తిరుచ్చుఱ్ఱు - మాళికై

4. తిరునాళ్లు : దేవోత్సవము.

'అసమబాణుండు తిరునాళ్ల నన్నినాళ్ల' [క్రీడా 212]

'లంజియ లేమియ లేమిటికిఁగాకుళంపు తిరునాళ్ళ' [క్రీడా 211]

<తమిళము: తిరునాళ్ = శుభదినము, దేవోత్సవ దినము.

5. తిరుమల : వేంకటాచలము.

'కోయిలఁ దిరుమలఁ బెరుమా కోయిల' [కాశీ 5-288]

'తిరుమల విభు చామాధీశ్వరై కాగ్రజన్మా' [హర 1-31]

<తమిళము: తిరుమలై .

6. తిరువళ్లూరు : శైవక్షేత్రము.

'దీర్ఘతర తటాకాంభోధి తిరువళూరఁగావేరిఁ గట్టించె' [హర. పీ 10]

తమిళము. తిరువళ్లూర్ = తంజావూరు జిల్లాలోని శైవ క్షేత్రము

3. 4. 9 ఇవికాక ఈ క్రిందివి అన్యదేశ్యములని చిలుకూరి నారాయణరావుగారి యభిప్రాయము. వీనికి ఆశ్రయములు మృగ్యములు.

1. దీనారము[22]: ఇది బహుశః పారశీకపు నాణెము కావచ్చును.

'దీనారటంకాల తీర్థమాడించు' [శ్రీనా. వీధి]

దీనికి ల్యాటిను భాష మూలమని చిలుకూరి వారి అభిప్రాయము

2. దివాణము[23] : నికుంభు దివాణమున భృంగి కులపతికాఁగా [హర 5-9]

3. పోటి[24] : లోలార్కునకు నీకు లోలోన నేమేని పోటి పుట్టదుగదా'

[భీమ 2 88]

4 దేహరము : ధీనిధి నంబిసెట్టి తన దేహర మింటి విభూతి'

[హర 2-37, కాశీ 1-48]

ఇది హిందీ నుండి గ్రహింపబడినది కావచ్చును. దేవ + ఘర్.[25]



---

22 ఆంధ్రభాషాచరిత్ర 1-పుట 619 22. పైదే - పుట 602. 24. పైదే పుట 608
25. శబ్దసాగర్ - హిం. ని.

## 3.5.0 సర్వనామములు (Pronouns)

సర్వనామములను ప్రాథమికముగా నిర్మాణ క్రమము ననుసరించి ముఖ్యముగా విశేష్యముల యందే యంతర్భవింపజేయవచ్చును.

1. పురుష వాచక సర్వనామములు (Personal Pronouns)
2. ఆత్మార్థక సర్వ నామములు (Reflexive Pronouns)
3. నిర్దేశ సర్వనామములు (Demonstrative Pronouns)
4. ప్రశ్నార్థక సర్వనామములు (Interrogative Pronouns)

ఉత్తమ, మధ్యమ పురుష వాచక సర్వనామములు, ఆత్మార్థక సర్వ నామములు అన్ని లింగములయందు సమానముగా నుండును. లింగబోధ విషయమున నిర్దేశ, ప్రశ్న వాచక సర్వనామములు భిన్నముగా నుండును. సర్వనామముల ద్వితీయాది విభక్త్యంగ ప్రాతిపదిక ఇతర నామముల ద్వితీయాది విభక్త్యంగ ప్రాతిపదిక కంటె భిన్నము శ్రీవాధుని భాషలో వచ్చిన సార్వనామిక రూపము లీక్రింద చూపబడుచున్నవి కుండలీకరణమున చూపబడిన అంకెలు ఉపస్థితి పౌనఃపున్యము (frequency)ను తెలియజేయును

### 3.5.1 పురుష వాచక సర్వనామములు : (Personal Pronouns)

| ఉత్తమ పురుష : | ఏకవచనము | బహు వచనము |
|---|---|---|
| ప్రథమా విభక్తి | ఏ [14] | ఏము [25] |
| | ఏను [97] | మేము [16] |
| | నేను [118] | మనము [23] ఉభయార్థకము (Inclusive) |
| ద్వితీయావిభక్తి | నన్ | మము-న్ |
| | నను-న్ | మమ్ము-న్ |
| | నన్ను-న్ | మనల-న్ [ఉభయార్థకము] |
| తృతీయాది విభక్త్యంగము | నా- | మా- |
| | | మన- [ఉభయార్థకము] |

| మధ్యమ పురుష : | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్రథమా విభక్తి | ఈవు [60] | ఈరు [1] [క్రీడా 189] |
| | నీవు [230] | మీరు [84] మీరలు [21] |
| ద్వితీయా విభక్తి | ని-న్ | మిము-న్ |
| | ని-నున్, ని-న్నున్ | మిమ్ము-న్ |
| తృతీయాది విభక్త్యంగము | నీ- | మీ- |

ప్రథమ పురుష :

మహద్వాచకము :

| | | |
|---|---|---|
| ప్రథమా విభక్తి | వాఁడు [170] | వారు [210] వాండ్రు [2] |
| | | వార-లు [52] |
| ద్వితీయా విభక్తి | వాని-న్ | వారి-న్, వారల-న్ [4] |
| ద్వితీయాది విభక్త్యంగము | వాని- | వారి- |

మహతీ వాచకము :

| | |
|---|---|
| ప్రథమా విభక్తి | అది, అపె, అమె [3] |
| ద్వితీయాది విభక్త్యంగము | దాని-, అపె-, అమె- |

మహద్వాచక బహువచన రూపములే మహతీ వాచకమున కూడ బహువచనమున వచ్చును.

మహతీతరామహద్వాచకము :

| | | |
|---|---|---|
| ప్రథమా విభక్తి | అది, అద్ది, అయ్యది [2] | అవి, అయ్యవి [1] [కాశీ 6-82] |
| ద్వితీయా విభక్తి | దాని-న్ | వాని-న్ |
| ద్వితీయాది విభక్త్యంగము | దాని- | వాని- |

### 3.5.2 ఆత్మార్థక సర్వనామములు : (Reflexive Pronouns)

| | | |
|---|---|---|
| ప్రథమా విభక్తి | తాను [92] తా-[43] | తారు [19] తాము [8] |
| | | తమరు [1] |

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ద్వితీయా విభక్తి | త-న్, తను-న్, తన్ను-న్, తాను-న్ | తమ్ము-న్ [1] [శృ.నై 1-70] తము-న్ [1] [శృ.నై. 7-65] తారు-న్ [4] |
| ద్వితీయాది విభక్త్యంగము | తన- | తమ- |

## 3. 5. 3. నిర్దేశ సర్వనామములు : (Demonstrative pronouns)

నిర్దేశ సర్వనామ ప్రాతిపదికలకు లింగ - వచన ప్రత్యయములు చేరుటచే నివి యేర్పడుచున్నవి. ఇవి రెండు విధములు.

1. అ - దూరవర్తి (remote) ని, 2 ఇ-సమీప వర్తి (proximate) ని తెలియ జేయును. దానిపైని 'త' వర్ణము చేరుటచేత సర్వనామ మహద్వాచక ప్రాతిపదిక లేర్పడును.

1. దూరవర్తిని నిర్దేశించు సర్వనామములు :

| మహద్వాచకము : | ఏక వచనము | బహు వచనము |
|---|---|---|
| ప్రథమా విభక్తి | అతఁడు, ఆతఁడు, వాఁడు | |
| ద్వితీయా విభక్తి | అతని-న్, ఆతని-న్, వానిన్ | |
| ద్వితీయాది విభక్త్యంగము | అతని-, ఆతని-, వాని- | |

ప్రథమ పురుష మహద్వాచక బహువచనములే దీనియందును వచ్చును.

2. సమీపవర్తి నిర్దేశించు సర్వనామములు :

మహద్వాచకము :

| | |
|---|---|
| ప్రథమా విభక్తి | ఇతఁడు, వీఁడు [22] వీరు [18] వీరలు [3] ఈతఁడు, ఈయన [2] |
| ద్వితీయా విభక్తి | ఇతని-న్. ఈతని-న్, వీని-న్, వీరి-న్ |
| ద్వితీయాది విభక్త్యంగము | ఇతని-,ఈతని-,వీని- వీరి-,వీరల[1][వ.వి21] |

| మహతీ వాచకము : | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్రథమా విభక్తి | ఇది | |
| ద్వితీయా విభక్తి | దీని-న్ [4] | [శృ నై 3-188] |
| ద్వితీయా విభక్త్యంగము | దీని-[22] | |

మహద్వాచక బహువచన రూపమున మహతివాచకమున కూడ బహువచనమున వచ్చును.

మహతీతరామహద్వాచకము :

| | | |
|---|---|---|
| ప్రథమా విభక్తి | ఇది, ఇయ్యది [2] | ఇవి |
| ద్వితీయా విభక్తి | దీని-న్ [8] | వీని-న్ |
| ద్వితీయాది విభక్త్యంగము | దీని- [9] | వీని- |

### 3.5.4 ప్రశ్నార్థక సర్వనామములు : (Interrogative Pronouns)

నిర్దేశ సర్వనామము లేర్పడినటులే ప్రశ్నార్థక సర్వనామములు కూడ ఏర్పడుచున్నవి

మహద్వాచకము :

| | | |
|---|---|---|
| ప్రథమా విభక్తి | ఎవ్వఁడు, ఎవ్వాఁడు | ఎవ్వరు, ఎవ్వారు [2] |
| | ఏరు [2] | ఏవారు [1] వేరు [3] |
| | | ఎవ్వారలు [3] |
| ద్వితీయా విభక్తి | ఎవ్వని-న్, ఎవ్వాని-న్ | ఎవ్వరి-న్, ఎవ్వారి-న్ |
| ద్వితీయాది విభక్త్యంగము | ఎవ్వని-, ఎవ్వాని- | ఎవ్వరి-, ఎవ్వారి- |
| | ఎవని- ఏని- [3] | ఎవరి- [1] ఏవారి [1] |

మహతీ వాచకము :

| | | |
|---|---|---|
| ప్రథమా విభక్తి | ఎవ్వత [1], ఎవ్వతె | — |
| ద్వితీయా విభక్తి | — | — |
| ద్వితీయాది విభక్తి | ఎవతె- | — |

మహాతీత రామహద్వాచకము :

| | | |
|---|---|---|
| ప్రథమా విభక్తి | ఎద్ది, ఏది [1] | ఎవ్వి |
| | ఎయ్యది | ఎయ్యవి |
| ద్వితీయా విభక్తి | ఎద్దాని–న్ [11] | |
| ద్వితీయాది విభక్త్యంగము | ఎద్దాని– [2] | |

3 5.5 1 శ్రీనాధ పదప్రయోగ కోశమున ఉత్తమపురుష ప్రథమైక వచనము 'ఏను' 97 పర్యాయములు, 'నేను' 118 పర్యాయములు శ్రీనాధుడు ప్రయోగించినటులు సూచింపబడినది. నేను శబ్దముతో ప్రయోగించిన ప్రయోగములను పరిశీలింపగా నవి నిర్ధారకములని యనుట కవకాశము చాలదు. కావున శ్రీనాధుని భాషలో నేను శబ్దము ఏను శబ్దము కంటె పెక్కు పర్యాయములు ప్రయోగించినను నిర్ధారక ప్రయోగములు లేమి 'ఏను' శబ్దమునే శ్రీనాథుడు ప్రయోగించెననుట సమ్మతము యతి స్థానమున గల ఈ క్రింది ఉదాహరణములు దీనికి తార్కాణము.

'ఏను నీ వంశ నామంబు లెవ్వి యనిన' [శృ నై 4–50]

'ఎందరబ్బరు నీకు నేను సైతంబుగా' [కాశీ 6–224]

2. యుష్మదర్థక ప్రథమా బహువచనమున 'ఈరు' అను రూపముతో ఒకే ప్రయోగము శ్రీనాధునిలో కలదు.

'ఎందుండి వచ్చితిరీరు ? కొసల్పాటనుండి' [క్రీడా 189]

3 మేము, ఈరు అను సర్వనామములతోడి రూపములు నన్నెచోడునిలో లేవు. కాని నన్నయ, తిక్కనల భాషలో ప్రయుక్తములు

4. నే–ను, మే–ము, నీ–వు, మీ–రు అను ప్రథమా విభక్తి సర్వనామముల అంత్యవర్ణములు లోపించి పరిణతి పొందగా ఉత్తమ, మధ్యమ పురుషైక బహువచనములందలి తృతీయాది విభక్త్యంగ రూపములైన నా–, మా–, నీ–, మీ– అను రూపములు ఏర్పడుచున్నవి.

5. ద్వితీయా విభక్త్యంత ప్రత్యయములైన -ను, -ములు ద్విత్వము నొందునపుడు విభక్త్యంగములోని దీర్ఘాచ్చు ద్వితీయా విభక్త్యంగములో హ్రస్వముకాగా నన్ను-, మమ్ము-, నిన్ను-, మిమ్ము- అను రూపము లేర్పడు చున్నవి.

6. ఉత్తమ, మధ్యమ పురుషల ఏక వచన విభక్త్యంగము నా-, నీ-, రూపములు, ఆత్మార్థక సర్వనామముల ఏకవచన విభక్త్యంగము తన- అను రూపము సర్వ సాధారణముగ ప్రయుక్తమైనను షష్ఠీ విభక్త్యేక వచనమున నాదు- [14], నీదు- [16] తనదు- [4] అను ప్రత్యేక రూపములు కూడ కలవు.

'నా-దు ప్రతిజ్ఞ' [శృ నై 4-70]

'నీ-దు సౌందర్యవిభవంబు నిష్ఫలంబు' [శృ నై 2-24]

'తన-దు రూపు' [హర 4-3]

తన-దు అను రూపము నన్నయ, తిక్కనల భాషలో నుండగా నన్నెచోడునిలో లేదు ఆత్మార్థకషష్ఠీ బహువచనమున మనదు-[ఉభయార్థకము తోడి విశిష్ట ప్రయోగము తిక్కనలో కలదు.

'మనదు శాస్త్ర మంచితమగు కుశాస్తరణమున' [ఆను 3-130]

ఆత్మార్థక ప్రథమా బహువచనమైన 'తాము' నన్నయ, నన్నెచోడుల భాషయందు లేదు. ఇది తిక్కన నాట నుండి ప్రయుక్తము

తాను, తాము అను ఆత్మార్థక సర్వనామముల ప్రథమా విభక్త్యంగము లోని దీర్ఘాచ్చు ద్వితీయా విభక్త్యంగములో హ్రస్వమై, ప్రాతిపదికపై -అ ప్రత్యయము చేరుచున్నది.

తాను > తన : తనదాన మహిమ [శృ.నై. 1-9]

తాము > తమ : తమ మనంబుల భావన సేసి [శృ నై 1-31]

7. మీరు, వారు, వీరు, తాము- అనునవి బహువచనములైనను వానికి పూజ్యార్థమున మీరలు [21] వారలు [55] వీరలు [3] తమరు [1]

అను ద్విగుణీత బహువచనము తోడి ప్రయోగములు శ్రీనాథునిలో కలవు.

మీరలు : అభిమానించిన మీరలేడ్వురు [భీమ 4-207]

వారలు : ఈయున్నవారలందఱు నాయానతి [భీమ 6-96]

వీరలు : వీరలవిముక్త క్షేత్ర సప్తమావరణ దేవతలు [కాశీ 6-99]

తమరు : ఇబ్బంగి మెచ్చుచు నింతులు తమరు చల్లులాడుచు [కాశీ 6-99]

గౌరవ వాచకమున ఏక వచనమునకు బదులు బహువచనము వాడబడుచున్నది.

మాకు మాకు నాయంబె నీతోడ మాటలాడ [శృ నై 4-50]
[దమయంతి వాక్కులు]

మీకు : మీకు మేలయ్యెడుఁబోయి వచ్చెద [కాశీ 1-105]
[వింధ్యపర్వతము నుద్దేశించి]

8 వాన్-, వార్-, దాన్- అను సర్వనామ ప్రాతిపదికలకు -ఇ అను ప్రత్యయము చేరుటచే ద్వితీయాది విభక్త్యంగమేర్పడుచున్నది

వాన్ - ఇ > వాని, వార్ - ఇ > వారి, దాన్ - ఇ > దాని.

9 ప్రథమ పురుష మహద్వాచక బహువచనమున 'వాండ్రు' అను రూపము ఒకే పర్యాయము శ్రీనాథ ప్రయుక్తము.

'ఏకార్థక్రియన్మించువాండ్రు భవార్ప్రారతినెంచ' [భీమ 4-207]
తిక్కనలో 'వారలరు' [నిర్వ రా 10-123], 'వాండ్రు - రు' [శాం 3-284] అనువిశిష్ట ప్రయోగములు గలవు తిక్కనలో 'వీండ్రు' [విరా. 3-22] అను బహువచనము, నన్నెచోడునిలో 'వీండు' అను ఏకవచనము కలదు. శ్రీనాథునిలో నిట్టి రూపములు లేవు

వీరలన్- అను ద్వితీయా బహువచన రూపము, నన్నయ, తిక్కనల భాషలో కలదు. కాని నన్నెచోడ, శ్రీనాథుల యందిట్టి ప్రయోగము లేదు.

10. మహద్వాచక ప్రథమ పురుషైక వచన సర్వనామములైన 'వాఁడు, వీఁడు, ఎవ్వఁడు' మహతీ వాచకము నందలి 'అది' మొదలగు శ్రీనాథ ప్రయుక్త రూపములు ఆధునిక భాషలో నైనట్లు అగౌరవ సూచకములు కావు.

వాఁడు : పార్వతీశ్వరుఁడు వాఁడె [కాశీ 5-177]

వీఁడు : వీఁడు చిఱుతొంత నంబికంటె నధికుండు [హర 2-81]

ఎవ్వఁడు : ఎవ్వఁడే పదార్థ మెంతేని జింతించున్ [భీమ 3-143]

అది : అదె యరుంధతి [హర 4-70]

11. ప్రథమ పురుష మహతీ వాచక ప్రథమైక వచనము 'అది' అను రూపము నకు తోడు ఆమె [హర 2-104], ఆపె [భీమ 6-64, 6-75] అను రూపములును, ద్వితీయా విభక్త్యంగముగ ఆపె [భీమ 6-69] అను రూపముతోను శ్రీనాథునిలో ప్రయోగములు గలవు

ఆమె : ఆసిన నామెయు నట్లకాకయని [హర 2-104]

ఆపె : అన విని చని ఆపె ఆవార్త చెప్ప [భీమ 6-64]

ఆపె-కె : అనుకొన్న ఫలమేమి ఆపెకె తెలియు [భీమ 6-69]

12. నిర్దేశ ప్రశ్నార్థక సర్వనామములకు ఔప విభక్తిక ప్రత్యయమైన 'ఇ' వర్ణము చేరి ద్వితీయాది విభక్త్యంగమేర్పడుచున్నది.

13. సమీపవర్తి నిర్దేశ ప్రాతిపదికకు - అన ప్రత్యయము చేరి 'ఈయన' [2] అను రూపమేర్పడు చున్నది.

'దుర్జనుల కీయన రౌద్రాకారుడై' [కాశీ 3-150]

14 ఎవ్వఁడు, ఎవ్వరు అను ప్రశ్నార్థక సర్వనామములు ద్విత్వరహితముగ శ్రీనాథునిలో రెండు సందర్భములలో ప్రయోగింపబడినవి.

'పాథేయ మెవనికి బ్రాహ్మణికము' [భీమ 6-6]

'అహికంకణ మెవరికైన నలవియె' [భీమ 5-127]

15. ప్రశ్నార్థక సర్వనామమైన 'వేరు' అను రూపము 'ఎవరు' అను నర్థమున శ్రీనాథునిలో కన్పించుచున్నది ఇది యితర రూపములతో సమత్వము పొందుచున్నది.

'వేరీ నిన్నెదిరింపగా జగమునన్ వీరలు' [హర 7-145]

16. అయ్యది [అ + అది], ఇయ్యది [ఈ + అది], ఎయ్యది [ఏ + అది] అనునవి కూడ అది, ఇది, ఏదితో పాటు నిర్దేశ ప్రశ్నార్థక సర్వనామములుగా వాడబడినవి.

'ఏముం జిత్తమందెంతు మయ్యది' [హర 2-132]

'పరమ బ్రహ్మార్థ సంసిద్ధియియ్యది సుమ్మన్న' [హర 2-117]

'ఎయ్యది కారణంబుగ మహీపతి' [శృ.నై 1-83]

17. ఎద్ది, ఏది, ఎయ్యది అనువాని ద్వితీయా విభక్తి రూపము ఎద్దాని-న్ 11 పర్యాయములు ప్రయోగింపగా, విభక్త్యంగ రూపమైన 'ఎద్దాని'-రెండుపర్యాయములు శ్రీనాథునిలో ప్రయుక్తమైనది.

ఎద్దాని - యందు బ్రహ్మాస్థంబగు జగంబు [కాశీ 6-260]

ఎద్దాని - యందాదర్శంబు నందు [కాశీ 6-250]

18. కొన్నియెడల మహద్వాచకముగా 'అది' అను సర్వనామ ముపయుక్తమై కన్పట్టు చున్నది

'అది యెవ్వరని ప్రతీహారులెవ్వరి నన్నదన్నుగాదలంచి చిత్తమున నులుకు' [శృ.నై 3-84]

19. మధ్యవర్తి నిర్దేశించు సర్వనామమైన 'ఉల్ల' తోడి ప్రయోగము శ్రీనాథునిలో కలదు.

'మేలుగాకేమి టంకాల జాళెము లెవ్వి ?
యుల్ల వెట్టియు నిండియున్న యవివె' [కాశీ 7-247]

## 3.6.0 సంఖ్యావాచకములు (Numerals)

సంఖ్యావాచక శబ్దములు నిర్మాణ క్రమములో విశేష్యముల వంటివి ఇవి ప్రాథమిక సంఖ్యావాచకములని, (Cardinals) సార్వనామిక విశేషణములని (Ordinals) రెండురకములు ప్రాథమిక సంఖ్యా వాచకములకు 'అగు' ధాతు రూపములను చేర్చియు, అస్వతంత్ర సంఖ్యావాచక విశేషణ ప్రాతిపదికలకు లింగ వచన బోధక ప్రత్యయములను చేర్చియు రెండు విధములుగ సార్వనామిక విశేషణము లను నిర్మింప వచ్చును. లింగ వచనాదులందు నీ సంఖ్యావాచక రూపములు భిన్నముగ కనబడుచున్నవి వానికి విభక్తి పరమైనపుడు రూప భేదము కలుగుచున్నది. అవి విశేష్యములుగను, విశేషణములుగను రెండు విధములుగ నుండును ఒకటి నుండి పదివరకు గల సంఖ్యావాచకములు, నూఱు, వేయి అనునవి స్వతంత్రమైన పదాంశములు.

ఈ క్రింద సూచించిన సంఖ్యావాచకములు శ్రీనాథుని భాషలో కన్పించు చున్నవి కుండలీకరణమున సూచించిన అంకెలు వాని ఉపస్థితి పౌనఃపున్యమును (frequency) సూచించును

## 3.6.1 ప్రాథమిక సంఖ్యా వాచకములు : (Cardinals)

### 3.6.1.1 మహద్వాచకములు :

1. ఏకవచనము : ఒక్కఁండు [9], ఒక్కఁడు [13]
   ఒక్కఁడు [2]
   ఒకండు [1] ఒకఁడు [27], ఒకడు [5]
   ఒకొండు [1]

   బహువచనము : ఒక్కఁండ్రు [3] ఒక్కరు [2]

2. ఏకవచనము : ఒక్కరుండు [9] ఒక్కరుఁడు [6] ఒక్కరుడు [1]
   ఒకరుండు [3] ఒకరుఁడు [1]

   బహువచనము : ఒకళ్ళు [1]

3. ఏకవచనము : ఒరుండు [1] ఒరుఁడు [2]

బహువచనము ఒరులు [1] ఒండొరువులు [1]

ఒడ్లు [1]

4 ఏకవచనము : ఒండు [1]

బహువచనము : ఒండులు [1]

3.6.1.2. మహతీవాచకములు :

ఒక్కతె [11], ఒక్కత [2], ఒకతె [1], ఒక్కతి [1]

ఒకర్తు [4], ఒక్కర్తు [2], ఒకర్తె [1]

ఓర్తు [31]

3 6.1.3 మహతీతరాబహుద్వాచకము :

ఏకవచనము : ఒండు [20]

ఒక్కటి [31] ఒకటి [34]

రెండు [22]

మూడు [5] మూఁడు [21]

నాలుగు [11] నాల్గు [29]

ఐదు [26] అయిదు [4] ఏను [2]

అఱు [7] ఆరు [3]

ఏడు [14]

ఎనిమిది [3] ఎన్మిది [1] ఎనిమిదుల్ [11]

తొమ్మిది [2] తొమ్మిదులు [బహు] [1]

తొమ్మండ్రు [1]

పది [16] పదులు [2]

పదునొక్కఁడు [1] పదునొకొండు [1]

పదుమువ్వురు [1]

పదునాలుగు [1] పదునాల్గు [1]

పదియేను [1] పదునేను [1] పదేను [1]

పదాఱు [3] పదియాఱు [3] పదునారు [2]

పదియేడు [1]

పదునెనిమిది [4]

ఇఱువది [1]

ముప్పది [1]

ఏఁబది [2]

అఱువది [1]

డెబ్బది [1]

ఎనుబది [1]

తొంబది [1]

నూరు [1] నూఱు [13] నూఱులు [1]

వేయి [4] వే [3] వేయు [7] వేలు [12]

ఈ ప్రాథమిక సంఖ్యా వాచకములన్నియు నమహత్తుల'నుండి నిష్పన్నము లైనవి.

3 6 1.4 ఒకటి: మొదటి సంఖ్యా వాచకమునకు మహత్-మహతీ-అమహద్రూప ములు మూడు ఉన్నవి అమహద్రూపమే సంఖ్యావాచక విశేష్యము.

3.6.1.5 మహతీతరామహద్వాచకములు :

ఒక్కండు [1] ఒక్కఁడు [1] ఒక్కడు [4]

ఒక్కండు : ఒక్కఁడొక్కండు చాలు దోషోత్కరమునన్ [శివ 2-86]

ఒక్కఁడు : కళలు పదునొక్కఁ డెక్కు రుద్రుల శిరంబు [శృ నై 8-188]

ఒకఁడు : ధర్మ మొకఁడేరి కొనుఁడు విద్వాంసులార [శృ.నై 7-73]

ఒక్కటి : ప్రశ్నయొక్కటి యొక్కటి ప్రతివచనము [శృ.నై 4-50]

ఒకటి : కావ్యమొకటి గావింపఁదలఁచి [భీమ 1-17]

ఒండు : ఒరిమ నొండొంటిఁ జూచు నాభరణములును [శృ.నై 6-61]

ఒండేనిన్ · తీవ్ర భయ సంత్రాసార్త మొండేనిన్ [శృ నై. 5-46]

'ఒండెన్' అనునది ద్రుతాంతమగు నవ్యయము. దీనికి 'వికల్పము' నని యర్థము ఇట్టి యర్థమున తొలుత శ్రీనాథుడే 'ఒండేనిన్' అని వాడినాడు 'ఒండె'ను ప్రత్యేకముగ గూడ ప్రయోగింప వచ్చును.

'అష్టమీ వాసరంబున యందునొండె
నొండెనేని చతుర్దశి'.... [భీమ 6-72]

ఇట్టి ప్రయోగమును భారత కవులు ప్రయోగింప లేదు

3.3.1.6 మహద్వాచక రూపములు :

ఏకవచనము :

ఒకఁ౦డు : ధరలో నొక్కండు పేరుక్కునన్ [శృ నై 1-36]

ఒక్కఁడు : బత్తుడొక్కఁడు మధుపాన మత్తుడగుచు [హర 2-76]

ఒక్కఁడు సేవకుడొక్కఁడు చేదండ యివ్వ [ప.వీ 30]

ఒకండు : ఆ వేళ నొకండు లేమి యద్భుతమయ్యెన్ [హర 2-39]

ఒకఁడు : ఆనతిఁదగు నాకు మీలోన నొకఁడు [భీమ 4-44]

ఒకడు : పట్టిక సుందర ఘటు డొకడేగ [ప.వీ 16]

ఒకొండు : పదియుఁ బదునొకొండు దినములు వర్షించు [హర 2-15]

బహువచనము :

ఒక్కండ్రు : పదియు నొక్కండ్రు రుద్రులు [కాశీ. 4-164]

ఒక్కరు : ఒక్కరినొక్కరు ఒగి బిల్చికొనుచు [ప.వీ 45]

2. ఏకవచనము :

ఒక్కరుండు: ధూర్తుఁ డొక్కరుం డివ్వల వచ్చి [శృ.నై 6-113]

ఒక్కరుఁడు : ధరణి నొక్కరుఁ డున్నను [హర 5-297]

ఒక్కరుడు : వెనుక నొక్కరు డుండు వినయంబుతోడ [ప వీ 30]

ఒకరుండు : వాడొకరుండు భరంబు ధాత్రికిం [శృ.నై 3-56]

ఒకరుఁడు : ఒకరుఁడేణ విలోచన బంతిపట్టి [శృ.నై 6-.32]

బహువచనము :

ఒకళ్ళు : ఆవేళ నొకళ్ళు లేమి యద్భుత [హర 2-39]

3. ఏకవచనము :

ఒరుండు : జగత్ప్రపంచ పరికల్పనసేయఁగ లేఁడు తక్కొరుండు [శివ 1.76]

ఒరుఁడు : ఒరుఁడు గలసిన నీ ధనంబెల్లఁజూపె [కాశీ 7-247]

బహువచనము :

ఒరులు : అడ్డపడువారె యొరు లతఁ డలిగినపుడు [కాశీ 5-324]

ఒండొరువులు : ఒండొరువులుఁ దాఁకిన భండనంబు [శివ 4-75]

ఒడ్లు : మేని వస యొడ్లకు గల్గనె [క్రీడా 65]

4. ఏకవచనము :

ఒండు : నలుండు గాక యొండెవ్వఁ డనఁగమెచ్చు [శృ.నై 1-77]

బహువచనము :

ఒండులు : ప్రియంబున నొండులతోడ [శృ.నై 6-113]

ఒరుండు మొదలగు రూపములు ఇతరుఁడు/ఇతరులు అను అర్థముననే వాడబడినవి. 'చిలుకూరి' వారి నిర్ణయానుసారము ఒరుడు >* ఒర్డు > ఒడ్డు

**3.6.1.7 మహతీవాచకములు :**

ఒక్కతె : శుద్ధాంత వధూటి యొక్కతె ప్రియంబునన్ [శృ నై 6-45]

ఒక్కత : కాంత యొక్కత సురుచి యొక్కత [కాశీ 4-280]

ఒకతె : కర్పూర తిలక నాగమణిక యొకతె [కాశీ 6-139]

ఒకర్తు : లలనయొకర్తు వగ్గు కృకలాసము జేరఁగదెచ్చి [శృ.నై 6-111]

ఒక్కర్తు : వెల్లకిలఁబెట్టె నుత్పలగంధి యొక్కర్తు [శివ 2-71]

ఒకర్తె : అంతఃపుర పరిచారిణి యొకర్తె [శివ 2-63]

ఒక్కతి : కమల యొక్కతియు నొక్క ముఖంబున [కాశీ 6-73]

ఓర్తు : సైరంధ్రి యోర్తు [కాశీ 5-16]

తిక్కన 'ఒకత' అను రూపమును పై దానికి తోడు విశేషముగ ప్రయోగించెను.

ఒకత . ఒకతకుఁ బనిసేయ నెఱుంగ [విరా 2-219]

**3.6.1.8 (స్త్రీ) పుంసామాన్య బహువచనము : (Epıeine Plural)**

ఒరులు [ఇతరులు] అల్పు లొరుల కమ్మహత్త్వంబు గలుగునే? [కాశీ 5-94]

**3.6.1.9 ద్వితీయాది విభక్త్యంగము :**

ఔపవిభక్తిక ప్రత్యయములు చేరికవలననే ఈ సంఖ్యావాచకములకు ద్వితీయాది విభక్త్యంగమేర్పడుచున్నది.

ఒక్కటన్ : [శివ 1-24] ఒక్కంటి-తోన్ [శివ 4-61]

ఒండొంటి-ం [హర 5-16] ఒంటి-న్ [శివ 3-125]

ఒంట : అర్క సంపర్కమున దక్క నగునె యొంట? [శృ.నై 2-70]

రెంట-న్ [శృ.నై 3-184] రెంట-ను [హర. 4-58]

రెంటి-లో [శృ.నై 3-166] రెంటి-కి [భీమ 6-6]

| | | | |
|---|---|---|---|
| మూఁటి-కిన్ | [హర 5-48] | మూఁటి-ని | [శివ 1 69] |
| మూఁటి-యందు | [శృ.నై 6-87] | నాలుగిటి | [క్రీడా 52] |
| నాల్గింటి-నిన్ | [కాశీ 5-210] | నాల్గింటి-లోన్ | [కాశీ 3-209] |
| ఐదిటి-కి | [కాశీ 5-221] | ఏడింటి-కి | [భీమ 2-77] |
| పదు-నాలుగింటి-కిన్ | [శృ నై 1-47] | నూట- | [భీమ 2-52] |
| వేయిటి-కిన్ | [భీమ 6-65] | | |

వేయి అను రూపమునకు ఉవర్ణాంతమైన 'వేయు' సముచ్చయము తోడి రూపము కలదు. వీనికి తోడు 'వే' అను రూపమును కలదు.

వేయు : నయనములు వేయు విరియించి నాకభర్త [శృ.నై 4-64]

వే : కంకటముబోని వే జాలకములయింటి [శృ నై 6-106]

## 3 6.2. సంయుక్త సంఖ్యా వాచకములు : (Compound Numerals)

సంకలనముచే (addition) గుణకారముచే (multiplication)సంయుక్త సంఖ్యావాచకము లేర్పడుచున్నవి

పదికి - ఒకటి నుండి తొమ్మిది వఱకు గల సంఖ్యలు కలసినచో సంకలన మేర్పడుచున్నది

రెండునకు -వంద, వేయి అను సంఖ్యలు రెండవ అవయవిగా నుండి గుణకారమును పొందినయెడల సంయుక్త సంఖ్యా వాచకములగును సకృత్తుగా ఒకట్ల స్థానమునందున్న సంఖ్యలు కూడ గుణకారమును పొందుచుండును

### 3.6 2.1 సంకలనము : (Addition)

| | | | |
|---|---|---|---|
| నాలుగు మూడు | : | [4 + 3 : 7] | [కాశీ 3-87] |
| పదునొక్కఁడు | | [10 + 1 11] | [శృ నై 8-88] |
| పన్నిద్దఱు [2] | . | [10 + 2 : 12] | [కాశీ 6-94] |
| పండ్రెండు [9] | : | [10 + 2 : 12] | [భీమ 3-118] |

| | | | |
|---|---|---|---|
| పదియు రెండు [7] | : | [10 + 2 : 12] | [భీమ 3-158] |
| పదు మువ్వురు [1] | : | [10 + 3 : 13] | [కాశీ 6-84] |
| పదు నాలుగు [1] | : | [10 + 4 : 14] | [శృ నై 1-47] |
| పదు నాల్గురు | : | [10 + 4 : 14] | [భీమ 3-206] |
| పదు నాల్గు [1] | : | [10 + 4 : 14] | [హర 5-40] |
| పదియు నాలుగు [1] | : | [10 + 4 : 14] | [కాశీ 2-128] |
| పది యేను [1] | : | [10 + 5 : 15] | [శృ.నై 8-200] |
| పదునేను | : | [10 + 5 : 15] | [వ పీ 50] |
| పదేను | : | [10 + 5 . 15] | [భీమ 1-9] |
| పదునారు | : | [10 + 6 : 16] | [వ పీ 18] |
| పదాఱు | : | [10 + 6 . 16] | [హర 2-93] |
| పదియాఱు | : | [10 + 6 . 16] | [శృ నై 6-142] |
| పదియునాఱు | : | [10 + 6 : 16] | [కాశీ 4-91] |
| పదియేడు | : | [10 + 7 : 17] | [కాశీ 1-12] |
| పదు నెనిమిది | : | [10 + 8 : 18] | [భీమ 1-103] |
| పదియు నెనిమిది | : | [10 + 8 : 18] | [కాశీ 1-71] |
| పదియు పదునొకండు | : | [10+10+1 : 21] | [హర 2-15] |
| ఎనిమిది పది | : | [8 + 10 : 18] | [వ పీ 19] |

తొంబదినూఱును తొంబదితొమ్మిది : [900 + 99 : 999] [భీమ 6-65]

ఇన్నూఱు మున్నూఱు నేనూఱు : [200 + 300 + 500 : 1000]
[శృ.నై 6-72]

వేయిన్నాఱు న్నూఱు [1000 + 600 : 1600] [కాశీ 5-244]

రెండువేలు నిన్నూట రెండు [2000 + 202 : 2202] [కాశీ 1-135]

1. 11, 16, 18 – అను సంఖ్యావాచకములకు – ఉన్ అను సముచ్చాయక ప్రత్యయము చేరుచున్నది

పదియు నొక్కండు [కాశీ 7-86] పదియునారు [కాశీ 4-91]
పదియు నెనిమిది [కాశీ 1-71]

'ఉన్' చేరక 'పదియేను' అనురూపము, పదేను [పది + ఏను] అను రూపము శ్రీనాథుని భాషలో కలవు

పదియేను : పదియేను దినంబులకు [శృం.నై 8-200]
పదేను : పదేను పర్వములు [భీమ 1-9]

2. 11, 13, 14, 15, 16, 18 – అను సంఖ్యలకు పది బదులు 'పదు రూపముచేరుచున్నది.

పదునొక్కండు [శృం.నై 8-188] పదుముప్వురు [కాశీ 6-84]
పదునాలుగు [శృం.నై 1-47] పదునేను [ప వీ 50]
పదునారు [ప వీ 18] పదునెనిమిది [భీమ I-103]

3. 15, 16 అను సంఖ్యలకు పది బదులు 'పద్' రూపము గ్రహింపబడినది.

పదేను [భీమ 1-9] పదాఱు [హర 2-93]

4 గుణకారము చెందిన పదికి పరముగా ఒకటి నుండి ఆపైన వచ్చు సంఖ్యలు కలిసి సంకలన మగుచున్నది.

ఇరువది రెండు : [20 + 2 : 22] [హర 2-24]
ఇరువై నాలుగు : [20 + 4 : 24] [కాశీ 1-53]
ఇది వ్యావహారిక రూపము
ఇర్వదేను : [20 + 5 : 25] [కాశీ 4-19]
ఇరువదేడు : [20 + 7 : 28] [కాశీ 4-195]
ఇరువైతొమ్మిది : [20 + 9 : 29] [కాశీ 3-51]

| | | | |
|---|---|---|---|
| ముప్పదిమూడు | : | [30 + 3 : 33] | [శృ.నై 5-21] |
| ఏఁబది యాఱు | : | [50 + 6 : 56] | [శివ 3-68] |
| అఱువది యేగురు | : | [60 + 5 : 65] | [క్రీడా 118] |
| అర్వది నాల్గు | : | [60 + 4 : 64] | [భీమ 3-179] |
| అర్వదార్గురు | : | [60 + 6 : 66] | [వ. వీ 97] |

5. గుణకారము చెందిన నూరు అను సంఖ్యకు పరముగా ఒకటి నుండి తొమ్మిది వరకు వచ్చు సంఖ్యలు కలిసి సంకలనమగుచున్నవి. గుణకారము చెందిన నూరు అను సంఖ్యకు పరముగా ఒకటి మొదలైనవి చేరినపుడు నూఱు అనురూపము ఔపవిభక్తికము పొందును.

నూటొక్క [వ. వీ 2] నూట యెనిమిది [భీమ 2-66]

నూటయొక్కండ్రు త్రోవలంది [కాశీ 7-165]

నూటముప్పది యొక్కండు [ఫిర. శా]

6. రెండు, ఇద్దఱు అను సంఖ్యా వాచకములకు పూర్వము 'పన్' – అను విశేషణరూపము చేరును

| | | | |
|---|---|---|---|
| పన్ + రెండు | : | పండ్రెండు | [భీమ 3-18] |
| పన్ + ఇద్దరు | : | పన్నిద్దరు | [కాశీ 6-94] |

### 3.6.2.2 గుణకారము (Multiplication)

| | | | |
|---|---|---|---|
| ఈరేడు | : | ( 2× 7 : 14) | [హర 3-25] |
| రెండెనిమిదుల్ | : | ( 2× 8 : 16) | [క్రీడా 155] |
| ముయ్యాఱు | : | ( 3× 6 : 18) | [కాశీ 7-190] |
| ఇఱువది/ఇరువై | : | ( 2× 10 : 20) | [కాశీ 6-131] |
| ముయ్యేడు | : | ( 3× 7 : 21) | [హర 2-15] |
| ముప్పది | : | ( 3× 10 : 30) | [కాశీ 3-64] |

| | | | | |
|---|---|---|---|---|
| మూఁడుపదులు | : | ( 3× 10 : 30) | [కాశీ 6-131] |
| ఏఁబది | : | ( 5× 10 : 50) | [కాశీ 1-8] |
| ఐదుపదులు | : | ( 5× 10 : 50) | [భీమ 1-26] |
| అఱువది | : | ( 6× 10 : 60) | [భీమ 2-52] |
| డెబ్బది | : | ( 7× 10 : 70) | [కాశీ 3-186] |
| ఎనుబది | : | ( 8× 10 : 80) | [శివ 4-15] |
| తొంబది | : | ( 9× 10 : 90) | [భీమ 6-65] |
| ఇన్నూఱు | : | ( 2× 100 : 200) | [శృ.నై 6-72] |
| మున్నూఱు | : | ( 3× 100 : 300) | [శృ.నై 6-72] |
| నన్నూఱు | : | ( 4× 100 : 400) | [కాశీ 5-192] |
| ఏనూఱు | : | ( 5× 100 : 500) | [శృ.నై 6-72] |
| అఱునూఱు | : | ( 6× 100 : 600) | [భీమ 6-78] |
| ఆర్నూఱు | : | ( 6× 100 : 600) | [కాశీ 5-144] |
| ఏడ్నూఱు | : | ( 7× 100 : 700) | [కాశీ 5-286] |
| తొంబనూఱు | : | ( 9× 100 : 900) | [భీమ 6-64] |
| పదినూఱులు | : | (10× 100 : 1000) | [కాశీ 6-248] |
| రెండువేలు | : | ( 2 × 1000 : 2000) | [కాశీ 2-128] |
| మూఁడు వేలు | : | ( 3 × 1000 : 3000) | [ప.వీ 44] |
| నాలుగు వేలు | : | ( 4 × 1000 : 4000) | [ప.వీ 44] |
| అయిదువేలు | : | ( 5 × 1000 : 5000) | [ప.వీ 44] |
| ఆఱువేలు | : | ( 6 × 1000 : 6000) | [ప.వీ 44] |
| ఏడువేలు | : | ( 7 × 1000 : 7000) | [ప. వీ 69] |
| ఎనిమిది వేలు | : | ( 8 × 1000 : 8000) | [కాశీ 6-148] |
| తొమ్మిదివేలు | : | ( 9 × 1000 : 9000) | [ప.వీ 34] |

| | | | |
|---|---|---|---|
| పదివేలు | : | (10× 1000 : 10000) | [శృ.నై 7–81] |
| పంౘ్రెండువేలు | : | (12× 1000 : 12000) | [ప వీ 34] |
| నూఱువేలు | : | (100× 1000 : 100000) | [ప.వీ 34] |
| నాల్గు లక్షలు | : | ( 4× 100000 : 400000) | [శృ.నై 1–75] |
| రెండు కోట్లు | . | ( 2× 10000000:20000000) | [కాశీ 6–148] |
| మూడు కోటులు | : | ( 3× 10000000:30000000) | [శృ నై 5–21] |
| ఏఁడు కోట్లు | : | ( 7× 10000000 70000000) | [కాశీ. 6–148] |

1. ఒకట్ల స్థానమందలి సంఖ్యా వాచకములు గుణకారము నొందుట తక్కువ.
ఈరేడు : [2 × 7 : 14] [శృ.నై 6–25]

2. సంయుక్త సంఖ్యావాచకమందలి 'వేయి' అనురూపమునకు 'ఉన్' అను సముచ్చయార్థక ప్రత్యయము చేర్పబడి ప్రయోగింపబడుచున్నది.
ఇరువదియొక్క వేయున్నాఱునూ్నాఱు [కాశీ 5–244]
వేయును నెనిమిది యేడులు [కాశీ 5–20]

3 నాలుగేన్ [4 లేక 5] ఆఱేడు [6 లేక 7] అను యర్థమున అనిర్ధారకముగ శ్రీనాథుడు ప్రయోగించెను
నాలుగేన్ : నాలుగేన్ పదంబులు సని [హర 4–35]
ఆఱేడు : దివసంబులాఱేడ/లీరేడ/ తిక్రమించినయప్పుడు [కాశీ 1–111]

4 'వే' పూర్వపదముగా గలిగిన సంఖ్యా వాచక పదము లందు 'వే' పై సముచ్చయార్థకమగు 'ఉన్' చేరును. కొన్నియెడల 'వే' పై సముచ్చయార్థక 'ఉ' వర్ణ మనావశ్యకముగ చేరుచుండును.
'వేయున్' అనుటకు 'వేయిన్' అను రూపము కలదు.
'వేయిన్నాఱునూ్నాఱు' [కాశీ 5–244]

వ్యవహారమున 'వేయిన్ని, వెయ్యిన్ని' అని యగును,

5 వేనవేలు, వేమఱు, వేమాఱు, వేవేలు - అనురూపములు 'అనేకము' 'చాల' అను అర్థమున వాడబడినవి.

వేనవేలు : వేనవేలు పయోరాశి వీచిఘటలు [భీమ 3-52]

వేమఱు : వేమఱు రాత్రియుం బగలు వీధుల [హర 5-14]

వేమాఱు : వేమాఱుం గలశీతనూళవ వధూ
వేణీభరాంతః ప్రసూనామోద [భీమ 5-55]

వేవేలు : వేదములు నాల్గు వేవేల విధుల [శృ నై 3-129]

6. ఒకప్పుడు సంఖ్యావాచక పదము మహన్మహత్యర్థక విశేష్యములకు విశేషణమగునప్పుడు మహతీతరాపమహద్వాచక రూపముననే యుండును

మున్నూఱు శిష్యులు [భీమ 2-126]

అబ్జనాభులు నూఱు నైదుపదులు [కాశీ 6-131]

## 3.6.3 సంఖ్యావాచక విశేషణములు (Numeral Adjectives)

'ఒక్కండు' తప్ప మిగిలిన సంఖ్యావాచకములన్నియు నామముల ముందు విశేషణములుగ ప్రవర్తించును సంఖ్యలలో ఒకటి అను శబ్దమునకు ఓ, ఒక, ఒక్క అనునవి విశేషణ రూపము లగుచున్నవి మిగిలిన సంఖ్యా వాచకములు యథాతథముగా విశేషణములుగా ప్రయోగములో నున్నవి నామములకు పూర్వము ఒకటి నుండి అన్ని సంఖ్యావాచకములును వాడబడినపుడు ఆ సంఖ్యలు విశేషణములుగా సూచింపబడుచున్నవి.

### 3.6.3.1 కుఱుచ రూపములతో కూడిన సంఖ్యావాచక విశేషణము లు:

1. ఒక - పువ్వు [భీమ 3-175] ఒక్క-కుందేలు [శృ నై 8-183]
ఓ - రాత్రిన్ [కాశీ 5-189] తనయుఁడొక్కఁడు [హర 2-57

2 ఇరు - గ్రేవల [శృ. నై 7-194] ఇరు-దెరంగులు [హర 6-116]

ఇను-వింతల [శృ నై 8-61] రెండు-బంతులు [హర6-116]

3 ముక్కారు [కాశీ 7-26] మూ-న్నాళ్ళ [కాశీ 2-72]

ము-న్నూఱు [భీమ 2-126] మూఁడు-కన్నుల [శృ నై 4-23]

ముగురు రాజులకును [చా మ 1-118]

4. నల్దెసలు [శృ.నై 4-105] నాలుగు-మోములు [శివ 1-3]

నాల్నాళ్ల [కాశీ 2-72]

5. అయిదు-రోజులదాక [ప.పీ 42] ఏను - కోసులు [భీమ 2-88]

ఐదు-వన్నెలకూళ్ళన్ [చా.మ 1-132]

6 ఆఱు-నెలలు [హర. 6-92] ఆర్నెల్లకు [కాశీ 5-262]

7. ఏడు-గాడ్పులు [కాశీ 2-51] ఏన్నాళ్లు [భీమ 4-12]

8 ఎనిమిది-మలకల [కాశీ 2-126]

9. పదివేళ్ల-నిడుపును [కాశీ 5-205]

0. ఆఱువదేడులు [కాశీ 5-266]

11. నూఱు-రూకల [క్రీడా 2-45]

12. వే-గన్నులు [శృ.నై 4-25] వేయి-మాటలున్ [శృ నై 7-121]

వేయు-దమ్ముల [భీమ 6-64]

13. మూడుకోట్లు పాతాళతల భుజంగంబులును [కాశీ 6-148]

ముప్పదిమూడు కోట్ల దేవతలు [కాశీ 6-148]

## 3.6.4 వచనముతో కూడిన అనుబంధనామములు :

(Appellative Nouns of Number)

కుఱుచ రూపముగల సంఖ్యావాచకములకు - వురు, -గురు, -రు అను ప్రత్యయములు చేరుటచే నివి యేర్పడుచున్నవి.

| | | | |
|---|---|---|---|
| ఇరు-వురు | [శృ నై 3-95] | | |
| ముగ్గురు/మువ్వురు | [హర పీ 21] | ముగురు | [శృ నై 4-64] |
| ము-వురు | [హర 2-115] | | |
| నలు-వురు | [శృ నై 7-88] | నలు-గురు | [శివ 2-35] |
| ఏ-గురు | [ప పీ 102] | ఏ-వురు | [శృ నై 5-175] |
| ఆ-ర్గురు | [కాశీ 6-99] | ఆ-ర్వురు | [ప పీ 58] |
| ఏ-డ్వురు | [కాశీ 2-26] | ఏడు-వుర | [హర 4-42] |
| పదు-గురు | [ప పీ 53] | పదు-రు | [కాశీ 3 142] |

3.6.4.1 ఇద్దఱు- అను అనుబంధ నామమును ఇర్-తారు అను విధముగ నిర్ణయింప వచ్చును

3 6 4 2 పది సంఖ్యా వాచకమునకు -రు ప్రత్యయము చేరునపుడు తుదినున్న 'ఇ' వర్ణము 'ఉ' వర్ణముగా మారును.

పదురు నిజాప్త కింకరులు పార్శ్వయుగంబున [కాశీ 3-142]

3 6 4 3 -ది వర్ణమంతముగా గల ఎనిమిది, తొమ్మిది, ముప్పది మొదలగు సంఖ్యా వాచకములకు కొన్ని సంధిగతమైన మార్పులచే అనుబంధముగ -ండ్రు వచ్చును.

ఎనిమిది > ఎనమండ్రు [శృ.నై 6-78] తొమ్మిది > తొమ్మండ్రు [కాశీ 4-178]

ముప్పది > ముప్పండ్రు [కాశీ 6-131] ఱువది > అఱువండ్రు [కాశీ 4-188]

3 6 4.4 నన్నూఱు శిష్యులు [భీమ 2-126] ఆఱునూఱు బాలలు [భీమ 6-78]
పై రెండు సంఖ్యల యందును మహద్వాచకములకు పూర్వము 'గురు' వాడలేదు.

## 3.6.5 సార్వనామిక విశేషణములు : (Ordinals)

సార్వనామిక విశేషణ ప్రత్యయములైన -అగు, -ఔ/అవు/అవ చేరుటచే సార్వనామిక విశేషణ సంఖ్యావాచకము లేర్పడు చున్నవి.

అగు/ఔ/అవు-అనునవి 'అగు' యొక్క అనిర్దిష్ట కాల విశేషణము అవు రూపమేర్పడిన తరువాత దీనిపై విశేషణ ప్రత్యయమైన 'అ' చేరికతో 'అవ' అగుచున్నది. కావ్యభాషలో తరచుగా కనబడు రూపమిదియే. -అవు రూపముతోడి ప్రయోగములు నన్నయలో నున్నవి కాని శ్రీనాధునిలో 'అగు, ఔ, లతో కూడిన ప్రయోగములున్నవి. -అవ వ్యవహారములో 12వ శతాబ్దమునకే 'ఓ'గా మారినట్లు శాసన ప్రయోగముల వలన తెలియుచున్నది ప్రబంధయుగములోని కవులు 'ఓ' రూపము వాడియున్నారు. శ్రీనాథునియందు 'ఓ'తో కూడిన రూపములు లేవు. 'అవ'తో కూడిన రూపములు కలవు

అగు : ఎనిమిదియగు [కాశీ 4-24]

ఔ/అవు : ఎనిమిదియౌ [కాశీ 6-68]

| | | | | |
|---|---|---|---|---|
| అవ : | ఒక్కం-డవ | [శివ 2-106] | రెం-డవ | [శృ.నై 1-59] |
| | మూ-డవ | [హర 4-30] | నాలు-గవ | [భీమ 3-66] |
| | నా-లవ | [శృ నై 7-94] | నాల్గ-వ | [కాశీ 4-13] |
| | ఐ-దవ | [శృ.నై 5-183] | ఆ-అవ | [కాశీ 6-169] |
| | ఏ-డవ | [శృ.నై 8-166] | ఎనిమి-దవ | [కాశీ 6-87] |
| | తొమ్మి-దవ | [శృ నై 3-184] | పదునొకం-డవ | [కాశీ 1-71] |
| | పదియా-అవ | [శృ.నై 8-200] | పదునెనిమి-దవ | [కాశీ 6-87] |
| | ఇరువదిరెం-డవ | [హర 2-24] | వే-యవ | [శృ.నై 3-173] |

మొదటి సంఖ్యా వాచకమునకు ప్రత్యేకమైన సార్వనామిక విశేషణ రూపము గలదు. మొదటి/మొదలి/మొదలింటి అనురూపములు సోదాహరణముగ ప్రదర్శితము.

మొదటి : మొదటి కాలఁగేంద్రమున నాంగిరసుడుండ [కాశీ 5-236]

మొదలి : విశ్వనాథుని మొదలి శ్రీవేశ్మమునకు [కాశీ 2-32]

మొదలింటి: మార్గమును దేటపడ నొ్మదలింటి నుండియున్ [శివ 1-49]

## 3.6.6 విభాజక సంఖ్యా వాచకము (Distributive Numeral)

-ఏసి అను ప్రత్యయము సంఖ్యా వాచకముల తర్వాత ప్రయోగింపబడి పరిమాణమును, కొలదిని తెల్పుచున్నది

-ఏసి [<చేసి : నన్నయ : నూఱు పేసి [భార 1.6 2, 3 1 12]

శ్రీనాథునిలో :

-ఏసి : ముచ్చిచ్చు నేదేసి నాల్కలు కొండనాల్కలు [భీమ 3-37]

పదేపి పదియేసి వర్ణంబులనఘ [కాశీ 3-187]



## 3.7.0 వి శే ష ణ ము లు (Adjectives)

విశేషముల అర్థవ్యాప్తి కవధిని కల్పించునట్టియు, వ్యక్తివాచక పదముల గుణాదులను వర్ణించునట్టియు, జాతివాచక పదములుతెలుపు వస్తువుల ధర్మమును నిరూపించునట్టియు పదములు విశేషణము లనబడును. సంస్కృతము నందలి విశేషణములకును తెలుగునందలి విశేషణములకును నొక ముఖ్యభేదమున్నది. సంస్కృతము నందు విశేషణములు లింగ విభక్తి వచనములందు విశేష్యములతో సమానముగా నుండును తెలుగున విశేషణములకు ప్రత్యేకముగా లింగ, విభక్తి, వచనములు లేవు విశేష్యముల యర్థవ్యాప్తిని ఏ విధముగనైన సంకుచితముచేయు నేపద మయినను విశేషణమే యగును. గుణమునుగాని, జాతినిగాని, క్రియనుగాని, ద్రవ్యమునుగాని, సంఖ్యనుగాని, సంజ్ఞనుగాని, తెల్పు శబ్దము నామ వాచకమునకు ముందు నిల్చును. స్థానమును బట్టియే వీని కితర నామ శబ్దములతో సంబంధమేర్పడి, విశేషణత్వము కలుగును. ఉదాహరణకు 'మాట తీపి' అనునపుడు 'మాట' యనునది విశేషణమై 'తీపి' విశేష్యమగును. మాట యొక్క తియ్యదనమని యర్థము. 'తీపి మాట' యవి యనునప్పుడు 'తీపి' యనునది విశేషణమై 'మాట' విశేష్య మగును. తియ్యనయగు మాట యని యర్థము ఇచ్చట మాటల రూపమునం దేమాత్రమును భేదములేదు. వేర్వేరుగా రెండును నామవాచకములే. రెండింటి నొకచోట చేర్చినపుడు స్థానమునుబట్టి ఒకటి విశేషణమును, ఒకటి విశేష్యమును అగుచున్నది ఇట్లు విశేషణము విశేష్యముగను, విశేష్యము విశేషణముగను వ్యత్యస్తముగా వాడబడుటనుబట్టి తెలుగు భాషలో విశేషణ విశేష్య నియమము సువ్యవస్థితముకాదని స్పష్టమగుచున్నది [1] ఒక పదమును విశేషణ మనియు విశేష్య మనియు వేఱుపరచి యుంచుట భాషా సంప్రదాయ విరుద్ధము.

3.7 1 విశేషణములను వాని నిర్మాణము ననుసరించి రెండు ముఖ్యమైన తరగతులుగ విభజింపవచ్చును.

1. స్వతస్సిద్ధ విశేషణములు 2. నిష్పన్న విశేషణములు (Derived Adjectives)

---

1. స్వార్ధశ్రీ: తెలుగు భాషాచరిత్ర, పుట-289.

### 3.7.2 స్వతస్సిద్ధ విశేషణములు :

ఇవి గుణవాచక, నిర్దేశాత్మక, ప్రశ్నవాచక, సంఖ్యావాచక, పరిమాణాత్మక, ప్రకారార్థక, పరిగణనార్థక, అనిశ్చిత విశేషణములని ఎనిమిది విధములుగ నుండును.

విశేష్యములకు పూర్వమందు చేరునపుడవి విశేష్య విశేషణములనబడును

అత్యధికమైన విశేషణములు సమాసముల పూర్వ పదములుగ కన్పించును వీనియందన్నిట ఒకటే పదము ముందు నిల్చుటవలన విశేషణమును తర్వాత వచ్చుట వలన విశేష్యముగాను పనిచేయుచుండుట స్పష్టము.

| | | | |
|---|---|---|---|
| అగడు - కాకులు | [హర 5-10] | అచ్చ-వెన్నెల | [కాశీ 3-23] |
| అచ్చ-సీతు | [శివ 4-25] | అడి-యాస | [కాశీ 2-111] |
| అనుఁగుఁ-గొడుకు | [కాశీ 4-101] | అఱ-సంజ | [కాశీ 5-275] |
| అర-కన్ను | [కాశీ 7-70] | అలఁతి-నవ్వ | [శృ. నై 4-67] |
| అసదు-నడుము | [హర 3-74] | ఆణి-ముత్యాలు | [భీమ 1-117] |
| ఇఱు-ఁజీకటి | [హర. 3-88] | ఈ-రెండ | [హర 7-139] |
| ఎడ-కేలు | [శివ 4-38] | ఎడమ-దిక్కు | [హర 2-123] |
| ఎడ్డి-మాటలు | [హర 7-61] | ఎఱ-సంజ | [శృ.నై 8-152] |
| ఎల-దోఁట | [భీమ 3-36] | ఎల-నాఁగ | [శృ నై 6-44] |
| ఓరు-గాలి | [చామ 1-128] | కటికి-డెందము | [శృ నై 3-68] |
| కట్టిడి-పిశాచము | [శివ 2-98] | కుడి-కన్ను | [భీమ 6-68] |
| కట్టెఱ | [శృ. నై 7-46] | కడిది-యుత్పాతము | [కాశీ 2-69] |
| కడు-గారాము | [శృ.నై 8-198] | కమ్మ-ఁదేనియ | [భీమ 5-104] |
| కఱకు-వెంట్రుకలు | [హర 7-79] | కాఱు-మొగులు | [భీమ 4-120] |
| కూరిమి-కొడుకు | [శృ.నై 2-75] | కెం-గేలు | [కాశీ 6-227] |
| కొమరు-ఁబ్రాయము | [కాశీ 1-123] | కొంకర-మాటలు | [హర 4-34] |
| క్రొన్నె-త్తురులు | [కాశీ 3-11] | క్రే-ఁగన్ను | [కాశీ 4-148] |
| క్రొం-బొగ | [హర 6-63] | గండు-మీను | [శృ.నై 1-97] |

| | | | |
|---|---|---|---|
| గండ్ర-గొడ్డలి | [కాశీ 1-121] | గిల్ల-కన్ను | [కాశీ 2-80] |
| గురు-కత్తి | [హర 2-1 5] | గొగ్గి-పండులు | [శృ.నై 7-93] |
| చిటి-బొట్టు | [కాశీ 3-212] | చిన్న-వాడు | [ప.పీ 93] |
| చిన్ని-కురులు | [కాశీ 1-3] | చిమ్మ-చీకఁటి | [శృ.నై 7-46] |
| చిఱు-కొండ | [కాశీ 1-100] | చుర-కత్తి | [హర 2-115] |
| చెంగలువ | [శృ.నై 2-141] | డా-కన్ను | [శృ నై 8-201] |
| డొప్ప-చెవులు | [శృ. నై 7-93] | తెలి-కన్నులు | [కాశీ 2-160] |
| తియ్య-గూరలు | [కాశీ 7-186] | తొలు-మావు | [భీమ 3-36] |
| దండి-మాటలు | [శివ 4-58] | దొడ్డ-వయసు | [భీమ 2-46] |
| నిండు-చందురుఁడు | [శృ.నై 1-50] | నల్ల-చెఱుకుల్ | [హర 2-8] |
| నిడు-గోల | [హర 5-25] | నిఱు-పేద | [శృ.నై 6-73] |
| నివ్వెఱఁగు | [హర 3-10] | నీలి-పుట్టంబు | [భీమ 2-36] |
| నును-ఁజేల | [హర 2-45] | నులి-వేఁడి | [భీమ 3-37] |
| నెత్తమ్మి | [శృ.నై 7-141] | పంద-మాటలు | [ప.పీ 95] |
| పచ్చ-కోల | [కాశీ 3-118] | పచ్చియేనిక-తోలు | [హర 5-56] |
| పలు-గాకులు | [హర 5-10] | పిన్న-వయసు | [శృ.నై 2-22] |
| పిఱికి-కంద | [కాశీ 2-86] | పీల-చేతులు | [ప.పీ 68] |
| పెద్ద గద్దియ | [శృ.నై 7-160] | పెం-జిలువ | [శృ.నై 8-154] |
| పెను-బాము | [క్రీడా 223] | పేరాఁకలి | [కాశీ 4-118] |
| ప్రాఁత-మాట | [హర. 2-13] | బీ-రెండ | [శృ.నై 8-91] |
| బోసి-నోరు | [క్రీడా. 271] | మంచి-తలంపులు | [ప.పీ 20] |
| మిక్కిలి-నలుపు | [హర. 3-65] | మిడి-గ్రుడ్లు | [శృ.నై 7-93] |
| మీఁ-గాళ్ళు | [కాశీ 5-226] | ముంగురులు | [శృ నై 7-187] |
| ముంజేయి | [శృ.నై 6-87] | ముదుసలి-యవ్వ | [హర 2-123] |

| | | | |
|---|---|---|---|
| ముద్దు-మాటలు | [చా.మ 1-46] | మెల్ల-చూపు | [కాశీ. 6-206] |
| రిత్త-యలుక | [శృ.నై 8-70] | లేఁగ-పెయ్య | [కాశీ 3-198] |
| వింత-విలాసము | [శృ.నై 3-96] | వాలు-ఁగన్నులు | [శృ.నై 8-87] |
| వెల్ల-గొడుగు | [కాశీ 4-296] | వెలి-చాయ | [భీమ 1-4] |
| వేఁడి-పాలు | [క్రీడా 206] | సోఁగ-కన్ను | [హర 4-86] |

3.7.2.1 గుణవాచక విశేషణములు :

కాల, స్థాన, ఆకార, వర్ణ, దశా గుణాది భేదములచే నివి వివిధములుగా నుండును.

| | | | | |
|---|---|---|---|---|
| కాలము : | క్రొత్త | [శృ నై 6-44] | పాత | [హర 2-13] |
| స్థానము : | ఎత్తు | [హర. 3-70] | లోఁతు | [శివ 1-160] |
| | దాపలి | [శృ నై 8-133] | వలపలి | [శృ నై 8-133] |
| ఆకారము : | చౌకము | [క్రీడా 134] | వంకర | [భీమ 4-7] |
| వర్ణము : | తెల్ల- | [శృ.నై 6-96] | నల్ల- | [భీమ 2-34] |
| | ఎఱ్ఱ- | [భీమ 3-8] | | |
| దశ : | పేద | [కాశీ 5-287] | గొప్ప | [ప పీ 8] |
| గుణము : | మంచి | [శృ.నై 3-50] | చెడు | [ప.పీ 42] |

3.7.2.2 నిర్దేశాత్మక విశేషణములు : (Demonstrative Adjectives)

దూరవర్తి . ఆయింతి [శృ.నై 2-10] ఆవేలుపు [శృ.నై 4-30]
అక్కన్నియ [శృ.నై 3-128] అప్పడఁతుక [శృ.నై 5-12]

సమీపవర్తి : ఈయలరుఁబోఁడి [కాశీ 2-96] ఈయింతి [శృ.నై 5-186]
ఇక్కొండ [కాశీ 1-134] ఇత్తఱిన్ [శృ నై 8-7]

3.7.2.3 ప్రశ్నవాచక విశేషణములు : (Interrogative Adjectives)

ఏ-దెస [భీమ 1-104] ఏ-కరణి [శృ.నై 6-137]
ఎ-త్తఱిన్ [హర 2-5] ఎ-ప్పట్టున [శృ.నై 7-137]

**3.7.2.4** పరిమాణాత్మక విశేషణములు : (Quantitative Adjectives)

అంత : అంత_మేర [శృ.నై 8-65]
పుడిసెఁడంతఁ త్రావియు [హర 6-129]
అంతలు : ఉసిరికకాయలంతలు పయోధరముల్ [కాశీ 5-167]
ఇంత : ఇంత_పెద్ద [భీమ 3-65]
ఇంతలు : అతినృశంసత నింతలు సేసినట్టి [కాశీ 5-163]
ఎంత : ఎంత_దవ్వు [కాశీ 4-291]
ఎల్ల : ఎల్ల-ప్రొద్దు [కాశీ 2-28]
కొంత : కొంత_తడవు [శృ.నై 1-91]

**3.7.2.5** ప్రకారార్థక విశేషణములు : (Qualitative Adjectives)

అట్టి : అట్టి_దిట్టతనము [శృ.నై 7-160]
ఇట్టి : ఇట్టి_చోద్యములు [కాశీ 3-105]
ఎట్టి : ఎట్టి_వారికి [కాశీ 7-44]

**3.7.2.6** పరిగణనార్థక విశేషణములు : (Adjectives of Totality)

మహద్వాచకములు : అందఱు [శృ నై 4-137] ఇందఱు [కాశీ 2.79]
ఎందఱు [శృ. నై 3-64] కొందఱు [శృ.నై 1-17]

**3.7.2.7.** అనిశ్చిత విశేషణములు: (Indefinite Adjectives)

అమహద్వాచకము : అన్ని : అన్ని-దినములు [శృ.నై 7-24]
ఇన్ని : ఇన్ని-గుణములు [కాశీ 4-34]
ఎన్ని : ఎన్ని-చందముల [కాశీ 4-112]
కొన్ని : కొన్ని-పయనంబులు [కాశీ 3-56]
పెక్కు : పెక్కు-మాటలు [శృ.నై 3-46]

ఇవి పైన సూచించిన పరిమాణాత్మక, పరిగణనార్థక విశేషణములలోనే అంతర్భవించును.

**3.7.2.8** సంఖ్యావాచక విశేషణములు : (Numeral Adjectives)

ఒక-తల [కాశీ 3-217] ఒక్క-కుందేలు [శృ నై 8-183]

| | | | |
|---|---|---|---|
| ఓ-రాత్రింగనురెప్ప వేయక | | | [కాశీ 5-189] |
| రెండు-బంతులు | [హర 6-116] | ఇను-వింతల | [శృ.నై 8-61] |
| మున్నూఱు | [భీమ 2-126] | మూ-న్నాళ్ళు | [కాశీ 2-72] |
| ముక్కారు | [కాశీ 7-26] | మూఁడు-కన్నుల - | [శృ.నై 4-23] |
| నన్నూఱు | [కాశీ 5-192] | నలు-గడలు | [హర 7-168] |
| నల్దెసలు | [శృ.నై 4-105] | ఇరువైనాలుగు-మూళ్ళమేర | [కాశీ 1-55] |
| ఏనూఱు | [శృ.నై 6-72] | ఏను-కోసులు | [భీమ 2-88] |
| అయిదు-రోజులు | | | [వ.పీ 42] |
| ఆఱు-నెలలు | [హర 6-92] | అఱు-వది | [హర 7-188] |
| ఏడు-వాడలు | [హర 1-13] | ఏన్నాళ్ళు | [భీమ 4-12] |
| ఎనిమిది-మలకల | [కాశీ 2-126] | ఎను-బది | [శివ 4-15] |
| పది-నాళ్ళు | [క్రీడా 198] | తొంబ-నూఱు | [భీమ 3-18] |
| వేయి-కన్నులు | [హర 3-39] | వేయు-ఁగడవల | [కాశీ 3-74] |

### 3.7.3 నిష్పన్న విశేషణములు : (Derived Adjectives)

ఇవి ప్రాథమిక విశేషణముల నుండి నిష్పన్నములైనవి. నామ క్రియా ధాతువులకు ప్రత్యయముల చేరికచే నేర్పడినవి

3 7 3 1 ఈ క్రింద పేర్కొనినవి స్థానము ననుసరించి విశేష్యములకు ముందున్న నామ ధాతురూపములు విశేషణములగుచున్నవి

| | | | |
|---|---|---|---|
| అలరమ్ము | [శృ నై 1.83] | అనుఁగు-భార్య | [హర 2-60] |
| ఇంచు-విల్లు | [కాశీ 3-28] | ఇసుక-తిప్పలు | [భీమ 2-88] |
| ఉక్కు-దండసంబు | [కాశీ 6-251] | ఉప్పు-కడలి | [కాశీ 3-28] |
| చలి-గాలి | [కాశీ 7-40] | చెఱకు-విల్లు | [హర 5-40] |
| జమిలి-పాములు | [హర 5-5] | నేరెడు-పండు | [భీమ 1-111] |
| పగ-వాడు | [వ.పీ 85] | పసిడి-కొండ | [హర 3-9] |
| పసుపు-ఁబుట్టము | [శివ 2-71] | బంగారు-గొడుగు | [శృ నై 5-78] |
| బడుగు-వాఁడు | [శృ నై 8-148] | నిండు-చంద్రుఁడు | [భీమ 2-43] |

మంచు-కొండ [హర 5-23] ముత్యాల-గొడుగు [భీమ 2-112]
రాచ-సిరి [హర 6-127] వెండి-కొండ [కాశీ 6-185]

3.7.3.2 విశేష్యముల నుండి నిష్పన్నమైన విశేషణములు :

నామ, క్రియా ధాతు ప్రాతిపదికలకు కొన్ని ప్రత్యయములు చేరి విశేషణము లగుచున్నవి.

-'అ' ప్రత్యయము : కొన్ని అదంతములై ద్విత్వము నొంది విశేషణములైనవి.

నల్ల-కలువ [కాశీ 1-2] తెల్ల-మడుంగు (శ్రీ శృ 52]
పిన్న-వయసు [శృ.నై 2-22] ఎఱ్ఱ-చాయ [కాశీ 1-111]
తేట-నీరు [కాశీ 5-131] ముత్యాల-గొడుగు [భీమ 2-112]

కొన్నింటికి దానిపై 'న' ప్రత్యయము వచ్చి విశేష్యములగుచున్నవి

నల్లన-య్యె [కాశీ 4-3] ప్రసన్నమైన [హర 3-78]
చల్లన-య్యె [కాశీ 3-147] కమ్మనైన [శివ 2 47]

మరల దానిపై 'ఇ' ప్రత్యయము వచ్చి విశేషణములగు చున్నవి

ఎఱ్ఱని-చూపులు [భీమ 3-8] చల్లని-గంధవహము [శృ నై 4-133]
కమ్మని-తావి [భీమ 1-95] తెల్లని-మేను [భీమ 4-123]
వెచ్చని-జుంఝూ పవమానము [కాశీ 6-228]
ప్రసన్నని-నున్నని-నీరుకావిదోవతులును [శివ 3-112]
నున్నని-యొదలమీఁది వచ్చి గంధము [హర 1 15]
తిన్నని-యెలుంగున [కాశీ 6-82]
చిక్కని-నియద్దంగా ప్రవాహంబులో [హర 3-7]

దానిపై మఱల - తనము/-తనంబు ప్రత్యయము చేరి విశేష్యములగు చున్నవి.

ఎఱ్ఱఁదనము [శృ.నై 6-130] కమ్మఁదనంబులు [భీమ 2-55]
చక్కఁదనము [శృ.నై 1-35] తియ్యఁదనము [శృ.నై 2-81]

ఇట్లు విశేష్య విశేషణములు మారుచుండుటయు మఱల ప్రత్యయాంతరము చేరి క్రొత్తరూపము కన్పించుటయును భాషకు స్వాభావికమైనది.

ఇదంతరూపములు :

కొన్నియెడల విశేష్యములకు ముందు ఇదంతరూపములు చేరి విశేషణములుగా వ్యవహరించును.

| | | | |
|---|---|---|---|
| అలంతి_నవ్వు | [శృ.నై 4_67] | ఆణి_ముత్యాలు | [భీమ 1_117] |
| కటికి-తోలు | [భీమ 1_80] | కూరిమి_కొడుకు | [శృ.నై 2_75] |
| తెలి_గన్నులు | [కాశీ 5_144] | నీలి_పుట్టంబు | [భీమ 2_36] |

ఉదంతరూపములు :

కొన్నియెడల విశేష్యములకు ముందు ఉదంతరూపములుచేరి విశేషణములుగా వ్యవహరించును.

| | | | |
|---|---|---|---|
| క్రాలు_గన్నులు | [కాశీ 6_209] | పరసు_వారు | [కాశీ 4_67] |
| శిరసు_పాగ | [హర 4_19] | | |

ఉకారాంత పదముల తుది యచ్చు లోపించిన రూపములు :

క్రాల్గనులు [కాశీ 3_240]

అదంతరూపములు :

కొన్నియెడల విశేష్యములకుముందు అదంత రూపములుచేరి విశేషణములుగా వ్యవహరించును.

| | | | |
|---|---|---|---|
| అఱ_సంజ | [కాశీ 5_275] | ఎల_దోఁట | [భీమ 3_36] |
| గండ్ర_గొడ్డలి | [కాశీ 1_121] | గిల్ల_కన్ను | [కాశీ 2_80] |

_టి ప్రత్యయము :

| | | | |
|---|---|---|---|
| తాటి_పండు | [కాశీ 1_114] | నేరెె_టి_దీవి | [శృ.నై 5_76] |
| పిన్న_టి_కొదీఁగ | [క్రీడా 75] | తొల్లి_టి_జన్మము | [కాశీ 2_156] |

_ంటి ప్రత్యయము :

| | | | |
|---|---|---|---|
| తొంటి-చందము | [హర 2_138] | తొంటి_నాడు | [శృ.నై 3_10] |
| వింటి_జోదు | [శృ.నై 1_94] | | |

_అ, _ఇ, _ఉ, _[ం]టి అను ప్రత్యయముల షష్ఠ్యర్థమునను విశేషణములుగను వచ్చును.

3 7.3.3 కొన్ని విశేషణ సమాసములయందలి మొదటి యవయవము 'ఉ' వర్ణాంతము గాని, 'అ' వర్ణాంతము గాని యైనపుడు పరుషములు పరమైనచో నకారాగమమై సరళాదేశమగును.

మొదటి అవయవము 'ఉ' వర్ణాంతమైనపుడు :

అనుంగుఁగూతు [శృ నై 7_4] అనుఁగుఁజుట్టము [శివ 3_21]
ఇఱుఁజీకటి [హర 3_88] అనుఁగుందాత [భీమ 1_100]
అనుఁగుంబాసెము [భీమ 2_67] నునుఁబల్కులు [శృ.నై 4_13]

మొదటి అవయవము 'అ' వర్ణాంతమైనపుడు :

కమ్మఁదేనియ [భీమ 5_104] కమ్మఁబువ్వులు [శృ.నై 6_68]
చక్కఁజాయ [కాశీ 2_159]

3.7.3.4 ఉవర్ణాంత రూపములకచ్చు పరంబగునపుడు _'ట్' అను విశేషణ సంకేతము సామ్యము (analogy) ననుసరించి సంధియందాగమముగ వచ్చుచున్నది.

నిలువు_ట్_అద్దము [కాశీ 3_236] కులుకు పెలుఁగు [శృ.నై 7_187]
పాఱుటాకులు [హర 5_38] కొమ్ము_టేనుంగు [హర 3_25]
తళుకుటద్దము [శృ నై 1_5]
_త : చిఱు_త_నవ్వు [హర 2_110] చిఱు_త_చీకటి [కాశీ 1_123]
ఇచ్చట _త వర్ణలోపము వైకల్పికము

3 7.3.5 అమహద్వాచకాంతము నందలి 'ము' వర్ణస్థానమున _పు/_ంపు ఆదేశముగ వచ్చును.

కప్పుర_పు_ముగ్గు [శివ 2_53] గంద_ంపు_బొట్టు [క్రీడా 134]
కవ్వ_పు_గొండ [హర 6_75] చొక్క_ంపు_టేరు [కాశీ 7_186]
దోస_పు_మాటలు [క్రీడా 36] దాసన_ంపు_ బువు [భీమ 2_29]

1. కొన్నింటికి _ప్ అను విశేషణ సంకేతము సామ్యము ననుసరించి సంధి యందు ఆదేశముగా వచ్చుచున్నది

తామర_వ్_అకు > తామరపాకు [కాశీ 6_179]

2 కొన్నియెడల సంబంధమును తెలియజేయుటకు 'పు' వర్ణమున కత్వము చేరుచున్నది.

పావతేఁడు [భీమ 4–151] ఇనుప–సూదులు [కాశీ 3–153]

3 కొన్నియెడల సమాసములందు -పు/ –ంపు లు లేని రూపములు కలవు.

మూల–దుంప [భీమ 5–157] మాంజిష్ఠ–తెర [హర 7–137]
మృదుల–గోధూమ-సరులు [శివ 2–61] రుద్రాక్ష–పూస [శివ 4–59]

నన్నయ భారతమున –పు/–ంపుల కంటె పూర్ణబిందుపూర్వక –బు వర్ణము తోడి వానినే విశేషణములుగా ఎక్కువగా వాడెను.

తపంబు–గౌరవంబు [అర 1–34] ఆశ్రమంబు–దెస [అర 3–273]
తపము బలము [అర 2–209]

తిక్కన -పు/–ంపు వర్ణకాంత రూపములను వాడినను ము వర్ణకాంత రూపములనుకూడ వాడెను

లోకము సమరంబులు

శ్రీనాథుని యందును ము వర్ణకాంత రూపములు కలవు

పుట్టము చెఱంగు [శృ.నై 6–131]

4. తత్సమ విశేషణములను తెనుగున వాడునపుడు వాని విశేష్యముల మహదమహద్భేదము ననుసరించి యా విశేషణములను లింగమున మారుచుండును

3.7.3.6 అగు, అయిన అను శబ్దములను చేర్చుటచే విశేష్యములన్నియు విశేషణము లగుచున్నవి

1. నామ ప్రకృతికి 'అగు' ధాతువు అదనముగ చేరుటచే తద్ధర్మార్థక విశేషణ మగుచున్నది

అందంబగు మందాకినీ [భీమ 4–123]
అచ్చమగు భోగ మోక్షము [భీమ 2–19]
విశారదుండునగు నారదుండు [శృ నై 3–2]

2. నామ ప్రాతిపదికకు 'అగు' ధాతు నిష్పన్నమైన 'అయిన/ఐన' అదనముగా చేరుటచే భూతార్థక విశేషణమగు చున్నది.

ఆయితంబయిన ఖాద్యము [కాశీ 5 307]
సౌభాగ్య ధురంధరంబయిన పాశుపతాస్త్రము [హర 7–106]

గురుతరంబైన యవ్వీటి కోట గవను [శృ.నై 2-42]
చంచలంబైన నీ కటాక్షాంచలంబు [శృ నై 4-29]

3 ఇట్టి 'అగు' ధాతువునకు 'కలదియగు' 'కలిగియుండు' అను నర్థములు ఈ క్రింది ప్రయోగములకు కలవు

సురధాణి నిండు కొలువై యుండి [హర పీ 22]
అలు మగడును నొక కూతురై నఁగాక [హర 2-60]

4. అగు, అయిన అను శబ్దములకు - అట్టి అను ప్రత్యయము చేరి విస్తారిత విశేషణ రూపములును కలుగును.

కర్తవ్యమగునట్టి కార్యము [శృ.నై 4-17]
సదృక్షంబగునట్టి పుణ్యక్షేత్రము [భీమ 2-20]
అఖిల లక్షణ సంపూర్ణ యైనయట్టి యాలతాతన్వి [హర 3-72]
ఉరుప్రభావులైనట్టి మహామునీంద్రులకున్ [కాశీ 1-76]

3.7 3.7 పూర్వ పదాంత -డవర్ణము సంధియందు పరుషమై ద్విత్వము నొంది విశేషణ మగుచున్నది. [డ్>ట్ట్]

కట్టెఱచాయ [కాశీ 1-21] కట్టెఱ నెరలు [శృ నై 7-46]

3.7 3 8 అవు/అవ అదనముగా చేరిన సంఖ్యావాచక సర్వనామ విశేషణ రూపములు

ఎనిమిది యగు మాసమున [కాశీ 4-24]
ఎనిమిదియౌ దినంబునకు [కాశీ 6-68]

రెండవ [శృ.నై 1-59] మూడవ [భీమ 3-66]
నాలవ [శృ.నై 7-94] నాలుగవ [భీమ 3-66]
ఐదవ వాఁడు [శృ నై 5-183] ఆఱవ పుష్ప బాణము [కాశీ 6-169]
ఏడవ నిలువు [శృ నై 8 166] ఎనిమిదవ దివసంబు [కాశీ 6-87]
తొమ్మిదవ లెక్క [శృ నై 1-84]

3 7 3 9 క్రియాప్రాతిపదికలకు కొన్ని ప్రత్యయములు చేరి క్రియాజన్య విశేషణము లగుచున్నవి.

22)

1. వర్తమాన కాలిక విశేషణము: (Present Adjectives)

వితర్కించుచున్న సమయము [శృ.నై 1-8]
ప్రవహించుచున్న యమునా నది [శృ.నై 5-97]
చేయుచున్నవాఁడు [హర 3-50]
ఉన్న-వాఁడు [హర 3-91]

2. భూతకాలిక విశేషణము : (Past Adjective)

ఉన్న-గుఱుతు [కాశీ 4-27] పండిన-మారేడు [హర 3-23]
చేసిన-వాడు [కాశీ 4-229] వచ్చిన-వాడు [కాశీ 7-61]

3. తద్ధర్మార్థక విశేషణము : (Habitual Adjective)

పెండ్లి చేసెడివాడు [ప పీ 74] పోయెడు భానుండు [కాశీ 1-134]
వచ్చెడిత్రోవ [శృ.నై 4-11] చనువాఁడు [హర 6-41]
కానన్ అయ్యెడున్ [హర 6-5]

4. వ్యతిరేక విశేషణము : (Negative Adjective)

చాలని వాఁడు [హర 2-79] చేయనివారు [కాశీ 2-164]
చూడని వేళలయందు [కాశీ 4-198] కానని వనజముఖి [శృ నై 1-63]

5. భవిష్యత్కాలిక విశేషణము : (Future Adjective)

కాగలయది [హర 7-27] రాగల భూమిపాలురున్ [భీమ 5-86]
చేయగలవాడనేను [కాశీ 7-172]

నన్నెచోడుని కుమార సంభవమున భవిష్యత్కాల ధాతుజ విశేషణ ప్రయోగములు లేవు 'కొల్వగలవాడన్' అను సమాపక క్రియా నిర్మాణము కల రూపమున్నది

3 7.3 10 అవ్యయములను విశేషణములుగ ప్రయోగించుట కలదు

ఇంచుక-సేపు [శృ నై 6-7] ఎల్ల-ప్రొద్దు [కాశీ 2-28]
కడు.నిబ్బరంబు [శృ.నై 5-177]

## 3.´.4 తర-తమ భావ నిరూపణము

సంస్కృతమున ఒకదానికంటె మఱియొకటి యెక్కువ, అన్నిటికంటె నొకటి యెక్కువ అను భావములు విశేషణ పదములపై 1. తర, (ఈయస్) 2 తమ, (ఇష్ఠన్)అను ప్రత్యయములను చేర్చుట వలన కలుగును ఈ ప్రత్యయము లను తెలుగు విశేషణములపై చేర్చుట లేదు గాని వీనిలో -తర ప్రత్యయము సంస్కృత ప్రోద్బలము వలన కొన్ని అచ్చిక విశేషణములపై హాన వచ్చుచున్నది. -తరము అను ప్రత్యయము తెలుగున ప్రత్యేక పదముగ వ్యవహరింపబడుచున్నది.

ఎవ్వఁడు గానఁదరముగాఁడు [కాశీ 5-92]
తరముగా వితర తీర్థములు [భీమ 3-159]
తరము సౌదామనీ దామ ధామమునకు [శృ నై 3-156]
పై సందర్భమునందలి తరమునకు 'కొలది'యని అర్థము.
వీరి మనసులు వట్ట నెవ్వారి తరము [శృ.నై 7-81]
ఎవ్వఁడు గానఁదరముగాఁడు [కాశీ 5-92]

ఇక్కడ తరమునకు 'శక్తము, శక్యము' అను నర్థము లు కలిగినవి కాని పైయభిప్రాయము తెలుపుటకు తెలుగున స్వతంత్రమైన మఱియొక ప్రణాళిక బయలుదేరినది

వానికంటెఁబెద్ద వాతాపి తాపస [కాశీ 7-23]
లావణ్య వార్థిలో మదనుఁడెక్క [శృ నై 3-101]

మొదటిది తర ప్రత్యయము యొక్కయు, రెండవది తమ ప్రత్యయము యొక్కయు నర్థమును నిరూపించును

3.7.4.1 సంస్కృతమునను, ఆంగ్లమునను విశేషణమునకు తుదిని ప్రత్యయములు చేరుటచే నీయభిప్రాయము తెలియనగును తెలుగుననట్లుకాదు. విశేషణ రూపమున మార్పు లేదు న్యూన గుణవాచియయిన శబ్దమునకు 'తరప్' ప్రత్యయార్థమున 'కంటె' వర్ణకమగును. అట్లే 'తమప్' ప్రత్యయార్థమున సముదాయవాచి శబ్దమునకు 'లో, లోపల' యను శబ్దములలో నొక్కటి చేర్పనగును సూరి దీనిని నిర్వచించుటకు నిర్ధారణపంచమియు, నిర్ధారణ షష్ఠియు నను పదములను సంస్కృత వ్యాకరణముల యుండలి కారక విధానమునను సరించి కల్పింప వలసి వచ్చినది

## 3.8.0 లింగము (Gender)

ద్రావిడ భాషలలోని లింగబోధకత ప్రాయికముగా అర్థ ధర్మాశ్రయము సంస్కృతములో నిది శబ్ద ధర్మాశ్రయము. మిగిలిన ద్రావిడ భాషల వలె తెలుగు కూడ హేతుబద్ధమైన లౌకిక లింగమును కలిగి యున్నది దీనిని రెండు విధములుగ విశ్లేషింపవచ్చును. మహదమహత్తులను పేర లింగ విభజనమును తెలుగు వైయాకరణులు గుర్తించినారు.

స్త్రీలు, తిర్యక్కులు, జడములు నను వానిని గాక తక్కిన వానిని దెలుపు శబ్దములును, వాని విశేషణములును, మహద్వాచకములనబడును పరిశేష న్యాయముచే స్త్రీ తిర్యగ్జడములు వాని విశేషణములును అమహత్తులగును అందు స్త్రీలను దెలుపు శబ్దములను మహతీ వాచకములని యందురు స్త్రీవాచకమునకు ప్రత్యేక రూపము లేదు కాని ఈ మహతీ వాచకము ఏక వచనమున అమహద్వాచకముతోను, బహు వచనమున మహద్వాచకముతోను సామ్యము కలిగియుండును. దానితోపాటు ఆ నామ ధాతువులకే లింగ–వచన ప్రత్యయములు చేరుట స్వాభావికమైన లక్షణము. నామ ధాతువులన్నియు లింగ నిర్దేశమును ఎల్లప్పుడు పొందవు. కొన్ని నామ ధాతువులకు మహద్వాచకమున –ండు/–ఁడు, మహతీవాచకమున –అలి, –అలు, –ఇడి, –ఆలు, –ఉక, -కత్తె/-కత్తియ, –త/–తి/–తె/–తు, అమహద్వాచకమున -ంబు, -ము, -మ్ము అను లింగవచన బోధక ప్రత్యయములు చేరుచుండును.

### 3.8.1 లింగబోధక ప్రత్యయములు చేరని రూపములు :

| | | | | |
|---|---|---|---|---|
| మహద్వాచకము : | అన్న | [కాశీ 4–90] | కొడుకు | [హర 5–25] |
| | తండ్రి | [శృ.నై 2–73] | మామ | [శృ.నై 6–98] |
| మహతీ వాచకము : | అత్త | [కాశీ 4–92] | అప్ప | [క్రీడా 252] |
| | అమ్మ | [కాశీ 6–29] | | |
| మహతీతరా | పులి | [శృ.నై 6–115] | | |
| మహద్వాచకము : | కన్ను | [శృ నై 5–9] | చెవి | [శృ.నై 8–70] |

### 3.8.2 లింగబోధక ప్రత్యయములు చేరినవి :

| | | | | |
|---|---|---|---|---|
| మహద్వాచకము : | తమ్ము-ఁడు | [శృ.నై 3–28] | చోడ–ఁడు | [హర.పీ 10] |
| | బిడ్డ–ండు | [హర 2–130] | మనుమ–ఁడు | [శృ.నై 6–72] |

మహతీవాచకము :

| | | | | | |
|---|---|---|---|---|---|
| _అలి | : తొయ్యలి | [శృ.నై 1-83] | పైదలి | [శృ.నై 2-84] |
| _అలు | : కోడలు | [హర 1-8] | చెల్లెలు | [శృ.నై 8-1] |
| | చెలియలు | [క్రీడా 244] | | |
| _ఆఁడి | : వన్నెలాఁడి | [చా మ 1-122] | | |
| _ఆలు | : ఇల్లాలు | [కాశీ 7-252] | పేరఁటాలు | [భీమ 4-166] |
| _ఉక | : నెల_ఁతుక | [భీమ 2-126] | పొలఁతుక | [శృ నై 5-40] |
| _కత్తె | : చెలి_కత్తె | [కాశీ 6_208] | | |
| _కత్తియ | : చెలి-కత్తియ | [శృ.నై 4-99] | | |
| _త | : ఒక్క_త | [కాశీ 4_280] | | |
| _తి | ఒక్క-తి | [కాశీ 6_73] | | |
| _తె | : ఒక్క_తె | [శృ.నై 6_45] | | |
| _తు | : ఒక_ర్తు | [శృ నై 3-98] | | |

మహతీతరామహద్వాచకము :

| | | | | |
|---|---|---|---|---|
| _ంబు | : అంద_ంబు | [శృ నై 1_5] | డెంద_ంబు | [శృ.నై 5-80] |
| _ము | : చుట్ట_ము | [శృ.నై 7-105] | | |
| _మ్ము | : కంచ_మ్ము | [హర 5_16] | | |

మహన్మహతీ వాచకములను తెలియజేసెడు శబ్దములు ప్రత్యేకముగా వాడబడినవి.

మగ-బిడ్డ [హరి 2_130] ఆఁడు_బిడ్డ [వ.వి 22]
కోడి_పుంజు [క్రీడా 233]

### 3.8.3 వచనము (Number)

తెలుగున ఏక, బహువచనములని రెండు వచనములు కలవు. ఒకేవ్యక్తిని గాని, వస్తువును గాని బోధించునది ఏకవచనము. ఒకని కంటెనెక్కువమంది వ్యక్తులను గాని, వస్తువులనుగాని బోధించునది బహువచనము. నామరూపమునకు లింగవచన ప్రత్యయములు చేర్చియు, చేర్పకయు ఏకవచనము వాడబడును బహువచనప్రత్యయము ప్రాతిపదికకు చేర్పబడియే బహువచనము వాడబడుచున్నది

నామ ధాతువులకు ఏకవచనమున లింగ ప్రత్యయములు చేరువిధానము పూర్వ ప్రకరణమున నిరూపింపబడినది.

శ్రీనాథుని భాషలో _ము, _ఱు, _రు/ంద్రు, _లు బహువచనమున వచ్చు ప్రత్యయములు.

1. _ము : ఈ ప్రత్యయము సార్వనామిక రూపములయందే వచ్చును.

2. _ఱు,_రు|_ంద్రు : ఈప్రత్యయములు మహన్మహతీ వాచకములకు చేరును.

3 _లు : లింగముతో నిమిత్తము లేకుండ నామ ధాతువులకన్నింటికి ఈ ప్రత్యయము చేరును.

బహువచనమేర్పడు విధానము దేశ్య శబ్దములకు వలెనే దేశ్యేతరములకును వర్తించును.

**3.8.3.1 ఉత్తమ పురుష బహువచనము :**

_ము : ఏ_ము [శృ.నై 3-46] మే_ము [భీమ 2-121]
మన_ము [శృ.నై 3-129]
ఆత్మార్థకము: తా_ము [శృ నై 7-169]

3 8 3 2 ఈ క్రింది రూపములలో బహువచనమున ఱు ప్రత్యయము వచ్చుచున్నది.

1. నిర్దేశక విశేషణముల నుండి నిష్పన్నమైన సాముదాయక విశేష్యములు

అంద-ఱు [శృ నై 4-137] ఇంద-ఱు [కాశీ 2-79]
ఎంద-ఱు [శృ.నై 3-64] కొంద-ఱు [శృ నై 1-17]

2. కా ప్రత్యయంబు మీఁది బహువచన లకారంబునకు లఘ్వలఘురేఫంబులును, లఘురేఫంబునకు ముందు బిందుపూర్వకమగు దకారంబునగు [బాల-ఆచ్ఛిక-7]

వేడుక కాఁడు → వేడుక కాంద్రు [శివ 2 87]
విలు కాఁడు → విలుకాంద్రు [ప వీ 111]
గగ్గులకాఁడు → గగ్గులకా-ఱు [హర 3-10]
గగ్గులకాంద్రు [కాశీ 7 88]

తిక్కనలో 'వేఁటకాఱులు' [శల్య 2_36] అను ద్విగుణిత బహువచనము తోడి (double plural) రూపము కలదు

3.8. .3 - రు ప్రత్యయము :

1 పగతాదుల బహువచన లకారంబునకు రేఫంబగు. [బాల_అచ్చిక_5]

మహద్వాచకము :

అల్లుఁడు → అల్లురు [కాశీ 7_54]
మార్తుఁడు → మార్తురు [శృ.నై 5_125]
పగతుఁడు → పగతురు [ప.వీ 94]

2. కొన్ని డుమంతంబుల బహువచన లకారంబునకు రేఫంబును దానికి ముందు పూర్ణబిందు పూర్వక దకారంబునగు [బాల_అచ్చిక_6]

అల్లుఁడు → అల్లుండ్రు [కాశీ 7_89]
ఒక్కఁడు → ఒక్కండ్రు [కాశీ 4_164]

3, అదంతంబయి దీర్ఘపూర్వలోపధంబయిన మహత్తు మీఁది విభక్తి లకారంబునకు రేఫంబగు. [బాల_తత్సమ_38]

లోకపాలుఁడు → లోకపాలురు [భీమ 3_98]
బాలుఁడు → బాలురు [శృ.నై 7_58]

దయాళు శబ్దంబునకిట్లు రేఫంబు గానంబడియెడి

దయాళుఁడు → దయాళురు [భీమ 2_159]

మహతీ వాచకము :

4. ఆల్వాదుల బహువచన లకారంబునకు రేఫంబును ముందరి లువర్ణంబునకు బిందుపూర్వక దకారంబగు. [బాల_అచ్చిక 11]

ఆలు → ఆండ్రు [కాశీ 7_60]
కోడలు → కోడండ్రు [శృ.నై 7_9]
చెలియలు → చెలియండ్రు [క్రీడా 244]
చెల్లెలు → చెల్లెండ్రు [ప వీ 55]

పేరఁటాలు → పేరఁటాండ్రు [కాశీ 3-81]
వెలయాలు → వెలయాండ్రు [క్రీడా 263]

5. సార్వనామిక రూపములలో :

వాఁడు వారు [భీమ 6-28]; వాండ్రు [భీమ 4-207]
నీవు మీరు [భీమ 4-203]: ఈరు [క్రీడా 189]
వీఁడు వీరు [హర 7-173]

నన్నయలో 'వాండ్రు' అను రూపము లేదు. తిక్కనలో 'వాండ్రు' [స్త్రీ 1-25] 'వాండ్రురు' [శాం 3.284] అనురూపములు కలవు నన్నెచోడునిలో 'వాండు' అనురూపము ఏకవచనము నందును కలదు

6 సంఖ్యావాచకములలో :

I అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాషనగు. [బాల అచ్చిక-27]

ముగురు [శృ.నై 4-64] మువురు [హర 2-116]
నలుగురు [శివ 2-35] నలువురు [శృ నై 7-88]
ఏగురు [ప పీ 102] ఏవురు [శృ.నై 5-175]

సంఖ్యా వాచకములందు సంయుక్త గకారమునకును కొన్నియెడల వకారము కావచ్చును.

అర్గురు [కాశీ 6-99] అర్వురు [ప.పీ 58]
చారిత్రకముగా చూచినపుడు వకారమే తొలుతటిది గకారమే తరువాతది.

II రు, రవర్ణకంబులు వరంబులగునపుడు కొన్నింటికి నిత్యముగాను, గొన్నింటికి వైకల్పికముగాను బిందుపూర్వక డకారంబంతాగమంబగు. [ప్రౌఢ-శబ్ద-93]

ముప్పండ్రు [కాశీ 6-131] అఱువండ్రు [కాశీ 4-188]
ఎనమండ్రు [శృ నై 6-78] తొమ్మండ్రు [కాశీ 4-188]
పెక్కురు-పెక్కండ్రు [కాశీ 4-108]

### 3.8.3.4 –లు ప్రత్యయము :

మహదమహద్భేద వివక్షలేక బహువచనమున –లు ప్రత్యయము శ్రీనాథునియందే కాక ఇతర కవుల ప్రయోగములందును అన్ని నామములకు చేరు ననుటలో విప్రతిపత్తిలేదు చాల నామములకు ఏకవచన, బహువచన విభాగము వర్తించినను, కొన్నినామములు నిత్యైకవచనములో, నిత్య బహువచనములో అయిఉండును.

'లు వర్ణంబు బహువచనంబు [బాల–శబ్దప–12] అని చిన్నయ సూరి లువర్ణకము చేరినపుడు ప్రాతిపదికలోని వర్ణ సంయోజనముతో కొన్నిమార్పులు జరుగును ప్రత్యయములో కూడ కొన్నిమార్పులు జరుగును బహువచన ప్రత్యయమునకు రెండు సపదాంశములు కలవు.–లు, –ళు

–లును మూలరూపముగ గ్రహించి, –ళును మారిన రూపముగ చెప్పుట వ్యాకరణములో సులభపద్ధతి.

1 –అ, –ఉ, –ఎ వర్ణాంత నామధాతువులకు బహువచన ప్రత్యయము చేరునపుడు ఎట్టిమార్పును కలుగదు.

| | | |
|---|---|---|
| మహద్వాచకము | : కొడుకు > కొడుకు–లు | [కాశీ 6–60] |
| | : అయ్య > అయ్య–లు | [శృ.నై 1–17] |
| మహతీవాచకము | : అత్త > అత్త–లు | [హర 2–105] |
| | : అతివ > అతివ–లు | [ప వీ 47] |
| మహతీతరామహద్వాచకము | : చిలుక > చిలుక–లు | [శృ.నై 4–24] |
| | : ఎలుక > ఎలుక–లు | [శివ 3–10] |
| | : చెఱకు > చెఱకు–లు | [హర 2–31] |
| | . కంచె > కంచె–లు | [కాశీ 7–5] |
| | : తేనె > తేనె–లు | [శృ నై 6–12] |
| | : కుంచె > కుంచె–లు | [శృ.నై 4–132] |

2. ఏకవచనమున '–(డు' ప్రత్యయమును పొందుశబ్దములు బహువచనము నందు '–లు' ప్రత్యయమును పొందును.

తమ్ము-ఁడు > తమ్ము-లు [శృ నై 1-31]
అగఁడీ-ఁడు > అగఁడీ లు [హర 5-8]
భటు ఁడు > భటు-లు [కాశీ 5-287]
మారంకకారుఁడు > మారంకకార్లు [హర 5-8]

3 ఈ క్రింది ఏకవచన రూపములకు బహువచన ప్రత్యయము చేరునపుడు ప్రాతిపదికాద్యైన 'ఇ' వర్ణము 'ఉ' వర్ణముగా స్వరసామరస్యము (Vowel harmony) చెందుచున్నది

| | | | | |
|---|---|---|---|---|
| మహద్వాచకము | : తండ్రి | > | తండ్రు-లు | [హర 5-38] |
| [తత్సమ] | : ముని | > | మును-లు | [హర 3-10] |
| మహతీవాచకము | : తల్లి | > | తల్లు-లు | [హర 3-23] |
| | ఇంతి | > | ఇంతు లు | [కాశీ 3-169] |
| మహతీతరామహద్వాచకము | : చెవి | > | చెవు-లు | [భీమ 3-198] |
| | తావి | > | తావు లు | [కాశీ 5-57] |
| [తత్సమ] | : అంఘ్రి | > | అంఘ్రు-లు | [కాశీ 5-221] |

4. 'కూఁతు' శబ్దము ప్రథమైక వచనంబునకు రువర్ణంబగు [బాల-అచ్చిక-9]

కూఁతురు>కూఁతు లు [కాశీ 6-60]
ద్వితీయాది విభక్త్యంగము కూఁతు [కాశీ 7-69]

నన్నయ, నన్నెచోడులు 'కూఁతులు' అను బహువచన రూపమునే వాడగ, తిక్కన 'కూఁతు-ండ్రు' [శ్రీ 2-116] అను రూపమును వాడెను. 'కూతుఁరు' అను రూపమునే ప్రాతిపదికగా గ్రహించుటచే అట్టి రూపము సిద్ధించినది అర్వాచీనులు 'లు' వర్ణమును జేర్చి 'కూఁతురు-లు' మున్నగు విధముగా వ్యవహరించుట ఆ దృష్టికే పుష్టిని కూర్చును

5. బహువచనంబు పరంబగునపుడు చేను, పేను, మీను శబ్దంబుల నువర్ణంబు లోపించు. [బాల-అచ్చిక-20]

చేను- చే-లు [కాశీ 7-26] మీను- మీ-లు [కాశీ 3-73]
పేలు శబ్దమునకు ప్రయోగము శ్రీనాథుని రచనలలో మృగ్యము.

6. బహువచనంబు పరంబగునపుడు రేయి ప్రభృతుల తుది యక్షరము లోపించు. [బాల_అచ్చిక-21]

రేయి _రే_లు [భీమ 2-15] రాయి _రా_లు [శృ నై 8-148]

వేయి వే-లు [కాశీ 6_148] వ్రాయి -వ్రా_లు [ప వీ 51]

7 బహువచనంబు పరంబగునపుడావు ప్రభృతుల తుది యక్షరంబునకు లోపంబు విభాషనగు. [బాల_అచ్చిక. 22]

ఆవు : ఆ_లు [భీమ 3-62] ఆవు_లు [కాశీ 2-23]

పూవు పూ లు [కాశీ 3-213] పూవు-లు [హర 3-47]

జాము . జా_లు [కాశీ 6_19] జాము_లు [కాశీ 5-239]

మీసము : మీస-లు [శృ నై 7-93] మీసము_లు [హర 7-12]

చుట్టము : చుట్ట-లు [కాశీ 5-?92] చుట్టంబు_లు [శృ.నై 2-4]

8. వువర్ణకేతర విభక్తి పరమగుచో నుకారాంతసంజ్ఞలకు బహుళంబుగా వుగాగమంబగు [బాల_తత్సమ_49]

బంధువు బంధు-వు-లు [కాశీ 2-82] బంధు_లు [భీమ 1-57]

శత్రువు : శత్రు-వు-లు [హర 7-186] శత్రు-లు [శృ నై 5-133]

అకరువు : [దేశ్యము] అకరు_లు [భీమ 3-50]

9. కలన్వాదుల నువర్ణంబు కుజ్జగు బహువచనము పరంబగునపుడు నిత్యముగా నగు. [బాల_అచ్చిక-18]

కెలను · కెలంకు_లు [శృ.నై 1-74] కెలఁకులు [హర 7-113]

కొలను : కొలంకు_లు [భీమ 1-97] కొలఁకు_లు [కాశీ 7-206]

మ్రాను . మ్రాఁకు-లు [శృ నై 2-63]

గవను : గవఁకు_లు [భీమ 5-38]

నెఱను : నెఱఁకు-లు[1] [శృ నై 2-97] [మర్మస్థానములు]

1 నెఱఁకులు అన ప్రయోగమున వేదంవారి ప్రతియందు, వావిళ్ళవారి ప్రతియందు, అకాడమి ప్రతియందు, ఎమెస్కోవారి ప్రతియందు బిందువు లేదు ఇది అచ్చు పొరపాటుకావచ్చు.

10. విభక్తి పరంబగునపుడు గోయి ప్రభృతుల తుదియక్షరంబు తివర్ణంబగు.[2]
[బాల_అచ్చిక_35]

చేయి : చేతి-లు [స్వరసామరస్యముచే] >చేతులు [భీమ 5_119]
నేయి : నేతి-లు [స్వరసామరస్యముచే] >నేతులు [కాశీ 7_186]
నూయి : నూతి-లు [స్వరసామరస్యముచే] >నూతులు[హా.మ 1-131]

11 రేను, గోను శబ్దంబుల నువర్ణంబు గుజ్జగు. [బాల_అచ్చిక_19]
గోను > గోఁగులు [హర 7_36]

రేను శబ్దమునకు శ్రీనాథునియందు ప్రయోగము మృగ్యము.

12 బహువచనము పరంబగునపుడు _డ, _ల, _ట, _ర ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు [బాల-అచ్చిక_12]

| | | | | |
|---|---|---|---|---|
| పండు | : | పండు_లు | [కాశీ 4_121] | [సూత్రము 1చే] |
| | | పండ్లు | [శృ.నై 1-36] | [సూత్రము 12చే] |
| కాలు | : | కాళ్ళు | [హర 6_109] | [సూత్రము 14చే] |
| చీఁకటి | : | చీఁకటులు | [భీమ 2_102] | [సూత్రము 3చే] |
| | | చీకట్లు | [క్రీడా 274] | [సూత్రము 12చే] |
| గోరు | : | గోరు_లు | [శృ నై 7-166] | [సూత్రము 1చే] |
| | | గోళ్ళు | [శృ నై 4-88] | [సూత్రము 14చే] |
| కోటి | : | కోట్లు | [కాశీ 6_148] | [సూత్రము 12చే] |
| [తత్సమ] | | కోటు_లు | [శృ నై 7-76] | [సూత్రము 1చే] |

13. బహువచనము పరంబగునపు డసంయుక్తంబులయి యుదంతంబులయిన _ల, _ర, ల కలఘు లకారంబు కొన్నియెడల వైకల్పికముగ నగును.
[బాల_అచ్చిక_13]

పగలు : పగళు_లు [హర 2_15]
ఊరు : ఊళు_లు [కాశీ 5_267]

---

2. త్రిమాత్రా పరిమాణముగల శబ్దములలో అకారేతర దీర్ఘస్వర పూర్వకమైన '-యి'కి 'తి' ఆదేశమగును. తెలుగులో బహువచనరూపనిష్పత్తి : చేకూరి రామారావు - భారతి 1970, పుట_15

చివురు : చివుళు-లు [శృ.నై 8-112]
చివురు-లు [భీమ 5-101]

14 బహువచన శ్లిష్టంబులయి యద్విరుక్తంబులయిన, డకార లకారంబుల కలఘులకారంబు నిత్యంబుగ నగు. [బాల-అచ్చిక-14]

రేఫమునకీ కార్యము పాక్షికముగా నగును

| | | | |
|---|---|---|---|
| నీరు-నీళ్లు | [కాశీ 5-262] | పేరు-పేళ్లు | [హర 2-22] |
| గోరు-గోళ్లు | [శృ.నై 4-88] | నోరు-నోళ్లు | [చామ 1-131] |
| కుదురు-కుదుళ్లు | [హర 3-23] | చప్పుడు-చప్పుళ్లు | [శృ.నై 8-28] |
| నాఁడు-నాళ్లు | [భీమ 2-100] | వీడు-వీళ్లు | [శివ 2-62] |
| పగలు-పగళ్లు | [కాశీ 5-23] | చెక్కిలి-చెక్కిళ్లు | [కాశీ 6-41] |
| వ్రేలు-వ్రేళ్లు | [కాశీ 4-24] | సంకెల-సంకెళ్లు | [కాశీ 4-67] |

అద్విరుక్తంబులయిన అనుటచే ద్విత్వముల యెడ నలఘు లకారము కాదు

గ్రుడ్డు-గ్రుడ్లు [కాశీ 3-152]

15 ఇదంతములకు బహువచనము పరమైనపుడు ఉత్వమగును. అపుడు పై విధముగా రూపము లేర్పడును

| | | | |
|---|---|---|---|
| గుడి-గుళ్లు | [కాశీ 5-290] | ముడి ముళ్లు | [హర 5-38] |
| కోడి-కోళ్లు | [హర 7-137] | పచ్చడి-పచ్చళ్లు | [హర 6-130] |
| | | పచ్చడులు | [కాశీ 7-186] |

16 సమాన పదంబునందు సంయోగంబు పరంబగునపుడెల్లచో ఖండ బిందువునకుం బూర్ణంబగు. [బాల అచ్చిక-15]

| | | |
|---|---|---|
| ఏఁడు-ఏండ్లు | [కాశీ 4-72] | [సూత్రము 16చే] |
| ఏఁడులు | [కాశీ 4-40] | [సూత్రము 1చే] |
| పోఁడి-పోండ్లు | [శృ.నై 6 66] | [సూత్రము 16చే] |
| పోఁడులు | [శృ నై 7-162] | [సూత్రము 3చే] |
| బోఁటి-బోంట్లు | [శృ.నై 2-8] | [సూత్రము 16చే] |
| బోఁటులు | [కాశీ 3-62] | [సూత్రము 3చే] |

ఈ క్రింది రూపముల యందు పూర్ణ బిందువు తోడి ప్రయోగములే శ్రీనాథుని భాషలో గలవు.

తేఁటి – తేంట్లు [శృ.నై 2-113] తూఁడు–తూండ్లు [శృ నై 2-49]

17 ఔప విభక్తికంబుల లివర్ణ సల లువర్ణంబులకు బహువచనంబు పరంబగు నపుడు పూర్ణబిందు పూర్వక డువర్ణంబు బహుళంబుగా నగు

[బాల–ఆచ్ఛిక–16]

ఇల్లు – ఇండ్లు [కాశీ 7–160] ఇండు–లు [హర 2–44]
పల్లు – పండ్లు [హర 1–20] పండులు [కాశీ 4–37]
విల్లు – విండ్లు [శృ నై 2–15] విండులు [భీమ 2–35]

శ్రీనాథుని రచనలలో లివర్ణాంత రూపములు కాన వచ్చుట లేదు. తిక్కనలో బహువచన శ్లిష్టము బహువచనమునొందిన ,

ఇండ్లులు [నిర్వ 6-89] విండ్లులు [విరా 1–172]

అను ప్రయోగములు కలవు.

18 i మువర్ణకేతరంబయిన విభక్తి పరంబగునపుడు మగాగమంబగు

బింకము–బింకములు [ప వీ 25] బేరము–బేరములు [చా మ1–123]
నరము–నరములు [ప.వీ 11] రొక్కము–రొక్కములు [ప వీ 31]

ii. కొన్ని యెడల బహువచన ప్రత్యయమునకు పూర్వమందలి ముగాగమము లోపించి తత్పూర్వ స్వరంబునకు దీర్ఘంబును విభాషనగు.

చుట్టము . చుట్టాలు [హర 5–20] చుట్టంబులు [శృ.నై 2–4]
మీసము : మీసాలు [శృ నై 7–46] మీసములు [హర 7–12]
ముత్యము:ముత్యాలు [భీమ 2-52] ముత్యములు [భీమ 3–92]
వజ్రము . వజ్రాలు [హర 6–46] వజ్రములు [శృ.నై 3–94]

ఈ క్రింది రూపములో నిత్యముగ లోపించుచున్నది

కళ్లెము : కళ్లేలు [కాశీ 3–11]

19. 'దంపతి' అనునది సంస్కృతమున ద్వివచనము తెలుగున సాధారణముగా 'లు' వర్ణమును చేర్చి వాడుదురు శ్రీనాథుడు సంస్కృత సంప్రదాయము ననుసరించి లువర్ణము చేర్చకయే ప్రయోగించెను

దంపతికి దృక్కులు [కాశీ 4–169]

20 ఈ క్రింద సూచించిన ద్విగుణిత బహువచన రూపములు (double plurals) శ్రీనాథునిలో కలవు.

పేరటాండ్రు–రు [శృ.నై 6-82] పెక్కండ్రు–రు [కాశీ 6–226]
ఇల్లాండ్రు–రు [కాశీ 1–30]

1 సర్వనామములలో పూజ్యార్థమున ద్విగుణిత బహువచనము తోడి ప్రయోగములు కలవు.

మీరలు [భీమ 4–207] వారలు [భీమ 6–96]
వీరలు [కాశీ 6–99] తమరు [కాశీ 6–99]

3 8.3.5 1 పూజ్యతయందు –గారు, –వారు శబ్దములు ఈ క్రింది ప్రయోగములలో శ్రీనాథుడు వాడెను.

–గారు :

ప్రెగడగారు . పెద్ది దొడ్డుగ నాపెత ప్రెగడ గారు [శివ 2–65]
తాతగారు సత్యంబు నుడువు తాతగారనువావి [కాశీ 6–60]
అయ్యగారు : అయ్యగారి కారగింప [హర 2–124]
అయ్యగారికి నమస్కారంబు [శివ 3–39]

స్త్రీ వాచకములపైని సైతము పూజ్యత యందు –గారు కానంబడును.

అత్తగారికి [శృ నై 7–4] అత్తగారిని [కాశీ 2–83]

–వారు :

రాచవారు : ఏనికమోము తాల్పెలుక నెక్కిన రావుతు రాచవారు
సేనానియనుంగుబెద్దన వినాయక దేవుడు [భీమ 1–2]

2 పూజ్యత యందు 'ఈయన' అని ఏతచ్ఛబ్దమునకు సమానముగా వాడెను.

ఈయన దుర్జనులకీయన రౌద్రాకారుడై [కాశీ 3–151]

3 పూజ్యత యందు ఆత్మార్థక బహువచనము యుష్మదర్థకమునకు బదులుగా వాడబడినది

ఎందునుందురు తమయంతలేసివారు [కాశీ 7_147]

4 సంబంధమును తెలియజేయునపుడు బహువచనము ప్రయోగించుట జరిగినది.

ఏలొకొ మా గృహంబునకు నిప్పుడు రారు [శృ నై 3_10]
మీ వంశంబీ పరిపాటిదే [హర 2_111]

5 అజ్ఞాత ప్రశ్నము నందు ఏక వచనమునకు బదులు బహువచనము వాడుట జరుగును

ఈవార్థిమథన కథనంబేవారు పఠించిరేని [హర 6_133]
అది యెవ్వరని ప్రతీహారులెవ్వరినన్న
తన్నుగాదలఁచి చిత్తమున నులుకు [శృ నై 3_14]

3.8 3.6 1. దేశ్యమునందక్కడాదులు నిత్యైక వచనాంతములు [ప్రౌఢ-శబ్ద-28]

| | | | |
|---|---|---|---|
| అక్కడ | [శృ.నై 2_108] | ఇక్కడ | [హర 6_98] |
| ఎక్కడ | [శృ.నై 4_68] | అచ్చట | [శృ.నై 3_97] |
| ఇచ్చట | [భీమ 3_44] | ఎచ్చట | [భీమ 4_9] |
| ఇరులు | [శృ.నై 3_90] | | |

2. లోహ వాచక శబ్దములైన 'ఇత్తడి' [హర 2_90] పసిఁడి [హర 6_55] సంభారవాచక శబ్దములైన 'పెరుగు [హర 6_56] పాలు[3] [హర 2_93] నిత్యైక వచనాంతములు [ప్రౌఢ-శబ్ద-30-31]

3 లోహ వాచకమైన 'బంగారము' నిత్యైక వచనాంతము అయినను శ్రీనాథుడు బహువచనమున వాడినాడు.

మలిపించె బంగారముల దేవగృహములు [భీమ 5_81]

4. సమాసము నందు సంఖ్యా వాచకపదము పూర్వపదముగా నున్నపుడు ఆ సమస్తపదము తఱచుగ నేకవచనాంతమగును.

---

3. 'పాలు, నీళ్లు, పేలాలు, ఉక్లు-వంటి పదాలు నిత్య బహువచనాలే' చేకూరి రామారావు : తెలుగులో బహువచన రూపనిష్పత్తి, భారతి, జూన్ 1970 పుట-12.

| | | | |
|---|---|---|---|
| ఇరువాగు | [హర 6_111] | ఇరుగేలు | [కాశీ 5_195] |
| మినూ్నలు | [శృ నై 6_72] | నలుగడ | [హర 8-12] |

3 8.3.7 1 శ్రీనాధుని రచనలలో ఈ క్రింది రూపములు నిత్య బహువచనములుగా వాడ బడినవి

| | | | |
|---|---|---|---|
| అందలు | [కాశీ 7-150] | ఇందలు | [కాశీ 2-69] |
| ఎందలు | [శృ నై 3-64] | కొందలు | [శృ.నై 1-17] |
| అంగజాలలు | : | అంగరక్షకులు | [కాశీ 6_227] |
| అడుకులు | : | అటుకులు | [కాశీ 7_186] |
| అదరులు | | నిప్పుకణములు | [శృ నై 2-12] |
| అగడపలు | : | మేఘశకలముల దొంతులు | [హర 2-17] |
| ఉవ్విళులు | : | త్వర | [శృ నై 6-88] |
| ఏటికోళ్లు | : | నమస్కారములు | [భీమ 2-101] |
| కురులు | : | వెంట్రుకలు | [శృ.నై 2-15] |
| మిణుంగురులు | : | అగ్నికణములు | [హర 6-60] |
| సేసలు | : | అక్షతలు | [భీమ 4-129] |
| సోరణగండ్లు | : | గవాక్షములు | [శృ.నై 3-89] |

2 ధాన్య వాచకములైన 'వడ్లు' [వ పీ 59] పెసలు [చా మ1_138] జొన్నలు [శ్రీ శృం _74] నిత్య బహువచనాంతములు. బహువచన ప్రత్యయము చేరకపోయినను 'బియ్యము' [కాశీ 5_65] నిత్య బహువచనము.

3. శ్రీనాధునిలో క్రీడా విశేషమైన 'బొమ్మపెండిలి' [హర 4-11] ఏకవచనాంతముగ ప్రయుక్తము.

4 సరులు లేని దృక్ఛంజన శాబకములు [శృం.నై 3-90] అను ప్రయోగమును బట్టి 'సరి' శబ్ద మేక వచనాంతము తలచుగ నగుననియు, సరుదుగ బహువచనాంత మగునని చెప్పుట యుక్తము.

5. సంయుక్త క్రియకు పూర్వాంగమగు నామము కొన్నియెడల బహువచనాంతమై యుండును.

| | | | |
|---|---|---|---|
| ఓలాడు | [శివ 2-8] | ఓలలాడు | [భీమ 3-191] |
| కొల్లాడు | [భీమ 1-48] | కొల్లలాడు | [కాశీ 2-156] |
| తులతూగు | [హర 4-28] | తులలుతూగు | [శివ 2-5] |

6 'ఏగుట' అను భావార్థకమునకు పౌనఃపున్య సూచకముగా బహువచన ప్రత్యయమునుచేర్చి శ్రీనాథుడు ప్రయోగించెను ఒండు కడకేగుటలు మాని యుండవలయు [భీమ 6-100]



## 3.9.0 నామవిభక్తులు - రూపనిష్పత్తి
(Case Declension)

నామ ప్రకృతులపై చేరెడు ప్రత్యయములను నామ విభక్తి ప్రత్యయము లందురు. అవి చేరగా ఏర్పడిన ప్రథమా విభక్త్యంత రూపములు లింగము-వచనము అను ప్రకరణము నందు ప్రసక్తములు.

## 3.9.1 ద్వితీయాది విభక్త్యంగ నిర్మాణము :
(Formation of the oblique stem)

దేశ్య శబ్దములు ఔపవిభక్తికములనియు, ననౌపవిభక్తికములనియు రెండు విధములు ఈ భేదము ద్వితీయాది విభక్త్యంగ స్వరూపమును బట్టి యేర్పడినది. ప్రథమా విభక్తియందెట్టి విలక్షణమైన సంకేతము చేరదను విషయము పూర్వ ప్రకరణమున సూచితము. ప్రత్యక్షముగా ప్రాతిపదికలకు విభక్తి ప్రత్యయములు అదనముగా చేరుటవలన గాని, ప్రత్యయాత్మకౌపవిభక్తికముల చేరికచే గాని, ద్వితీయాది విభక్తులు ఏర్పడుచున్నవి. అవి ప్రాతిపదికతో తాదాత్మ్యము పొందును. ప్రథమా విభక్తి రూపమే మరియొక నామమునకు పూర్వము ఎట్టి వికృతిని పొందక, దాని స్థానము ననుసరించి ద్వితీయాది విభక్తిగా రూపొందును.

సాంప్రదాయక వైయాకరణులు '-ఇ-, -తి- -టి-, -ంటి-' అనువానిని ఔప విభక్తికములుగా గుర్తించిరి. కాని వీనికి తోడు -అ- వర్ణము కూడ చేరును. -ఇ- వర్ణము సాధారణముగా నేకవచనముల పయిని, -అ- వర్ణము ఎక్కువగా బహువచన రూపములలో ఔప విభక్తికముగ వాడుట కలదు ఇవి చేరుట చేత ద్వితీయాద్యంగ మేర్పడు చున్నది. సమాసము లేర్పడునపుడును నడుమ నియ్యవియే ఆగమాదేశములుగా వచ్చుచుండును

'-ఇ-, -అ-' అంత్యాచ్చునకు ఆదేశమగును, '-తి-, -టి-, -ంటి-' కొన్నియెడల అంత్యవర్ణమున కాదేశములుగను, కొన్నియెడల ఆగమములుగను వచ్చును -అ- వర్ణము యొక్క ఉపస్థితి (occurrence) ఆత్మార్థక సర్వనామ ద్వితీయాది విభక్త్యేక వచన రూపము నందున్నది

తన-కు [హర 2-63] దీని ప్రథమైక వచనము 'తాను'

### 3.9.1.1 ఔపవిభక్తికములు : (Inflexional increments)

ఏకవచనము :

| | | | |
|---|---|---|---|
| -ఇ- : | ఆలి-ని | [< ప్రథమ : ఆలు] | [శివ 1-3] |
| | ఊరి-కి | [< ప్రథమ : ఊరు] | [కాశీ 5-192] |
| | చూలి-కిన్ | [< ప్రథమ : చూలు] | [శృ నై 1-28] |
| | చోటి-కి | [< ప్రథమ . చోటు] | [కాశీ 2-29] |
| | కెంగేలి లీలారవిందమ్మున | [< ప్రథమ . కెంగేలు] | [భీమ 3-62] |
| -తి- : | ఆలనేతి-తో | [< ప్రథమ : నేయి] | [హర 5-47] |
| | నందీశ్వరునిచేతి-కి | [< ప్రథమ : చేయి] | [కాశీ 6-144] |
| | ఱాతి మీద | [< ప్రథమ : ఱాయి] | [భీమ 2-02] |
| | చేతి దర్పణము | [< ప్రథమ : చేయి] | [శృ.నై 1-70] |
| | అఱుతన్ | [< ప్రథమ : అఱ్ఱు] | [శృ నై 3-111] |
| -టి- : | ఏటి-లో | [< ప్రథమ : ఏఱు] | [హర 6-10] |
| | నేఁటి-కి | [< ప్రథమ నేఁడు] | [హర 4-72] |
| | మూఁటి-కి | [< ప్రథమ . మూఁడు] | [హర 5-48] |
| | కాటి-లో | [< ప్రథమ కాడు] | [కాశీ 7-46] |
| | ఐదిటి-కి | [< ప్రథమ : ఐదు] | [కాశీ 5-22] |
| | వేయిటి-కి | [< ప్రథమ : వేయి] | [భీమ 6-65] |
| | ఆఁకటి వంట | [< ప్రథమ ఆఁకలి] | [శృ నై 8-201] |
| | తాటి యంత | [< ప్రథమ : తాడు] | [హర 7-62] |
| | క్రిందటి మొగమై | [< ప్రథమ : క్రిందు] | [కాశీ 2-127] |
| -ంటి- : | ఇంటి-లో | [< ప్రథమ : ఇల్లు] | [హర 2-70] |
| | తొల్లింటి-కంటె | [< ప్రథమ . తొల్లి] | [హర 4-100] |
| | పొరుగింటి బ్రాహ్మణుని | [< ప్రథమ ఇల్లు] | [కాశీ 7-231] |
| | పదునాలుగింటి-కిన్ | [< ప్రథమ : నాలుగు] | [శృ నై 1-47] |
| | పగలింటి నిద్రలు | [< ప్రథమ : పగలు] | [శృ.నై 7-61] |

బహువచనము :

సార్వనామిక రూపములందు :

-ఇ- : వారి-యందును [<ప్రథమ : వారు] [శృ.నై 4-18]
వారి-వలన [<ప్రథమ : వారు] [శృ.నై 3-64]

-అ- :

| | | | |
|---|---|---|---|
| చేడియల-చేత | [శృ.నై 3-37] | దేవతల-కంటె | [కాశీ 4-20] |
| వీపుల-మీఁద | [కాశీ 3-138] | పద్మముల-పై | [హర 7-139] |
| మగవారల-తోడ | [శృ.నై 4-61] | పువ్వు-ల-వాన | [భీమ 6-92] |
| తూపుల-జోడు | [శృ.నై 1-79] | | |

1 చారిత్రికముగ ప్రయోగ రూపముల యందు మార్పు గోచరించుచున్నది. శ్రీనాథునిచే ప్రయోగింప బడిన ఔపవిభక్తికశబ్దము లొక విధముగా నుండగా, కొందరు వానిని భిన్నరూపములతో ప్రయోగించినట్లు కనబడును

| | | | |
|---|---|---|---|
| మొదలి | [కాశీ 2-132] | మొదలింటి | [శివ 1-49] |
| ఆఁకటికి | [కాశీ 7-168] | ఆఁకలికి | [కాశీ 6-78] |
| కౌఁగిటిలోన్ | [శృ నై 5-92] | | |

2 నన్నెచోడ, తిక్కనల కాలమున గల ఈ క్రింది రూపములు శ్రీనాథుని కాలమునకు ఔపవిభక్తిక ప్రత్యయములను మార్చుకొన్నవి.

| | | | |
|---|---|---|---|
| నీరిలో | [కు.సం 1-95] | నీరఁగలిపి | [కు సం 5-137] |
| నీరిలో | [ఉద్యో 3-368] | -నీటిలో | |
| నోరికి వచ్చినట్లు | [కర్ణ 3-80] | -నోటికి | |
| ఎదురన్ | [కు సం 8-22] | -ఎదుటన్ | |

3 ఒక్కొక్కప్పుడు ఔపవిభక్తికాంతము ప్రథమా విభక్తి రూపముగ వాడుకలోనికి రావచ్చును. నన్నయ కాలములో అమహత్సంఖ్యావాచక విశేష్యము 'ఒకండు'. దీని ఔపవిభక్తిక రూపము 'ఒకంటి.' 13వ శతాబ్దమునకు ప్రథమాంతముగా గ్రహింపబడి 'ఒకండు' కేవలము పుంలింగ రూపమైనది.

4. ద్వితీయాద్యేక వచనము పరమగునపుడు డుమంతమునకు 'ని' అను నాగమము పాక్షికముగా నగును.

| | | | |
|---|---|---|---|
| భర్గు_వలన | [కాశీ 4_233] | జము_ని_కంటె | [కాశీ 2_89] |
| ప్రచేతసు_చేత | [భీమ 3_142] | రాక్షసు_ని_చేత | [కాశీ 7_13] |
| కృష్ణు_చేత | [కాశీ 6_13] | కాము_ని_చేతన్ | [కాశీ 6_10] |
| మహేశ్వరు_వలన | [కాశీ 4_230] | కాలకంరు_ని_కంటె | [కాశీ 7_123] |

5. అనుదంతమగు నచ్చ తెనుగు డుమంతమునకు ద్వితీయాద్యేక వచనము పరమగునపుడు నిగాగమము నిత్యముగా నగును. [బాల_తత్సమ_24]

| | | | |
|---|---|---|---|
| మగ_ని_చేత | [శృ నై 8_72] | మగ_ని_తోడ | [హర 3_25] |
| మగ_ని_తో | [క్రీడా 128] | | |

6. తెలుగు శబ్దములైనప్పటికి ఉదంతములైనచో నిగాగమము పాక్షికముగా నగును.

| | | | |
|---|---|---|---|
| అల్లు_ని_న్ | [భీమ 2_73] | అల్లు_ని_కి | [హర 5_47] |
| తమ్ము_న్ | [శృ నై 4_118] | అల్లు_న్ | [శృ నై 7_4] |
| అల్లు_న_కుం | [హర 2_91] | | |

చారిత్రకముగ _ఇ_ వర్ణము ద్వితీయాది విభక్త్యంగముగను, _న్ ప్రాచీన మహద్వాచక రూపముగను చెప్పవచ్చును

7 'కూఁతురు' అను మహతీ వాచకమునకు ద్వితీయాది విభక్త్యేక వచనము 'కూఁతు'

| | | | |
|---|---|---|---|
| కూఁతున్ | [శృ.నై 7 10] | కూఁతు_వలన | [హర 3_22] |
| కూఁతు_నకు | [క్రీడా 199] | | |

బహువచనము : కూఁతు_లు [శివ 4_12]

## 3.9.2 ద్వితీయాది విభక్తుల నిర్మాణము :

(Formation of oblique cases)

ప్రథమేతర విభక్తులు చేరునపుడు ఔపవిభక్తిక నామములకు ఔప

విభక్తిక ప్రత్యయములు చేరును అదియే ద్వితీయాది విభక్త్యంగ మగును

నామము + ఔప విభక్తికము [ + ప్రత్యయము]

3.9.2.1 ద్వితీయా విభక్తి :

శ్రీనాధుని భాషలో నీ విభక్తియందు కానవగు ప్రత్యయములు :

-ను/-ని/-నిన్/-న్, -గురించి/గురిచి-గురియించి; -కూర్చి.

ఏకవచనము :

మహద్వాచకము : తిక్క-యజ్వ-ను [కాశీ 1-19] అల్లు-ని [భీమ 4-108]
తండ్రి-నిన్ [కాశీ 6-273] తమ్ము-న్[శృ.నై 4-118]

మహతీ వాచకము . నెలత-ను [ప.పీ 68] అలి-ని [శివ 1-3]
తల్లి-నిన్ [కాశీ 6-273] ఇంతి-న్[శృ.నై 5-185]

మహతీతరామహద్వాచకము. అద్దము-ను[శృ.నై 3-187]అంగద-న్ [శృ నై 8-173]

బహువచనము :

మహద్వాచకము : తమ్ముల-ను [ప.పీ 147] తండ్రుల-న్ [శివ 3-2]

మహతీవాచకము : అతివ-ల-న్ [ప పీ 46]

మహతీతరామహద్వాచకము: చన్నుల-న్[హర 5-38]

-గురించి/-గురిచి/-గురియించి :

చిన్నయ సూరి 'కూర్చి, గురించి' యను వానిని తలపెట్టనే లేదు. నన్నెచోడుని భాషయందు 'గురించి/గురిచి' యను ప్రత్యయముల తోడిప్రయోగములే లేవు. నన్నయ భాషయందు 'గురించి' తోడి ప్రయోగములు ముద్రిత గ్రంథము లందు కనబడుచున్నవి కాని వ్రాత ప్రతులందు 'గురిచి' అను ప్రయోగమున్నటుల డా॥ చిలుకూరి నారాయణరావు సూచించెను.[1] తిక్కన భాషయందు రెండు ప్రయోగములు కలవు

1. 'పాండవుల గురిచి బహు విధంబులగు' [భార-ఆది-7.3]
'ఈశ్వరు గురిచి'[భార-అర-3 81, 4.52] ఆంధ్రభాషాచరిత్ర - పుట 1385.

శ్రీనాథుని రచనలలో :

-గుఱించి . ఒక గందగజంబు - గుఱించి [శృ.నై 5-133]
పశుపతి - గుఱించి తపంబు సేయుము [హర 7-27]
విశ్వేశ్వరు - గుఱించి [హర 3-49]

-గుఱిచి : నియతి - గుఱిచి [శృ.నై 3-138]
శాత్రవున్ - గుఱిచి యీ గాయత్రి [కాశీ 3-191]
లోపాముద్రా కాంతు - గుఱిచి పోవఁగ [కాశీ 2-35]

-గుఱియించి : రమేశ్వరుఁగాని - గుఱియించి యెవ్వరఁట [కాశీ 2-9]

-కూర్చి :

నన్నయ, నన్నెచోడులయం దీ ప్రత్యయము కన్పట్టదు తిక్కన భాషలో: 'నన్ను మెచ్చని కత మేమిటం గొలఁది సాలనే వారిని గూర్చి వచ్చితే యనికి' [నిర్వ 7-75] అను ప్రయోగమొక్కటియే కలదు

శ్రీనాథుని భాషలో 57 సన్నివేశములలో 'కూర్చి' తో కూడిన ప్రయోగములు గలవు.

గాయత్రిఁగూర్చి యర్ఘ్య మెత్తిన [కాశీ 3-179]
అతనిఁగూర్చి నా ప్రాణంబు రక్షింపు మింతయు[శృ.నై 2-77]
పద్మజుఁగూర్చి యేఁగి కూ పెట్టిరి [హర 3-11]

3.9.2.2 తృతీయా విభక్తి :

ఈ విభక్తియందు వచ్చు ప్రత్యయములు :

-చే/-చేఁ/-చేత/-చేతన్/-చేతను [చేయి యొక్క సప్తమి]
-చేసి [చేయు యొక్క క్త్వార్థకము]
-తో/-తోన్/-తోడ/-తోడన్/
-తోడి/-తోడు/త-న్/-తోడుతను/-తోన(తోడు) [సాహాయ్యము యొక్క సప్తమీ]
-మై/-మైన్/-మెయి/-మెయిన్ (మెయి : ) [శరీరము యొక్క సప్తమి]

కుండలీకరణమున చూపబడిన అంకెలు ప్రత్యయముల ఉపస్థితి పౌనః పున్యము (frequency)ను తెలియ జేయును

-చే : [111] ప్రత్యేక పదముగ 10 పర్యాయములు వచ్చినది

ప్రత్యయము : నిశాలాక్షి-చే-శిశిర భాను కిరీటు [కాశీ 6-191]
మునుల-చే-వేలుపులచేత [కాశీ 4-238]

ప్రత్యేక పదము: చివ్వకుఁ జేసాప వలదు [కాశీ 1-109]
చే గదల్ త్రిప్పుచు [ప.వీ 114]

-చేన్ : [69] ప్రత్యేక పదముగ 5 పర్యాయములు ప్రయోగింప బడినది

ప్రత్యయము : దైత్యు-చేన్ [హర 3-15] శివుని-చేన్ [భీమ 2-77]
ప్రత్యేక పదము. ఒకచేన్ ఇందీవర మాలికయును [కాశీ 6 125]
శూలంబు చేన్-అందె సోమనంది [కాశీ 7-31]

-చేత : [83] ప్రత్యేక పదముగా 8 పర్యాయములు వచ్చినవి

ప్రత్యయము : నందన-చేత వ్రేటువడి [హర 1-26]
శౌరి-చేత సత్కారమంది [కాశీ 6-7]
ప్రత్యేక పదము : కుడిచేత మాంసఖండములు [శివ 4-38]
ఒకచేత ప్రేవుల నొయ్యన నెత్తి [ప వీ 116]

-చేతన్: [72]: ప్రత్యేక పదముగ 13 పర్యాయములు వచ్చినవి

ప్రత్యయము : కాముని-చేతన్ [శృ.నై 6-10]
నిషధాధిపు-చేతన్ [శృ నై 4-136]
ప్రత్యేక పదము : ఎడమ కుడిచేతన్-ఆరతులిచ్చువారు [క్రీడా 142]

-చేతను : [18] ప్రత్యేక పదముగ ఒకే పర్యాయము వచ్చినవి

ప్రత్యయము : దమయంతి - చేతను [శృ నై 4-106]
జనంబుల - చేతను [భీమ 1-110]
ప్రత్యేక పదము : ఒక చేతను రోఁకలి పూని [చామ 1-134]

-చేసి : [69] రాపిఁడిని-జేసి [హర 6-16] లేఁమిఁ-జేసి [భీమ 3-5]

-తో : [268] వేడ్క-తో ఖదిరపాణి [శృ నై 3-3]
రసముతో-రాయిడింప [హర 5-54]

-తోన్ : [233]నాలుక-తోన్ [శృ నై 6-49] నేతి-తోన్ [భీమ 2-142]

తోడ : [437] ప్రత్యేక పదముగ ఒకే పర్యాయము వచ్చినది.

ప్రత్యయము : అవ్వ-తోడ [హర 2-1..]
భక్తి-తోడ భజింపరో [భీమ 3-83]

ప్రత్యేక పదము : మనముల్ నిండగఁదోడ - రాఁద్రిజగతీమాన్యుండు [హర 4-.3]

-తోడన్ :[186] ఈశ్వరుని-తోడన్ [కాశీ 4-218]
నృపాలుని-తోడన్ [శృ నై 5-69]

-తోడి : [48] వాని-తోడి సంబంధము [హర 4-29]
దమయంతి - తోడి సఖ్యంబు [శృ నై 2-24]
పుష్పశరాసను - తోడి [కాశీ 5-165]

-తోడుత: [5] [ప్రౌఢ-కారక-8]
ముత్యాల-తోడుత ముగ్గులు వెట్టి [పవీ 16]
నియమంబు-తోడుత-నిల్చినవేళ [పవీ 58]

-తోడుతన్ :[5] చిఱువాల-తోడుతన్ [శివ 4-8]
అర్థి-తోడుతన్ [హర 2-44]

-తోడుతను:[1] ఒండొరుల-తోడుతను [భీమ 4-33]

-తోడుత/-తోడుతన్/-తో కూడిన ప్రయోగములు నన్నయ, తిక్కనల భాషయందులేవు. కాని నన్నెచోడుని యందొక ప్రయోగము మాత్రమే కలదు.

వేళ్ల-తోడుతన్-కల్ప వృక్షముల్ వెఱికించి [కుసం 4-11]

-తోన : [6] నీజవ్వనంబు-తోన [శృ నై 4-21]
భయంబు-తోన [భీమ 5-45]

-మై : [28] ప్రత్యేక పదముగ 9 పర్యాయములు వచ్చినది

ప్రత్యయము : భీతి-మై వాసవుఁడు [శృ.నై 7-48]
భక్తి-మై సప్త సాహసములను [కాశీ 6-151]

ప్రత్యేక పదము : మైవడఁక గన్నుల్తార కాబింబ సంచార [హర 2-83]
మై సగము నిండ [కాశీ 6-21]

-మైన్ : [12] ప్రత్యేక పదముగ 7 పర్యాయములు వచ్చినది

ప్రత్యయము : చప్పమైన్ [శృ నై 7-181]
తాల్మిమైన్ [శృ నై 6-132]
ప్రత్యేక పదము : మైన్ కలయ వలఁది [హర 5-56]
మైన్ అలఁది కొనిన [హర 2-94]

-మెయి : [2] ప్రత్యేక పదముగ 6 పర్యాయములు వచ్చినది

ప్రత్యయము : అచ్చలంబు - మెయి [శృ.నై 1-79]
జాగరూకత - మెయి [వ పీ 38]

ప్రత్యేక పదము . ఒక్క మెయి నిండగఁ జేయుటకై [శృ.నై 2-54]
మెయి చాయ చంద్రికామృతము [కాశీ 5-5]

-మెయిన్ : [8] ప్రత్యేక పదముగ 6 పర్యాయములు వచ్చినది.

ప్రత్యయము వంపిన-మెయిన్ [శృ నై 6-113]
భక్తి-మెయిన్ [భీమ 3-152]
ప్రత్యేక పదము . మెయిం-గబళించి [కాశీ 4-68]
ఈ మెయిఁ బ్రేమ్య భావము [శృ.నై 4-54]

-వన్ అను ప్రత్యయముపై 'చేసి' అవ్యయముగ చేరి తృతీయార్థక మగును.

మదనోన్మాదంబునం - జేసి [శృ.నై 2-84]
నైర్మల్యమునఁ - జేసి [హర 2 45]

నన్నయ భాషలో 'వలన' అను అసబంధ ప్రత్యయముతో కూడి -చేసి తృతీయార్థమున వాడబడినది

క్రోధంబువలనఁజేసి లజ్జయు, వృత్తంబునుం జెడు [భార 3-2-315]
-చేతన్, -చేన్, -చేసి -మెయిన్ ప్రత్యయములు తృతీయార్థమున, -తోడన్, -తోన్ ప్రత్యయములు తృతీయార్థమున, సహార్థమున (sociative) వచ్చును.

తృతీయా విభక్తి శ్రీనాథుని భాషలో నీక్రింది అర్థములలో ప్రయుక్తము.

1 గ్రహణార్థము : [బాల-కారక-4]

బ్రాహ్మణుల చేత దీవెనల్ వడసి [శృ.నై 3-107]

కృష్ణుచేత శాప మోక్ష ప్రకారం బెఱింగి [కాశీ 6-13]

2. కరణార్థము : [బాల-కారక-5]

దంభోళి తోడ సంస్తంభించితి [భీమ 3-212]

ఈ కత్తి చేత తల తెగ వేయుదు [ప.వీ 91]

అలరమ్ములచే నదికారణంబుగాఁ దొయ్యలి

[శృ.నై 1-83]

3. తుల్యార్థము : [బాల-కారక-5]

పువ్విలుకానితోడ సరిపోలెడు చక్కని వాఁడు [శృ.నై 1-77]

4 సహార్థము : [బాల - కారక - 5]

కుంభ సంభవుడబ్ధితోఁగూడఁగ్రోలి [శృ.నై 2-123]

శశితోడం గూడఁ గౌముదియు [హర 3-93]

5. పచ్యర్థాముఖ్యకర్మమునకు : [బాల-కారక-6]

ఆ మానాధికుతోడ నిట్లనియె [హర 2-57]

6 హేత్వర్థకము : [బాల-కారక-4]

దానాదులచేత సంచితంబులైన దురితంబులు నిరసింపఁబడుట

[కాశీ 3-50]

5 9.2.3 చతుర్థీ విభక్తి :

ఈ విభక్తియందు వచ్చు ప్రత్యయములు :

-కై/కయి, -పొంటెస్, -కొఱకు.

-కై /-కయి : షష్ఠీ ప్రత్యయమైన కు + అయి/క + ఐ[అగు ధాతువు యొక్క క్త్వార్థకము] అనువాని చేరిక వలన కలిగినదని పరిశీలకుల

నిర్ణయము. ఉదంత ప్రాతిపదికలకు న వర్ణము -కై/-కయి ప్రత్యయములు పరముగా వచ్చును.

చక్రలాభమున-కై [భీమ 6-62] సర్గశేషమున-కై [హర 4-42]
ఏకార్యమున-కయి యేచోటికరిగెదరు [శివ 4-54]

-కయితో కూడిన ప్రయోగము నన్నయ భాషలో కలదు

అన్యుల-కయి అన్యులు జూదంబాడుట [భార 2-2-175]

-పొంటెన్ : శ్రీనాథుని భాషలో నీ ప్రత్యయము మూడు పర్యాయములు మాత్రమే ప్రయుక్తము.

ప్రథమా విభక్తి రూపముపై :

ఎద్ది రచియించె బుధలోక హితము పొంటెనట్టి [శృ.నై 1-16]
అట్టి నెయ్యముపొంటె నలుని పౌత్రుండవై [శృ నై 8-129]

తద్ధర్మార్థక ధాతుజవిశేషణముపై :

శిశిరోపచారముల్ సేయు పొంటెఁ బ్రోవు [శృ.నై 2-116]

-పొంటెన్ తోడి ప్రయోగములు నన్నెచోడుని యందు లేవు. నన్నయ తిక్కనలు వాడిరి.

-కొఱకున్ : [కొఱ + కు] కొఱ-ప్రయోజనము 'కొఱ' అను శబ్దము 'కు' అను ప్రత్యయము నెనసి 'కొఱకు' అయినది.

నా-కొఱకు [హర 4-48] మా-కొఱకు [హర 4-50]
అన్నంబు-కొరకు [ప.వీ 110] దేహంబు-కొరకు [ప వీ 111]

-కొఱకున్ ప్రత్యయము నన్నయ, నన్నెచోడులయందుగాని, పదునొకండవశతాబ్దపు శాసనములందుగాని, తత్పూర్వపు శాసనములందుగాని కానరాదు తిక్కన భాషలో [3 + *1] ప్రయోగములు కలవు

శాంతి కొఱకు విజ్ఞానంబున [శాం 5-90]
నీ పరిపాటి గర్మ శ్రీలతకొఱకున్ [శాం 4-98]

-కోసము అను పదము చతుర్థీ విభక్త్యర్థకావ్యయముగ శ్రీనాథుని ప వీ చరిత్రలో కలదు. ఇది కన్నడమందలి 'ఓస్కర' శబ్దముతో సంబంధించిన

దందురు తెలుగు మాండలికములలో 'కోసరము' సైతము కన్పించు చున్నది

కలిమికోసము వచ్చి కలియుట లేదు [ప.వీ 97]
సంప్రదానార్థమున చతుర్థి వచ్చుచున్నది [బాల–కారక–8]
వానికై యభీతి దాన మొసఁగు [శృ.నై 4–101]

3.9.2.4 పంచమీ విభక్తి :

ఈ విభక్తి యందు శ్రీనాథుని భాషలో కనిపించుచున్న ప్రత్యయములు.

1. –ఉండి [ఉండు ధాతువు యొక్క క్త్వార్థకము]
2 –వలనన్ [దిగర్థకమగు 'వలను' పదమునకు సప్తమ్యేక వచనము]
ఇది – వల్ల అనియు ఏకారము నొందినది.
3 –కంటెన్ [షష్ఠి -కు + అంటెన్ : అంటివేని అను ధాతు చేదర్థక పరిణత రూపము]
4 –కోలెన్ [కొలుచు : సేవించు, తూకము చేయు]
5 –కతమున [కృతము యొక్క తద్భవ రూపము]
6. –పట్టి [పట్టు ధాతువునకు క్త్వార్థకము : గ్రహించి]

–ఉండి, –కోలెన్ అనునవి నామముల యొక్క సప్తమీ రూపములపై ప్రయోగింపబడినవి మిగిలినవి నియత పద్ధతితో ద్వితీయా విభక్త్యంగరూపములు.

–ఉండి : గద్దియ–నుండి [శృ నై 7–160] కాశి–నుండి [కాశీ 3–101]
ఇంట–నుండి [కాశీ 5–63] స్థానంబుల–నుండి [హర 2–138]

–వలనన్ :[118] ప్రత్యేక పదముగ 3 పర్యాయములు వచ్చినది.

ప్రత్యయము · క్రోధంబు–వలన [హర 3–18] అతని–వలన [శృ.నై 2–3]
ప్రత్యేక పదము . ఏవలన నైన నుండి తపంబు [భీమ 3–189]
ఆవలనన నిర్గమించి కదా [కాశీ 3–120]

వల్ల తోడి ప్రయోగములు ప వీ చరిత్ర యందే కలవు.

వల్లను వలన : కదలిన నీవల్ల గాకున్న దేమి [ప వీ 50]
నేటి వ్యవహారమున 'వల్ల' ప్రచురముగా కలదు

వలన ప్రత్యయము భిన్నార్థములలో శ్రీనాధుడు వాడెను.

'అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ నిరామాంతర్ధి వారణంబు లెద్దాన నగు దానికి వలన వర్ణకంబగు [బాల-కారక-9]

1. అపాయార్థము : అపరాధంబు వలన విముక్తుండగుటయుఁ [కాశీ 4-68]
రాజ సమాజంబు వలనం బాపి [శృ.నై 6-164]
పాతకంబుల వలన విముక్తుండగును [భీమ 5-30]

2. భయార్థము : మూఁడుకోట్ల వారల వలనం గలంగెడు [హర 7-148]

3. గ్రహణార్థము : గుణంబులు జనపరంపర వలన వినియె [శృ.నై 1-78]
ఘంటా సిద్ధేశ్వరుని వలన సంత్ర సిద్ధి వడసె [కాశీ 3-57]

4 భవనార్థము : వెలివాడ యోషిత్తు వలన సంతతి గాంచె [శివ 5-5]
భువనేశ్వరి మహేశ్వరుని దేహంబువలన నిర్ముక్తయయ్యెన్ [భీమ 2-15]

5. త్రాణార్థము : మృత్యు దేవత వలన నిజ ప్రాణంబులకు
బరిత్రాణంబు గావింపను [శృ.నై 4-40]
భర్త నభ్యుద్ధరింపఁ బాపంబు వలన నగ్ని
నుఱికిన యట్టి పద్మాయతాక్షి [కాశీ 2-87]

-కంటె : తరుణి-కంటె [భీమ 5-64] ముక్కంటి-కంటె [కాశీ 7-123]

-కంటెన్ : నీ-కంటెన్ [హర 7 28] చెలుతొండనంబి-కంటెన్ [హర 2-81]

1 అపహద్వాచకమైన ఉపపత ప్రాతిపదిక తరువాత 'న' వర్ణమాగమముగ వచ్చును
ఎలమితూపమ-న-కంటె హెచ్చు గొలిచి [ప.వీ 42]

3 భావార్థక స్ఫూర్తి కలిగిన తద్ధర్మార్థకపదముపై - కంటెన్ ప్రత్యయము వచ్చుట కలదు.
కడు వేడుక నిచ్చుకంటెఁ బ్రీతి [భీమ 5-62]

3 -కంటె వర్ణక మవ్యయముల మీదను చేరును
అంత-కంటెను [కాశీ 3-78] ఇంత-కంటెను [కాశీ 4-133]

4 -కంటె వర్ణకమునకు మాఱుగ 'కన్న' వర్ణకము శ్రీనాథుని భాషలో కలదు.
కాశి-కన్నను నెక్కుడు గౌరవమున [భీమ 2-5]

కోలె/-కోలెను : కాల వాచక శబ్దములపై, క్రియాజన్య విశేషణములపై కనబడుచున్నది

కాలవాచక శబ్దములపై : పుట్టిన నాఁటన్-గోలె [హర 4-26]
నాఁట-గోలెన్ [శృ నై 7-4]
హృదయంబున నాఁటిన నాఁటం గోలె [హర 4-26]

క్రియాజన్యవిశేషణములపై : తరుణేందుధరున్ వీక్షించిన-కోలెను [కాశీ 3-25]

-కతంబున/-కతమున : నీ -కతంబునఁగాదె కాకోల విష వహ్ని [కాశీ 5-96]
వెల్లివిరిసిన-కతంబునన్ [శృ.నై 1-100]
గర్భ భారము-కతమున [శివ 2-51]
పోయెడు-కతమున [కాశీ 3-117]

-కతన : నీచరిత్రంబు-కతన [హర 4-21] నీ-కతన [కాశీ 4-93]

-కతాన : పెల్లాకొన్న-కతాన [భీమ 2-120]

-పట్టి : [157]

1 ఇది పదముల ద్వితీయా విభక్తి రూపముల మీద చేరుచుండును.
భుజంగ ప్రతానముఁ బట్టి బాధింతురు [హర 5-10]
తోఁకయు శిరంబును బట్టి [హర 6-60]

2. అన్నంత రూపముల మీదను 'పట్టి' ప్రయుక్తమై హేత్వర్థకమగును.
సురలు నసురులు సంప్రీతిఁ దరువంబట్టి [కాశీ 5-283]
సేవింపఁ బట్టి [కాశీ 6-18]

2. భావార్థకముపై 'పట్టి' ప్రయుక్తమై హేత్వర్థక మగును.
నీ బోఁటి పుణ్యవతులు కొందఱు గలుగంబట్టి [కాశీ 2-93]
ఎట్టు సమకూరు వీరికి నీ ప్రభావ మీవు
గలుగంగఁ బట్టి కా కందువదన [కాశీ 3-44]

4. 'పట్టి'ని హేత్వర్థముననే కాక ఇతరార్థములందును వాడ వచ్చును.

పెద్ద గాలంబునం బట్టి [కాశీ 5-275]

ఊాసు మిటఁబట్టి యే నీకు మాన్యవేని [శృ నై 4-82]

3.9.2.5 షష్ఠీ విభక్తి :

షష్ఠీ విభక్తి సామాన్యముగా సంబంధార్థమునందు వచ్చును. దీనినే శేష షష్ఠి యందురు ఈ శేష షష్ఠి యందు 'యొక్క' అనుదానిని కూడ వ్యాకరణ కర్తలు చెప్పిరి కాని ఇది శ్రీనాథుని కావ్యములందు లేదు.

షష్ఠీ విభక్తియందు వచ్చు ప్రత్యయములు

-కున్, -కిన్.

-కున్ : దీనిని తెలుగు వైయాకరణులు షష్ఠీ విభక్తి ప్రత్యయముగా పరిగణించిరి కేతన దీనిని చతుర్థీ, షష్ఠీ విభక్తి ప్రత్యయముగా గుర్తించెను[2] ఆధునిక వ్యాకరణ వేత్తలు దీనిని షష్ఠీ విభక్తి ప్రత్యయముగా నిర్ధారించిరి. ఇట్టి భిన్నాభిప్రాయము కలుగుటకు కారణమేమనగా చారిత్రకముగ తెలుగు నందలి ప్రత్యేకమైన ప్రత్యయము చతుర్థ్యర్థము నిచ్చుచున్నది -కై [కు + అఇ], కై అకు [కొఱ + కు] ఇందలి -కు వర్ణమే షష్ఠీ విభక్తి ప్రత్యయము అయినప్పటికిని సాధారణముగా నీ ప్రత్యయము సంబంధార్థమునందు కంటె సంప్రదానార్థమైన చతుర్థ్యర్థమునందే వాడబడు చున్నది

1 అదంత, ఉదంత, ఎదంత ప్రాతిపదికలపై -కున్ ప్రత్యయము వచ్చును.

అన్న-కున్ [హర.పీ 30] అమ్మ-కున్ [భీమ 4-171]

ఇండ్ల కున్ [శృ నై 1-97]

కన్నె-కున్ [శృ నై 8-121] పల్లె-కున్ [కాశీ 5-64]

2. -కు ప్రత్యయము పరమగుచో ఉదంతములకు 'న' వర్ణమాగమమగును.

అంతిపురంబు-న-కు [శృ నై 7 145] కొడుకు-న-కున్ [కాశీ 4-11]

2 కేతన : ఆంధ్ర భాషా భూషణము - పుటం 85.

3. ఈ క్రింది ప్రయోగములలో నగాగమ ప్రాప్తిలేదు

బచ్చు-కున్ [శృ నై 6-115] పసపు-కు [శృ.నై 7-12]
పిచ్చుకుంటు-కు [శృ నై 8-13] ఎదురు-కు [భీమ 4-12]

పదునాల్గవ శతాబ్దము నుండియు కవులు యథేచ్ఛముగ నగాగమములేని రూపములు వాడుచు వచ్చిరి అయినను ఇట్టివి క్వాచిత్కముగ పూర్వ కవులలోను కలవు.

నన్నయలో : తాకు-కు [భార 3-4-12]
నన్నెచోడునిలో : నభము-కు [కు. సం. 1-168]
కౌను-కు [కు సం. 8-160]
పాల్కురికి సోమనలో. కొలువు-కు [బసవ 7-218]
తిక్కనలో : ఆకసంబు-కు [అను 5-468]
పరసదనంబు-కు [కర్ణ 3-298]
నాచనసోమనలో . దిక్కు-కు [ఉ.హ 2-40]

4. సంబంధార్థమున -కున్ ప్రత్యయ మీ క్రింది ప్రయోగములలో శ్రీనాథుడు వాడెను.

నీకున్-కోడలు [హర 1-8] ఈతండు మగఁడు నీకున్ [శృ.నై 4-109]

-కిన్ : 1. ఇదంత ప్రాతిపదికలపై -కిన్ ప్రత్యయము వచ్చును.

గుడి-కిన్ [భీమ 3-59] తల్లి-కిన్ [హర 2-58]

2 మహద్వాచకములకు నిగాగమము మీద 'కిన్' అను ప్రత్యయము వచ్చుచున్నది.

అల్లు-ని-కిన్ [శృ.నై 6-97]

శేష షష్ఠికి : 1. ఉకారాంత జడవాచక పదములలో : ఎదుర్కట్టున [కాశీ 6-262]

2 కొన్నియెడల నామమున కెట్టి ప్రస్ఫుటమైన సంకేతమును లేకయే యుండును. అట్టియెడల శబ్ద క్రమము (word order) ప్రాధాన్యము వహించును.

మృత్యుదేవతముని పండ్లు [కాశీ 2-47] అలరు వాన [శృ.నై 7-24]
ధాయంచ పలుకులు [శృ.నై 2-35] పులి తోలు [హర 4-11]

3. ప్రథమైక ప్రత్యయమైన -ండు వర్ణము లోపించుటచే షష్ఠ్యర్థము వచ్చును.

అభవు ప్రోల [హర 3-70] దైత్యుచిత్తంబు [హర 3-4]
కాలభైరవు చిత్తము [భీమ 2-159]

తెలుగు వైయాకరణులు -లోన్, -లోపలన్ అనునవి షష్ఠీ విభక్తి ప్రత్యయములుగ పరిగణించిరి. దీనికి కారణము సంస్కృత విభక్తి విధానానుసరణమే కాని అవి వాస్తవముగా సప్తమీ విభక్తి యొక్క అనుబంధ ప్రత్యయములు

**3.9.2.6 సప్తమీ విభక్తి :**

ఈ విభక్తియందు వచ్చు ప్రత్యయములు :

1. -అన్/-నన్
2. -అందు
3. -లో/-లోన్/-లోన/-లోనన్; -లోపల/-లోపలన్

స్థలవాచకమైన -అల్ అను పదము నుండి -అన్ అను ప్రత్యయము నిష్పన్నమైనటుల కొందరు పండితుల యభిప్రాయము. [కన్న. అల్లి తె అల్ల]

-లోన్, -లోపలన్ అనునవి నిర్ధారణార్థమున తర్వాత ఏర్పడిన షష్ఠీ విభక్తి ప్రత్యయములు. కాని అవి సప్తమ్యర్థము నిచ్చుచున్నవని సంప్రదాయ వ్యాకరణ వేత్తల యభిప్రాయము.

-అన్ : నోరన్ [హర 2-83] ఇంటన్ [శివ 3-15]

[బహు] కెలంకు-లన్ [శృ.నై 1-74] నలుదెస-లన్ [శృ నై 1-64]

-నన్ : ముక్కు-నన్ [కాశీ 4-227] పేరురము-నన్ [శృ నై 8-113]

-అందు: [693] ప్రత్యేకపదముగా 72 పర్యాయములు వచ్చినది

ప్రత్యయము : చేతులందు [శృ.నై 2-141] దినంబు-నందు [హర 2-24]
నీ-యందు [హర 7-98] కడుపు-నందు [శృ.నై 8-145]

ప్రత్యేక పదము : అందగ్రజుండు [శృ నై 1-54]
అందుధర్మంబుఁ జేసిన [భీమ 5-152]

1 ఉదంత శబ్దముల ఏకవచనమునకు అందు వర్ణకము పరమగునపుడు నగాగమము వచ్చును.

పద్మమునందు [శృ నై 6-77] గుణమునందు [శృ.నై 1-57]

[బహు] సప్తర్షులందు [శృ నై 1-19]

పాతాళవిష్టపములందు [శృ.నై 1-66]

2 నిర్ధారణార్థమున అందువర్ణకము :

దీవులందెల్ల నేరేఁటి దీవి లెస్స [హర 2-3]

3. అధికరణమున అందు వర్ణకము :

కాశిపురంబునందు భిక్షాన్నము లేదు [కాశీ 7-180]

జనంబునందెల్ల స్వయంవరంబు [శృ నై 2-142]

4. కొన్నియెడల సప్తమీ విభక్తి ప్రత్యయముపై 'అందు' ప్రయోగించుట కలదు

కాశికా స్థానము-న-యందు [కాశీ 1-174]

విదర్భ దేశము-న-యందుద్భూతమై [శృ.నై 3-18]

-లో : [122] పురము-లో [హర 2-45]

-లోన్ : [150] ప్రత్యేక పదముగ 5 పర్యాయములు వచ్చినది.

ప్రత్యయము : వనము-లోన్ [శివ 3-140] కంచి-లోన్ [హర 1-13]

ఆమూటఁది త్తిలో నదిమి తుఱిమి [కాశీ 5-61]

ప్రత్యేక పదము : లో గదిరిన పాపభీతి [శృ నై 3-86]

-లోన : [104] ఎద-లోన [హర 7-153] పీటి-లోన [హర 3-6]

-లోనన్ : [88] ప్రత్యేక పదముగా 6 పర్యాయములు వచ్చినది.

ప్రత్యయము : మది-లోనన్ [శృ.నై 1-58] దేశము-లోనన్ [శృ.నై 7-116]

ప్రత్యేక పదము : వెక్క-సంబై విభాసిల్లు లోనన్ చైతన్యంబు నీవు [కాశీ 3-176]

దీని వక్షోరుహంబులాలోన నుండు [శృ.నై 8-66]

-లోపల : [7] సభ-లోపల [శివ 1-30]

-లోపలన్ : [13] ప్రత్యేక పదముగ 2 పర్యాయములు వచ్చినది.

ప్రత్యయము : అడుసు-లోపలన్ [కాశీ 1-114]
కంచి-లోపలన్ [హర 2-19]

ప్రత్యేక పదము : లోపల-వెండియుఁ బైఁడియు [క్రీడా 256]

3 9.2.7 సంబోధనా విభక్తి :

సంబోధనమును తెలియ జేయు విభక్తిని సంబోధన ప్రథమా విభక్తి యందురు.

1. మహద్వాచక శబ్దముల తుది యచ్చు సంబోధనంబున దీర్ఘము నొందును.
తత్సమములలో : కుంభసంభవా [కాశీ 5-175]
మహేంద్రా [శృ.నై 5-194]
దేశ్యశబ్దములలో : అన్నా! [హర 2-75] అయ్యా [హర 2-75]

2. కొన్ని యెడల తుదియచ్చునకు దీర్ఘము వైకల్పికము.
భూదేవ [కాశీ 3-202] కలశ సంభవ [కాశీ 7-127]
కుమార [భీమ 2-156]

3 ఇదంత ప్రాతిపదికలు దీర్ఘములు పొందుట వైకల్పికము.
తల్లీ [భీమ 2-120] కల్యాణీ [భీమ 5-85]
ఉగ్మలీ [శృ.నై 2-67] వెలది [శృ.నై 5-8]
తరుణీ [శృ.నై 4-33] వైదర్భి [శృ నై 7-27]

4. సంబోధనమున ప్రాతిపదిక మీది లింగవచన ప్రత్యయమునకు అకారము కలిగి దీర్ఘము కలుగు చున్నది
తమ్ముఁడా [హర 3-94] చెలువుడా [ప.పీ 99]

5. సంబోధనమున బహువచన నామములకు -ఆర ప్రత్యయము వచ్చును.
దేవతలార [శృ నై 4-113] సఖులార [శృ.నై 1-110]
తమ్ములార [భీమ 4-53] ముదితలార [శృ.నై 2-126]

6 'ఓ' శబ్దము సంబోధ్య వాచకమునకు ముందే వాడబడును.
ఏక. ఓ కంసారి [శృ నై 8-146] ఓ తండ్రి [కాశీ 4-37]

ఓదామోదర [శృ.నై 8-119] ఓ దేవ [భీమ 6-8]
బహు.ఓ వెఱ్ఱులార [భీమ 4-52]

7. ఓ శబ్దమునకు చివర పురుష సంబోధనమున 'యి' వర్ణమును, నీచ పురుష సంబోధనమున 'రి' వర్ణమును వికల్పముగ నాగమములగును

ఓయి : ఓయి! జనమేజయుండ [భీమ 3-216]
ఓయి! విశ్వానరుండ [కాశీ 4-15]
క్రియలపై : వినవోయి [ప వీ 2]
ఓరి : ఓరి దురాత్మ [భీమ 2-153] ఓరి మదాంధ [హర 6-11]
'ర' పై ఓరి : ఎవ్వడవు + ఓరి ఎవ్వడవురోరి [హర 7-50]
నిన్ననరాదు + ఓరి నిన్నరాదురోరి [క్రీ. పీ 66]
తగు + ఓరి తగురోరి [హర 7-53]

8 స్త్రీవాచక పదములకు పరముగ -రో ప్రత్యయము కేవలము ప వీ చరిత్ర యందే వచ్చుచున్నది. [ప్రౌఢ-శబ్ద-14]

ఇంతి-రో [ప వీ 39] తల్లి రో [ప.వీ 38]
చెలువ-రో [ప.వీ 76]

9 దేశ్యములందు కొన్నిచోట్ల స్త్రీవాచకములగు సంబోధ్య వాచకముల మీద నేకవచనమున 'కాన' శబ్దము చేరుచుండును

ధర్మమేమరకుండుమీ తల్లి - కాన [శృ నై 7-9]
చిలుకలకొలికి - కాన [శృ నై 8-50]

10 సంబుద్ధియందు మహతీవాచక పదములతో 'ఓమె, ఏమె' ప్రయోగింపబడుచున్నది.

ఓమె యేమె, యిదే మేమెలేమ యేమె
మేఘపుష్పంబు దేవంచు మేల మాడ [శృ నై 6-114]

## 3.9.3 విభక్తి విపర్యయము : (Functional Syncretism)

వైయాకరణులు వివరించిన ప్రత్యయములు, వారు విధించిన విభక్తుల యందేకాక యితర విభక్తుల యర్థము నందును వచ్చుచుండుట గోచరించును. ఈ విషయమునే యాంధ్ర శబ్ద చింతామణికారుడు "అన్యస్యాః క్వచిద్భవేచ్ఛాన్యా"

అని సూత్రించెను. ఈ సంస్కృత సూత్రమునకు అనువాదమే అనదగినట్లు 'ఒకానొకచో నొక విభక్తికి మఱియొక విభక్తియునగు' [బాల-కారక-21] అని సూరి సూత్రీకరించెను. వ్యాకరణ నియమము ననుసరించి ఒక విభక్తి ప్రత్యయము రావలసి యుండగా అది రాక దానిస్థానము నందు మఱియొక ప్రత్యయము వచ్చునని యర్థము

ఆధునిక పద్ధతిలో దీనినిట్లు వివరింపవచ్చును ఒక విభక్తి ప్రత్యయము నకు ఒకకారక సంబంధ వ్యక్తీకరణము ప్రధానకార్యముగ గుర్తించి, అట్టికార్యము మరికొన్ని విభక్తులచే జరిగినచో అదివిభక్తి విపర్యయమని యందురు దీనినిబట్టి ఒకవిభక్తికి ప్రధానకారక సంబంధమును గౌణకారక సంబందములును ఏర్పరింప వచ్చును ఆధునిక వ్యాకర్తలు కారక సంబంధములను గుప్త నిర్మాణమునందు గుర్తింతురు. విభక్తిసంధానమును వాని మార్పులను పరివర్తన సూత్రములద్వార సాధింతురు అనగా విభక్తి విపర్యయములను సాధించు సూత్రములను పరివర్తన నిర్మాణములుగా గ్రహింపదగును.

3.9 3.1 శ్రీనాధుని కావ్యములందు ఒక విభక్తికి మఱియొక విభక్తి వచ్చిన ఉదాహరణములు క్రింద పొందుపరుపబడుచున్నవి

1. ద్వితీయకు ప్రథమ : జడవాచక నామములపై వచ్చును

| | | |
|---|---|---|
| నీ వరంబేదియొ వేడుమనుటయు | [వరంబును] | [హర 7-101] |
| మాయందు నక్కటికంబు పాటింపు మయ్య | [అక్కటికంబును] | [శృ నై 7-90] |
| చూడాహేమ విటంక కోణముల యంచుల్మెట్టి - | [అంచులను] | [శృ నై 7-153] |
| బృందారకునియందు డెందంబు నిలుపుటయును | [డెందంబును] | [శృ.నై 1-71] |
| ఇది యన్యాయముగా నీచిత్తంబునఁ దలఁపకుము | [దీనిని] | [హర 2-12] |

2 తృతీయకు ప్రథమ :

| | | |
|---|---|---|
| కనుగొందు సుఖమున్నవారలిందు | [సుఖముతో] | [కాశీ 2-11] |
| వరుణలోకంబునందు నిండువేడుక సుఖియించు చుండువారు | [వేడుకతో] | [కాశీ 4-66] |

3. చతుర్థికి ప్రథమ :

| | | |
|---|---|---|
| ధర్మశీలత యర్థించి నిర్మలత్వమాసపడి | [ధర్మశీలతకొఱకు] [నిర్మలత్వముకొఱకు] | [శృ.నై 4-78] |
| పనిపూని కాశికానగరంబున కరిగి | [పనికై పూని] | [కాశీ 6-57] |

4. పంచమికి ప్రథమ :

| | |
|---|---|
| వనము వెలువడి పరివారజనము గొలువ | [వనము నుండి] [శృ.నై 2-107] |
| ఇట్లు గగనంబు డిగ్గి | [గగనంబు నుండి] [శృ నై 3-39] |
| తీర్థయాత్రా పరాయణుండై యిల్లు వెడలి | [ఇంటి నుండి] [కాశీ 3-35] |
| పిళ్ళకోపంబుతో నిల్లు వెళ్లివచ్చి | [ఇంటి నుండి] [క్రీడా 265] |
| నిజగృహంబు వెలువడి | [గృహంబు నుండి] [హర 2-43] |
| కనకశైలంబు డిగ్గి యాకాశ సింధు సలిల- | [కనక శైలము నుండి] [శృ.నై 2-51] |

5. షష్ఠికి ప్రథమ :

| | |
|---|---|
| అది గర్వమై | [దానికి] [కాశీ 6-107] |
| ఉప్పర మెగసి యజాండము చిప్ప లురాలంగ | [ఉప్పరమునకు] [కాశీ 1-112] |
| కురియు నెల మూఁడు వానలు | [నెలకు] [కాశీ 4-301] |
| అంబుధర మాలికలు దక్షిణంబు నడచె | [దక్షిణమునకు] [హర 2-17] |

6. సప్తమికి ప్రథమ :

| | |
|---|---|
| పేరోలగంబుండి | [పేరోలగంబు నందు] [హర 3-37] |
| కొలువున్న మహేంద్రునర్ధాసనంబున | [కొలువు నందున్న] [హర 7-116] |
| వెఱపొంకితయులేక చిచ్చురికెనేని | [చిచ్చు నందు] [కాశీ 2-91] |
| తరిచూచి యిచ్చె నెద్దానిఁ బట్టికి తల్లి | |
| జూదమోడిన పైడి చుట్టుకొనిన | [జూద మందు] [కాశీ 4-59] |
| అంగడి వేల్పుటిండుల సురావసథంబుల రచ్చపట్టులన్ | [అంగడియందు] [హర 2-44] |
| భుజాబల విక్రమకేళి విక్రమాదిత్యుఁడు | [విక్రమ కేళియందు] [శృ.నై 1-29] |
| ఇల్లు సొచ్చి | [ఇంటి యందు] [కాశీ 5-66] |

3.9.3.2 1. తృతీయకు ద్వితీయ :

| | |
|---|---|
| తను భక్తి భజింపగ | [భక్తితో] [హర 5-3] |
| దప్పిఁగుందితి దప్పి దట్టంబు నైతి | [దప్పిచేత] [కాశీ 6-401] |
| వాయుప్రేరణఁ బచ్చకప్పురము | [ప్రేరణతో] [హర 5-35] |
| బిసరుహాసను నుద్ది పెద్ద విభుఁడు | [బిసరుహాసనునితో నుద్ది] [శృ నై 1-26] |

అఖండిత భక్తి నమస్కరింతు [భక్తితో] [భీమ 1-9]
పరివేష మిషమున నబ్జసూర్యమండలముల [పరివేష మిషముతో][శృ నై 1-58]
మొలచిన కూర్మిఁ గన్నుఁగవ మోడ్చిన- [కూర్మితో] [శృ నై 1-69]

2. చతుర్థికి ద్వితీయ :

వానిఁగొనిపోవఁ బనిఁబూని వచ్చిరపుడు [పనికై] [కాశీ 4-125]

3. పంచమికి ద్వితీయ :

నిరంతర స్మరణ సరణి ధారావాహికావ
గాహంబున నెడ నెడం [అవగాహన వలన] [శృ.నై 1-77]
ప్రమదంబులాత్మలం జిప్పిలుచుండ [ఆత్మలనుండి పైకుబుకగా] [శృ.నై 1-67]
పరికల్పనఁ బుట్టెడు నంతరాయముల్ [పరికల్పన వలన] [శృ.నై 1-69]
నీరనైనను నురినైన నెగడినైన విడుతు [కంఠపాశమువలననైన] [శివ 3-130]

4. షష్ఠికి ద్వితీయ :

తమ్ముని వీరభద్రవసుధాధిపు విక్రమ వీరభద్రుని న్నమ్మదలీల
రాజ్యభరణ స్థితిఁబట్టముఁగట్టి [తమ్మునకు, వీరభద్రునకు] [భీమ 1-34]

5. సప్తమికి ద్వితీయ :

పూజనీయుఁడు కావున బుద్ధిఁదలఁచి [బుద్ధి యందు] [హర 6-52]
అతని కీర్తిప్రతాపంబు లవనిఁ గలుగనేల [అవని యందు] [శృ.నై 1-58]
నలుదెసలఁ గరుల గండస్థల ఫలకములన్ [నలుదెసలయందు] [శృ.నై 1-64]

3.9.3 3 1. పంచమికి తృతీయ :

దాక్షాయణితోఁ బాసి [దాక్షాయణి వలన] [కాశీ 4-243]
వేమ భూవరుని చేతంగాంచె [భూవరుని వలన] [శృ.నై 1-38]
బ్రాహ్మణులచేత దీవనల్ వడసి [బ్రాహ్మణుల వలన][శృ.నై 3-107]

ఔషధములచేత ననుభవించిన విషయంబు [ఔషధముల వలన] [భీమ 5-190]

వానిచే నీ నిఖిలంబు పావన [వాని వలన] [శృ నై 4-11]

4. షష్ఠికి తృతీయ :

పువ్విలుకానితోడ సరిపోలెడు చక్కనివాఁడు [పువ్విలుకానికి] [శృ.నై 1-77]

3.9.3.4 1. ప్రథమకు షష్ఠి :

క్రియ 'వలయు' అన్న అనుబంధముతో కూడి వచ్చిన యెడల సాధారణముగ షష్ఠీ విభక్తియే వచ్చును. వీనికి తెలుగులో ప్రాచీన ప్రయోగములును గలవు.

[అ] అవ్వీర మహేశ్వరు నాకుం జూడవలయు [నేను] [హర 2-14]

నాకుం బంకజాసనునకుం బరిచర్య సేయంబోవలయునని [నేను] [శృ.నై 2-106]

[ఆ] నీపెంచిన లత [నీవు] [హర 4-19]

మీకు సాధింపరాని కార్యంబు [మీరు] [శృ.నై 3-64]

నాయొనర్పంబూనిన యిమ్మహా ప్రబంధంబునకుం గథానాయకుండు [నేను] [శృ.నై 1-45]

నా నేర్చినభంగి కాశికామాహాత్మ్యంబు– [నేను] [కాశీ 5-4]

2. ద్వితీయకు షష్ఠి :

నిరోధంబు నంకిలికోర్చి [నిరోధంబు చేతనైన విలంబమును] [శృ.నై 7-172]

వలతు నే భక్తకోటికి భక్తకోటియువలచునాకు [నన్ను] [హర 2-13]

3. తృతీయకు షష్ఠి :

అతివ యీగర్బమెవ్వరికైతి [ఎవ్వరిచేత] [కాశీ 4-226]

అధిప సుతునకిట్లనె మనుజ భాషలహేమఖగము [సుతునితో] [శృ.నై 1-104]

లోపాముద్ర కిట్లనియె [లోపాముద్రతో] [కాశీ 3-29]

ఆనతిచ్చిన ప్రకారంబు నీకుంజెప్పెద [నీతోచెప్పెద] [కాశీ 5-6]

బుద్ధి సంపదం దామరచూలికిన్సరి [చూలితోసరి] [శృ.నై 1-28]

అకుంభసంభవుని కిట్లనియె [కుంభసంభవునితో] [కాశీ 5-2]

కంతుని కిట్లనియె [కంతునితో] [హర 3-48]

4. చతుర్థికి షష్ఠి :

| | | |
|---|---|---|
| నీరుదప్పికి నేయును బోలి | [దప్పికై] | [హర 7–127] |
| మాకుం గృపసేసిన యీసంస్మరణాను- | [మాకొఱకు] | [హర 4–46] |
| వాగమృతంబు వానికిం బ్రసాదింపుము | [వానికొఱకు] | [శృ నై 2–12] |
| నాకు రచింపు పావాల నడుసు పాదంబుల- | [నాకొఱకు] | [కాశీ 7–40] |
| ఇక్షురసము మాకు నిపుడు తెమ్ము | [మాకొఱకు] | [హర 1–17] |

5. పంచమికి షష్ఠి :

| | | |
|---|---|---|
| గాలికి దూలెడు ఘనశిరోజములు | [గాలివలన] | [ప పీ 11] |
| గోప్రదాతలకు మిగిలిన పుణ్యవంతులులేరు | [దాతల కంటె] | [కాశీ 3–29] |

3.9.3.6 1. ద్వితీయకు సప్తమి :

| | | |
|---|---|---|
| మహీధవుండు కిల్బిషంబునఁ బొందండని | [కిల్బిషంబును] | [శృ నై 2–8] |
| వైశ్యకులమౌర్జిత్యంబునంబొందఁగా | [ఔర్జిత్యంబును] | [హర 1–11] |

2. తృతీయకు సప్తమి :

| | | |
|---|---|---|
| చంద్రార్థమౌళి కారసంబున నభిషేకమాచరించె | [ఆరసంబుతో] | [హర 1–23] |
| ఆశాపాశంబులఁగట్టు వడినారు | [ఆశాపాశములతో] | [శృ నై 4–79] |
| తద్గుణాకర్ణనంబునఁ దదనిరీక్షణమున | [ఆకర్ణనంబుతో] | [శృ.నై 1–68] |

3. పంచమికి సప్తమి :

| | | |
|---|---|---|
| నేఁడాదిగ దీనఁబాయఁబడెనో మనకున్ | [దీని వలన] | [కాశీ 5–43] |
| ప్రీతి వాసనా వశంబునఁ బ్రతిదిన ప్రవర్ధమానంబగు | [వశంబువలన] | [శృ.నై 1–73] |

4. షష్ఠికి సప్తమి :

| | | |
|---|---|---|
| చిరకాలంబున నుపార్జింప బడ్డ | [చిరకాలమునకు] | [శృ.నై 3–68] |
| ఎక్కడదనేనియుం జనువాడు | [ఎక్కడకు] | [కాశీ 4–107] |
| ఆదనన్వచ్చిరి సంభ్రమంబుననుఁ బంచారామలీలావతుల్ | [అదనునకు వచ్చిరి] | [శివ 2–55] |

పై ప్రయోగానురూపవైఖరిననుసరించి చూచిన కొన్ని భాషకు సహజమైనవిగా, మఱికొన్ని సంప్రదాయానుసారమైన నుడికారముతో కూడినవిగా గోచరించుచున్నవి. ఉదాహరణకు : ద్వితీయకు ప్రథమ వచ్చిన సందర్భములను పరిశీలించిన అవి కేవలము జడవాచక నామములందే వచ్చుచున్నవి. షష్ఠీ విభక్తిలో వచ్చు '-కున్' ప్రత్యయస్థానకు చతుర్థీ విభక్త్యర్థము వచ్చుచున్నది. చతుర్థికి ద్వితీయ, షష్ఠికి తృతీయ కొన్నియెడల తరచుగా కన్పించుచున్నవి మరికొన్ని రూపములు సంస్కృత ప్రభావమునకు లోనైనవి కలవు.

ఉదాహరణకు : వానికిం బ్రసాదింపు [శృ.నై 2-12] [తదర్థము]
నాకు రచియింపు [కాశీ 7-40] [మదర్థము]

ఇట్టి సందర్భమున సాధారణముగ తెలుగున -పై, -మీఁద అను అనుబంధ ప్రత్యయములు వాడబడుచుండును

3 9 4 నన్నయ, నన్నెచోడ, తిక్కనల కాలమునకు లేని అనుబంధ ప్రత్యయములు శ్రీనాథుడు తన కావ్యజాలమున విరివిగా వాడుక చేసెను. ఈ క్రింద నవి పొందుపఱుప బడుచున్నవి. కుండలీకరణము నందలి సంఖ్యలు పౌనఃపున్యమును నిరూపించును.

1. అనుసరించి : [3]

ఋషుల ననుసరించి యేతెంచు చుండె [భీమ 4-179]

2. కూడ : [21]

అతిపరిశ్రాంతిఁబొంది కూడ రెండవ రతికి [శృ.నై 8-84]

3. క్రింద : [6] ఏమిచెప్పనిట క్రింద బలారికి [శృ.నై 4-28]

4. తప్ప : [4] చల్లని చోటు దప్ప నడచుకొని [కాశీ 5-74]

5. దాక : [7] కలయవచ్చిన దాక గడియ కాలంబు [ప.వీ 83]

6. సంప్రదాయ వైయాకరణులు పేర్కొనని సప్తమ్యర్థకానుబంధ ప్రత్యయములు శ్రీనాథునిలో కలవు. /పై/-పయి/-పైన్/-పయన్/-పైన.

-పై : [142] కనకస్యందనంబుపై [శృ.నై 6-80]
బొజ్జపై [కాశీ 7-187]
పెజ్జపై [శివ 1-66]
-పయి : [8] మోవిపయి [భీమ 1-3]
-పయిన్ : [17] మోవిపయిన్ [హర 4-19]
-పైన్ : [50] సుతపైన్ [హర 4-45]
కొప్పుపైన్ [కాశీ 7-224]
అచలంబు పైన్ [హర 7-28]
ధనంబు పైన్ [కాశీ 7-244]
-పైన : [5] భారతీదేవి పద్మజుపైనఁ జల్లె [భీమ 5-121]

7. మాత్రంబ : [1] కోపంబింత మాత్రంబ చాలునని పలికి [శృ.నై 8-77]

8. -మీఁద : [95] మీఁద [58]
పాన్పుమీఁద [హర 7-123]
కెమ్మోవిమీఁద [శృ.నై 2-26]
ఘనవితానమ్ములు కట్టిరి మీద [ప.పీ 16]
-మీఁదన్ : [32]అడుగులమీఁదన్ [హర 3-73]
ఇలమీఁదన్ [శృ.నై 8-137]
-మీఁదట : [1]కోటల మీఁదట [భీమ 1-109]
-మీఁదటన్ : [2] అరుంగు మీఁదటన్ [హర 2-41]

9. వద్ద : [8] < యొద్ద :
బ్రహ్మనాయుని వద్ద బలువైన కుంతమున్నది [ప.పీ 26]
కుమారుని తనయొద్దకుంగొని వచ్చుటయు [కాశీ 4-68]



## 3·10.0 సమాస నిర్మాణము

### (Formation of Compounds)

కేవల ధాతువులతో ఏర్పడు పదనిర్మాణము సమాసమగును. ప్రాచీనులు విధించిన సమర్థ పదవిధి కూడ దీనినే సూచించును. ఈ సమాసములలో స్వతంత్ర పదములుగా ఉన్నవానికి వాక్యార్థబోధ ఉండును. సాంప్రదాయికమైన విగ్రహవాక్య నిర్మాణమ్ము కూడ నీ విషయమునే సూచించును. కొన్నియెడల సమాసములు భిన్నార్థ బోధకములగును. వాని అర్థములు భాషా వ్యవహర్తల సాంస్కృతికమైన అలవాటు లనుబట్టి గ్రహింపదగి యుండును. అట్టివానిని సందర్భమునసరించి తెలిసికొన గలుగుదుము, ఉదాహరణకు 'ఇంటిపని' అనినపుడు 'ఇంటిలో చేయు పని', 'ఇంటికి చేయు పని' 'ఇంటినిర్మాణమునకు చేయు పని'. ఈ ప్రకారము రకరకముల అర్థములు చెప్పుటకు వీలున్నది. క్రియా విభక్తులు, నామవిభక్తులు లోపించుట వలన నీస్థితి యేర్పడును. ఆధునిక భాషా శాస్త్రములోనైనను సమాస నిర్మాణములో గర్భితముగా నున్న సూత్రములు పూర్తిగా వెలికి తీయు పద్ధతులు లేవు. కొంతలో కొంత ప్రాచీన వ్యాకర్తల సమాస నిర్మాణ వివరణ పద్ధతియే పనికి వచ్చును. అదైనను సమాస నిర్మాణములో భాగస్వాములైన పదములకున్న పరస్పర సంబంధమును మాత్రమే తెలియజేయును. కాని వానికి మూలమైన వాక్య నిర్మాణములోని పదముల సంబంధమును సంపూర్ణముగా సూచింప సమర్థము కాదు.

సమాస నిర్మాణములో అంతర్గత సూత్రములను కనిపట్టుట ఆవశ్యకమను విషయములను గుర్తించుచు, పటిష్ఠమైన విధాన లోపము వలన [సాధన లోపము వలన] ప్రస్తుతమునకు సమాసములో పదముల స్థితి మాత్రమే యిక్కడ పరిశీలింప బడినది

భిన్నచారిత్రక కాలములలో అప్పటి భాషా పద్ధతిని బట్టి యేర్పడిన పదములు తర్వాతి కాలములో స్థిర రూపమును పొంది ఆ పద్ధతి అంతటితో ఆగిపోవచ్చు. అందువలన పదనిర్మాణములో నన్నింటిని కలిపి ఏక సూత్రబద్ధము చేయుట కష్టము. సమాసములకుకూడ నీ స్థితి తప్పదు, సమాస మనగా భిన్న పదములు ఏకపదముగా భాసించుట. ఏకపదస్థితి పొందిన కొన్ని సమాసములు భిన్నపద స్ఫూర్తిని నిలబెట్టుకొనవచ్చు, లేక నిలబెట్టుకోలేక పోవచ్చు. భిన్నపదస్ఫూర్తి ఉన్నప్పటికి వానిలో ఒకదానికి గాని, కొన్నిటికిగాని, అన్నిటికి గాని విడివిడిగా అర్థస్ఫూర్తి

ఉండక పోవచ్చు. అప్పుడు ఏకపదముతో అధిక సామ్యమును పొంది యుండును. శ్రీనాథుని కృతులలో నీ పద్ధతులన్నియు కన్పించును. ప్రాచీన వ్యాకర్తలు సూచించిన భిన్న సమాస కార్యములకు ఉదాహరణ ప్రాయములైనవి ఒక వైపు కన్పించుచున్నను, ఇంకొకవైపు అట్టివానికి లొంగనివి కూడ కన్పించుచునేయున్నవి. అవి కూడ నీ ప్రకరణములో పేర్కొనబడుచున్నవి. మొదట చెప్పినటుల ఏక సూత్ర నిర్మాణము కష్టము గనుక ప్రస్తుతమునకు సాధ్యము కాదు. కనుక ఈ పరిశీలన కొంతవరకు అనివార్యముగా చాల చోటుల పట్టికా పద్ధతిలోనే ఉండును.

3.10.1 తెలుగు సమాసములను స్థూలముగా మూడు విధములుగా విభజింపవచ్చును.

1. సాంస్కృతికములు 2. అచ్ఛికములు 3. మిశ్రములు

సంస్కృత సమాసములను తెలుగులోనికి కొన్ని మార్పులు చేసి తెచ్చుకొనిన వానిని సాంస్కృతిక సమాసములందురు. కేవల తెలుగు శబ్దములచే నిర్మాణము చేయబడినవి అచ్ఛిక సమాసములు. సంస్కృతసమ పదములతో, నాచ్ఛిక పదములు చేరగా నేర్పడునవి మిశ్రసమాసములు.

3.10.1.1 ఇందు సాంస్కృతిక సమాసములు సిద్ధములని, సాధ్యములని రెండు విధములు. సంస్కృతమునందేర్పడిన సమాసములకే తెలుగున తత్త్రప్రత్యయములు చేరగా కలిగినవి సిద్ధ సాంస్కృతిక సమాసములందురు.

దీర్ఘ సమాసములకు శ్రీనాథుని రచనలలో నుదాహరణములు :

'కింకుర్వాణ పురందరాదిక మహాగీర్వాణ కోటీ కిరీటాంక స్థాపిత నూత్నరత్న
రుచిధారా శ్లేష కిమ్మీర పత్పంకేజాండు – హరుండు'.... [కాశీ 3-86]

'అష్టాశీతి సహస్ర సంయమి జనవ్యాకీర్ణ తీర ద్వయీ జాఘ్నోదంచిత
సప్తసింధు సలిలస్రోతోవగాహక్రియా తుష్ట స్వాంతుఁ దనై భజింతు.' [భీమ 3-201]

సంస్కృత పదములు తత్సమములై సమసించినయెడల నట్టి సమాసములు సాధ్య సాంస్కృతిక సమాసములనబడును.

తత్సమ + తత్సమ :

దైత్య-చిత్తంబు [హర 3-4] శవుని-వంశంబు [శాశీ 2-92]

అశ్వమేధంబు-ఫలంబు [కాశీ 2-86] మిహిరు-రథము [కాశీ 1-126]
థవు-న్నాజ్ఞ [కాశీ 4-286]

3.10.1 2 తద్భవ దేశ్య పదములలో నేవి యైనను కలిసి యేర్పడిన సమాసములు అచ్ఛిక సమాసములనబడును. అవయవ నిర్మాణము ననుసరించి అచ్ఛిక సమాసముల నీ క్రిందివిధముగ విభజింప వచ్చును.

1 దేశ్య + దేశ్య :

అలఁతి-నవ్వు [శృ.నై 4-67] అనుఁగుఁగొడుకు [కాశీ 4-101]
ఊర్పు-గాలులు [భీమ 4-151] ఎడ-కేలు [శివ 4-38]
కొదమ-ఎండ [కాశీ 1-123] చీకఁటి-తప్పు [హర 5-57]
పొడుపు-గొండ [కాశీ 1 125] మూ-న్నాళ్లు [కాశీ 2-72]

2. దేశ్య + తద్భవ :

అనుగుం-బాసెము [భీమ 2-67] తొలు-సంజ [కాశీ 1-121]
నిండు-చందురుఁడు [శృ.నై 1-50] పసిఁడి-యంచ [శృ.నై 1-102]
పసిఁడి-చాయ [భీమ 2-54]

3 తద్భవ + దేశ్య :

అచ్చ-వెన్నెల [కాశీ 3-23] అడవి-పిల్లి [కాశీ 2-43]
కప్పురపు-గ్రోవి [భీమ 5-89] జమిని-మెడ [కాశీ 7-96]

4. తద్భవ + తద్భవ :

అచ్చర-లేమ [భీమ 6-93] అడి-యాస [కాశీ 2-111]
కప్పుర-పీడెము [శృ.నై 6-141] మోము-దమ్మి [హర 3-62]
రా-యంచ [శృ.నై 1-5]

3.10.1.3 అవయవ నిర్మాణము ననుసరించి మిశ్ర సమాసముల నీ క్రింది విధముగ వింగడింప వచ్చును.

1. సంస్కృత సమ + దేశ్య :

కనకంపు-గొడుగు [శృ.నై 8-103] కుంకుమ-పువ్వు [శృ.నై 7-11]
దక్షు-తల [కాశీ 7-69] భాను-పొడుపు [కాశీ 1-119]

| | | | |
|---|---|---|---|
| రవి_తేరు | [కాశీ 1_132] | వృక్షము_కొమ్మ | [కాశీ 1-138] |

2. దేశ్యము + సంస్కృతసమము :

| | | | |
|---|---|---|---|
| అన్నచూంబ | [కాశీ 1_24] | తండ్రి-వంశంబు | [కాశీ 2_92] |
| తల్లి-యనుజ్ఞ | [కాశీ 4_282] | నిండు_చంద్రుండు | [భీమ 2_43] |
| నడి-వీధి | [హర 5_55] | పొలిమేర_సీమ | [కాశీ 3_118] |

3. సంస్కృతసమము + తద్భవము :

| | | | |
|---|---|---|---|
| అంగన_మోము | [హర 5_22] | కమలగర్భుని_యానతి | [కాశీ 2_69] |
| నాగ_సొరము | [క్రీడా 219] | ప్రియ_సుద్ది | [శృ నై 1-76] |
| భర్త_యానతి | [కాశీ 2_75] | | |

4. తద్భవము + సంస్కృతసమము :

| | | | |
|---|---|---|---|
| అంతి-పురంబు | [శృ నై 7-145] | ఇంగాల_తేజము | [భీమ 4-107] |
| కపుర_దీపములు | [హర.పీ 10] | చుక్క_ల_రాజు | [భీమ 2_44] |
| జము_గదాదండంబు | [భీమ 4_107] | | |

3.10 2 ఇవిగాక తెలుగు వైయాకరణులు కొన్ని సమాసములను వైరి సమాసములుగ విభాగించిరి. మొదటి పదము తత్సమము కాక సంస్కృత శబ్దమై దానితో సూటిగా తెలుగుపదము కలియు నపుడు ఏర్పడువానిని వైరి సమాసములందురు. వీనిని తెలుగు వైయాకరణులు నిషేధించిరి మహాకవులు వాని నుపయోగించి యుండుటచే నట్టివాని ననింద్య గ్రామ్యము లనవలెననియు, అట్టివాని సాదృశ్యమున నితరములను కల్పింపరాదనియు, కల్పించినచో నవి గ్రామ్యములగుననియు వైయాకరణులు స్పష్టపరిచిరి. కాని ఇట్టి సమాసములు నన్నయకాలము నుండియు గ్రంథములందును, వ్యావహారికమైన భాషలోను అధికమైన ప్రచారమునందున్నవి.

3.10.2.1 ఈ క్రింద సూచించిన వైరి సమాసములు శ్రీనాథుని గ్రంథములందు కన్పించు చున్నవి

1. దేశ్యము + తత్సమము :

| | | | |
|---|---|---|---|
| కలు_కంఠుడు | [భీమ 3-156] | కైవార_దుర్భాషణంబు | [శృ నై 7_89] |
| హేరాళ_క్రీడాసంచారిణి | | | [భీమ 1-100] |

2. సంస్కృత శబ్దము + దేశ్యము :

| | | | |
|---|---|---|---|
| కంకాళ-తండము | [కాశీ 3-138] | కనక-తప్పెటలు | [ప.వీ 8] |
| కుల-పగ | [ప.వీ 4] | గరుడ-పచ్చ | [శృ నై 6-124] |
| జీవ-గఱ్ఱ | [క్రీడా 136] | దిన-గోరు | [శృ.నై 7-81] |
| దిన-వెచ్చము | [వీధి 49] | పంచకర పాట్లు | [కాశీ 4-18] |
| పంచ-వన్నియ | [భీమ 1-111] | ప్రాణ-గొడ్డము | [శృ.నై 7-53] |
| మూల-దుంప | [భీమ 5-157] | లింగ-కాయ | [శ్రీ.శృం. 38] |
| వీర-ముద్దియలు | [శృ.నై 6-44] | విమలడిండీరఖండ-తండము | |

3.10.2.2 బిరుదాదులు సంస్కృత శబ్దానుకరణమున సిద్ధసమాసము లగుచున్నవి.[1]

[మరారి] పేషణి హనుమంత బిరుదాంకులు [శృ.నై 1-32]
[కన్నడ] రాయ వేశ్యా భుజంగ [భీమ 1-38]

కొన్ని బిరుద వాచకములు భాషాంతర శబ్దములుగ కానబడుచున్నవి.

[కన్నడ] జగనొబ్బ గండ బిరుద [శృ.నై 1-37]
[కన్నడ] మూరురాయర గండ [చా మ1-118]

3.10.3 కారక సంబంధమాధారముగా సమాసములు ఈ క్రింది విధముగా విభజింపబడును.

1. తత్పురుష, కర్మధారయము, ద్విగువు - అని నిర్ధారక సమాసములు (Determinative). ఇవి సాధ్య సమాసములోని మూడింటిలో నేదో యొక జాతిలోనికి చేరును.
2. బహువ్రీహి [సంబంధ తత్పురుష సమాసము] (Possessive)
3. ద్వంద్వము [సంయోజక సమాసము] (Copulative)

సహజముగా ద్వంద్వ - బహువ్రీహి సమాసములు ఆచ్ఛికములలో కూడియేయుండును.

3.10.3.1 తత్పురుషము : ఇది తఱచుగ నుత్తర పదార్థ ప్రధానమై యుండును.

| | | | |
|---|---|---|---|
| అందియల-రవళి | [భీమ 2-110] | ఆట-తమకము | [కాశీ 6-4] |
| ఏనిక-మోము | [భీమ 1-2] | పెండిలి-పాట | [హర 4-11] |

1. 'భవేద్బిరుద శబ్దేష........ [వికృతి వివేకము]

2. కొన్నియెడల తత్పురుషమున పూర్వపదము ఏకాక్షరమై కనుపట్టును.

చే-చిట్ట [హర 1-4] చే-దోయి [శృ.నై 2-5]
పూ-రేకు [కాశీ 6-125] పూ-నీరు [హర 3-118]

3. కొన్ని సమాసములలో పూర్వపదము అదంతము, ఇదంతమునై యుండును. అది పూర్వపర పదములకు సంబంధమును స్థాపించును

అ : పాల-కడలి [శృ.నై 2-92] పాల-బుగ్గలు [కాశీ 3-241]
పాల-సముద్రము [శివ 1-74]
ఇ : అతని-పుత్రుండు [కాశీ 4-78] వారి-యెడలు [కాశీ 3-113]

3.10.3.2 కర్మధారయము : సాధారణముగా కర్మధారయము సమాసమున విశేష్యమునకు ముందు విశేషణము వచ్చును.

అనుఁగు-బెద్దన [భీమ 1-2] ఉడుకు-నీరు [హర 6-60]
కలికి-నవ్వు [కాశీ 1-34] మెఱుఁగు-ఁబండ్లు [శివ 3-66]

2. కొన్నియెడల పూర్వపదాంతమందలి ము వర్ణము లోపించును.

కప్పుర-విడెము [శృ.నై 6-141]

3 ధాతుజ విశేషణములతో సమాసములు కలుగును.

పుట్టినిల్లు [హర 4-24] ఉన్న రూపు [కాశీ 4-100]

4. కొన్ని యెడల పూర్వ పదముపై 'ట' వర్ణ మాగమముగా వచ్చును.

బుజ్జటకొమ్మ [భీమ 5-111] పిన్నటనాఁడు [హర.పీ 30]

3.10.3.3 ద్విగువు : ఈ సమాసము నందు సంఖ్యా విశేషణము పూర్వమందు వచ్చును.

ఇరు-కేలు [కాశీ 5-195] ఏను-కోసులు [భీమ 2-88]
నల్గడలు [హర 7-170] నాలుగు-మోములు [శివ 1-3]

2. కొన్నియెడల పరపదాది న వర్ణము పూర్వ పదాంత్య హల్లుతో కలిసి దానికి వికారము కలిగించును.

మున్నూఱు [శృ.నై 6-72] నన్నూఱు [కాశీ 5-192]

3. ఒక, ఒక్క అను సంఖ్యలు విశేషణములుగను, ఒక్కఁడు, ఒక్కటి అనునవి నామ రూపములుగను ప్రయోగింప బడుచున్నవి.

ఒక, ఒక్క అనునవి మొదటి అవయవముగా గల సమాసములు.

| | | | |
|---|---|---|---|
| ఒక-కుత్తుక | [హర 2-60] | ఒక్క-తాత | [హర పీ 10] |
| ఒక-చాయ | [శివ 3-73] | ఒక్క-కుందేలు | [శృ.నై 8-183] |
| ఒక-జాడ | [శృ నై 7-73] | ఒక్క-తలఁపు | [హర 3-33] |
| ఒక-తల | [కాశీ 3-217] | ఒక్క-చోద్యంబు | [కాశీ 3-113] |

4. రెండు అను రూపమునకు విశేషణము 'ఇరు'

| | | | |
|---|---|---|---|
| ఏకవచనముగ : | | ఇరు-గేలు | [కాశీ 5-195] |
| ఇరు-చక్కియ | [హర 7-40] | ఇరు-చెవి | [భీమ 4-50] |
| ఇరు-దెస | [వ పీ 64] | | |
| బహువచనప్రత్యయము కలిసి : | | ఇరు-పుటలు | [శృ.నై 5-74] |
| | | ఇరు-గెలఁకులు | [కాశీ 5-286] |

5. 'ఇరు' నకు 'న మ' లు పరమైనపుడు 'ఇను' ఆదేశముగా వచ్చును.

| | | | |
|---|---|---|---|
| ఇను మడి | [శృ.నై 5-23] | ఇమ్మడి | [హర 7-144] |
| ఇనుమాఱు | [హర 4-60] | ఇమ్మూఱు | [శృ.నై 6-72] |

6. మూఁడు అను రూపమునకు విశేషణము 'ము'

| | | |
|---|---|---|
| ఏకవచనమున : | ముచ్చిచ్చు | [భీమ 3-37] |
| | ముప్రొద్దు | [శృ.నై 6-142] |

7. నాలుగు అను రూపమునకు విశేషణము 'నలు'

| | | |
|---|---|---|
| ఏకవచనమున : | నల్దిక్కు | [శృ.నై 7-88] |
| | నల్గడ | [కాశీ 3-105] |

8. కొన్ని- అను దానికి 'కొన్'- అను రూపాంతరము గలదు.

కొన్నాళ్లకు [వ.పీ 41]

3 10.3.4 బహువ్రీహి : ఇది అన్యపదార్థ ప్రధానము తారతమ్య పరిశీలనము చేయగ బహువ్రీహి సమాసములు శ్రీనాథుని భాషలో తక్కువ వానిలో కొన్ని సంస్కృత రూపములను పోలియున్నవి.

| | | | |
|---|---|---|---|
| అలరుఁ బోఁడి | [హర 4-85] | ఇగురుఁబోఁడి | [కాశీ 3-41] |
| ఎలదీఁగఁబోణి | [శృ.నై 3-178] | ఏనికమోముతాల్పు | [భీమ 1-2] |
| కొండ విల్లు | [భీమ 6-46] | కొండరాచూలి | [హర 4-17] |
| క్రొన్నెలపువ్వుతాల్పు | [భీమ2-117] | చిగురుఁబోఁడి | [కాశీ 6-265] |
| తలిరుఁ బోఁడి | [కాశీ 2-117] | తమ్మిపూచూలి | [శృ నై 2-138] |
| తీఁగఁబోఁడి | [కాశీ 7-137] | నలువ | [భీమ 3-136] |
| ననవిల్తుడు | [భీమ 3-212] | పూఁబోఁడి | [శృ.నై 8-40] |
| ముక్కంటి | [శృ.నై 8-201] | మచ్చకంటి | [హర 7-127] |
| మెఱుంగుఁబోఁడి | [కాశీ 3-23] | | |

'పోఁడి' అను పదము రెండవఅవయవముగా గల సమాసములు నన్నయ భాషలో లేవు. నన్నెచోడునిలో 'తలిరుఁబోఁడి [కు.సం 5-135] అని ఒకే ఒక ప్రయోగముకలదు

2. ఈ క్రింది సమాసములలో నుత్తర పదములందు వికారము కలిగినది.

| | | | |
|---|---|---|---|
| ముక్కంటి | [కాశీ 2-44] | నలువ | [భీమ 3-136] |
| తొలకరి | [హర 4-47] | కొండరాచూలి | [హర 4-17] |

3.10 3.5 ద్వంద్వము : ఉభయ పదార్థ ప్రధానము ద్వంద్వము. సహజముగ నిది బహువచనాంత ప్రత్యయము కలిగి యుండును.

| | | | |
|---|---|---|---|
| అన్నదమ్ములు | [భీమ 1-33] | అత్త-మామలు | [శృ.నై 7-9] |
| తలి-దండ్రులు | [కాశీ 3-330] | పాలుపెరుగోగిరంబులు | [హర 6-56] |

2. ద్వంద్వ సమాసమున రెండవ అవయవమైన 'పా' కు 'వా' రాకుండుట ఈ క్రింది ప్రయోగమున కలదు.

ఆట-పాటలు [భీమ 5-41]

3. క్త్వార్థక శబ్దముతోడను కొన్ని యెడల ద్వంద్వ సమాసములు కలుగవచ్చును.
వినీవినని భంగి [శృ.నై 6_33]

4. సముచ్చయార్థకమునకు బదులుగా దీర్ఘము వచ్చిన ప్రయోగమొకటి శ్రీనాథుని రచనయందు కలదు.

చల్లాయంబలి ద్రావితిన్ [చా.మం 1_19]

3.10.4 1. శ్రీనాథుని రచనలలో ఈ క్రింది సమాసములందలి ఉత్తర పదము అవ్యయ ప్రతిరూపక విశేష్యముగా నున్నది.

తలక్రిందు [కాశీ 3_152] ఉరువడి [కాశీ 6_227]
వెంబడి [భీమ 4_60]

2 ఈ క్రింది వానియందుత్తర పదము క్త్వార్థక రూపమై విశేష్యార్థమును కలిగించుచున్నది.

రేపాడి [కాశీ 2_83] ఎల్లుండి [కాశీ 7_74]

3. ఈ క్రింది వానియందుత్తర పదము క్త్వార్థక రూపమై యవ్యయములను కల్పించుచున్నది.

ఇటఁబట్టి [శృ నై ?_144] కాఁబట్టి [హర 1_15]
కను కని [కాశీ 2_17] పదం పడి [శృ.నై 4_80]

4. ఈ క్రింది వానియందుత్తర పదము తుమున్నర్థకమై యవ్యయములను కల్పించుచున్నది.

ఎడపఁదడప [కాశీ 4_85] క్రచ్చఱ [కాశీ 6_236]

5. ఈ క్రింది ఆమ్రేడిత సమాసములు ఒక వ్యాపారమునకు పునః పునరాగతమును, ఆధిక్యమును సూచించు చున్నవి. ఇవి కేవలము నామములే కాక, విశేషణ, క్రియావిశేషణ, అవ్యయములుగ వచ్చును.

తరువందరువ [హర 6_62] ఎదురుకెదురు [భీమ 4_12]
అచట నచట [శృ.నై 7_125] అల్ల నల్లన [శివ 4_40]
అంచెలంచెలు [కాశీ 1_132]

6. ధ్వన్యనుకరణ నిర్మాణమున పునరుక్తి సహజము.

| | | | |
|---|---|---|---|
| కలకల | [శృ.నై 7-156] | గనగన | [హర 4-14] |
| జవజవ | [కాశీ 5-119] | తొకతొక | [హర 6-60] |
| నిగనిగ | [హర 6-80] | పలపల | [కాశీ 5-144] |
| పుట పుట | [భీమ 3-222] | పురపుర | [శృ.నై 1-110] |
| పెళపెళ | [భీమ 4-130] | బుగ బుగ | [హర 6-62] |
| మిల మిల | [భీమ 1-118] | వడవడ | [శృ.నై 2-35] |
| వికవిక | [హర 4-28] | విసవిస | [శృ.నై 1-72] |
| పొటపొట | [క్రీడా 229] | | |

7. విలక్షణార్థమై ఒకే పదము పునరుక్తమై సమాసముగా నగుటయు కనుపట్టును

ఒండొండ [కాశీ 3-235]

3.10.5 శ్రీనాథుని భాషలో నీ క్రింది సమాసములు విశిష్టములగుటచే వేరుగా ప్రదర్శింపబడుచున్నవి.

అర - మొదటి అవయవముగా గల సమాసములు :

| | | | |
|---|---|---|---|
| అర గౌను | [శివ 2-21] | అర కన్ను | [కాశీ 7-70] |
| అరవీసము | [హర 3-62] | అర సంజ | [కాశీ 5-275] |
| అరవాడిన | [హర 3-2] | అర/ఱ/చేతులు | [కాశీ 5-226] |

ఆకు - మొదటి అవయవముగా గల సమాసములు :

| | | | |
|---|---|---|---|
| ఆకుంబోఁడి | [శృ.నై 3-165] | ఆకు-మోవి | [శృ.నై 5-28] |
| ఆకుగొడుగు | [హర 3-38] | ఆకు పోకలు | [ప.వీ 69] |

ఎల - మొదటి అంశముగా గల సమాసములు :

| | | | |
|---|---|---|---|
| ఎలగోలు | [కాశీ 2-51] | ఎలఁదీఁగ | [శృ.నై 3-173] |
| ఎలఁదోఁట | [భీమ 3-36] | ఎల నాఁగ | [శృ.నై 6-44] |
| ఎలప్రాసఁగుఁ టడుగులు | | | [హర 2-91] |

ఎదురు - మొదటి అంశముగా గల సమాసములు :

| | | | |
|---|---|---|---|
| ఎదురుగద్దియ | [శృ.నై 4-97] | ఎదుర్కట్టు | [కాశీ 6-262] |
| ఎదురువేళంబులు | [భీమ 4-47] | ఎదుర్చుక్క | [కాశీ 2-17] |
| ఎదురు రొమ్ము | | | [ప పీ 109] |

కడ - మొదటి అంశముగా గల సమాసములు :

| | | | |
|---|---|---|---|
| కడగన్ను | [శృ.నై 7-41] | కడ గోరు | [భీమ 3-22] |
| కడకొంగు | [హర 5-16] | కడ కొమ్ము | [భీమ 4-134] |
| కడ దాఁక | [కాశీ 2-160] | కడ తెక్క | [శృ.నై 8-5] |
| కడ తెప్పలు | [శృ.నై 5-9] | కడ పీను | [శృ నై 6-53] |

కన్నె - మొదటి అవయవముగా గల సమాసములు :

| | | | |
|---|---|---|---|
| కన్నె కూర్మి | [శృ.నై 1-86] | కన్నె పువ్వు | [శృ నై 1-92] |
| కన్నె కయ్యము | | | [ప.పీ 107] |

జమిలి - మొదటి అంశముగా గల సమాసములు :

| | | | |
|---|---|---|---|
| జమిలి పాములు | [హర 5-5] | జమిలి మండెగలు | [శృ.నై 6-120] |

తండము - రెండవ అంశముగా గల సమాసములు :

| | | | |
|---|---|---|---|
| త్రవ్వి తండము | [క్రీడా 256] | కంకాళ తండము | [కాశీ 3-138] |

తరఁగ - మొదటి అంశముగా గల సమాసములు :

| | | | |
|---|---|---|---|
| తరఁగ దండు | [హర 7-80] | తరఁగల వడి | [హర 6-90] |

తరి - మొదటి అంశముగా గల సమాసములు :

| | | | |
|---|---|---|---|
| తరి కొండ | [హర 6-76] | తరి చోటు | [భీమ 3-51] |
| తరి త్రాడు | [శృ.నై 5-63] | తరి తీపు | [ప.పీ 96] |

తల - మొదటి అంశముగా గల సమాసములు :

| | | | |
|---|---|---|---|
| తల గడ | [శివ 3-25] | తల చీర | [కాశీ 1-139] |
| తల చుట్టు | [శృ.నై 3-167] | తల పుట్టె | [ప.పీ 13] |
| తల పువ్వు | [శృ.నై 8-201] | తల యంపి | [శివ 2-70] |

| | | | |
|---|---|---|---|
| తల వాకిలి | [భీమ 5-6] | తల వెంట్రుకలు | [శృ.నై 1-64] |
| తల వరి | [కాశీ 4-124] | | |

నడు - మొదటి అంశముగా గల సమాసములు :

| | | | |
|---|---|---|---|
| నడు కందు | [శృ.నై 8-180] | నడు చక్కి | [హర 1-3] |
| నడు త్రోవ | [భీమ 4-181] | నడు నట్టు | [భీమ 3-19] |
| నడు నీరు | [హర 6-78] | నడు పుట్టు | [శృ.నై 8-16] |
| నడు నెత్తి | [క్రీడా 235] | నడు ప్రొద్దు | [క్రీడా 278] |

వెడఁద-మొదటి అంశముగా గల సమాసములు :

| | | | |
|---|---|---|---|
| వెడఁద కన్ను | [భీమ 6-69] | వెడఁద నోళ్ళు | [చా.మ 1-131] |

3.10 5 1. సిద్ధ సమాసము సంపూర్ణ రూపము వైకృత మయినపుడు సమాస మందలి పూర్వపదమునకు తెలుగున వ్యస్త ప్రయోగము లేదు.

| | | | |
|---|---|---|---|
| అడియాస | [కాశీ 2-111] | అంతి పురము | [శృ నై 7-145] |
| గండ కత్తెర | [క్రీడా 142] | గండ్ర గొడ్డలి | [శివ 4-29] |
| పరుస వేది | [భీమ 2-144] | | |

2. పూర్వ పద మౌపవిభక్తికమగుచో దాని యౌపవిభక్తికరూపము నిలుచును

| | | | |
|---|---|---|---|
| ముని కోల | [కాశీ 3-235] | చెలియలి కట్ట | [ప.పీ 88] |
| వింటి జోదు | [శివ 3-53] | | |

3.10.6 తెనుగున రెండు మూడు పదముల కలయికచే ఏర్పడు సమాసములే ఎక్కువ. అంతకంటె ఎక్కువ పదములతో ఏర్పడుట అసహజము. కాని సంస్కృతమున అట్టివి చాలఎక్కువ శ్రీనాథుని భాషలో అవయవ నిర్మాణము

ననుసరించి సమాసములను అయిదు విధములుగా విభాగించుట యైనది. అందు రెండంశముల సమాసములు 2135 మూడంశముల సమాసములు 549, నాలుగంశముల సమాసములు 127, ఐదంశముల సమాసములు 28, ఆఱంశముల సమాసములు 3. మొత్తము 2842. అందు ఆఱు అవయవముల సమాసము పెద్దది.

జగ-జెట్టి-పాప-తేని-యొా-దల [భీమ 5-9]

శ్రీనాథుని కృతులలో ఉన్న సమాస సాహస్త్యము అవయవ విభజనతో అనుబంధము - 2 లో పొందుపరుప బడినది.



# 4. క్రియారూప విజ్ఞానము

## (VERB MORPHOLOGY)

### 4.1.0 క్రియావ్యవస్థ :

వ్యాపార బోధకములైనవి క్రియలు. పద జాతమున విధ్యర్థకాది భావ బోధకముల నుండి వర్గీకరింపబడి రూప భేదమును కలిగినట్టిది క్రియ. అట్టి క్రియ యందలి ముఖ్య భాగమే ప్రాతిపదిక క్రియా ప్రాతిపదికకు ప్రత్యయములు చేరియు, చేరకయు శ్రీనాధుని భాషలో క్రియా నిర్మాణమేర్పడు చున్నది.

4.1.1 సమాపకము, అసమాపకమని క్రియా రూపములు రెండు విధములు. సమాపక క్రియలో క్రియా ప్రాతిపదికకు కాల భావబోధక ప్రత్యయము (Tense-mood - suffix) పురుష ప్రత్యయము (Personal suffix) చేరును. అసమాపక క్రియలో క్రియా ప్రాతిపదికకు కాలభావబోధక ప్రత్యయమే కాని, పురుష ప్రత్యయము చేరదు సమాపక క్రియతోడి వాక్యమే సంపూర్ణ వాక్యమగును. కాని అసమాపక క్రియతో సంపూర్ణవాక్య మేర్పడదు. ఇది సమాపకక్రియ కాక అనుషంగి వలె నుండును.

4 1 1.1 సామాన్యము (simple), సంయుక్తము (compound) అని సమాపక క్రియలను రెండు విధములుగా విభజింప వచ్చును.

1. క్రియా ప్రాతిపదికకు సూటిగా కాలభావ బోధక ప్రత్యయములు చేరగా సామాన్య క్రియ లేర్పడును.

| | | | |
|---|---|---|---|
| వచ్చు-ఎ-ను | > | వచ్చెను | [శృ.నై 4-103] |
| వచ్చు-ఎద-ము | > | వచ్చెదము | [హర 6-98] |
| చెప్పు-దు-రు | > | చెప్పుదురు | [కాశీ 1-82] |
| చేయు-ద-ము | > | చేయుదము | [భీమ 4-173] |
| చేయు-అ-ఁడు | > | చేయఁడు | [శృ.నై 4-32] |
| విను-φ-ము | > | వినుము | [శృ.నై 3-46] |

పై క్రియా నిర్మాణము నందలి 'వచ్చు-, చెప్పు-, చేయు-, విను-' మున్నగు క్రియా ప్రాతిపదికల నంతకన్న తక్కువ పదాంశములను (morphemes) గా విభజించుటకు వీలుపడదు దీనిని బట్టి ఒకే ధాతువుకలిగినట్టిది సామాన్య క్రియా రూపమగుచున్నది.

2. సంయుక్త సమాపక క్రియలలో మూలధాతు రూపము ఇతర విభక్తి ప్రత్యయములతో ప్రత్యక్ష సంబంధమును కల్పించుకొనదు.

క్రియా విశేషణము + ప్రథమ పురుష సర్వనామము :

వచ్చు-వాఁడ-వు [కాశీ 7-199] ఉన్న-యది [కాశీ 3-201]
ఉన్న-యవి [శృ.నై 2-63]

సమాపక క్రియ + సహాయక క్రియ [సమాపక క్రియా రూపము] :

చేయరయ్యెదరు [శృ.నై 7-72]

వర్తమాన, భవిష్యత్కాల వాచక క్రియారూపములు ఈతెగకు చెందినవియై యున్నవి.

4.1.1.2 భిన్నమైన కాల భావబోధక ప్రత్యయములతో సామాన్య సమాపక క్రియానిర్మాణము ఈ క్రింది [4-1-1-3] పట్టికలో సూచింప బడుచున్నది. డా॥ భద్రిరాజు కృష్ణమూర్తిగారు ప్రదర్శించిన పట్టిక యథాతథముగా నిచ్చట ప్రదర్శింపబడినది.[1] ప్రకృత గ్రంథమున ననుసరించిన ప్రణాళికను బట్టి మూల ధాతువు నజంతముగా గ్రహింపవలయును. పై పట్టిక యందు 'వండ్' మున్నగు విధముగా నున్న ధాతువును 'వండు' అని గ్రహించిన ప్రకృత ప్రణాళికకు సరిపోవును. మార్పులేనిచోట 'ϕ' [శూన్య పదాంశము (zero morpheme)] వచ్చినట్లు గ్రహింపవలయును.

4.1.1.4 4.1.1.3న సూచించిన పట్టిక ననుసరించి ఐదు విధములైన సమాపక క్రియా రూపములు కలవని తేలుచున్నది.

1. భూతకాలము (Past tense)
2. తద్ధర్మము (Habitual)

[1] Prof. Bh. Krishnamurti : Telugu Verbal Bases, P. 189,

3. వ్యతిరేకార్థకము (Negative)
4. విధ్యాశీరర్థకము (Imperative, Benedictive)
5. నిషేధార్థకము (Prohibitive)

వీనిలో భూతకాలిక, తద్ధర్మార్థక, నిషేధార్థక క్రియా పదములకు ఎనిమిది విధములైన క్రియారూప జాతములు (Paradigms) కాన వచ్చుచున్నవి.

1. ఉత్తమ పురుషైక వచనము
2. ఉత్తమ పురుష బహు వచనము
3. మధ్యమ పురుషైక వచనము
4. మధ్యమ పురుష బహు వచనము
5. మహద్వాచక ప్రథమ పురుషైక వచనము
6. అమహద్వాచక ప్రథమ పురుషైక వచనము
7. అమహద్వాచక ప్రథమ పురుష బహువచనము
8. మహన్మహతీ వాచక ప్రథమ పురుష బహువచనము.

విధ్యాశీరాద్యర్థక క్రియా పదములలో నుత్తమ పురుష రూపములు లేవు. నిషేధార్థక క్రియా రూపముల యందును, వ్యతిరేక ప్రార్థన క్రియా రూపముల యందును ప్రథమోత్తమ పురుష రూపములు లేవు ఈ విధమైన కాలభావ బోధక, పురుష ప్రత్యయముల విభజనము శ్రీనాథుని భాషకును వర్తించును.

## 4.1.2 క్రియాప్రాతిపదిక : (The verb stem)

క్రియా రూపమందలి అర్థవంతమైన అత్యల్పమైన మూల రూపమునకు క్రియా ప్రాతిపదిక యనిపేరు ఈ ధాతు రూపములు సామాన్యములని (Simple) సంశ్లిష్టములని (complex) సంయుక్తములని (compound) మూడువిధములు.

4.1.2 1 కాలభావబోధక సపదాంశములకు (allo-morphs) పూర్వము ధాతువు నందలి పర్యాయ రూపత (stem-alternation)ననుసరించి శ్రీనాథుని భాషయందలి సామాన్య ధాతువులను (simple verbal roots) ఐదు తరగతులుగ విభజింప వచ్చును. అందు మొదటి తరగతిలో 478, రెండవ తరగతిలో 112, మూడవ తరగతిలో 103, నాలుగవ తరగతిలో 8, ఐదవ తరగతిలో 14. మొత్తమన్నియు కలిసి శ్రీనాథుని భాషయందు 715 సామాన్య ధాతువు లున్నవి. ఇందు నన్నయ,

నన్నెచోడులందు లేక శ్రీనాథునియందే గలవి 260 ధాతువులు నన్నయ యందుండి శ్రీనాథునిలో లేనివి 55 ధాతువులు. [2] నన్నెచోడుని యందుండి శ్రీనాథునిలో లేనివి 103 ధాతువులు.[3]

4.1.2.2 ధాతువులకు -ఇంచు/-ఇల్లు అను ధాత్వీకరణ ప్రత్యయముగాని, సకర్మక, ప్రేరణార్థక ప్రత్యయములుగాని చేరుటచే శ్రీనాథుని భాషలో సంశ్లిష్ట ధాతువు లేర్పడుచున్నవి (Complex verbal roots) వీనిని రెండు తరగతులుగా విభజింప వచ్చును.

1. అచ్చిక సంశ్లిష్ట ధాతువులు [494]
2. తత్సమ సంశ్లిష్ట ధాతువులు. [571]

4.1.2.3 ఒకటి కంటె ఎక్కువ ధాతువులుండి ప్రత్యయములు పరమైనను కాకున్నను సంయుక్త ధాతువు లేర్పడును (Compound verbal roots). ఇట్టి సంయుక్త ధాతురూపములనే శబ్ద పల్లవములని యాంధ్ర వైయాకరణులు చెప్పుచున్నారు.

> 'ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబులయి విలక్షణార్థాభిదాయకంబు లగు నీయవి శబ్దపల్లవంబులు నాఁబడు,' [బాల-క్రియా-18]

శ్రీనాథుని భాషయందు 149 అనుబంధ ధాతువులతో కూడి రెండంశము లతో 928, పంద్రెండు అనుబంధ ధాతువులతో కూడి మూడంశములతో 59, ఒక అనుబంధ ధాతువుతోకూడి నాలుగంశములతో 2, అచ్చిక సంయుక్త ధాతువులు గలవు. 17 అనుబంధధాతువులతో కూడి రెండంశములతో 31, రెండు అనుబంధ ధాతువులతో కూడి మూడంశములతో 2, తత్సమ సంయుక్త ధాతువులు కలవు సామాన్య, సంశ్లిష్ట, సంయుక్త ధాతువుల విశ్లేషణము అనుబంధము-3 లో పొందుపరుప బడినది.

---

2. Dr. K. Nagabhushana Rao : A Descriptive analysis of Nannaya's usage, unpublished thesis: S.V. University. 1964.

3. Dr. L.B. Sankara Rao ; A Study of the Language of Nannechodadeva's Kumara Sambhavamu; unpublished thesis of S.V. University, 1967.

## 4.2.0 సామాన్య ధాతువులు : (Simple verbal roots)

### 4.2.1 సామాన్య క్రియాప్రాతిపదికల విహిత రూపములు :
(Canonial forms of verbal roots)

#### 4.2.1.1 ద్విస్వర క్రియా ప్రాతిపదికలు :

1. [హ] అ హ అ :

ఇడు [నశించు] [కాశీ 1-7] చెడు [నశించు] [కాశీ 4-93]
తగు [యుక్తమగు] [శృ నై 1-46] తెగు [ఖండితమగు] [కాశీ 7-60]
కను [చూచు] [కాశీ 7-60] అను [చెప్పు] [భీమ 6-10]

2. [హ] అ హ హ అ :

కట్టు [బంధించు] [శృ నై 6-124] అన్ము [పరవశమగు] [కాశీ 4-203]
తెచ్చు [తీసికొనివచ్చు] [కాశీ 6-236]
ఉండు [నివశించు] [హర 1-18]

3. [హ] ఆ హ అ :

ఆను [ఆస్వాదించు] [భీమ 2-46]
ఈఁదు [ఈతకొట్టు] [శృ.నై 2-15]
డాఁగు [మఱుగుపడు] [శృ నై 8-69]
తాఁకు [కలియు] [కాశీ 7-61]

4. [హ] అ హ అ :

వైచు [విసరివేయు] [శృ నై 8-131]
సైచు [ఓర్చు] [హర 7-65]

5. [హ] ఆ హ హ అ :

మోడ్చు [ముకుళించు] [శృ నై [illegible]-128]
కాంచు [చూచు] [శృ నై 3-88]
ఆర్చు [అఱచు] [హర 7-184] ఓర్చు [జయించు] [కాశీ [illegible]-47]

6. [హ] హ ఆ హ అ:

త్రోయు [నెట్టు] [శృ.నై 2-99]
వ్రాయు [లిఖించు] [భీమ 1-81]
త్రేఁచు [ఉద్గారించు] [శృ నై 2-123]
త్రాఁగు [పానముచేయు] [శృ.నై 2-81]

7. [హ] హ అ హ హ అ:

మ్రింగు [కబళించు] [శృ.నై 7-53]
క్రమ్ము [వ్యాపించు] [భీమ 5-123]
వ్రచ్చు [భేదించు] [కాశీ 7-80] త్రెయ్యు [తెగు] [శృ.నై 4-68]

4.2.1.2 త్రిస్వర క్రియా ప్రాతిపదికలు:

1. [హ] అ హ అ హ అ:

కలుగు [సంభవించు] [హర 2-16] కనలు [కోపించు] [కాశీ 4-266]
తలరు [అతిశయించు] [భీమ 1-96]
విడుచు [త్యజించు] [శృ.నై 5-187]
ఉడుకు [కాగు] [కాశీ 5-105] ఎదుగు [పెరుగు] [కాశీ 5-193]

2. [హ] ఆ హ అ హ అ:

ఆరయు [వెదకు] [శృ.నై 4-28] ఏమఱు [మఱచు] [కాశీ 3-71]
ఓసరు [తొలగు] [హర 2-20] వేసరు [విసుగుచెందు][హర 2-101]

3. [హ] అ హ [అ] హ అ:

ఒ/ల్చు/లుచు [ఊడదీయు] [శృ.నై 7-81]
ఉ/ల్కు/లుకు [భయపడు] [శృ.నై 7-124]
తొ/ద్గు/డుగు [ధరించు] [ప.వీ 37]
ము/న్గు/నుగు [స్నానముచేయు] [కాశీ 3-16]

4. [హ] ఆ హ [అ] హ అ :

ఈ/ల్గు/లుగు [మరణించు] [కాశీ 3–98]
ఊ/ర్చు/రుచు [తుడుచు] [భీమ 3–62]
కూ/ర్కు/రుకు [నిద్రించు] [కాశీ 5-40]
నే/ర్చు/రుచు [అభ్యసించు] [కాశీ 4–111]

5. [హ] ఆ హ ఆ హ అ :

ఏఁకారు [మిక్కిలి కాంక్ష కలిగి యుండు] [భీమ 3-15]

6. [హ] అ హ హ అ హ అ :

ముచ్చిరు [పరితపించు] [శృ.నై 6–13]
వందురు [క్లేశపడు] [కాశీ 5–266]

7. [హ] హ అ హ అ హ అ :

ప్రబలు [పెరుఁగు] [కాశీ 5–7] ప్రిదులు [విరియు] [శృ నై 3-86]
బ్రదుకు [జీవించు] [శృ నై 3-140]
బ్రమయు [భ్రాంతిపడు] [భీమ 5–120]

8. [హ] హ ఆ హ [అ] హ అ :

క్రో/ల్చు/లుచు [కూయు] [హర 2-18]

9. [హ] హ అ హ హ అ హ అ :

ప్రముచ్చిలు [వంచించు] [శృ.నై 8–69]
క్రమ్మఱు [మరలు] [శృ నై 4–103]
క్రుమ్మరు/ఱు [తిరుగు] [కాశీ 2–147]
త్రిమ్మరు [సంచరించు] [కాశీ 7–177]

4.2.1.3 చతుస్స్వర క్రియా ప్రాతిపదికలు :

1. [హ] అ హ అ హ [అ] హ అ :

ఇగు/ల్చు/లుచు [పండ్లు వెలిబుచ్చు] [శృ నై 7–52]
ఇము/డ్చు/డుచు [ఇముడ చేయు] [శృ.నై 2–6]

కమ/ఱ్బ/రుచు [కమర జేయు] [శివ 2-71]
విదు/ర్బ/రుచు [ఒసగు] [భీమ 1-30]

2. (హ) అ హ అ హ అ హ అ :

అలహరు [బాధించు] [శివ 2-106]

4.2.2.1 ఈ క్రింది అచ్చిక ధాతువులు శ్రీనాథుని భాషయందు విశిష్టముగ ప్రయోగింప బడినవి.

మొదటి తరగతి :

అడఁకు [చలించు] [భీమ 3-212] అలుకు [భయపడు] [శివ 3-40]
ఆడు [పలుకు] [శృ.నై 3-68] ఆను [ఆస్వాదించు] [భీమ 2-46]
ఆఱు [నశించు] [శృ నై 7-169] ఇందు [రుచించు] [కాశీ 1-108]
ఊను [కలుగు] [భీమ 5-160] కొట్టు [తాడించు] [కాశీ 7-96]
క్రప్పు [నిగిడించిచాచు] [హర 2-82] తేఁడు [పండుకొను] [క్రీడా 159]
నూకు [గెంటు] [భీమ 4-110] వాచు [చెప్పుకొను] [కాశీ 4-64]
వాను [కుండలుచేయు] [శివ 1-81] ఉపయోగించుకొను

రెండవ తరగతి :

ఈపుచు [దువ్వివైచు] [క్రీడా 108] పంచు [గణించు] [హర 5-22]

మూడవ తరగతి :

బ్రమయు [భ్రాంతిపడు] [భీమ 5-120]
లాయు [ఉద్రేకించు] [క్రీడా 235]
ఇఱియు [బిగియు] [శృ.నై 4-73]
కూయు [కూపెట్టు] [కాశీ 7-191]

2. ఈ క్రింది చకారాంత, యుకారాంత ధాతువులు రెండును ఏక కాలమున శ్రీనాథుని భాషలో ప్రయోగింప బడినవి

క్రోచు [హర 7-85] క్రోయు [శృ.నై 2-99]
మోచు [కాశీ 4-174] మోయు [భీమ 4-83]
రాచు [కాశీ 7-96] రాయు [కాశీ 3-103]

3. ఈ క్రింది క్రియా ప్రాతిపదిక రూపములు శ్రీనాథుని భాషలో వ్యతిరేకార్థమునందు మాత్రమే ప్రయోగింప బడినవి

| | | | |
|---|---|---|---|
| ఉఱక | [కాశీ 6-139] | ఉఱరు | [శృ నై 7-81] |
| కొంకక | [శృ నై 7-11] | కొతకక | [శ్రీ శృం 6-215] |
| కానక | [శృ.నై 1-109] | పాఱక | [హర 2-118] |
| మిన్నక | [శృ.నై 3-139] | పాయక | [శృ.నై 1-69] |
| వారక | [శృ నై 2-114] | | |

లే -[లే-దు [శృ.నై 3-56] 'కలుగు' ధాతువునకు వ్యతిరేకార్థమున ప్రాయికముగ వచ్చు ఆదేశము.

4. వాంచు [శృ.నై 4-88] వంచు [శివ 4-26] అను ప్రాచీనాధునిక ప్రయోగముల రెంటిని ప్రయోగించెను.

5. తక్కు [శృ నై 2-73] అను సకర్మక క్రియకు విడుచు, మాను అను నర్థము. దీని భూతార్థక క్రియాజన్య విశేషణమగు 'తక్కిన' [శృ.నై 2-78] అను పదమునకు అన్యము, ఇతరము, అను నర్థము వచ్చును.

6 'ఉదిలు' అను క్రియను ప్రాచీనులు 'కొను' చేరి సంయుక్త ధాతువుగా వాడిరి కాని శ్రీనాథుడు సామాన్యక్రియగా వాడెను

ఉరలె పాతాళ భువనంబుల్, ఉదిలెనభము [భీమ 4-61]

7 'మఱచు' ధాతువునకు వ్యతిరేక ప్రార్థనార్థకమున 'మఱవకుము' అను రూపమేర్పడవలెను కాని శ్రీనాథునిలో 'వ' కారము లోపించి నపుడు పూర్వ స్వరమునకు దీర్ఘము వచ్చుట కలదు

చిత్తమందున్మఱా, మది [హర 2-131]
తిక్కనలో : మఱాకుము [ఉద్యో 4-720]

'వెఱచు' ధాతువునకు 'వ' కారము లోపింపజేసి 'వెఱకుము' [కాశీ 5-71] అనికూడ శ్రీనాథుడు ప్రయోగించెను

8 'వలచు' ధాతువు వ్యతిరేకార్థమునందు రూపద్వయమును బొందుచున్నది.

| | | | |
|---|---|---|---|
| వలదు | [శృ.నై 2-57] | వలవదు | [శృ నై 2 83] |

9. 'పోలు' అను ధాతువు అన్వంత రూపములగు పోలన్ [శృ.నై 2-76] పోలగన్ [శివ 1-19] అనునవి బాగుగా, చక్కగా పూర్ణముగా నను విశేషార్థము నిచ్చు చున్నవి.

10. 'పోవు' అను ధాతువు ఈ క్రింది యర్థములలో శ్రీనాథుడు ప్రయోగించెను.

కాకయును అను అర్థమున : నీకు వంపఁగ వచ్చుఁబో నియమ నిష్ఠ దల్లికోర్వంగవచ్చుఁబో ధైర్య గరిమి [హర 2-62]

దొంగిలింపబడు, అపహృతమగు నను నర్థమున : భిక్షాపాత్రము పోయెనంచుమదిలో బెగ్గిల్లఁగానేటికిన్ [భీమ 4-100]

తీఱు, అడగు నను నర్థమున · సలిలంబుదప్పిపోఁద్రాగిన వారికి [శృ నై 2-81]

## 4.2.3 క్రియాప్రాతిపదికల వర్గీకరణమున సంధిగతమైన లక్షణములు :

(Morphophonemic criteria for the classification of verbal stems)

కాల భావ బోధక సపదాంశములకు పూర్వమున్న ప్రాతిపదికల పర్యాయ రూపమాధారముగా ప్రాచీనాంధ్రము నందలి క్రియా ప్రాతిపదికలు ఐదు ప్రత్యయాత్మక వర్గములుగ వర్గీకరింప బడినవి. తఱుచుగా నుపస్థితమైన కాల భావ బోధకప్రత్యయములు సంధిగతముగ ఏ, బి, సి అను తరగతులుగ పునర్విభజింప బడినవి [4] ఇతరములైన పర్యాయరూపములు ఒండలీకరణమున సూచింపబడినవి

### 4.2.3.1 'ఏ' విభాగము : హలాది ప్రత్యయములు :

| | | |
|---|---|---|
| 1. -చున్ | : | శత్రర్థకము |
| 2. -చ్- | : | వర్తమానకాల ధాతుజ విశేషణము |
| 3. -త- | : | విధ్యాశీరర్థకము [ప్రథమ పురుష] |
| 4. -డున్ | : | ఆనంతర్యార్థకము |

4. Prof. Bh. Krishnamurti : Telugu Verbal Bases, P. 203-205.

5. -φ- [∾ న్] : తద్ధర్మార్థక ధాతుజ విశేషణము [బి_6]
6. -దు- [∾/ద్ ∾/డ్] : తద్ధర్మార్థకము
-తు- [ -త్]
7. -బి- భూతకాలము [బి-1]

**4.2. .2 'బి' విభాగము : తాలవ్యాచ్చాదిగా గల ప్రత్యయములు :**

1. -ఇ-, -ఎ-, -ఇతి- · భూతకాలము
2 -ఇ : క్త్వార్థకము
3 -ఇన[∾/న ∞/అ] : భూతకాల క్రియా విశేషణము
4 -ఇనన్[∾/నన్ ∞ అన్] . చేదర్థకము
5. -ఎడు-/-ఎడి-/-ఎద . తద్ధర్మార్థకము
6. -ఎడు-/-ఎడి- . తద్ధర్మార్థక ధాతుజ విశేషణము

**4.2 3 2 'సి' విభాగము : కంఠ్యాచ్చులాదిగాగల ప్రత్యయములు :**

1. -అన్ [∾ న్] అన్నంతము
2. -అ- [∾ φ] : వ్యతిరేకార్థకము
3. -అకు వ్యతిరేకప్రార్థనాద్యర్థకము [వ్యతిరేక సపదాంశము-అ-]
4. -అక [∾క] : వ్యతిరేక క్త్వార్థకము
5. -అని [∾ని] : వ్యతిరేక ధాతుజ విశేషణము
6. -ఉ- [∾ φ] · విధ్యాశీరర్థకము [మధ్యమపురుష ప్రత్యయములకు పూర్వము]

4.2.3.4 కొన్ని న్యూన క్రియలు [ఐదవ తరగతి] తప్ప, కాల భావ బోధక ప్రత్యయములకు ముందుండి పర్యాయ రూపము నొందిన క్రియా ప్రాతిపదిక లన్నియు కొన్ని సంధిగతమైన సూత్రముల ద్వారా వివరింపబడును.

1. అజంత ప్రాతిపదికలకు అచ్చు పరమైనపుడు ప్రాతిపదిక తుది యచ్చు లోపించును. అజంత ప్రాతిపదికలకు హల్లు పరమైనపుడు ప్రాతిపదిక లోని యచ్చు లోపింపదు.

కట్టు - చున్ [ఏ - 1] [హర 2_21]
కట్ట్ - ఇ [బి - 2] [శృ నై 6_22]
కట్ట్ - అన్ [సి - 1] [శృ.నై 1-18]

ఏ విభాగ ప్రత్యయముల ముందు 'కట్టు' అనియు, 'బి' 'సి' విభాగ ప్రత్యయముల ముందు 'కట్ట్' అనియు ప్రాతిపదిక ఉండును

2. త్రిస్వర ధాతువులకు తాలవ్యాచ్చైన ఇ/ఏ లు పరమైనపుడు ధాతువు నందలి రెండవ అచ్చైన 'ఉ' కారము స్వర సామరస్యముచే మార్పు చెందును.

కలుగు_చున్ [ఏ_1] [హర 4_78]
కలిగ్_ఇ [బి_2] [కాశీ 5_127]
కలుగ్_అన్ [సి_1] [శృ.నై 1_58]
కలిగ్_ఎను [బి_2] [కాశీ 4_203]

హలాది ప్రత్యయములకు ముందు [ఏ విభాగము] 'కలుగు' అనియు, తాలవ్యాచ్చులైన ఇ/ఏ లకు ముందు [బి విభాగము] 'కలిగ్' అనియు, కంఠ్యాచ్చులాదిగాగల ప్రత్యయములకు ముందు [సి విభాగము] 'కలుగ్' అనియు క్రియా ప్రాతిపదిక మూడు విధములుగ పర్యాయరూపతనొందును.

3. _యు/_య్యు వర్ణాంత ధాతు ప్రాతిపదికలకు తాలవ్యాచ్చైన ఇ/ఏ లు పరమైనపుడు _స్/_స్స గా నియత పర్యాయ రూపత నొందును.

చేయు-చున్ [ఏ_1] [శృ.నై 5_27] చేస్_ఇ [బి_2] [హర 5_40]
చేయ్_అన్ [సి_1] [భీమ 1_89]

దీనిని బట్టి 'యు' వర్ణాంత ప్రాతిపదిక 'చేయు' [ఏ విభాగము] చేస్ [బి విభాగము] చేయ్ [సి విభాగము] అని మూడు విధములుగ పర్యాయరూపత నొందుచున్నది

4. అ. 'చు' వర్ణాంత ధాతు ప్రాతిపదికలకు తద్ధర్మార్థక ప్రత్యయములైన _తు_/_త్_ పరమైనపుడు క్రియా ప్రాతిపదిక మార్పు చెందును కాని ఇవికాక అన్యమైన హల్లు పరమైనచో ధాతువు నందెట్టిమార్పు రాదు.

- చు + దు - (~ద్ -) > - తు - (~-త్-)

చూచు + దు - రు > చూ- తు-రు [కాశీ 3-203]

చూచు + ద్ - అము > చూ-త్-అము [శృ.నై 2-35]

[సంసక్తోత్తమపురుష బహువచనము]

(Inclusive first person)

(అ) 'చ్చు' వర్ణాంత ధాతు ప్రాతిపదికలకు తద్ధర్మార్థక ప్రత్యయములైన [-తు~త్-]పరమైనపుడు క్రియాప్రాతిపదికాంత వర్ణమునకు '-త్' వర్ణము ఆదేశము నొందును ఇట్టి మార్పు అన్యమైన హల్లు పరమైనచో క్రియా ప్రాతిపదికకు రాదు.

-చ్చు + దు - (~ద్-) > -త్తు - (~త్ -)

తెచ్చు + దు + రు > తెత్ - తు - రు : తెత్తురు

తెచ్చు + ద్ + అము> తెత్ - త్ - అము . తెత్తము

5 హ్రస్వాదికములయిన అన్వాదులకు [అద్విరుక్త నువర్ణాంత క్రియా ప్రాతిపదికలకు] భూతకాల సపదాంశమైన -టి-, తద్ధర్మార్థక సపదాంశమైన -డ్- పరమైనపుడు ధాతు ప్రాతిపదికాంత వర్ణము 'ఙ్' గా పర్యాయ రూపత నొందును.

అఙ్ - టి - ని : అంటిని [శృ.నై 4-104]

అఙ్ - డ్ - రు : అండ్రు [కాశీ 2 . 7]

6 హ్రస్వ, దీర్ఘాచ్చులతో కూడిన ఏకాచ్క ధాతు ప్రాతిపదికలకు కంఠ్యాచ్చు లాదిగా గల [సి విభాగ. ... ] ప్రత్యయములు పరమైనపుడు ప్రత్యయగతమైన అచ్చు ... .

వచ్చు : రా + అన్ > ... [సి - 1]

రా + అ + డు > రాడు [సి - 2]

రా + అక > ...క [సి-4]

రా + అని > రాని [సి-5]

ర + ఉ + మ్ము > రమ్ము [సి - 6]
ర + ఉ + ండు > రండు [సి - 6]

వచ్చు అను ధాతువునకు 'రా/ర' అనునవి సపదాంశములు.

### 4.2.3.5 మొదటి తరగతి : (Class I)

అత్యధిక సంఖ్య గల క్రియా ప్రాతిపదికలు ఈ విభాగమునకు చెందినవై యున్నవి. శ్రీనాధుని భాషలో మొత్తము 715 సామాన్య ధాతువులకు గాను 476 ధాతువులీ వర్గమునకు చెందినవై యున్నవి [61%] వీనిని రెండంతర్భాగములుగ విభజింపవచ్చును

[అ] 1. -అడు హ ఆ హ అ [లేక] కొట్టు [హ అ హ హ అ] మొదలగు ద్వి స్వర ధాతువులకు, అడఁగు, కరఁగు [హ] అ హ అ హ వంటి ధాతువులలో రెండవ వర్ణము 'ఉ' వర్ణ రహితమైన త్రిస్వర ధాతువులకు సంధిగతమైన మార్పులలో మొదటి సూత్రము వర్తించును.

| ప్రాతిపదిక | ప్రత్యయముల ముందు పర్యాయరూపమైన ప్రాతిపదిక | | |
|---|---|---|---|
| | ఏ | బి | సి |
| కొట్టు | కొట్టు- | కొట్ట్- | కొట్ట్- |
| కరఁగు | కరఁగు- | కరఁగ్- | కరఁగ్- |

2. యువర్ణాంత రహితమై దీర్ఘాచ్చులేని ఏకస్వర, ద్విస్వర క్రియాప్రాతిపదికలకు 'ఏ' వర్ణముతో ప్రారంభమగు భూత, తద్ధర్మకాల భావబోధక ప్రత్యయములు పరమైనపుడు వైకల్పికముగా 'ఇయ్' ఆగమముగా వచ్చును. [బాల-క్రియా-50]

నగు- నగ్ - ఇయ్ - ఎ - ను నగియెను [కాశీ 6-18]
కొను- కొన్- ఇయ్ - ఎదన్ కొనియెదన్ [శృ.నై 1-101]
చెడు- చెడ్ - ఇయ్ - ఎ - ను చెడియెను [కాశీ 6-267]

'బి' విభాగము నందలి ప్రత్యయముల ముందు పడు, చెడు, ఇడు ఇత్యాది క్రియా ప్రాతిపదికలు పర్యాయ రూపము నొందును.

పడ్-అ : పడ్డ పడ్-అన్ : పడ్డన్
చెడ్-అ : చెడ్డ చెడ్-అన్ : చెడ్డన్
ఇడ్-అ : ఇడ్డ ఇడ్డ-అన్ ఇడ్డన్

[ఆ] త్రిస్వర క్రియా ప్రాతిపదికలలో రెండవ వర్ణము 'ఉ' వర్ణముగా గల వానికి సంధిగతమైన మార్పులలో మొదటి రెండు సూత్రములు ప్రవర్తించును.

| ప్రాతిపదిక | ప్రత్యయముల ముందు పర్యాయరూపమైన ప్రాతిపదిక | | |
|---|---|---|---|
| | ఏ | బి | సి |
| అడుగు | అడుగు- | అడిగ్- | అడుగ్- |
| కడుగు | కడుగు- | కడిగ్- | కడుగ్- |

-చు, -యు, -ను, [హ్రస్వాచ్చు ఆదిగాగల]వర్ణాంత క్రియా ప్రాతిపదికలు సాధారణముగా నీ విభాగమున చేరవు.

4.2.5.6 రెండవ తరగతి : (Class II)

-చు వర్ణాంత క్రియా ప్రాతిపదికలు ఈ విభాగమునకు చెందినవియై యున్నవి. శ్రీనాధుని భాషలో 112 ధాతువులు కలవు. [16%] వీనికి 1, 2, 4 సంధిగతమైన సూత్రములు వర్తించును. 'సి' విభాగ ప్రత్యయముల ముందు పొందు పదనిర్మాణ సోపాధికత (Morphological conditioning) యొక్క పర్యాయరూపముల మార్పు నాధారముగా చేసికొని ఈ విభాగమునకు సంబంధించిన ధాతుగణమును నాలుగు అంతర్విభాగములుగ విభజింప వచ్చును.

1. -చు/-చ్చు వర్ణాంత ధాతువు -వు/-వ్వు గ పర్యాయ రూపత నొందును.
2. -చు/ంచు వర్ణాంత ధాతువు -పు/-ంపు గ పర్యాయ రూపత నొందును.
3 ధాతువు తుది ‹చు వర్ణము - ‹పు గ పర్యాయరూపత నొందును.
4. ధాతువునకు కంర్యాచ్చులాదిగా గల ప్రత్యయములు పరమైనపుడు [సి విభాగ ప్రత్యయములు] ధాతు ప్రాతిపదిక ఎట్టిమార్పును పొందదు

ఈ అంతర్విభాగముల సపదాంశ వ్యాప్తి ఈ క్రింద ఉదాహరింపబడును.

1. -చు/-చ్చు వర్ణాంత ధాతువులు -వు/-వ్వుగ మార్పు చెందును.

ఈ విభాగమున శ్రీనాథుని భాషలో 51 ధాతువులు గలవు.

| ప్రాతిపదిక | ప్రత్యయములముందు పర్యాయరూపతనొందిన ప్రాతిపదిక | | |
|---|---|---|---|
| | ఏ | బి | సి |
| కాచు | కాచు- [1-5] | కాచ్- | కావ్- |
| | కా- [6-తు/-త్] | | |
| విడుచు | విడుచు- [1-5] | విడిచ్- | విడువ్- |
| | విడు [6-తు/-త్] | | |
| ఓర్చు | ఓర్చు- | ఓర్చ్- | ఓర్వ్- |
| నేర్చు | నేర్చు- | నేర్చ్- | నేర్- |

నిలుచు, విడుచు ధాతువులకు ఆశీరర్థక ప్రత్యయమైన 'ఉ' [సి విభాగము -6] పరమగునపుడు ప్రాతిపదికాంతమున ఆదేశముగా వచ్చు 'వ్' వర్ణము వైకల్పికత్వమును పొందును.

నిల్-ఉ-ము [నిలుము] [ప.పీ 24, 66]

నిలు-వ్-ఉ-ము [నిలువుము] [భీమ 3-212]

విడ్-ఉ-ము [విడుము] [చా మ 1-126]

విడు-వ్-ఉ-డు [విడువుడు] [శృ.నై 2-125]

నేర్చు ధాతువునకు కంత్యాచ్చులాదిగా గల ప్రత్యయములు పరమగునపుడు [సి-1-5] ప్రాతిపదిక భిన్నముగా నుండును.

నేర్ - అన్ : నేరన్ [కాశీ 3-80]

నేర్ - అ - మి : నేరమి [కాశీ 4-267]

నేర్ - అక : నేరక [శృ నై 4-99]

నేర్ - అని : నేరని [కాశీ 3-62]

2. -చు/ -ంచు వర్ణాంత ధాతువులు -పు/ -ంపుగా మార్పు చెందును.

ఈ విభాగమున శ్రీనాథుని భాషలో 16 ధాతువులు కలవు.

ప్రాతిపదిక ప్రత్యయములముందు పర్యాయరూపత నొందినరూపము

| | ఏ | బి | సి |
| --- | --- | --- | --- |
| అనుచు : పంపు | అనుచు-[1-5] అను-[6-తు/-త్] | అనిచ్- | అనుప్- |
| నించు : నిండు | నించు- [1-5] | నించ్- | నింప్- |
| త్రుంచు : ఖండించు | త్రుంచు-[1-5] | త్రుంచ్- | త్రుంప్- |

-చు/-ంచు వర్ణాంత ధాతువులకు [హలాది ప్రత్యయమైన] [ఏ విభాగము] తద్ధర్మార్థక 'దు' ప్రత్యయము పరమగునపుడు ప్రాతిపదికాంతమున ఆదేశముగ 'ప్' వర్ణము వైకల్పికముగ వచ్చును. [బాల-క్రియా -90]

చించు : చీల్చు, పగులకొట్టు 'చింపుదుమే'. [కాశీ 7-34]

3. -ఁచు వర్ణాంత ప్రాతిపదిక -ఁపు వర్ణముగ మార్పు చెందును.
ఈ విభాగమున శ్రీనాథునిలో 7 ధాతువులు గలవు.

ప్రాతిపదిక ప్రత్యయముల ముందు పర్యాయ రూపత నొందిన రూపములు

| | ఏ | బి | సి |
| --- | --- | --- | --- |
| తలఁచు వివేచించు | తలఁచు- [1-5] తలఁ- [6-తు/-త్] | తలఁచ్- | తలఁప్- |
| తోఁచు · గోచరమగు | తోఁచు- | తోఁచ్- | తోఁప్- |

4. ధాతువునకు కంఠాచ్చులాదిగా గల ప్రత్యయములు పరమైనపుడు [సి విభాగము] ధాతు ప్రాతిపదిక ఎట్టి మార్పును పొందదు.

ఈ విభాగమున శ్రీనాథునిలో 38 ధాతువులు గలవు.

ప్రాతిపదిక ప్రత్యయములముందు పర్యాయ రూపత నొందిన రూపములు

| | ఏ | బి | సి |
| --- | --- | --- | --- |
| మెచ్చు : శ్లాఘించు | మెచ్చు-[1-5] మె-[6-తు/-త్-] | మెచ్చ్- | మెచ్చ్- |

విచ్చు : వికసించు —— విచ్చ్— ——
పుచ్చు : పోవజేయు పుచ్చు— పుచ్చ్— పుచ్చ్—

తెలుగు వైయాకరణులు ఈ వర్గమునకు సంబంధించిన క్రియా ప్రాతిపదికలనుగూర్చి వివరించునపుడు రెండు విధములుగ వివేచించిరి.

1. సిద్ధ 'చ' కారము అనగా ధాతువు నందే స్వతస్సిద్ధముగా నున్న 'చ' కారము.

కాచు, పిలుచు మొదలైనవి.

2. అగమ 'చ' కారము అనగా క్రియా ప్రాతిపదికకు అదనముగా చేరు ధాత్వీకరణ ప్రత్యయముకాని, సకర్మక ధాత్వనుబంధముకాని కావచ్చును. సిద్ధ చకారముతో కూడిన ధాతువులకు ఆదేశముగ 'వు' వర్ణము వచ్చును. ఆగమ చకారముతో కూడిన ధాతువులకు కంర్యాచ్చులాదిగా గల ప్రత్యయములు పరమగునపుడు ఆదేశముగ 'పు' వర్ణము వచ్చునని విధించిరి.

[అ] కొన్నియెడల అనుస్వార సహిత సిద్ధ చకారముతో కూడిన ధాతువులకు కంర్యాచ్చులు అదిగా గల ప్రత్యయములు పరమగునపుడు ఆదేశముగ 'పు' వర్ణము వచ్చు చున్నది

తలంచు — తలపక [హర 6—112] తలంపన్ [శృ.నై 3-57]

[ఆ] అనుచు, అడంచు, తెలుచు' పనుచు, మొదలగు ధాతువులు 'బి' అంతర్విభాగమునకు చెందినవి.] వీనియందలి 'చు' వర్ణమునకు కంర్యాచ్చులాదిగా గల ప్రత్యయములు పరమగునపుడు 'పు' వర్ణము ఆదేశముగ వచ్చుచున్నది. ఈ రూపములన్నింటికి ఆగమముగా 'చు' వర్ణము చేరినటుల[సకర్మక ధాత్వీకరణ ప్రత్యయముగా అదనముగా చేరినటుల] నిరూపించుట కష్టము.

'ఓడు' అను అకర్మక ధాతువునకు సకర్మకమున 'ఓర్చు' : జయించు అనియు'వారు' అను అకర్మక ధాతువునకు సకర్మమున' వార్చు': సంధ్యనుపాసించు అనియు వచ్చుచున్నవి. వీనికి కంర్యాచ్చు అదిగా గల ప్రత్యయములు పరమైనపుడు 'ఓర్ప్ - వార్ప్' అని రావలసియుండగా 'ఓర్వ్- వార్వ్' అని వచ్చుట

వైయాకరణుల యభిప్రాయమునకు విరుద్ధము అంతేగాక 'డి' అంతర్విభాగమునకు చెందిన ధాతువులకు 'సి' విభాగమునకు చెందిన ప్రత్యయములు పరమైనపుడు పొందు పర్యాయ రూపత గురించి వైయాకరణులు సూచింపలేదు.

4.2.3.7. మూడవ తరగతి (Class III)

—యు/—య్యు వర్ణాంత క్రియాప్రాతిపదికలకు సంధిగతమైన మార్పులలో ఒకటి, మూడు సూత్రములు వర్తించును

త్రిస్వర క్రియాప్రాతిపదికలలో 'ఉ' వర్ణము రెండవ వర్ణముగా గల ధాతువు లిందు లేవు కావున రెండవ సూత్రము వర్తింపదు.

ప్రాతిపదిక ప్రత్యయములముందు పర్యాయరూపత నొందిన ప్రాతిపదికలు

| | ఏ | బి | సి |
|---|---|---|---|
| చేయు | చేయు— | చేస్— | చేయ్— |
| కోయు | కోయు— | కోస్— | కోయ్— |
| క్రుయ్యు | క్రుయ్యు— | క్రుస్స్— | క్రుయ్య్— |
| త్రెయ్యు | త్రెయ్యు— | త్రెస్స్— | త్రెయ్య్— |

శ్రీనాధుని భాషలో 103 ధాతు ప్రాతిపదికలు ఈ తరగతికి చెందినవి. కలవు. [14%]

4.2.3.8. నాలుగవ తరగతి (Class IV)

ఈ విభాగములో చేరదగిన ధాతువులు మిగిలిన విభాగములలో కన్న తక్కువ 'అను', 'కను[1]', 'కను[2]' 'కొను' 'చను' 'తిను' 'మను' 'విను' మొదలైన ఎనిమిది అన్వాది ధాతువులు శ్రీనాధునిలో కలవు హ్రస్వాదికములయిన అద్విరుక్త 'ను' వర్ణాంతములైన క్రియా ప్రాతిపదికలు ఈ విభాగములోనికి చేరును. వీని కన్నింటికి సంధిగతమైన మార్పులలో ఐదవ సూత్రము ప్రవర్తించును.

—చున్ ∞ —చు, —దు ∞ —ద్— ప్రత్యయముల ముందున్న అన్వాది ధాతువులు పర్యాయ ప్రవృత్తిని పొందునపుడు ఈ ధాతువుల అంత్యవర్ణమైన 'ఉ' లోపించును.

అను_చున్/అన్_చున్, అను_దు_ను_/అన్_దు_ను

ప్రాతిపదిక ప్రత్యయములముందు పర్యాయరూపత నొందిన ప్రాతిపదిక

| | ఏ | బి | సి |
|---|---|---|---|
| అను | అను_/అన్_[1, 2] | అన్_ | అన్_ |
| | అను_ [3,5] | అన్_/అనియ్_ [ఏ 5,6] | |
| | అణ్_[6,7] | | |

'అను' ధాతువు కంఠ్యాచ్చు ఆదిగా గల ప్రత్యయములు [సి విభాగము] పరమగునపుడు 'నా' గా పర్యాయ ప్రవృత్తిని (Free Variation) పొందును.

అన్+అన్ : నాన్[సి_1]ఇట్లు పరివర్తనము నొందటకు వర్ణవ్యత్యయమే కారణము.

అన్_అ : నా_ $\phi$ [సి_2], అన్_అక్_: నా_క్_ [సి_3], అన్_అక : నా_క [సి_4]

2. 'కొను' ధాతువునకు [సి_6] _ఉ ప్రత్యయము పరమైనపుడు 'కొ' అని సర్వాదేశము నొందును.

కొ _ $\phi$ _ ండు [శృ.నై 1_53]

4.2.3.9 ఐదవ తరగతి : (Class V)

ఒకే విధమైన సంధిగత లక్షణములు లేనందువలన ఇవి యన్నియు న్యూన క్రియలుగా (Irregular Verbs) ఈ వర్గమున చేర్పబడినవి. అందువలన ఏ, బి, సి, అను నీమూడుతరగతుల ముందు ఒక్కొక్క ధాతు ప్రాతిపదిక పొందు పర్యాయ రూపములును ప్రత్యేకముగా పొందుపరుప బడినవి. శ్రీనాథునిలో 14 ధాతువులు ఈ వర్గమునకు చెందినవి కలవు. సౌలభ్యముకొఱకు నీ ప్రత్యయములకు అంతర్విభజన కావింపబడినది.

అకారాది ప్రత్యయములు : 'సి' విభాగము నందలి ప్రత్యయములు [1_5]

వాని పర్యాయ రూపములు [6వ సూత్రము]

ఉకారాది ప్రత్యయములు : విధ్యాశీరర్థకము [సి-6] వాని పర్యాయ రూపము.
ఇకారాది ప్రత్యయములు :} 'బి' విభాగమునకే చెందిన ప్రత్యయములు
ఎకారాది ప్రత్యయములు :}

1. అగు : [అయినట్టి] సపదాంశములు : అగు-/అవు-/ఔ-
అయ్-, ఆయ్-/అయ్యె-
కా-

| ఏ | బి | సి |
| --- | --- | --- |
| అగు /అవు-/ఔ- | అయ్-[ఇ-ప్రత్యయములు] | కా-[అ-ప్రత్యయములు] |
| | ఆయ్-/అయ్యె-[ఎ-ప్రత్యయములు] | క-[6] |
| | | అగు-[6 మధ్యమపురుష[illegible] వచనమునకు ముందు] |

2. ఇచ్చు : సపదాంశములు : ఇచ్చ్- ఇత్-, ఈ-, ఈయ్-, ఇ-

| | | |
| --- | --- | --- |
| ఇచ్చు- [1-5] | ఇచ్చ్ | ఈ-/ఈయ్[అ-ప్రత్యయములు] |
| ఇత్ [6-తు /-త్] | | ఇ- [6] |

3. ఉండు : నివసించు సపదాంశములు : ఉండు-, ఉండ్-, ఉన్, ఉణ్-

| | | |
| --- | --- | --- |
| ఉండు- [3-5] | ఉండ్-[-ఇ,-ఎ- 2-6] | ఉండ్- |
| ఉండు-/ఉన్-/ఉణ్ [6-దు-/-ద్-] | ఉన్-[3,4] | |
| ఉణ్- [7] | | |

4. *కాన్- : చూచు

| | | |
| --- | --- | --- |
| — | — | కాన్- [అ-ప్రత్యయములు] |

5. చచ్చు : సపదాంశములు : చచ్చు-, చచ్చ్-, చత్-, చావ్-/చా-

| | | |
| --- | --- | --- |
| చచ్చు- [1-5] | చచ్చ్- | చావ్-/చా-[అ-ప్రత్యయములు] |
| చత్-[6-తు-/-త్-] | | చావ్- [6] |

6. చూచు సపదాంశములు ; చూచు-, చూచ్-, చూడ్-, చూ-, చు-

| | | |
| --- | --- | --- |
| చూచు- [1-5] | చూచ్- | చూడ్- [అ-ప్రత్యయములు] |
| చూత్- [6-తు-/-త్-] | | చూడ్/చు- [6] |

7. చొచ్చు : సపదాంశలు : చొచ్చు-, చొచ్చ్-, చొత్-, చొర్-

| ఏ | బి | సి |
|---|---|---|
| చొచ్చు- [1-5] | చొచ్చ్- | చొర్- |
| చొత్-[6-తు-/-త్-] | | |

8. తెచ్చు : సపదాంశములు : తెచ్చు-, తెచ్చ్-, తెత్-, తే-/తేర్-, తె-

| | | |
|---|---|---|
| తెచ్చు- [1-5] | తెచ్చ్- | తేర్-/తే- |
| తెత్- [6-తు-/-త్-] | | తె- [6] |

9. నొచ్చు : సపదాంశములు : నొచ్చు-, నొచ్చ్-, నొత్-, నోవ్-/నొవ్వ్-

| | | |
|---|---|---|
| నొచ్చు- [1-5] | నొచ్చ్- | నోవ్-/నొవ్వ్- |
| నొత్- [6-తు-త్-] | | [అ-ప్రత్యయములు] |

10. పోవు : సపదాంశములు : పోవు-, పోవ్-, పోయ్-, పో-, పొ-

| | | |
|---|---|---|
| పోవు- [1-5] | పోయ్- | పోవ్-/పో- [అ-ప్రత్యయములు] |
| పోవు-/పో- [6-దు-/-ద్-] | | పొ-[6] |

11. లేచు : సపదాంశములు : లేచు-, లేచ్-, లేవ్- లె-

| | | |
|---|---|---|
| లేచు [1,2,5] | లేచ్- | లేవ్- [అ-ప్రత్యయములు] |
| | | లె- [6] |

12. వచ్చు : సపదాంశములు : వచ్చు-, వచ్చ్-, వత్-, రా-, ర-

| | | |
|---|---|---|
| వచ్చు- [1-5] | వచ్చ్- | రా- [అ- ప్రత్యయములు] |
| వత్-[6-తు-/-త్-] | | ర- [6] |

13. వలచు : సపదాంశములు : వలచు-, వలచ్-, వల-, వలవ్-, ఒల్ల్-

| | | |
|---|---|---|
| వలచు- [1-5] | వలచ్- | వలవ్- [1-6] |
| వల- [6-తు-/-త్-] | | ఒల్ల్- [2-4] |

పై రూపములలో -చు/-చ్చు అంతమైన 'ఇచ్చు, చచ్చు, చూచు, నొచ్చు, వచ్చు, వలచు, క్రియా ప్రాతిపదికలు రెండవ వర్గమున చేరిన ధాతు గణమందలి ఏ, బి విభాగ ప్రత్యయముల ముందు పొందిన రూప సిద్ధి కంటె భిన్నమైనవి కావు. కాని ఇవి సి - విభాగ ప్రత్యయముల ముందు భిన్నమైన పర్యాయ రూపములను పొందినవి,

4.౽.3.10 సర్వాదేశము నొందిన కొన్ని ఇతర రూపములీక్రింద సూచింపబడుచున్నవి.

1. పొద/పద, పొదము [శృ.నై 5-39] / పదము [క్రీడా 126], పొదండు [శృ.నై 7-122]

2 'వలయు' ధాతువు విల్లప్పుడు అన్నంతక్రియ కనుప్రయుక్తమై కాన వచ్చుచున్నది. ఈ న్యూనక్రియా రూపావళి యీ క్రింది విధముగా నుండును.

| | |
|---|---|
| వలయు - φ - ను | : తద్ధర్మార్థక ప్రథమపురుషైక వచనము |
| వలయు-φ [ఌ ను] | : తద్ధర్మార్థక ధాతుజవిశేషణము [ఏ-5] |
| వలస్ - ఇ | : క్త్వార్థకము[బి-2] |
| వలస్ - ఇన | : భూతకాల ధాతుజ విశేషణము [బి-3] |
| వలస్ - ఇనన్ | : చేదర్థకము [బి-4] |
| వలస్ - ఎ-ను | : భూతకాల ప్రథమపురుషైక వచనము |
| వలవ్ - అ-క | : వ్యతిరేక క్త్వార్థకము |
| వలవ్ - అ-దు/వల్-అ-దు | : వ్యతిరేక ప్రథమపురుషైక వచనము |
| వద్దు- | : నిషేధార్థకము [ప.పీ 38] |



## 4.3.0. సంశ్లిష్ట ధాతువులు(Complex Verbal Roots)

ఒక క్రియా ప్రాతిపదికకు అనుబంధముగ అస్వతంత్రమైన (bound) ప్రత్యయము చేరుటచే నీ సంశ్లిష్టధాతువు లేర్పడును. క్రియాప్రాతిపదికాంతమున చేరు ప్రత్యయముల ననుసరించి క్రియలను మూడు విధములుగ విభజింపవచ్చును.

1. 'ఇంచు' ప్రత్యయాంతములు [అచ్చిక, తత్సమ ధాతువులలోనివి; సకర్మక అకర్మకములుగా నుండును.]

2 'ఇల్లు' ప్రత్యయాంతములు [అచ్చిక, తత్సమ ధాతువులలోనివి; ఎల్లప్పుడు అకర్మకములుగానే ఉండును ]

3. తదితరములు [ ఇవి సకర్మకాకర్మకములు కావచ్చును ]

4.3.1. '–ఇంచు' తెలుగులో ధాత్వీకరణ ప్రత్యయము (verbalizing suffix) అనగా ధాతువులను తయారు చేయు ప్రత్యయము. ఇది సమ సమేతర శబ్దములకు వచ్చును. అచ్చిక శబ్దములలో 'ఆసించు' [శివ 3–87] 'అణకించు' [శివ 3–44] నంటివి తత్సమ శబ్దములలో 'అంకురించు' [భీమ 2–55] 'అంతర్భవించు' [కాశీ 6–157]మొదలైనవి. వీనిలో చాలవరకు నామములను ధాతువులుగా చేయుటకు '–ఇంచు' ప్రత్యయము వచ్చును. సంస్కృత శబ్దమైన 'ఆరోహణ' మన్నగు నామ రూపములకు –ఇంచు' చేర్చుట వలన తెలుగులో ధాతువై 'ఆరోహించు' శృ నై 1–87] ఏర్పడుచున్నది. సంస్కృతములోని 'ణ/న' ప్రత్యయమును లోపింపజేసి 'ఇంచు' కలుపగా తెలుగులో క్రియ ఏర్పడుచున్నవి. ఇక్కడ ధాతువు 'రుహ్' దానికి గుణము సంస్కృతములో నామ ప్రత్యయము చేర్చుట వలన వచ్చినది. ఉదా: ఆలోకించు [<ఆలోకన] [శృ నై 7–124]. అందువలన నామములకు –ఇంచు' ప్రత్యయము చేర్చుట వలననే ధాతువు లగుచున్నవి. సంస్కృతము నుండి వచ్చిన నామవాచకములకు నీరకమైన ప్రక్రియ సాధ్యమగు చున్నది ఇది సహజమైన ప్రక్రియ ఒక భాషనుండి మరొక భాషలోనికి పదములను ఎరువు తెచ్చుకొనినపుడు పదరూపములనే తీసికొందురు. కాని ధాతురూపములను తీసికొని ప్రత్యయములను చేర్చుట అరుదు అయినచో ప్రాయికముగా తెలుగు కవులు సంస్కృత భాషలో విశేషమైన పాండిత్యము కలవారగుటచే భాషలో సహజ పద్ధతులతో వచ్చిన మాటలనే కాకుండ కొన్ని తామే అంతకు పూర్వము లేని పదములను

ఎరువు తెచ్చుకొనినారు అట్టివానిలో కేవల ధాతు రూపములకు కూడ '–ఇంచు' ప్రత్యయములు చేర్చుకొనినటుల కన్పించును. వీనిని నామ రూపములుగా భావించుటకు వీలులేదు. ఎందుకనగా నామ రూపములలో వచ్చు గుణాది మార్పులు వీనిలో కన్పించుట లేదు. ఉదాహరణకు 'అలిఖించు' [శివ 2_53] ఇందు 'లిఖ్' ధాతువు. ఈ రకమైన రూపములు కవికి సంస్కృతములో నున్న పాండిత్యమును సంస్కృత ప్రౌఢిమను తెల్పును. 'ఆశీర్వదించు' [< ఆశీర్వాదము] [హర 7-13] '–ఇంచు' చేరిన పదములు చాలవరకు అమూర్త పదార్థ బోధకములు (abstract). దీనికి కారణమేమనగా ఉన్నత భావ వ్యక్తీకరణమునకు సంస్కృతమును స్వీకరించుట సహజ స్వభావము. '–ఇంచు' తో పాటు '–ఇల్లు' అను పదము కూడ సమ సమేతర పదములకు చేర్చి ప్రయోగింపబడుచున్నవి. అయితే '–ఇల్లు' చేరిన పదములు [32] '–ఇంచు' చేరిన పదముల [539]తో పోల్చి చూడగా అత్యల్పము. '–ఇల్లు' చేరిన తత్సమ ధాతువులన్నియు ఎల్లప్పుడు అకర్మకములుగనే ఉండును. '–ఇల్లు' ధాత్వీకరణ ప్రత్యయముగా ప్రాచీన కాలములో ఎప్పుడో ఉండి ఉండును. తర్వాత తొలగిపోయి దాని స్థానమును –'ఇంచు' ఆక్రమించి ఉండును. అందులకే '–ఇల్లు' తో క్రొత్త ధాతువులను సృష్టించుట కష్టము.

## 1.3.2. ఆచ్ఛిక సంశ్లిష్ట ధాతువులు

శ్రీనాథుని భాషలో '–ఇంచు' ప్రత్యయముతో కలిపి 327 ఆచ్ఛిక సంశ్లిష్ట ధాతువులు కలవు. (అనుబంధము 3.1 2. చూడుడు)

1. అమూర్త బోధక నామములు (abstract nouns) '–ఇంచు' చేరి ఆచ్ఛిక సంశ్లిష్ట ధాతువులగుచున్నవి. ఇప్పుడు అగమాదేశ లోపములు కలుగుచున్నవి.

| | | | |
|---|---|---|---|
| అణకించు | [అణకము + ఇంచు] | పరియాచకముచేయు | [శివ 3_44] |
| ఉజ్జగించు | [ఉజ్జనము + ఇంచు] | విడుచు | [శృ.నై 2-84] |
| కత్తిరించు | [కత్తెర + ఇంచు] | ఖండించు | [శృ.నై 7–93] |
| కమ్మిరించు | [కమ్మ + ఇంచు] | మూయు | [శృ.నై 7–93] |
| దీవించు | [దీవన + ఇంచు] | ఆశీర్వదించు | [శివ 2_70] |
| నేమించు | [నేమము + ఇంచు] | నియమించు | [హర 2_7] |
| బొబ్బరించు | [బొబ్బ + ఇంచు] | అఱచు | [వ వీ 82] |

మేళ/గి/వించు [మేళము + ఇంచు] జతపఱచు [భీమ 1_109]
విన్నవించు [విన్నపము + ఇంచు] మనవి చేయు [శృ.నై 2-81]
హెచ్చరించు[హెచ్చరిక + ఇంచు] ప్రోత్సాహపరచు] [ప.వీ 83]

2. శ్రీనాథుడు ప్రయోగించిన కొన్ని క్రియలకు సోదరభాషలైన తమిళ కన్నడ పదములు సరూపములుగ కన్పడుచున్నవి

| | | | |
|---|---|---|---|
| అంగవించు | [కన్నడ. అంగవిసు] | యత్నించు | [శృ.నై 7-46] |
| ఆరగించు | [కన్నడ. ఆరగిసు] | తిను | [హర 2-126] |
| ఆలకించు | [కన్నడ. ఆలిసు] | విను | [శృ.నై 3-39] |
| కత్తిరించు | [కన్నడ కత్తరిసు] | ఖండించు | [శృ నై 7-93] |
| కుప్పించు | [కన్నడ. కుప్పిసు] | దుముకు, దూకు | [కాశీ 1-112] |
| జాడించు | [కన్నడ. జాడిసు] | విదుల్చు,దులుపు | [శృ నై 2_5] |
| పరికించు | [కన్నడ. పరికిసు] | పరిశీలించు | [శృ నై 5-43] |
| అవలించు | [తమిళ. ఆవలి] | బద్దలగు | [ప వీ 99] |
| గోడగించు | [తమిళ. గోడై=ధ్వని] | పోటీపడు | [కాశీ 4-296] |
| తులకించు | [తమిళ. తులంకు] | ప్రకాశించు | [కాశీ 4-145] |
| ధట్టించు | [తమిళ తట్టు] | అదలించు | [హర 6-17] |
| గలబరించు | [కన్నడ. గలబరిసు] | తొలచు, చిలుకరించు | [శివ 3_92] |

3. పూర్వకవులు ప్రయోగించని '_ఇంచు' చేర్చిన కొన్ని అచ్చిక సంశ్లిష్ట ధాతువులను శ్రీనాథుడు విశిష్టముగా ప్రయోగించెను

| | | |
|---|---|---|
| ఇవతాళించు | [చల్లనగు] | [శృ నై 3-34] |
| కలమరించు | [కలత చెందు] | [శివ 3_92] |
| కులుకరించు | [శబ్దింపఁజేయు] | [కాశీ 7-185] |
| కుస్తరించు | [లాలించు] | [కాశీ 2-43] |
| గుమ్మడించు | [పూరించు] | [క్రీడా 226] |
| గోడగించు | [పోటీపడు] | [కాశీ 4_296] |
| రవళించు | [గల్లుగల్లుమను] | [కాశీ 3-241] |
| దిచ్చరించు | [ఉలికి పచ్చు] | [క్రీడా 93] |
| పంచారించు | [అతిశయించు] | [కాశీ 6_127] |

పచరించు : ప్రకటించు [హర 4-11]
పటుతాళించు . ఇటునటు బెళకఁగ జూచు [క్రీడా 75]
పుక్కిలించు : గండూషించు [భీమ 1-98]

4. ఈ క్రింది రూపములు క్రియాప్రాతిపదికతో కూడి అచ్చిక సంశ్లిష్ట ధాతువు లగుచున్నవి.

అడరించు [< అడరు + ఇంచు] వర్ధిల్లజేయు [హర 7-165]
ఉబ్బించు [< ఉబ్బు + ఇంచు] ఉబ్బజేయు [హర 6-87]
కుందించు [< కుందు + ఇంచు] బాధించు [భీమ 2-50]

5. కొన్ని అచ్చిక సంశ్లిష్ట ధాతువులకు ఆగమాదేశ లోపములు వచ్చు చున్నవి.

ఉంకించు [< ఊఁకు + ఇంచు] యత్నించు, పూను [శృ నై 1-103]
కావించు [< అగు + ఇంచు] కావించు [శృ నై 7-128]
క్రమ్మఱించు [< క్రమ్ము + ఇంచు] వ్యాపింపజేయు [భీమ 4-18]
తెప్పించు [< తెచ్చు + ఇంచు] తేఁజేయు [హర 6-50]
రప్పించు [< వచ్చు + ఇంచు] రాఁజేయు [శృ నై 8-54]

6. కొన్ని తత్సమ ధాతువులు కాల క్రమమున కొన్ని మార్పులకు లోనై అచ్చిక ధాతువు లగును.

అతకరించు [< సం అధఃకరించు] క్రిందపఱచు [హర 3-44]
అప్పళించు [< సం. ఆస్ఫాల కన్నడ. అప్పళిసు] ఉత్సహించు [శృ నై 1-62]
ఉగ్గడించు [< సం.ఉద్ఘాట్ కన్నడ ఉగ్గడిసు] స్తుతించు [శృ.నై 8-85]
పచరించు [< సం.ప్రసరః. కన్నడ.పసరిసు] ప్రకటించు [హర 4-11]

7. '-ఇల్లు' అను ప్రత్యయము శ్రీనాథుని కృతులందు అమూర్త పదార్థ బోధక నామములపైననే చేరుచున్నది. అప్పుడు కొన్ని ఆగమాదేశ లోపములు కలుగు చున్నవి

1. ఉజ్జగిల్లు [< ఉజ్జనము + ఇల్లు] తొలఁగు, పోవు [శివ 3-62]
2. ఊసరిల్లు [< ఊసరము + ఇల్లు] కృశించు [కాశీ 2-138]

3 ఓహటిలు [<ఓహటము + ఇల్లు] లయమందు [శృ.నై 8-179]
4 కత్తరిల్లు [<కత్తరి + ఇల్లు] చలించు [శృ నై 7-46]
5 గాసిల్లు/లు [<గాసి + ఇల్లు/లు] కోపించు [శృ.నై 1-84]
6. గూనుగిల్లు [గూను + ఇల్లు] వంగు [శివ 2-21]
7. చెమ్మగిల్లు/లు [చెమ్మ + ఇల్లు] తడియగు [చా.మ. 1-122]
8 చెమ్మటిల్లు [చెమ్మ + ఇల్లు] అర్ద్రమగు [శ్రీ శృ. 47]
9 జొత్తిల్లు [జొత్తు + ఇల్లు] ఎఱ్ఱనగు [భీమ 4-123]
10. తల్లడిల్లు [తల్లడము + ఇల్లు] చలించు [హర 3-10]
11. తారసిల్లు [తారసము + ఇల్లు] వచ్చు, వెళ్ల [హర 4-57]
12 తీండ్రిల్లు [తీండ్ర + ఇల్లు] అతిశయించు [భీమ 3-152]
13. దూపటిలు/ల్లు/
దూపిలు [దూప + ఇల్లు] దప్పికొను [భీమ 2-101]
14. దోరగిలు [దోర + ఇల్లు] ఎఱ్ఱబారు [కాశీ 3-23]
15 పంచతిలు [పంచితము + ఇల్లు] మూత్రము విడుచు
[హర 7-135]
16 పరిఢవిల్లు [పరిఢవము + ఇల్లు] ప్రవర్తిల్లు [శృ.నై 1-9]
17 పల్లటిలు [పల్లట + ఇలు] తగ్గు, క్షీణించు [కాశీ 6-64]
18 పాటిల్లు/లు [పాటి + ఇల్లు/లు] కలుగు,జనించు [కాశీ 6 64]
19 పిక్కటిలు [పిక్కటము + ఇలు] నిండు,పూర్ణమగు [భీమ4-198]
20 పుల్లసిల్లు [పుల్ల + ఇల్లు] భయపడు [క్రీడా 206]
21. పెల్లగిల్లు [పెల్ల + ఇల్లు] పెకలు [కాశీ 5-130]
22 బిత్తరిలు [బిత్తరము + ఇల్లు] వ్యాపించు [క్రీడా 130]
23. బీటగిల్లు [బీట + ఇల్లు] పగులు [భీమ 3-212]
24 బూరటిలు [బూరట + ఇల్లు] నిండు [శృ నై 7-63]
25 బెగ్గిలు [బెగ్గలము + ఇల్లు] భయపడు [హర 3-66]
26. బోరగిలు [బోర + ఇలు] భూమిపై అను [క్రీడా 80]
27. మందటిలు [మందట + ఇలు] నిలిచిపోవు [కాశీ 3-23]
28. మత్తిలు [మత్తు + ఇలు] మదించు [శృ.నై 1-107]
29. మ్రొగ్గతిలు [మ్రొగ్గ + ఇలు] మోఁకరిల్లు [హర 1-21]

30 సంతసిల్లు/లు [సంతసము + ఇలు] సంతసించు [భీమ 1-76]
31. సందడిలు [సందడి + ఇలు] సందడించు [కాశీ 2-44]
32 సొమ్మసిల్లు [సొమ్మ + ఇల్లు] మూర్ఛిల్లు [హర 3-93]

8 ఈ క్రింది ధాతువులు సంశ్లిష్టములు అయినను మూలధాతువును వేరు పరచి చూపుట వీలుకాదు అనగా ఈ మూలధాతువులు కాలక్రమమున పరిణామము నొంది తరువాతి ప్రత్యయముతో సంశ్లిష్టతను పొందినవని భావము.

| | | | |
|---|---|---|---|
| 1. అత్తమిల్లు | : | ఒఱగు, వ్రాలు | [కాశీ 1-122] |
| 2 ఒడ్డగిల్లు | : | వ్రాలు, అతిశయించు | [కాశీ 3-101] |
| 3. గడసిల్లు | : | కడనుండు | [భీమ 2-77] |
| 4. గుబ్బతిల్లు/లు | : | ఉప్పొంగు, అతిశయించు | [శివ 2-107] |
| 5. చించిలు | : | బాధపడు | [శివ 3-15] |
| 6 చిప్పిలు | : | తడిసి ఉబుకు | [శృ.నై 1-93] |
| 7. జొబ్బిలు | : | తడియు, స్రవించు | [హర 2-107] |
| 8. రవణిల్లు | | ఉండు, ప్రవర్తిల్లు | [కాశీ 5-96] |
| 9. దండ/ద/సిల్లు | | ఇఱుకుకొను | [శృ.నై 4-125] |
| 10 దురపిల్లు | : | పరితపించు | [భీమ 2-33] |
| 11. నివ్వటిల్లు/లు | . | నెఱవేఱు, విజృంభించు | [కాశీ 4-91] |
| 12. పిచ్చిలు | : | లోపలినుండి పైకి వచ్చు | [శృ.నై 2-114] |
| 13 మాగిలు | : | ఆఁచు | [క్రీడా 192] |
| 14. వెలికిలు | | వీపుక్రిందగునట్లు పడు | [శివ 2-7] |
| 15. సవరిల్లు | . | అందమగు, ఒప్పు | [కాశీ 2-28] |

9. ఈ క్రింది క్రియా ప్రాతిపదిక తద్భవముగా కన్పించుచున్నది.

ఉప్పతిల్లు [<ప్రా : ఉప్పత>సం ఉత్పద్] సంభవించు [భీమ 5-9]

## 4.3.3. తత్సమ సంశ్లిష్ట ధాతువులు :

ఈ సంశ్లిష్ట ధాతువుల యందు తత్సమ ధాతువులను రెండు విధములుగ వర్గీకరింప వచ్చును [అనుబంధము 3.1 3. చూడుడు]

1. క్రియాధాతువులు 2. నామధాతువులు.

**4.3.3.1 తత్సమ క్రియా ధాతువులు :**

'అర్చ్, త్యజ్, భజ్' – మున్నగు సంస్కృత ధాతువులకు '–ఇంచు' ప్రత్యయము చేరుటచే నేర్పడిన ధాతువులు. పుష్ ధాతువునకు గుణముతోడి రూపము.

| | | | |
|---|---|---|---|
| అర్చించు | [హర 7–9] | త్యజించు | [కాశీ 5–40] |
| భజించు | [కాశీ 6–53] | పోషించు | [శృ.నై 2-125] |

**4.3.3.2 తత్సమనామ ధాతువులు :**

సంస్కృతనామములకు '–ఇంచు' అను ప్రత్యయము చేర్చుట వలన నేర్పడిన ధాతువులు.

| | | | |
|---|---|---|---|
| నుతించు | [కాశీ 6–151] | శయనించు | [కాశీ 4–64] |
| స్తుతించు | [శివ 1–107] | | |

ఇట్లు సంస్కృత నామములకు '–ఇంచు' ప్రత్యయము చేరుట చాల తరచుగా కలదు.

4.3.3.3 1. '–ఇల్లు' అను ప్రత్యయముతో నంతమగు తత్సమధాతువుల యందు నీ క్రింది రూపములకు రేఫాగమము గలుగుట విశేషము.

| | | | |
|---|---|---|---|
| తేజరిల్లు | > [తేజ–ర్–ఇల్లు] | ప్రకాశించు | [హర 5–27] |
| ప్రజ్వరిల్లు | > [ప్రజ్వ–ర్–ఇల్లు] | ప్రకాశించు | [కాశీ 2–96] |

2. కొన్ని తత్సమ రూపములకు '–ఇంచు' పరమగునపుడు 'గు' వర్ణమాగమముగ వచ్చుచున్నది.

| | | | |
|---|---|---|---|
| కోపగించు | [<కోప – ఇంచు] | కోపించు | [భీమ 2–118] |
| కోరగించు | [<కోర – ఇంచు] | ముకుళితమగు | [శృ.నై 7–150] |

3. ధాతువు తుది నున్న ఇ, ఉ, ఋ వర్ణములకు 'ఇంచు' పరమగునపుడు –అయ్, –అవ్, అర్' అని వరుసగా నగును

| | | | |
|---|---|---|---|
| జి – ఇంచు | జయ్ – ఇంచు : జయించు | | [శృ.నై 5–145] |
| స్రు– ఇంచు | స్రవ్ – ఇంచు : స్రవించు | | [కాశీ 4–24] |
| ధృ – ఇంచు | ధర్ – ఇంచు : ధరించు | | [శృ.నై 5–96] |

4. 'జి' అను ధాతువు 'నిర్' అను ఉపసర్గతోకూడి వచ్చినపుడు అయుగాగమము కలుగదు.

నిర్ – జి – ఇంచు : నిర్జించు [శృ.నై 8–134]
దీనిని బట్టి ఉపసర్గలతో కూడియున్నప్పుడును పైని చెప్పిన ధాతువులకు నీ ప్రత్యయములు చేరును.

అను–నీ– ఇంచు > అను–నయ్–ఇంచు : అనునయించు [శృ.నై 7–10]
సం–భూ– ఇంచు > సం–భవ్–ఇంచు : సంభవించు [హర 7-26]
వి–స్తౄ–ఇంచు > వి–స్తర్–ఇంచు : విస్తరించు [శృ.నై 4–71]

5 భిద్ మొదలగు ధాతువులకు భేద– మున్నగు కృదంతరూపములేర్పడును. వానికి –ఇంచు పరమై భేదించు మున్నగు విధముగా రూపములేర్పడును.

భేదించు [<భేద + ఇంచు] [కాశీ 5–137]
ఘోషించు [<ఘోష + ఇంచు] [హర 7–79]
వర్షించు [<వర్ష + ఇంచు] [భీమ 4–83]
భేదిల్లు [<భేద + ఇల్లు] [కాశీ 4–222]
కోపించు [<కోప + ఇంచు] [హర 7–67]
దర్పించు [<దర్ప + ఇంచు] [కాశీ 1-55]

హ్రస్వములని చెప్పుటచేత 'పూర్, దీవ్' మున్నగు దీర్ఘముతోడి ధాతువులు పూరించు [కాశీ 5–237] దీవించు [ప.పీ 88] మున్నగు విధముగానే యుండును. ఉపసర్గలు చేరినప్పుడు కూడ 'నిషేధించు' [శృ.నై 2-46] ప్రబోధించు [శృ.నై 5-170] సందర్శించు [కాశీ 2–36] మున్నగు విధముగా రూపములేర్పడును.

6. 'స్పృశ్' అను ధాతువు కృదంతరూపముపై 'ఇంచు' చేరియు, ధాతువుపై సరాసరి 'ఇంచు' చేరియు రెండువిధములుగా తత్సమరూపము నొందును.
సం–స్పర్శించు [<సం–స్పర్శ్–ఇంచు] [భీమ 3–101]

7. లిఖ్, భుజ్, రుచ్, కృశ్ – అను ధాతువులకే ఇంచు చేరును
లిఖించు [శృ.నై 1–64] భుజించు [కాశీ 4–124]
రుచించు [శృ.నై 4–69] కృశించు [కాశీ 6–41]

8. 'సృజ్' ['నిర్మించు'] అను ధాతువునకు గుణము కలుగదు.

అజుఁడు దీని సృజించి యాత్మనువ్విళ్లూర– [శివ 3-49]

ఉపసర్గ చేరినపుడు గుణము కలుగును.

ధాత్రిన్ విసర్జించు [<వి + సృజ్ + ఇంచు] విడుచు [శృ నై 6-30]

9. సంస్కృత ధాతువు '–ఇంచు' తో కలిసిన పిమ్మట జగణమైన యెడల, అట్టి ధాతువులకు '–ఇంచు' నకు పూర్వమందు '–ఇయ్' అనునాగమము కలుగును.

| | | | |
|---|---|---|---|
| ఘటించు | [శృ.నై 7-128] | ఘటియించు | [శృ.నై 7-91] |
| చరించు | [శృ.నై 2-48] | చరియించు | [శృ నై 7-37] |
| జనించు | [శివ 1-108] | జనియించు | [కాశీ 2-19] |
| జనించు | [కాశీ5-244] | జపియించు | [భీమ 3-28] |
| — | | జ్వలియించు | [ప.పీ 113] |
| — | | తపియించు | [భీమ 4-102] |
| — | | తరియించు | [కాశీ 2-118] |
| త్యజించు | [కాశీ 5-40] | త్యజియించు | [ప.పీ 95] |
| — | | దమియించు | [శృ నై 2-9] |
| ధరించు | [శృ నై 5-96] | ధరియించు | [భీమ 1-117] |
| నటించు | [కాశీ 7-243] | నటియించు | [శృ.నై 5-127] |
| — | | నుతియించు | [కాశీ 4-68] |
| పరించు | [శృ నై [illegible]-70] | పరియించు | [భీమ 2-125] |
| భ్రమించు | [శ్రీ శృం. 3] | భ్రమియించు | [క్రీడా 86] |

10. రెండుపసర్గలతో కూడిన తత్సమ ధాతువులు శ్రీనాథుని భాషయందు విశిష్టముగా కానవచ్చుచున్నవి. ఇవి ఇతర కవులలో విరళము.

| | | |
|---|---|---|
| అభ్యుపగమించు | [<అభి + ఉప + గమ్ + ఇంచు] | [కాశీ 2-151] |
| అభ్యుద్ధరించు | [<అభి + ఉత్ + ధర్ + ఇంచు] | [కాశీ 2-87] |
| అభ్యవహరించు | [<అభి + అవ + హర్ + ఇంచు] | [శృ.నై 6-99] |
| ఉపాశ్రయించు | [<ఉప + ఆ + శ్రయ్ + ఇంచు] | [శివ 3-7] |
| ప్రత్యుద్గమించు | [<ప్రతి + ఉత్ + గమ్ + ఇంచు] | [కాశీ 2-159] |
| సంప్రతిష్ఠించు | [<సమ్ + ప్ర + తిష్ఠ్ + ఇంచు] | [భీమ 3-99] |

సమాస్ఫోటించు [< సమ్ + ఆ + స్ఫోట్ + ఇంచు] [శివ 1-59]
సముద్ధూళించు [< సమ్ + ఉత్ + ధూళ్ + ఇంచు] [కాశీ 7-128]
సమాకంపించు [< సమ్ + ఆ + కంప్ + ఇంచు] [హర 7-61]
వినిర్భేదించు [< వి + నిర్ + భేద్ + ఇంచు] [భీమ 3-36]
సమాస్ఫాటించు [< సమ్ + ఆ + స్ఫాట్ + ఇంచు] [శివ 1-97]
సముత్పాటించు [< సమ్ + ఉత్ + పాట్ + ఇంచు] [శివ 4-36]
సముద్భూషించు [< సమ్ + ఉత్ + భూష్ + ఇంచు] [భీమ 4-91]

11. మూడుపసర్గలతో కూడిన తత్సమ ధాతువులును శ్రీనాథుని భాషలో గలవు
సముద్వీక్షించు [< సమ్ + ఉత్ + వి + ఈక్ష్ + ఇంచు] [కాశీ 3-201]
సముపాశ్రయించు [< సమ్ + ఉప + ఆ + శ్రయ్ + ఇంచు] [హర 6-119]

12. ఈ క్రింది తత్సమ ధాతువులను శ్రీనాధుడు విశిష్టముగా ప్రయోగించెను. ఇట్టివి ఇతర కవులలో విరళము.

1. అభినిర్మించు [< అభి + నిర్మించు] నిర్మాణముచేయు [భీమ 2-75]
'వినిర్మించు' యనుట ప్రసిద్ధము.

2. అభిమర్శించు [< అభి + మృశ్ + ఇంచు] తాఁకు, పొందు [కాశీ 3-26]
సాధారణముగా 'మృశ్' ధాతువునకు 'వి' - 'పరా-' అను ఉపసర్గలు చేర్చి ప్రయోగించుట ప్రసిద్ధము.

3. ఆలిఖించు [< ఆఙ్ + లిఖించు] [చిత్తరువులు] వ్రాయు [శివ 2-53]
గుణాది మార్పులు లేక యిట్లు ప్రయోగించుట శ్రీనాథుని ప్రత్యేకత.

4 ఆస్ఫాటించు : [అగ్నికణములు] మండు [భీమ 4-60]
నిర్భర్త్సించు : తిరస్కరించు [శృ నై 8-72]
ఇట్టి ధాతువులను శ్రీనాధుడు తప్ప తదితర కవులు ప్రయోగింప లేదనియే చెప్పవచ్చును.

5. ఉజ్జృంభించు : చెలరేఁగు [హర 7-63]
'జృంభించు' అను ధాతువునకు 'వి' అను ఉపసర్గతోడి ప్రయోగములు ప్రసిద్ధము శ్రీనాథుడు 'ఉత్' అను ఉపసర్గతో ప్రయోగించుట విశేషము. శ్రీనాథుడు 'జృంభించు' [కాశీ 1-46] విజృంభించు [హర 2-21]

ఉజ్జృంభించు [హర 7-6౦] అను మూడు తత్సమ ధాతువులను ప్రయోగించెను.

6. ఉద్దండించు : అతిశయించు [కాశీ 1-52]
'దండించు' అను ధాతువునకు శిక్షించునని యర్థము. 'ఉత్–' అను నుపసర్గ చేరుట విరళము

7. ఉపస్తరించు : అభిషరించు [భీమ 2-135]

8. గమనించు : [సం.గమ్.వెళ్ళు]
'తుఱంగలి గొన్న సమ్మదముతో గమనింపుము: వెళ్లుము [భీమ 2-156]
నేడిది 'గుర్తించు' అని అర్థపరిణామము చెందినది.

9. చంచలించు : కదలు, చలించు [శృ.నై 1-90]
'సమ్, అను నుపసర్గతో ప్రయోగించుట ప్రసిద్ధము.

10. జ్వాలియించు, తపియించు, తరియించు, దమియించు: శ్రీనాథుడు జ్వాలించు, తపించు, తరించు, దమించు, అనునట్లుగా ప్రయోగింపలేదు '–ఇంచు' అను ప్రత్యయమునకు '–ఇయ్' ఆగమమును జేర్చి జ్వాలియించు [ప వీ 113] తపియించు [భీమ 4-102] తరియించు [కాశీ 2-118] దమియించు [శృ నై 2-9] అని ప్రయోగించెను.

11. ధర్షించు : అవమానించు [హర 3-9] ఇట్టి అప్రసిద్ధమైన తత్సమ ధాతువులనెవ్వరు సాధారణముగా ప్రయోగింపరు.
'మహర్షుల ధర్షించి పితరుల ప్రతిబంధించి, [హర 3-9]

12. నిరీక్షించు : చూచు [శివ 5-17] ఇది ఆధునిక భాషలో 'ఎదురుచూచు' నను నర్థమున వాడుకలో కలదు.

13. పరావర్తించు : మరలించు [కాశీ 4-98] 'వర్తించు' అను ధాతువునకు –ని, నిర్– అను నుపసర్గలు చేరుట ప్రసిద్ధము. కాని శ్రీనాథుడు 'పరా' అను నుపసర్గతో ప్రయోగించుట విశిష్టము.

14. ప్రమోషించు : మోసగించు [కాశీ 6-73] ఇట్టి ధాతువు లితర కవులలో విరళము పైన సూచించునట్టి ధాతువులేకాక విశిష్టమైనవి శ్రీనాథునిలో చాల కలవు. అందు కొన్నింటి నిక్కడ ప్రదర్శింతును.

| | | |
|---|---|---|
| అభివసించు | : కలిసిఉండు [భీమ 6_106] | |
| అవఘుళించు | : వ్యాపించు | [కాశీ 1.44] |
| గుంఫించు | : చెదరకుండు | [భీమ 4-46] |
| గ్రాహించు | : వ్యాపించు | [భీమ 4-58] |
| నిష్టంకించు | : తాకు | [హర 7_86] |
| విహ్వాపించు | : మఱుగు పఱచు | [శృ.నై 1_87] |
| పరిచరించు | : శుశ్రూష చేయు | [కాశీ 4_288] |
| ప్రతారించు | : మోసపుచ్చు | [శృ.నై 8_124] |
| ప్రాశించు | : త్రాగు | [కాశీ 5-223] |
| విఘటించు | . తప్పిపోవు | [శృ.నై 2-66] |
| సాత్కరించు | : గౌరవించు | [శృ.నై 8-108] |
| సాళగించు | . మిళితమగు | [కాశీ 7_186] |

13. ఈ క్రింది ప్రయోగమున '_ఇంచు' ప్రత్యయము చేరకయే పరిణామము నొందుట కనిపించును.

అవధారుదేవ :. [అవధరించు అనుటకు] [శృ నై 8-91]

14. 'ప్రబలు' అను క్రియ తత్సమ ధాతు సామాన్యమై 'ఇంచు' ను గ్రహించి సంశ్లిష్ట ధాతువుకాక సామాన్య ధాతువుగానే తెలుగున నుపయుక్తమగు చున్నది. శ్రీనాథుడు దీనిని పెక్కు పర్యాయములు ప్రయోగించుట దీనిపై నాతనికి గల మక్కువకు నిదర్శనము

అంధకారంబు ప్రబలె [భీమ 2-35]



## 4.4.0 సంయుక్త ధాతువులు (Compound Verbs)

నామరూపమునకుగాని, క్రియాప్రాతిపదిక రూపమునకు గాని, అన్నంతమునకు గాని, విశేషణ రూపమునకుగాని, క్త్వార్థకరూపమునకు గాని, ధ్వన్యనుకరణ శబ్దమునకు గాని, అవ్యయమునకు గాని, అదనముగా నొకటిగాని రెండుగాని అనుబంధ క్రియలు చేరగా శ్రీనాధుని భాషలో సంయుక్తధాతువు లేర్పడుచున్నవి.

| | | | |
|---|---|---|---|
| 1 | మేలు-కను | : నిద్రనుండి లేచు | [కాశీ 4-143] |
| 2. | అరుగు-దెంచు | : వచ్చు | [శృ.నై 5-88] |
| 3. | విన్నఁ-బోవు | : దైన్యము నొందు | [శివ 2-17] |
| 4. | పాడఱు | . నశించు | [భీమ 2-116] |
| 5. | అడచి-పడు | : మండిపడు | [శృ.నై 4-32] |
| 6. | బోరు-కలగు | : శబ్దించు | [శివ 1-64] |
| 7. | జో-కొట్టు | . నిద్రించుటకు జోజో అనితట్టు | [కాశీ 7-95] |

ఒకటి కంటె ఎక్కువ క్రియాప్రాతిపదికలు అనుక్రమము కలిగి సంయుక్త ధాతువులుగా నేర్పడుచున్నవి. ఇది భాషలో శబ్దజాలము నిర్మించుకొను ప్రక్రియ. ఈ సంయుక్త ధాతువులు తఱచుగా విలక్షణార్థమును కలిగియుండును ఇట్టివానినిజాతీయములుగా ప్రయోగార్హములైన సంయుక్త క్రియా ప్రాతిపదికలుగా(idiomatically used compound verbal roots) పేర్కొనవచ్చును. శ్రీనాథుని భాషలో నిట్టి సంయుక్త ధాతువులు 181 అనుబంధ క్రియలతో కూడ 1021 తత్సమాచ్ఛిక ధాతువులు కలవు.

4.4 1 ఇట్టి సంయుక్త ధాతువులు తిరిగి రెండు విధములు.

1. ధాతు పల్లవములు  2. శబ్ద పల్లవములు.

### 4 4.1.1 ధాతుపల్లవములు ;

పూర్వావయవము క్రియాప్రాతిపదికయై యుండి, తరువాతి యవయవములు కూడ ధాతువులై యుండి విలక్షణమైన యర్థమును బోధించు శబ్దముల కూడిక ధాతుపల్లవమని యిట వ్యవహరింపబడినది.

కొనియాడు  పొగడు, స్తుతించు  [శృ.నై 7-9]

[కొను: గ్రహించు, తీసికొను; ఆడు : నర్తించు [ ]

ఇచ్చిపుచ్చుకొను : తిరిగి పుచ్చుకొను [శృ.నై 7-107]
[ఇచ్చు : ఒకనిది మరియొకనికి అధీనము చేయు]
[పుచ్చు : పంపు; కొను : గ్రహించు ]

**4.4.1.2 శబ్ద పల్లవములు :**

పూర్వావయవము క్రియాప్రాతిపదికయే కావలయునను నియమము లేదు. పరావయవము మాత్రము ధాతువే కావలెను.

తలకూడు · సిద్ధించు, నెఱవేఱు [కాశీ 7-124]
[తల : శిరస్సు ; కూడు : చేరు]

కాలూఁదు : కాలుపెట్టు, కాలుమోపు [శృ.నై 5-127]
[కాలు . పాదము; ఊఁదు :గాలితో నిప్పును రేఁగఁజేయు]

నోరూరు : అపేక్ష కలుగు [హర 3-88]
[నోరు : ఆస్యము; ఊరు : లోపలినుండి ద్రవముపైకివచ్చు]

4.4 2 శ్రీనాథుని భాషలో ఈ క్రింది 149 ధాతువులు రెండవ అవయవముగా నుండి 928 ఆచ్ఛిక సంయుక్త ధాతువులైనవి ఇందు ప్రథమాంశము కొన్ని యెడల నామధాతువు,. కొన్నియెడల క్రియాధాతువు. సౌకర్యము నిమిత్తము రెండింటిని కలిపియే గుర్తింతము. [అనుబంధము 3.1.4 చూడుడు.]

| | | |
|---|---|---|
| 1. -అగు | 2. -అగల్చు | 3. -అంటు |
| 4. -అడఁగు | 5. -అడఁచు | 6. -అందు |
| 7. -అంపు | 8. -అమరు | 9. -అఱు |
| 10. -అలరు | 11. -ఆడు | 12. -ఆరు |
| 13. -ఆఱు | 14. -ఆర్చు | 15. -ఇచ్చు |
| 16. -ఇడు | 17. -ఇఱియు | 18. -ఈఁగు |
| 19. ఈఁడు | 20. -ఈను | 21. -ఉండు |
| 22. -ఊఁదు | 23. -ఊరు | 24. -ఊర్చు |
| 25. -ఎక్కు | 26 -ఎగయు | 27. -ఎచ్చు |
| 28. -ఎత్తు | 29 -ఎఱుఁగు | 30. -ఎసఁగు |

| | | |
|---|---|---|
| 31. _ఏఁగు | 32. _ఏయు | 33. _ఏఱు |
| 34. _ఒడ్డు | 35. _ఒత్తు | 36. _ఒనర్చు |
| 37. _ఒందు | 38. _ఒప్పు | 39. _ఓడు |
| 40. _ఓపు | 41. _కట్టు | 42. _కడచు |
| 43. _కదలు | 44. _కను | 45. _కనువు |
| 46. _కఱచు | 47. _కలఁగు | 48. _కలయు |
| 49. _క్రక్కు | 50. _కాంచు | 51. _కుడుచు |
| 52. _కుడుపు | 53. _కురియు | 54. _కుఱు |
| 55. _కూడు | 56. _కూరు | 57. _కూర్చు |
| 58. _కొట్టు | 59. _కొను | 60. _కొలుపు/కొల్పు |
| 61. _గిఱుపు | 62. _గ్రుచ్చు | 63. _చను |
| 64 _చఱచు | 65. _చల్లు | 66. _చాఁచు/సాఁచు |
| 67. _చిక్కు | 68 _చూచు | 69. _చూపు |
| 70, _చూరు | 71. _చెడు | 72. _చేయు |
| 73. _జాఱు | 74. _డించు | 75 _తట్టు |
| 76. _తన్ను | 77. _తప్పు | 78. _తాఁకు |
| 79. _తాఁచు | 80. _తాల్చు | 81. _తిరుగు |
| 82. _తెచ్చు | 83. _తెంచు | 84. _తేరు |
| 85. _తేఱు | 86. _తేలు | 87. _తోఁగు |
| 88. _తోఁచు | 89. _తోలు | 90. _త్రావు |
| 91. _త్రవ్వు | 92. _త్రెవ్వు | 93. _త్రొక్కు |
| 94. _త్రోచు | 95. _త్రోయు | 96. _ధరించు |
| 97. _నడచు | 98. _నాడు | 99. _నిలుచు |
| 100. _నేర్తు | 101. _పండు | 102. _పంపు/పంచు |
| 103. _పట్టు | 104. _పడు | 105. _పఱచు/పఱుచు |
| 106. _పలుకు | 107. _పాపు | 108. _పాయు |
| 109. _పాఱు | 110. _పుచ్చు | 111. _పెట్టు |
| 112. _పెనఁగు | 113. _పెరుఁగు | 114. _పొడుచు |
| 115. _పొంగు | 116. _పొందు | 117. _పోయు |
| 118. _పోలు | 119. _పోవు | 120. _ప్రాము |

| | | |
|---|---|---|
| 121. _మఱఁగు | 122. -మరలు | 123. _మఱచు |
| 124. _మలఁగు | 125. _మాడు | 126. _మాయు |
| 127. _మాలు | 128. _మిగులు | 129. _మిడుచు |
| 130. _మీఱు | 131. _ముట్టు | 132. _ము/డు/ణుఁగు |
| 133. _మెఱయు | 134. _మొగుచు | 135. _మోడ్చు |
| 136. _మొఱఁగు | 137. _మ్రింగు | 138. _రేఁగు |
| 139. _వందు | 140. _వచ్చు | 141. _వలచు |
| 142. _వంచు | 143. _విడుచు | 144. _విరియు |
| 145. _వేయు | 146. _వైచు | 147. _వ్రాలు |
| 148. _సడలు | 149. _సాగు | |

పైవానిలో మొదటి అవ్యవహితావయవమే (immediate constituent) సంయుక్త నిర్మాణమునకు తోడ్పడుచున్నది.

2. సాధారణముగా సంయుక్త ధాతువులు రెండంశములతోనే ఉండును. శ్రీనాథునిభాషలో మూడంశములుగల ఆచ్ఛిక సంయుక్త ధాతువులు 12, అనుబంధ ధాతువులతోకూడి 59, నాలుగంశములు గల ఆచ్ఛిక సంయుక్త ధాతువులు ఒక అనుబంధ ధాతువుతో కూడి 2 గలవు.

| | | | |
|---|---|---|---|
| 1. _ఆడు | : హెచ్చుకుందాడు | : ఎక్కువతక్కువలాడు | [శృ నై 8-91] |
| 2. _ఆరు | : ఇంపెసలారు | : శోభాతిశయమునొందు | [శృ.నై 3_55] |
| 3. _ఇంకు | : ఇట్టింకులింకు | : క్రుంగఁబడు | [భీమ 2-77] |
| 4. _ఊఁగు | : ఉబ్బూఁతలూఁగు | : మిక్కిలి ఊఁగు | [కాశీ 2_51] |
| 5. _ఎఱుఁగు | : ఎండ కన్నెఱుఁగు | : శ్రమపడు | [ప పీ 32] |
| 6. _కొను | : ఓలమాసగొను | : మఱుగున ప్రవేశించు | [శృ.నై 4-97] |
| 7. _చాఁచు/సాఁచు | : చివ్వకుఁజేసాఁచు | : యుద్ధమునకు సిద్ధమగు | [కాశీ 2_99] |
| 8. _చేయు | : పెన్నాటకముచేయు | : అతిశయముగా వంచించు | [భీమ 1_88] |
| 9. _పడు | . ఔరుసౌరుపడు | : క్షీణించు, నశించు | [శివ 2_109] |
| 10. _పాఱు | : వెలవెలఁబాఱు | . తెల్లఁబోవు, వివర్ణమగు | [హర 7-134] |
| 11. _పెట్టు | : పెడచెవుల బెట్టు | . శ్రద్ధతో వినకుండు | [శృ.నై 7-115] |
| 12. _పోవు | : గుజగుజలుపోవు | : రహస్యముగా మాటలాడు | [శృ నై 3_128] |

నాలుగంశములు గల ఆచ్ఛిక సంయుక్త ధాతువు :

(i) _కొను : కూర్చుండబెట్టుకొను : కూర్చుండజేసికొను .[హర 4_72]

3. తత్సమ శబ్దములపై 17 అనుబంధ ధాతువులు చేరి 31 రెండంశముల సంయుక్త ధాతువులగుచున్నవి.

1. _అగు 2. _ఆడు 4. _ఇచ్చు
4. _కట్టు 3. _కొను 6. _చను
7. _చెప్పు 8. _చేయు 9. _తలంచు
10. _తూఁగు 11 _పడు 12. _పఱచు
13 _పెట్టు 14. _పోయు 15. _పోవు
16. _మాలు 17. _వచ్చు

4. ఈ క్రింది రెండనుబంధ ధాతువులు చేరి మూడంశముల తత్సమ సంయుక్త ధాతువులు రెండు శ్రీనాథుని భాషలో కనిపించు చున్నవి

1. _ఆచరించు :

ఉపదర్శనమాచరించు : పెత్తనము చేయు [కాశీ 7_58]

2. _చేయు :

అంగుళి స్ఫోటనము చేయు : చిటికలు వేయు [హర 1_]

4 4.3 1 ఈ క్రింది సంయుక్త ధాతువులకు వ్యతిరేకార్థము నందు ప్రయోగములు గలవు.

| | | |
|---|---|---|
| అలవాయి గొనక | : వెనుదీయక | [భీమ 2_140] |
| ఎడ ద్రెవ్వక | : ఎడతెగక | [శృ.నై 1_90] |
| చూపోపక | . ఓర్వలేక | [శృ నై 6-32] |
| తనివి సనక | . తృప్తినొందక | [శృ నై 7_190] |
| తొలఁగం ద్రోవక | . పరిహరింపక | [శృ.నై 6_127] |
| పసిమి చెడక | : నవకము చెడక | [కాశీ 5_132] |
| ప్రహరి తిరుగక | . చుట్టు తిరుగక | [కాశీ 1_116] |
| బఱివోవక | హద్దు మీఱక | [క్రీడా 168] |
| లెక్కసేయక | . లక్ష్యపెట్టక | [కాశీ 5_62] |

మానక, ఊరక మొదలగు సామాన్యక్రియలు వ్యతిరేకార్థము నందు పరిమితమైన వ్యవహారమున ప్రయోగింపబడినటులుగా పూర్వ ప్రకరణమున గుర్తించితిమి.

2. '_తెంచు' ధాతు వనుప్రయుక్తమై విరుద్ధార్థమును తెల్పును

[అరుగు : వెడలు] అరుగుదెంచు : వచ్చు [శృ.నై 5_88]
[ఏఁగు : వెడలు] ఏఁగుదెంచు : వచ్చు [శృ.నై 3_108]
[చను : వెడలు] చనుదెంచు : వచ్చు [శృ.నై 3_84]
ఇది కొన్ని పదముల కనుప్రయుక్తమై అర్థ విశేషముల నిచ్చును
చొత్తెంచు :ప్రవేశించు [కాశీ 7_68] పుత్తెంచు:పంపజేయు [భీమ 1_90]

3. గరుదాల్చు [అ క్రి] గగుర్పొడుచు [కాశీ 2_149, 3_122] దీనిని వ్యస్తముగాను నన్వయింపవచ్చును. కాని ప్రయోగ బాహుళ్యమును బట్టియు 'గరుదాల్చు' అను రూపమును బట్టియు ప్రత్యేకపదముగా గ్రహింపఁబడినది.

4. వచ్చి వందఱలాడు [క్రీడా 235] అను సంయుక్త ధాతువు 'వచ్చు' ధాతువుతో కలిసియే కానవచ్చుచున్నది.

5 ఒనరు_పెట్టు-కొను [అ.క్రి] : పొంచియుండు [కాశీ 4_133] ఇది 'కొను' తో కలిసియే కనబడుచున్నది.

6 పట్టిపాలార్చు [స.క్రి] పాడుచేయు, ధ్వంసముచేయు [కాశీ 4_267] ఇది పట్టు ధాతు క్త్వార్థకాసమాపక క్రియాపూర్వకముగానే తరచుగా ప్రయోగములందుఁ గానఁ బడుచున్నది.

7; గొడ్డేటి [స.క్రి] గుత్తయెత్తు[చా.పం. 1_138] ఈ అర్థముగల సంయుక్త ధాతువునకు క్త్వార్థమందే ప్రయోగము కనబడుచున్నది.

8. ఉచ్చిపోవ్ [అ.క్రి] చెడునట్లు పలుకు [శృ నై 7_88] ఉచ్చు అను ధాతువునకు తఱచు'పోవు'మున్నగు గమనార్థకధాతువు లనుప్రయుక్తము లగును.

9. ఉబుసుపోవు [అ క్రి] కాలక్షేపమగు [కాశీ 3_165] ఈ యర్థమున పోవు, పుచ్చు అను ననుబంధ క్రియలతో కలిసియే యుండి సంయుక్త ధాతురూప మేర్పడుచున్నది.

10. 'పుచ్చు' అను ధాతువును కొన్ని సకర్మక క్రియల క్త్వార్థక రూపముల కనుప్రయుక్తమగును.

కప్పిపుచ్చు [శృ.నై 1-84] విడిచిపుచ్చు [శృ.నై 1-108]

11. 'చూరు' అనుధాతువు కేవలము'పొగ' శబ్దముతో కలిసియే ప్రయోగమున గలదు. పొగచూరు [శృ.నై 3-161]

12. 'తేఱు' అనుధాతువు 'కడ' పూర్వ శబ్దముతో కలిసి ప్రయోగము నొందు చున్నది.

కడతేఱు : చచ్చు, మరణించు [కాశీ 6-76]

13. 'మొఱఁగు' ధాతువునకు పదబంధము నందే ప్రయోగము కలదు.
కనుమొఱఁగు : కప్పిపుచ్చు [భీమ 1-112]

14 'రజ్జు' ధాతువునకు ఆడు శబ్దము చేరి 'రజ్జాడు' : వ్యర్థవచనములాడు [కాశీ 2-163] అగుచున్నది.

15. 'ముచ్చు' అనుధాతువు 'ముడింగి'తో కలిసి 'ముచ్చముడింగి' [క్రీడా 60] అగుచున్నది.

16. 'అచ్చు, కుమ్ము' అను ధాతువులకు 'కాచు' అనుప్రయుక్తమై 'అచ్చికాచు' [పూచీపడు] [కాశీ 5-125] కుమ్ముకాచు : కుమ్ము దగ్గఱ చలిపోవుటకై శరీరము కాచుకొను [శివ 4-27] అను నర్థముల విశిష్టముగా శ్రీనాథుడు ప్రయోగించెను.

4.4 3 2 ఈ సంయుక్త ధాతువులలో నాగమాదేశాది కార్యములగునని గ్రహింప వలెను

1. ద్రుతప్రకృతికముల పట్ల సరళాదేశము సంభవించును.

ఈడఁబోవు [ఈడన్ + పోవు] వెనుకకు పోవు [శివ 2-39]
కవఁగూడు [కవన్ + కూడు] రెండు కక్షలుగావేర్పడు[కాశీ 6-291]
చేయఁజను [చేయన్ + చను] చేయదగు [శృ నై 4-17]
తలఁపుఁజేయు[తలఁపున్ + చేయు] ధ్యానము చేయు [హర 3-33]
తెప్పలఁదేలు [తెప్పలన్ + తేలు] ఓలలాడు [హర 2-23]

2 ఈ క్రింది వానిలో గసడదవాదేశము వైకల్పికము.

| | | | |
|---|---|---|---|
| ఔడు గఱచు | [శివ 4_57] | తలకూడు | [కాశీ 7_124] |
| ఉజ్జన పేయు | [కాశీ 4_81] | తప్పు చేయు | [శృ.నై 2_61] |
| అరుగు దెంచు | [శృ.నై 5_88] | కడతేఱు | [కాశీ 6_76] |
| తాకట్టు వడు | [కాశీ 4_108] | చెవుడు పడు | [శృ.నై 4_28] |

3. సంధియందు వర్ణవికారము కలుగు చున్నది.
వాక్రుచ్చు [వా + కూర్చు] వచించు [ప.పీ 24]

4. ఒక శబ్దములోని పదమధ్య సంధి (Internal sandhi) సంయోగములో వలె కొన్నియెడల స్వర సంధి యేర్పడుచున్నది

| | | | |
|---|---|---|---|
| పదాంతమందలి అత్తులోపించుట . | ఓలాడు | [ఓల + ఆడు] | [శివ 2_8] |
| | అల్లాడు | [అల్ల + ఆడు] | [హర 7_73] |
| పదాంతమందలి ఇత్తులోపించుట . | అనతిచ్చు | [అనతి + ఇచ్చు] | [భీమ 1_22] |
| పదాంతమందలి ఉత్తులోపించుట | పోరాడు | [పోరు + ఆడు] | [కాశీ 6_310] |
| క్త్వార్థకేకారము లోపించుట : | తూగాడు | [తూగి + ఆడు] | [శృ.నై 3_97] |

5. కొన్నియెడల సమాసముల యందు వర్ణలోపము కలుగు చున్నది
బోసేయు [బోనము + చేయు] భుజించు [క్రీ.పీ 60]

6. కొన్ని సంయుక్త ధాతువులలో ప్రాచీన రూపములే నిలిచి ఉన్నవి.
అరు_దెంచు [ప.పీ 114] ఏ_తెంచు [భీమ 5_123]

ఇందు 'అరుగు, ఏఁగు' అను ధాతువులు స్వతంత్రమైన రూపములు. దేశ్య సమాసములయందు కూడ ఇట్టివి కలవు.

కెమ్_జాయ [శృ.నై 8_156] క్రొ_క్కాఱు [శృ.నై 3_88]

4 4.3.3 క్త్వార్థక, వ్యతిరేక క్త్వార్థక, శత్రర్థక అసమాపక క్రియా ప్రాతిపదికలు 'ఉండు' ధాతువు యొక్క సమాపక క్రియా రూపము అనుబంధముగా చేరి సంయుక్త ధాతువు లగుచున్నవి.

1. క్త్వార్థకము+ఉండు :

పడియుండు [<పడు] [భీమ 5_172]
అడంగియుండు [<అడఁగు] [కాశీ 2_4]

ఒకవ్యాపారము జరిగి పూర్తి అయినది. పూర్తి అయిన స్థితి తరువాతి వరకు సంబంధము కలిగి యుండుటను ఇది తెల్పును

2. వ్యతిరేక క్త్వార్థకము + ఉండు :

విరియకుండు [విరియక + ఉండు] [భీమ 3-87]
వెలువకుండు [వెలువక + ఉండు] [హర 3-12]
ఒక వ్యాపారము జరిగి పూర్తి అయిన దానికి వ్యతిరేకము.

3. శత్రర్థకము + ఉండు :

గ్రుక్కుచు నుండె [<గ్రుక్కుచున్ + ఉండె] [శృ.నై 4-104]
చేయుచు నుండు [<చేయుచున్ + ఉండు] [కాశీ 1-76]
ఇక్కడ వ్యాపారము పరిసమాప్తి కాదు.

4.4.3.4 అన్నంత క్రియల మీద అనుబంధ క్రియలు చేరి భిన్నార్థములలో సంయుక్త ధాతువు లేర్పడుచున్నవి.

1. సంయుక్త ధాతువులగు అన్నంత క్రియపై వచ్చు అనుబంధక్రియ ననుసరించి మూడు విధములుగా విభజింప వచ్చును.

[I] అన్నంత క్రియ ప్రధాన క్రియగా కలిగిన సంయుక్త ధాతువులు.
అనంగూడు [హర 2-64] ఆడఁజొచ్చె [క్రీడా 220]

[II] అనుబంధ క్రియ ప్రధాన క్రియగా (head) కలిగిన సంయుక్త ధాతువులు.

అంపఁజాలు [శృ.నై 6-215] అంటఁగట్టు [ప.పీ 82]

[III] పూర్వాంగము అస్వతంత్రరూపముగా నుండి (bound) అనుబంధము చేరిసంయుక్త ధాతువగుట.

ఒనఁగూడు [కాశీ 2.46] ఒడఁగూడు [కాశీ 3-117]
ఎగఁద్రోసి [హర 7-119] ఈడఁబోవు [శివ 2-39]

2. 'వలయు' ధాతువు సాధారణముగా అన్నంత క్రియల కనుప్రయుక్తమై కానవచ్చు న్యూనక్రియ. ఇది వాక్యము నందలి కర్తతో కాక అన్నంత క్రియతోనే అన్వయము కలిగియుండును.

మంత్రరహస్యంబులు బయలుపడకుండ వలయు [శృ నై 2-98]

3. తుమున్నర్థక రూపములపై 'ఇమ్ము' అనుబంధ క్రియగా చేరునపుడు 'ఇమ్ము' లోని 'మ్ము' లోపించి 'ఇ' కి దీర్ఘము కలుగుట శ్రీనాథునిలో ప్రచురముగ కన్పించు చున్నది.
ఓర్వపై నుప్పిండి యుపవాసముండనీ మగనాలి— [కాశీ 2-83]

4 'పాఱు' ధాతువు అన్నంతములపై ననుబంధముగాచేరును ఆరంభార్థమున అనుప్రయు క్తమగును.
ఎఱ్ఱఁబాఱు [శృ.నై 8-45] తెల్లవాఱు [కాశీ 4-107]
గాజువాఱక [హర 2-118]

5 'పెట్టు' ధాతువు కొన్ని క్రియల అన్నంతరూపముల కనుప్రయుక్తమై వాని ప్రేరణార్థమును తెల్పును.
కూడఁబెట్టు [హర 3-36]

6 కొన్ని సంయుక్త ధాతువులు పర్యాయ రూపత నొందుచుండును.
చెప్పంగబడె . చెప్పంగబడె నిట్లు సిద్ధాంతమందు [ప.పీ 50]
చెప్పఁబడిన . చెప్పఁబడిన యీభాష [శృ.నై 8-202]

7. 'పోవు' ధాతువు తుమున్నంతముల కనుప్రయుక్తమై 'యత్నించు, ఆరంభించు' నను నర్థము నిచ్చుచున్నది.
వెగ్గలంబైన మోపుఁగడువీకన యెత్తఁగఁబోయి ముందటన్ [హర 1-21]

4.4.3.5 'కొను' అన్న అనుబంధము చేరినపుడు ధాతువు కొన్ని మార్పులకు లోనగు చున్నది.

1. 'కొను' ఆత్మార్థకముగా వచ్చినపుడు :
గింజుకొను [శృ.నై 1-103] కాచుకొను [శృ.నై 7-65]
తన్నుకొను [ప.పీ 109] అందుకొను [హర 2-8]
తెచ్చుకొను [శృ.నై 4-112]

2. 'కొను' సామాన్య ధాత్వీకరణమైనపుడు :
ఇవముకొను : బాధనొందు [కాశీ 6-44]

ఉదిలకొను : భయాదులచే చలించు [శృ.నై 4-64]
గేలిగొను : పరిహసించు [శృ.నై 6-6]
పట్టుకొను : గ్రహించు [శృ.నై 1-112]

3. ఈ క్రింది ప్రయోగములలో '-కొను' అనుబంధము లేకయే కొన్ని క్రియలు ఆత్మార్థమున వాడబడినవి.

నా ప్రాణంబు రక్షించెదన్ [రక్షించుకొను] [శివ 3-89]
ఆనవాల్పట్టి తెలిసినయట్లపోలె [తెలిసికొను] [భీమ 5-181]

4. -ఇంచు తో కూడి '-కొను' అనుబంధముగా చేయవలసి యుండగా నట్లు ప్రయోగింపక కేవల క్రియాపదమునే వాడుట శ్రీనాథునిలోని ప్రత్యేకత
చంపెనా దైత్యుని ఒరలంగఁ జంక నిఱికి [ఇరికించుకొను] [కాశీ 6-163]

5. తద్ధర్మార్థక క్రియ యందలి ఉత్తునకు క్రియావిశేషణమునందును సమాపక క్రియా రూపము నందును కూడ లోపము కొన్నియెడల కూర్చినాడు.

తార్కొన్ తారక మండలంబు [తార్కొను] [భీమ 3-93]
కైకొన్విష్ణు రాజర్మిలిన్ [కైకొను] [భీమ 5-110]

6 'అంటుక, 'కొంట' వంటి ప్రయోగములు శ్రీనాథునిలో కలవు.

అంటుక : క్రింద నంటుక సంతరించి [హర 2-115]
అప్పళించుకోఁగలిగెడు [కొనునకు 'కో' ఆదేశము]
[శృ.నై 1-94]

కొంట : మధుకైటభారాతి మఱదిరమ్మని పిల్చి
పనిగొంట నీకుఁ బ్రాభవము గాదె? [శృ.నై 3-126]
చెలిమి సేయుటఁ బగగొంట తెలియనరిది [శృ.నై 3-159]
ఉచితంబయి యుండదు సెప్పికొంట [శృ నై 4-54]
కీర్తికాయంబుఁ గైకొంట కార్తియేల [హర 2-80]

14.56 సంయుక్త ధాతువులు కొన్నిపట్ల నర్థ విశేషము లేకయును, కొన్నిపట్ల నర్థ విశేషము కలిగియును, కొన్ని పదములతో కలిసి శబ్దపల్లవము లగును.

దొరకొను [లభించు] [కాశీ 2-25]
నిండారు [నిండు] [శృ.నై 1-98]

చల్లారు [చల్లఁబడు] [హర 2-131]
ఎసలారు [అతిశయించు] [శృ.నై 7-167]
పెంపారు [వృద్ధినొందు] [శృ నై 1-190]
ఏపారు [అతిశయించు] [శృ.నై 5-149]

**4.4.3.7** అకర్మక ధాతువుల అన్నంతరూపములపై —పెట్టు, —చేయు, —తీయు, —వేయు, —కొట్టు అను సకర్మకానుబంధ క్రియలు చేరి సకర్మక సంయుక్త ధాతు రూపములగు చున్నవి.

+ పెట్టు :

కూరుచుండు [అ.క్రి] + పెట్టు [స.క్రి] కూరుచుండఁబెట్టు [హర 4-97]

+ చేయు :

పడు [అ.క్రి] + చేయు [స.క్రి] పడఁజేయు [శృ.నై 5-188]

+ తీయు :

ఎగు [అ.క్రి] + తీయు [స.క్రి] ఎగఁదీయు [శ్రీ.శృ. 0-37]

+ వేయు :

తెగు [అ.క్రి] + వేయు [స.క్రి] తెగవేయు [ప.పీ 91]

+ కొట్టు :

తెగు [అ.క్రి] + కొట్టు [స.క్రి] తెగఁగొట్టు [ప.పీ 95]
పగులు [అ.క్రి] + కొట్టు [స క్రి] పగులఁగొట్టు [చా మ 1-117]

**4.4.3.8** వైచు :

ఇది కొన్ని సకర్మకముల మీద, స్వార్థమునను, అకర్మకములమీదను ప్రయుక్త మగును.

పడవైచు : విసరివైచు [శృ.నై 8-133]
పాఱవైచు : విసర్జించు [కాశీ 2-110]

## 4.5.0 సార్వనామికానుబంధములు

(Pronominal terminations)

క్రియా ప్రాతిపదికలకు కాలభావ బోధక ప్రత్యయము, పురుష ప్రత్యయము చేరుటచే సమాపక క్రియలేర్పడును శ్రీనాథుని భాషయందలి పురుష ప్రత్యయముల వ్యాప్తి యీ క్రింద వివరింప బడినది

నేను – మేము; నీవు – మీరు· వాడు – వారు; అది – అవి [అమహత్తు] ఇందలి అంత్యవర్ణములు అవశిష్టములై పురుష ప్రత్యయములుగా వ్యవహరించును. ఇందు ఇకారముపై వచ్చినవు డీ ప్రత్యయములు ఇత్వము నొందును. వీనినే సార్వనామికానుబంధములని క్రియా ప్రత్యయములని కూడ అందురు

| | | ఏకవచనము | బహువచనము |
|---|---|---|---|
| 4.5.1 | ఉత్తమ పురుష | –ను, –ని | –ము, –మి |
| | మధ్యమ పురుష | –వు, –వి | –రు, –రి |
| | ప్రథమ పురుష | | |
| | మహద్వాచకము | –ండు, –ను | –రు, –రి |
| | ప్రథమ పురుష | | |
| | అమహద్వాచకము | –ది, –దు –ను | – – |
| | ప్రథమ పురుష | | |
| | మహతీతరామహద్వాచకము | –– | – వి, –వు, –ను |

4.5.1.1 ఏకవచన [ప్రథమేతర] పురుష ప్రత్యయములు పాక్షికముగ లోపించును· ప్రథమ పురుష మహతీతరామహద్వాచక బహువచనము [–ను] లోపము పాక్షికము. [ఏకవచన ప్రత్యయ రూపముతో సదృశమే]

ఉత్తమ పురుషైక వచనము :

చేసితి – $\phi$ [హర 7–96] చెప్పితి – $\phi$ [భీమ 4–207]
చేయుదు – $\phi$ [కాశీ 6–47] వేఁడెద – $\phi$ [కాశీ 6–47]
ఇత్తు – $\phi$ [శివ 3–85]

మధ్యమ పురుషైక వచనము :

చేసితి - φ [కాశీ 4-108] చెప్పితి - φ [శృ.నై 1-14]
చెఱచితి - φ [హర 7-52] వచియింతు - φ [కాశీ 1-13]
భాషింతు - φ [కాశీ 1-13] వాక్రుత్తు - φ [కాశీ 1-13]
పరిభవింతు - φ [కాశీ 1-13]

ప్రథమ పురుషైక వచనము : [మహతీతరామహద్వాచక బహువచనము]

ఉండు - φ [హర 6-23] ఒసఁగు φ [భీమ 3-83]
అయ్యె - φ [కాశీ 5-294] ఇచ్చె - φ [కాశీ 5-294]
చేసె - φ [శృ.నై 4-12]

**4.5.1.2** కొన్ని సందర్భములలో మధ్యమ పురుషైక వచనమున -వు ప్రత్యయము యొక్క వకారము లోపించును.

ఆడెదు [<ఆడెదవు] [హర 7-57]
ఏడ్చెదు [<ఏడ్చెదవు] [శివ 2-25]
చేసెదు [<చేసెదవు] [హర 7-15]
పొందెదు [<పొందెదవు] [కాశీ 4-37]



## 4.6.0 సామాన్య సమాపక క్రియలు (Simple Finite Verbs)

### కాలభావ బోధక ప్రత్యయములు (Tense_mood Suffixes]

సమాపక క్రియలకు చేరు కాలభావ బోధక ప్రత్యయములును వానికిగల రూపాంతరములును ఈ క్రింద చూపఁబడు చున్నవి

## 4.6.1 భూతకాలిక ప్రత్యయములు : -ఇతి-/-టి-; -ఎ-;-ఇ-

4.6.1.1. ఉత్తమ, మధ్యమ పురుషైక బహువచన ప్రత్యయములైన -ని, -మి, -వి, -రి లకు పూర్వము భూతకాలిక -ఇతి- ప్రత్యయము వచ్చును.

ఇచ్చు + ఇతి + ని > ఇచ్చితిని ఉత్తమ పురుషైక వచనము [భీమ 5-81]
చేయు + ఇతి + మి > చేసితిమి ఉత్తమ పురుష బహువచనము [శృ.నై 3-46]
ఇచ్చు + ఇతి + వి > ఇచ్చితివి మధ్యమ పురుషైక వచనము [హర 6-19]
పోవు + ఇతి + రి > పోయితిరి మధ్యమ పురుష బహువచనము [శృ నై 7-103]

4.6.1 2 అన్వాది నాలుగవ తరగతికి చెందిన ధాతువుల ఉత్తమ, మధ్యమ పురుషైక బహువచన ప్రత్యయములకు పూర్వము భూతకాలిక పర్యాయరూప ప్రత్యయమైన -టి- వచ్చును

**ఉత్తమ పురుషైక వచనము :**

అం-టి-$\phi$ [హర 6-38] అం-టి-ని [శృ. నై 4-104]
కం-టి-$\phi$ [హర.పీ 9] కం-టి-ని [హర.పీ 9]
మం-టి-$\phi$ [హర.పీ 9] మం-టి-ని [భీమ 3-102]
విం-టి-$\phi$ [హర పీ 9] విం-టి-ని [భీమ 2-120]

**ఉత్తమ పురుష బహువచనము :**

కం-టి-మి [శృ.నై 3-101] కొం-టి-మి [భీమ 5-36]
విం-టి-మి [శివ 3-6]

**మధ్యమ పురుషైక వచనము :**

అం-టి-$\phi$ [కాశీ 6-82] విం-టి-వి [కాశీ 7-22]
కొం-టి-$\phi$ [హర 1-27] కొం-టి-వి [కాశీ 6-24]

మధ్యమ పురుష బహువచనము :

కం-టి-రి [భీమ 2-124] కొం-టి-రి [భీమ 2-124]

విం-టి-రి [హర 4-56]

'చను' ధాతువునకు నీ ప్రత్యయము [టి] కలుగదు.

4.6.1 3 ప్రథమ పురుషైక వచనమునకు, మహతీతరామహద్వాచక బహువచనమునకు పూర్వము భూతకాలిక ప్రత్యయమైన -ఎ- వచ్చును.

చేసెను [మహద్వాచక ప్రథమ పురుషైకవచనము] [హర 3-33]

వచ్చెను [మహతీవాచక ప్రథమ పురుషైకవచనము] [హర 7-110]

చేరెను [మహతీతరామహద్వాచక ప్రథమ పురుషైక వచనము] [శృ.నై 6-81]

అఱచెను [మహతీతరామహద్వాచక ప్రథమపురుష బహువచనము] [హర 2-18]

4 6 1.4 మహన్మహతీవాచక ప్రథమ పురుష బహువచనమునకు పూర్వము భూతకాలిక -ఇ- ప్రత్యయము వచ్చును.

చేసిరి [మహన్మహతీవాచక ప్రథమ పురుష బహువచనము] [హర 7-62]

## 4.6.2 తద్ధర్మార్థక ప్రత్యయములు : -ఎడు-, -ఢ-, -ఎద-/-దు ౦ తు ౦ ద్.

4.6.2.1 ప్రథమ పురుషైక వచన ప్రత్యయములకు పూర్వము -ఎడు- వచ్చును.

పడియెడును [ప్రథమ పురుషైక వచనము] [కాశీ 4-270]

మనిపెడును [ప్రథమ పురుషైక వచనము] [హర 3-25]

4 6.2.2 తద్ధర్మార్థకము ప్రథమ పురుషైక వచన మహతీతరామహద్వాచక బహువచన ప్రత్యయములకు పూర్వము కాలభావ బోధక ప్రత్యయ రహితముగ నుండును.

చేయు-ను [కాశీ 7-128]

4.6.2 3 ఉత్తమ, మధ్యమ పురుషైక బహువచనములకు, మహన్మహతీ వాచక ప్రథమ పురుష బహువచనమునకు పూర్వము తద్ధర్మార్థక ప్రత్యయమైన -ఎద వచ్చును.

| | | |
|---|---|---|
| వచ్చెదను | [ఉత్తమ పురుషైక వచనము] | [హర 7-27] |
| వచ్చెదము | [ఉత్తమ పురుష బహువచనము] | [హర 6-98] |
| చేసెదవు | [మధ్యమ పురుషైక వచనము] | [హర 7-20] |
| ఆడెదరు | [మధ్యమ పురుష బహువచనము] | [భీమ 4-53] |
| చేసెదరు | [ప్రథమ పురుష బహువచనము మహన్మహతీ వాచకము] | [హర 7-149] |

4 6.2.4 నన్నయలో -ఎడు, -ఎడి అను ప్రత్యయములతో కూడిన తత్సమ ధాతు నిర్మాణము కన్పింపదు[1] నన్నెచోడుని యందు -ఎడు, -ఎడి అను ప్రత్యయములు 27:1 నిష్పత్తిలో కానవచ్చును[2] నన్నెచోడునితో ప్రారంభమై తిక్కనాదుల యందీవిధమైన ప్రయోగము విస్తృతి నొందుట గమనింపదగిన విషయము తత్సమ క్రియలకు -ఎడు, -ఎడి అను ప్రత్యయములు శ్రీనాథుని యందును కలవు

ఉల్లసిల్లెడు [కాశీ 2-10] తేజరిల్లెడు [భీమ 3-35]

4.6.2.5 తద్ధర్మార్థక/భవిష్యత్కాల ప్రత్యయమైన -దు, -తు- ఉత్తమ మధ్యమ పురుషైక వచన మహన్మహతీ ప్రథమ పురుష బహువచన ప్రత్యయములకు ముందు వచ్చును. చువర్ణాంత ధాతువులపై వచ్చు తద్ధర్మార్థక 'దు' ప్రత్యయము వెనుకటి 'చు' తో సమీకరణము నొంది 'తు' అని యగును మిగిలిన పరిసరములందంతట 'దు' ప్రత్యయము వచ్చును

| | ఉత్తమ పురుషైక వచనము | | ఉత్తమ పురుష బహువచనము | |
|---|---|---|---|---|
| -దు- · | చేయుదును | [కాశీ 7-80] | చేయుదుము | [హర6-108] |
| -తు- : | కాంతును | [కాశీ 6-54] | కావింతుము | [భీమ 4-189] |

1. వి. చినసీతారామశాస్త్రి : వ్యాకరణ సంహితా సర్వస్వము, పుట 1373.

2 Dr. L B. Sankara Rao : A study of Language of Nannechodadeva's Kumara sambhavamu. unpublished thesis of S.V.University.

| | | | |
|---|---|---|---|
| కుడుతును | [హర2_53] | ఆచరింతుము | [శివ 1_103] |
| చూతును | [కాశీ 6_21] | కొలుతుము | [కాశీ 2_6] |

| | మధ్యమ పురుషైక వచనము | | మధ్యమపురుష బహువచనము | |
|---|---|---|---|---|
| -దు- | ఎఱుంగుదువు | [భీమ 5_53] | ఎఱుంగుదురు | [హర 4_8] |
| -తు- | అనుభవింతువు | [భీమ 5_53] | చూతురు | [శృ.నై 1_69] |
| | | | ప్రథమపురుష బహువచనము | |
| -దు- | మహన్మహతీ వాచకము | | చేయుదురు | [భీమ 5_53] |
| -తు- | మహద్వాచకము | | కాంతురు | [కాశీ 3_106] |
| | మహన్మహతీ వాచకము | | చూతురు | [భీమ 5-170] |

4 6.2.6 బిందువు మీది చకారమునకు పకారము వచ్చుటచే సమీకృత రూపమైన తకారము వారింపబడినది.

అభివసింపుదము [భీమ 6_107] దర్శింపుదము [భీమ 6_107]

4 6 2 7 -చ్చ్ వర్ణాంత ధాతువులకు తద్ధర్మ ప్రత్యయమైన -తు పరమైనపుడు -త్త్ ఆదేశముగా నగును. సాధారణముగా నొకే హల్వర్ణమునకు పూర్వము అదేహల్లు ద్విత్వము నొంది యుండుటను భాష యంగీకరింపదు కావున ద్విత్వము ఒక వర్ణమును కోల్పోవును.

నొచ్చ్- > నొత్త్ - నొత్- [తద్ధర్మ/భవిష్యత్కాలములకు ముందు]
-తు- > నొత్ - తు_ము [శివ 4_61]
మెచ్చ్- > మెత్త్ - మెత్- [తద్ధర్మ/భవిష్యత్కాలములకు ముందు]
-తు- > మెత్తు- రు [కాశీ 3_65]

4.6.2.8 అను, కొను, మొదలైన నాలుగవ తరగతి ధాతువులకు బదులుగా వచ్చు 'అన్, కొన్' అనువానికి 'దు' అను కాలభావ బోధక ప్రత్యయము మధ్యమపురుష బహువచనమున మహన్మహతీ ప్రథమా బహువచన ప్రత్యయమైన 'రు' కు పూర్వము చేరును

అను - దు - రు > అన్ - దు - రు > అందురు [భీమ 1_15]
కొను - దు - రు > కొన్ - దు - రు > కొందురు [శృ.నై 3-126]

**4.6.2.9 _ద్_ ప్రత్యయము :**

మహన్మహతీ ప్రథమ పురుష బహువచనము : ఉం _ ద్ _ రు [హర 1_13]

కం _ ద్ _ రు [హర 4_63] కొం _ ద్ _ రు [కాశీ 6_87]

4.6.2.10 అన్వాదులకు 'దు' ప్రత్యయము చేరినపుడు నన్నయలో 'అండ్రు', 'కొండ్రు' ఇత్యాది మూర్ధన్యయుత రూపములే కనబడు చున్నవి. శ్రీనాథునిలో రెండు రూపములును గలవు.

కొండురు [భీమ 4_33] కొండ్రు [హర 5_10]
అండ్రు [హర 2_55] కండ్రు [కాశీ 7_74]
ఉండ్రు [కాశీ 3_115]

4.6.2.11 ఈ క్రింది ఉదాహరణములలో శత్రర్థక చువర్ణమునకు ముందు, ధాత్వీకరణ ప్రత్యయము '_ఇంచు'నకు బదులు '_ఇంపు' వాడెను

వీక్షింపుచున్నాఁడవు [కాశీ 7_74] ప్రహర్షింపుచున్నాఁడో [శివ 3_15]
మన్నింపుచున్నవాడు [శివ 2_109] ప్రభవింపుచునుండును [శివ 2_11]

2 ఈ క్రింది క్రియారూపములలో _ఇంపునకు బదులు _ఇంచు ప్రత్యయమును వాడెను.

సంస్తుతించంగ [శివ 1_60] ఆక్రమించ [శివ 1_95]

3. 'చేరు': అను అకర్మక క్రియ సాధారణముగ సకర్మకమగునపుడు _పుగాగమము వచ్చును. కాని ఈ క్రింది ఉదాహరణమున _చు అదనముగా వచ్చుచున్నది.

చేర్చంగ [కాశీ 1_37]

**4.6.3.1** ఉభయప్రార్థనమున : (Hortative)_ద_/_త_ అను ప్రత్యయములు వచ్చును.

చేయు_ద_ము [భీమ 4_173] కుడు_త_ము [హర 2_132]
అభిషేకిం_త_ము [భీమ 6_107] వీక్షి_ంత_ము [భీమ 3_34]
అవగాహిం_త_ము [భీమ 6_106]

4 6.3.2 'పో' అను ధాతువునకు యుష్మద్వాచకమునకు ప్రార్థనాద్యర్థమున -ద- పరమైనచో ధాతువు పొ-/ప-గ రూపాంతరత చెందును.

ప-ద-ము/పొ-ద-ము

| | | |
|---|---|---|
| పదమా | . పదమా షట్పదమాలికా పరిలసత్ | [భీమ 4-176] |
| పొదమ | : ప్రొద్దువోకుండ, ముందట బొదమనీవు | [శివ 3-101] |
| పొదము | : 'అలసః 'పొదమవ్వలికి' నంచుఁ బలుకుటయును | [శృ.నై 5-39] |
| పొదపొదము : | పొదపొదమని సొవిదల్లులు హస్తపల్లవంబులు- | [కాశీ 6-227] |
| పొదండు | : పొదండు పొదండని పోయిరి | [శృ.నై 7-122] |

**4.6.4** వ్యతిరేకార్థమున -అ- అను కాలభావబోధక ప్రత్యయమునకు రూపాంతర ప్రత్యయముగ దీర్ఘము మీద -φ- వచ్చును.

| | | | |
|---|---|---|---|
| కానఁడు | [శృ.నై 4-25] | చేయఁడు | [శృ.నై 4-32] |
| రా-φ-డు | [భీమ 2-149] | పో-φ-డు | [శృ.నై 2-86] |

**4.6.5.1** నిషేధార్థకమున 'అకు' అను కాలభావబోధక ప్రత్యయమునకు రూపాంతర ప్రత్యయముగ దీర్ఘము మీద -కు- వచ్చును.

| | | | |
|---|---|---|---|
| చేయకు | [శృ.నై 2-77] | చేయకుము | [శృ నై 2-130] |
| చూడకు | [హర 7-64] | చెప్పకుము | [కాశీ 5-12] |
| పో-కు-ఁడు | [శివ 4-64] | | |

4.6.5.2 'వెఱచు' ధాతువునకు నిషేధార్థమున 'వెఱవకుము' [కాశీ 5-71]

ఇదియేకాక, వ్యతిరేక క్త్వార్థకరూపముపై 'ఉండు' చేరుటచేత నిషేధార్థక మేర్పడును.

'వెఱవకుండుఁడు' [కాశీ 5-310] అని యగును.

4.6.5.3 'వలచు' ధాతువు నిషేధార్థమున 'వలదు' [శృ.నై 2-57] అను రూపమును పొందును.

4.6.6.1 విధ్యర్థకమున -ఉ- అను కాలభావబోధక ప్రత్యయమునకు రూపాంతర ప్రత్యయముగ -φ- వచ్చును

| | | | |
|---|---|---|---|
| వినుము | [శృ నై 3-46] | పోయింపుఁడు | [హర 2-93] |
| పో-φ-మ్ము | [భీమ 2-153] | పో-φ-ండు | [కాశీ 6-236] |

4.6.6.2 అన్నంతములపై -వలయు ననుబంధము చేరుటచే విధ్యర్థక రూప మేర్పడుచున్నది

క్షీరాంభోధి మథింపఁగా వలయున్ [భీమ 4-56]

తుహినామృత కిరణ ధరుని దర్శింప వలెన్ [భీమ 3-156]

4.6.6.3 'కొను' ధాతువు వ్యతిరేక రూపములయందు 'కో-' గా పర్యాయరూపత నొందును.

| | | | |
|---|---|---|---|
| పేర్కోని | [శృ.నై 1-62] | కైకోని | [శృ.నై 5-182] |
| కైకోక | [శివ 4-61] | కైకోవు | [కాశీ 4-69] |
| కైకొనదు | [కాశీ 5-317] | కైకొంటి | [హర 7-144] |
| కైకొంద్రు | [కాశీ 1-52] | కొనన్ | [హర 2-136] |
| కొనుము | [భీమ 6-48] | కైకొమ్ము | [భీమ 6-68] |

[<కైకొన్ - [ఉ] -ము]

ఉత్తు లోపించి వర్ణసమీకరణము నొందగా 'కైకొమ్ము' అను రూప మేర్పడినది.

కొనుఁడు [శృ.నై 7-73]

4.6.7.1. ఆశీరాద్యర్థక ప్రత్యయములు : -ఎడు-, -త-

| | | | |
|---|---|---|---|
| మేలయ్యెడు | [హర 3-19] | కలుగుంగావుత | [భీమ 5-23] |
| ప్రోచుఁగావుత | [కాశీ 3-3] | | |

4.6.7.2. 'ఎడు' 'త' ల ద్రుతంబున కచ్చుపరంబగునపుడు మకారంబగు
[బాల-క్రియా -28]

కార్యసిద్ధియయ్యెడు - మని [శృ.నై 3-75]

పునర్దర్శనంబు నయ్యెడు - మని [హర 3-53]

పునస్సమాగమంబగుఁగాత - మని [హర 4-56]

ఒసఁగుఁగాత - మభ్యుదయంబుల్ [భీమ4-170]

ఆంధ్ర శబ్ద చింతామణిలో ఈ ప్రత్యయము 'డుమ' అని చెప్పబడినది. తిక్కనలో :

వివేక మెడలి యుండెడును కప్పలు [అను 3-143]

ప్రసన్నుఁడయ్యెడును నాకు [శాంతి 1-4]

శ్రీనాథునిలో నిట్టివి లేవు.

4.6.7.3- కాక చేర్పబడిన తద్ధర్మార్థక క్రియా రూపములు ఆశీరాద్యర్థకమును తెలుపును

మోక్షమును బొందుదురు గాక [భీమ5-22]



## 4.7.0. సంయుక్త సమాపక క్రియలు
(Compound Finite Verbs)

శ్రీనాథుని భాషయందు సంయుక్త సమాపక క్రియలను నాలుగు తరగతులుగా విభజింప వచ్చును.

### 4.7.1. అసమాపక క్రియకు 'వాఁడు' 'అది' అనువాని రూపభేదములు చేరుట.

4.7.1.1 భూతకాల ధాతుజ విశేషణము నుండి భూతకాలమేర్పడుట

| | ఏకవచనము | | బహువచనము | |
|---|---|---|---|---|
| ఉ.పు.మహ. | చేసిన-వాఁడను | [హర 7-184] | ఉన్న-వారము | [కాశీ 7-141] |
| | చేసినాఁడను | [భీమ 5-45] | | |
| ఉ.పు.అమహ. | ఉన్న-దానను | [కాశీ 3-62] | — | |
| మ.పు.మహ. | తలఁచిన-వాఁడవు | [శృ.నై 4-6] | | |
| | చెప్పినాఁడవు | [కాశీ 1-13] | — | |
| మ.పు.అమహ. | ఉన్న-దానవు | [కాశీ 4-102] | — | |
| ప్ర.పు.మహ. | వచ్చిన-వాఁడు | [కాశీ 7-61] | — | |
| ప్ర.పు.మహన్మహతీ. | — | | తలఁచిన-వారు | [ప.పీ 50] |
| | | | ఉన్న-వారలు | [కాశీ 4-167] |
| ప్ర.పు అమహ. | జన్మించిన-యది | [శృ నై 2-65] | — | |
| ప్ర.పు.మహతీ.మహ. | — | | చేసినయవి | [హర 2-59] |
| ప్ర.పు.అమహ. | ఉన్నయది | [శృ.నై 5-28] | ఉన్నయవి- | [శృ.నై 2-63] |
| | ఉన్నది | [కాశీ 3-201] | ఉన్నవి | [భీమ4-31] |

4.7.1.2 తద్ధర్మార్థక ధాతుజ విశేషణము నుండి తద్ధర్మార్థక మేర్పడుట.

| | | | | |
|---|---|---|---|---|
| ఉ.పు.మహ. | చెప్పు-వాఁడ | [కాశీ 4-35] | చేయు-వారము | [ప.పీ 86] |
| ఉ.పు.అమహ. | ధరించు-దానను | [కాశీ 5-165] | — | |
| మ.పు.మహ. | వచ్చు-వాఁడవు | [కాశీ 7-199] | — | |
| ప్ర.పు.మహ. | చేయు-వాఁడు | [శృ.నై 7-158] | | |

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్ర.పు.మహన్మహతీ. | — | చేయువారు [భీమ 4-159] |
| ప్ర.పు. అమహ. | చేయు-నది [శృ నై 1-103] | — |
| ప్ర పు.మహతీ.మహ. | — | చేయునవి [భీమ 5-9] |

4.7 1.3 వ్యతిరేక ధాతుజ విశేషణము నుండి వ్యతిరేకార్థక మేర్పడుట.

| | | |
|---|---|---|
| ప్ర.పు.మహ. | చూడని-వాఁడు [ప.వీ 90] | — |
| ప్ర.పు.మహన్మహతీ. | — | చేయనివారు [కాశీ 2-164] |

## 4.7.2 అసమాపక క్రియకు సమాపక క్రియారూపమగు క్రియ అనుబంధముగానుండి 'వాఁడు' 'అది' అనువాని రూప భేదములు చేరుట.

4.7.2.1 శత్రర్థకమునకు 'ఉండు' అను సమాపక క్రియానుబంధమునకు పరముగ 'వాఁడు' 'అది' అను వాని రూప భేదములు చేరి వర్తమాన కాలమేర్పడుచున్నది.

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ఉ.పు.మహ. | ఏతెంచు-చుఉన్న-వాడ [శృ.నై 7-98] | వచ్చు-చు-ఉన్న వారము [శృ.నై 7-101] |
| మ.పు.మహ | ఏడుచు-చు-ఉన్న-వాడవు [భీమ 2-116] | — |
| మ పు.అమహ. | చేయు-చు-ఉన్న-దానవు [కాశీ 4-102] | — |
| ప్ర.పు మహ. | చేయు-చున్-ఉన్న-వాఁడు [శృ.నై 4-69] | — |
| ప్ర పు మహన్మహతీ. | — | వచ్చు-చు-ఉన్న-వారు [శృ.నై 2-98] |
| ప్ర.పు అమహ | వచ్చు-చు-ఉన్న-అది [శృ.నై 2-22] | |
| | వచ్చు-చు-ఉన్న-అది [క్రీడా 87] | |
| ప్ర.పు.మహతీ.మహ. | — | వచ్చు-చు-ఉన్న-యవి [క్రీడా 227] |

ఈ నిర్మాణములో నున్న ప్రథమ పురుష ఏకవచన రూపమగు 'వాఁడు' లోని 'వ'కారము పాక్షికముగ నన్నయకు తరువాతి భాషలో లోపించు చున్నది.

చింతించు-చు-ఉన్నా-డ [భీమ 4-124]

ఉన్న - అను క్రియా విశేషణమునకు 'వాఁడు' చేరగా 'ఉన్నవాఁడు, అను రూపమేర్పడును. శ్రీనాథునిలో దీని హ్రస్వీకరణ రూపములు కనిపించు చున్నవి.

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ఉత్తమ పురుష | — | ఉన్నాము [వ.వి 79] |
| మధ్యమపురుష | ఉన్నావు [శివ 2-109] | ఉన్నారు [శృ నై 5-76] |
| ప్రథమ పురుష | ఉన్నాఁడు [భీమ 4-19] | ఉన్నారు [కాశీ3-138] |

4.7.2.2 భవిష్యత్కాలము :

1 అన్నంతములకు 'కల' అను న్యూన సమాపక క్రియానుబంధమునకు పరముగ 'వాఁడు, అది' అనువాని రూప భేదములు చేరి భవిష్యత్కాల మేర్పడు చున్నవి.

1. ఈ బోటికి భర్త కాఁగలఁడు సోమకిరీటుఁడు [హర 3-26]
2. మీకార్యంబు సంఘటింప గల వాఁడు [కాశీ 2-29]
3. దర్శింపంగల వాఁడనని పల్కు [శృ.నై 7-98]
4. వక్కాణింపం గల వాఁడవు [కాశీ 3-51]
5. ఎబ్బంగి నీఁదఁగల దానవు [శృ.నై 1-110]

2. కల- అను న్యూన సమాపక క్రియకు పురుష ప్రత్యయములు చేరుటచే భవిష్యదర్థక రూపములు తెలుగున 14వ శతాబ్దినుండి కనబడుచున్నవి.

జిష్ణునకు నేను బరిచర్య సేయఁగలను [శృ.నై 3-130]

3. కలుగు- అను సమాపక క్రియ నుండి కల- అను న్యూన క్రియ ఏర్పడినది. 14వ శతాబ్ది తరువాత సకర్మక క్రియగా 'కలుగు' తోడి ప్రయోగములు లేవు. దీనిని బట్టి అది ప్రాచీన రూపముగా గు రింప వచ్చును. అకర్మక క్రియ మాత్రమే నిలిచి అనుబంధ క్రియగా నుండి భవిష్యదర్థము కంటె అధికముగా సామర్థ్యార్థము(ability)నిచ్చుచున్నది

ఛేయఁగల వాఁడనేను నీ చెప్పినట్లై [కాశీ 7-172]

## 4.7.3 అసమాపక క్రియకు సమాపక క్రియా రూపమగు అనుబంధక్రియ చేరుట.

**4.7.3.1** కర్మణ్యర్థకము : (Passive voice)

అన్నంతములకు పడ్వనుబంధము చేరుటచే కర్మణ్యర్థక రూపమేర్పడు చున్నది.

ఈక్షింపఁబడియె [శృ.నై 5-39] ఖండింపఁబడియె [కాశీ 1-190]
వివరింపఁగాఁబడియె [భీమ 3-13] పరిపాలింపఁబడిరి [కాశీ 6-89]

కర్మార్థక ప్రయోగము ద్రావిడ భాషలలో చాల తక్కువగా వినిపించును. నన్నయ భాషయందిట్టి ప్రయోగములు మొత్తము 59 మాత్రమే కలవని ఆంధ్ర భాషా వికాసకారులు పరిగణించిరి. సంస్కృత భాషయందు కర్మార్థక ప్రయోగము విరివిగా కలదు. అట్టియెడల అనువాద సమయమున ఆ విధానము సందుచేసికొనుటకు తప్పక యత్నించును. అంతేగాక ఛందోరచనమున నొక్కొకపుడు కర్మార్థకము సౌకర్య కారణమగును. ఐనప్పటికిని నన్నయ దానికి చాల వఱకు పరిహరించె ననియే చెప్పవలయును. వెగడుపడు, వెలువడు, ఏర్పడు, ఎఱుక పడు – మున్నగు స్థలములందు పడుశబ్ద ముపయుక్తమైనది అయినను ఇది కర్మార్థమును కాక కర్త్రర్థమునే బోధించు చున్నది.[1]

**4.7.3.2** ఆత్మనేపదార్థకము : (Reflexive)

ఒక కార్యమాత్మనేపదార్థమున కలుగుచున్నదని తెలుపుటకు ధాతువులపై 'కొను' ధాతువనుప్రయుక్తమగును. క్త్వార్థమునకు సమాపకక్రియా రూపమగు అనుబంధ క్రియ 'కొను' చేరగా ఆత్మనేపదార్థక మేర్పడు చున్నది.

| | | |
|---|---|---|
| ఉ.పు. ఏక. | లెస్స పనిఁజేసి కొంటి | [శృ.నై 6-110] |
| | గ్రీష్మయామిని యని యేను గేలిగొంటి | [శృ.నై 8-81] |
| ప్ర.పు.ఏక | దోఁచి కొనియె | [కాశీ 4-64] |
| | శివునిచే నెఱిఁగి కొనియె | [భీమ 2-77] |

1. స్వార్తిశ్రీ : తెలగుభాషా చరిత్ర, పుట 40౯.

పిల్చి కొనియె [శృ.నై 7-22]
ప్ర.పు.బహు. చేతులు పిసికి కొనిరి [కాశీ 7-77]

1. క్త్వార్థకము కానివానికి కూడ 'కొను' చేరి ఆత్మనే పదార్థక మేర్పడును.
తారు తము కాచుకొనరే ఈ రసమున [శృ.నై 7-65]

2. కొన్ని క్రియా ధాతువులు కొన్వనుబంధము లేకుండగ ప్రయోగింప బడినవి.

తద్విలాసమున్ మిలికిగఁజేసి, మన్మథుఁడు [చేసికొని] [శృ.నై 2-109]
నాక ప్రముఖులగు బర్హిర్ముఖులనోన్యాన్య
ముఖావలోకనంబు సేసి [చేసికొని] [శృ.నై 7-122]
ఆలింగనమ్మ పేసెం బాలిండ్లనుముట్ట [చేసికొనె] [కాశీ 5-156]
ప్రిదిలిన నీవిఁగేల సవరించు తలోదరి [సవరించుకొని] [శృ.నై 3-86]

4.7.3.3 వ్యతిరేక క్త్వార్థకము :

వ్యతిరేక క్త్వార్థకమునకు 'ఉండు' ధాతువు యొక్క సమాపక క్రియా రూపము అనుబంధముగా చేరగా వ్యతిరేక క్త్వార్థక మేర్పడుచున్నది.

మిన్నక ఉండెన్ [శృ.నై 3-128] పలుక కున్నాడు [వ.పీ 92]
చేయకుండుము [కాశీ 4-300]

4.7.3.4 అన్నంత క్రియపై సమాపక క్రియానుబంధము చేరినపుడు అనుమతి, నిషేధము, విధి, వ్యతిరేకార్థము వచ్చును.

చేయ-నిమ్ము [శృ.నై 4-91] చేయ-వలదు [కాశీ 2-74]
చేయ-వలయును [హర 7-147] కొనియాడ-నేరరు [శృ.నై 1-17]

## 4.7.4 సమాపక క్రియకు సమాపక క్రియారూపమగు అనుబంధ క్రియ చేరుట.

4.7.4.1 వ్యతిరేకార్థకము :

వ్యతిరేక సమాపక క్రియకు 'అగు' ధాతువు యొక్క సమాపక క్రియా రూపము అనుబంధముగా చేరగా వ్యతిరేకార్థక మేర్పడుచున్నది. ఇందలి క్రియా

రూపములు వ్యతిరేకమునందలి కాలములను సూచించును సామాన్య వ్యతిరేకమట్టి కాలములను స్పష్టముగా సూచింపదు.

నీ మాట వినన్ - ఒల్లము [శృ.నై 8-48]

భూతకాల బోధకము :

కానరాదయ్యేన్ [కాశీ 3-215] కానఁడయ్యేన్ [కాశీ 5-131]

4.7.4.2 వర్తమానార్థక వ్యతిరేకము :

భావార్థక 'ట' ప్రత్యయరూపమునకు 'లేదు' చేర్చగా వర్తమానార్థక వ్యతిరేక మేర్పడును.

మ్రొక్కు-ట-లేదు [శృ.నై 8-44] అరయు-ట-లేదు [వ.పీ 97]
వచ్చు-ట-లేదు [వ.పీ 116]

## 4.7.5 నామిత క్రియలు : (Appellative Verbs)

4.7.5.1 విశేష్యములకు ఉత్తమ మధ్యమ పురుష ప్రత్యయములు చేరుటచే నామిత క్రియలగుచున్నవి. వీనినే విధేయ విశేషణములని వైయాకరణులనిరి.

ఉత్తమ పురుష : హితుఁడ-ను [శృ.నై 2-66]
మధ్యమపురుష : యోగీశ్వరుండ-వు [హర 3-22]

4.7.5.2 ప్రథమ పురుష యందు నామితక్రియ లేవిధమైన ప్రత్యయములుగాని, పరిణామములుగాని పొందవు.

ఘనుఁడు [వాఁడు] [భీమ 5-64] చేయువారు [భీమ 4-159]

4.7.5.3 నామ ధాతువులకు పురుష ప్రత్యయములు చేరునపుడీక్రింది విధముగా రూపాంతరత నొందును.

| | ఉత్తమ పురుష | | మధ్యమ పురుష | |
|---|---|---|---|---|
| | ఏకవచనము | బహువచనము | ఏకవచనము | బహువచనము |
| అకారాంత ప్రాతిపదికలకు | ను | ము | వు | $\phi$ [రు] |
| ఇకారాంత ప్రాతిపదికలకు | ని | ము | వి | — |
| ఉకారాంత ప్రాతిపదికలకు | ను | ము | వు | — |

పై పట్టిక ననుసరించి పురుష ప్రత్యయములను ఉదిదంతములని విభజింప వచ్చును అదంత రూపములకు పరముగా ఉదంత పురుష ప్రత్యయములు, ఇదంత రూపములకు పరముగా ఇదంత పురుష ప్రత్యయములు చేరును. ను-వు లు చేరు నపుడు ఉదంతశబ్దములు తుది వర్ణమునకు అత్వమాదేశముగా నగును

4.7 5 4 శ్రీనాథుని భాషలో మధ్యమ పురుష బహువచన ప్రత్యయమైన 'రు' నిత్యముగ లోపించు చున్నది. బహువచన -లు ప్రత్యయముచే బహుత్వము సూచితమగును.

| | | |
|---|---|---|
| ఉత్తమ పురుషైక వచనము : | హితుఁడ-ను | [శృ.నై 2-56] |
| | బకంబ-ను | [భీమ 4-33] |
| | విహగంబ-ను | [భీమ 5-45] |
| | చేయువాఁడ-ను | [కాశీ 6-88] |
| | చేయఁగలఁవాఁడ - ను | [కాశీ 7-171] |
| | విధవ - ను | [కాశీ 5-162] |
| ఉత్తమ పురుష బహువచనము : | పశువుల - ము | [శివ 1-104] |
| | తపస్వుల - ము | [కాశీ 6-42] |
| | కన్నార - ము | [కాశీ 5-9] |
| | చేయువార - ము | [భీమ 2-121] |
| మధ్యమ పురుషైక వచనము : | నాయకుఁడ - వు | [శృ.నై 8-202] |
| | అడుగువెట్టినవాఁడ -వు | [భీమ 2-153] |
| | కన్య - వు | [హర 4-25] |
| | జనియించిన దాన - వు | [శివ 3-64] |
| | పతి - వి | [శృ నై 7-93] |
| | విశాలాక్షి - వి | [కాశీ 7-192] |
| | ఏడ్చుచున్నవాఁడ - వు | [భీమ 2-116] |
| | చేయుచున్నదాన - వు | [కాశీ 4-102] |

## 3.8.0 అకర్మక - సకర్మక - ప్రేరణార్థకములు

(Intransitive – Transitive – Causatives)

అకర్మకములని, సకర్మకములని క్రియలు రెండు విధములు. కర్మయొక్క ఆకాంక్ష లేనివి అకర్మకములు. కర్మయొక్క ఆకాంక్ష గలవి సకర్మకములు. ఎవనిని, దేనిని మున్నగు విధముగా ప్రశ్న వేయుటకు వీలుపడని క్రియలు అకర్మకములని, అట్లు వీలుపడినప్పుడు సకర్మకములని యందురు. 'వచ్చెను' అను రూపమున్నదను కొందము. 'ఎవనిని వచ్చెను' అనికాని 'దేనిని వచ్చెను' అనికాని ప్రశ్నించు నవకాశము గలుగదు. కావున ఇచ్చట కర్మాకాంక్ష లేదు కాబట్టి ఇది అకర్మక క్రియ. 'వండెను' అని యున్నపుడు 'దేనిని వండెను' అను ప్రశ్నకు అవకాశము కలదు. 'వంటకమును వండెను' మున్నగు విధముగా సమాధానము లభించును. కావున 'వండెను' అను దానికి కర్మాకాంక్ష కలదు. కాబట్టి ఇది సకర్మకక్రియ ఇట్లు స్పష్టముగా అకర్మక క్రియలును, సకర్మక క్రియలును వేర్వేరుగా కనిపించును. ఐనను, కొన్నిచోట్ల ప్రేరణార్థకమునకును సకర్మకమునకును స్పష్టమైన భేదము గోచరము కాక కొంత క్లేశము నాపాదించుటయు గలదు.[1]

4 8.1 అకర్మక ధాతువులును సకర్మకములుగా మార్చుటకు కొన్ని మార్గములు కలవు.

'ఇల్లు' అను ప్రత్యయము అకర్మక క్రియాప్రాతిపదికలకు చేరును. -చు, -పు [వీని పర్యాయ రూపములైన -ంచు, -చ్చు -ప్పు] -ఇంచు అను సకర్మక ప్రత్యయములు కొన్ని అకర్మక క్రియాధాతువుల అంత్యవర్ణమునకు బదులుగా గాని, ప్రత్యక్షముగా ప్రత్యయములు అదనముగా చేరుట వలనగాని సకర్మకక్రియ లేర్పడు చున్నవి కాని అన్ని అకర్మక ధాతురూపములకు తుల్యమైన సకర్మకరూపములులేవు.

తెలుగు వైయాకరణులు సకర్మక క్రియలను, ప్రేరణార్థకములను, ప్రత్యేకముగా విభజించి చూపలేదు. అన్ని సకర్మక క్రియలను ప్రేరణార్థకములుగనే వాడిరి. కాని సకర్మక ధాతువులకు [క్వాచిత్కముగా అకర్మక ధాతువులకు] 'ఇంచు' అను ప్రత్యయము చేర్చుటచే ప్రేరణార్థక ధాతు రూపములేర్పడుచున్నవి. అన్ని సకర్మక క్రియలకు తత్తుల్యమైన ప్రత్యయములు చేరి ప్రేరణార్థకములు కావలెనను నియమము లేదు.

---

1. స్వామిశ్రీ : తెలుగు భాషాచరిత్ర, పుట 340.

## 4.8.2 సకర్మక ధాతు ప్రత్యయములు :

4.8.2.1 –డు, –ను, –రు, –లు అంతమందు గల అకర్మక ధాతు ప్రాతిపదికలకు సకర్మక ప్రత్యయమైన –చు ఆగమముగా చేరి, తత్పూర్వమున్న స్వరము వైకల్పికముగా లోపించును.

| అకర్మక ధాతువులు | సకర్మక ధాతువులు | |
|---|---|---|
| 1. –డు: నిగుడు | నిగుడుచు / నిగుడ్చు | [భీమ –118] [హర 7–55] |
| కూడు | కూర్చు | [భీమ 3–19] |
| ఆడు | ఆర్చు | [కాశీ 6–270] |
| 2. –ను: ఊను | ఊన్చు | [శృ.నై 2–99] |
| మాను | మాన్చు | [కాశీ 6–247] |
| పూను | పూన్చు | [శృ.నై 2–113] |
| 3. –రు : అమరు | అమర్చు | [శృ నై 4–11] |
| చేరు | చేర్చు | [హర 3–36] |
| చెమరు | చెమరుచు / చెమర్చు | [హర 7–87] [హర 1–12] |
| తనరు | తనర్చు | [కాశీ 5–96] |
| తీరు | తీర్చు | [కాశీ 2–53] |
| శకటరేఫ సాధురేఫగా మార్పుచెందుట : | [ఈ మార్పు వ్రాతలోనే కన్పించును.] | |
| ఆఱు | ఆర్చు | [కాశీ 1–59] |
| కాఱు | కార్చు | [శృ.నై 6–112] |
| మాఱు | మార్చు | [హర 6–9] |
| 4. –లు : అదలు | అదల్చు | [శృ.నై 7–191] |
| కదలు | కదల్చు | [హర 2–51] |
| కాలు | కాల్చు | [భీమ 5–158] |
| తెమలు | తెమల్చు | [శృ.నై 1–176] |

| అకర్మక ధాతువులు | సకర్మక ధాతువులు | |
|---|---|---|
| తేలు | తేలుచు | [హర 6-75] |
| | తేల్చు | [భీమ 2-42] |
| రాలు | రాల్చు | [కాశీ 7-85] |
| ప్రేలు | ప్రేల్చు | [శృ.నై 7-88] |

ద్విరుక్తహల్లు లోపించగా :

| | | |
|---|---|---|
| దుల్లు | దుల్చు | [శృ.నై 7-81] |
| డొల్లు | డొల్చు | [కాశీ 1-77] |

4.8.2.2 సాధారణముగా అనుస్వార పూర్వకమైన -గు, -డు అంతమందుగల అకర్మక ధాతు ప్రాతిపదికలకు సకర్మక ప్రత్యయమైన 'చు' వర్ణమాదేశముగా వచ్చును

| | | |
|---|---|---|
| 1. -గు : అడఁగు | అడఁచు | [భీమ 5-71] |
| అణఁగు | అణఁచు | [భీమ 6-35] |
| ఊఁగు | ఊఁచు | [కాశీ 5-168] |
| కరఁగు | కరఁచు | [హర 3-59] |
| కలఁగు | కలఁచు | [భీమ 1-18] |
| కాఁగు | కాఁచు | [శృ.నై 6-120] |
| క్రాఁగు | క్రాఁచు | [భీమ 3-115] |
| దాఁగు | దాఁచు | [శృ.నై 6-102] |
| తూఁగు | తూఁచు | [శృ.నై 5-16] |
| పెనఁగు | పెనఁచు | [శృ.నై 6-120] |
| మలఁగు | మలఁచు | [శృ.నై 7-191] |
| రేఁగు | రేఁచు | [శృ.నై 8-42] |
| వంగు | వంచు | [శివ 4-26] |
| వేఁగు | వేఁచు | [హర 2-122] |
| 2. -డు : నిండు | నించు | [శృ.నై 2-87] |
| | నినుచు | [శృ.నై 1-74] |
| ఉండు | ఉంచు | [భీమ 6.56] |

3. కొన్ని యువర్ణాంత ధాతువులకును పై నియమము వర్తించును.

| అకర్మక ధాతువులు | సకర్మక ధాతువులు | |
|---|---|---|
| రాయు | రాచు | [కాశీ 7–96] |

4. ధాతుగత అచ్చు 'ఇ' 'ఉ' గా మారుట గుర్తింప దగినది.

| | | |
|---|---|---|
| కమియు | కముచు | [శృ.నై 7–172] |
| తడియు | తడుచు | [ప.పీ 6] |

5. ధాతుగత అచ్చు సకర్మకమున దీర్ఘము నొందుట.

| | | |
|---|---|---|
| ఎరియు | ఏర్చు | [క్రీడా 73] |

4.8 2.3 '–చు' అను సకర్మక ప్రత్యయము చేరి సకర్మక ధాతు రూపముగా రూపొందివ బడినపుడు అకర్మక ధాతుగతమైన '–డ' వర్ణము సాధు [లేక] శకట రేఫములుగా మార్పు చెందుట గలదు

| | | |
|---|---|---|
| ఆడు | ఆర్చు | [కాశీ 6–270] |
| కూడు | కూర్చు | [భీమ 3–12] |
| ఓడు | ఓర్చు | [హర 7–154] |
| ఏర్పడు | ఏర్పఱుచు | [భీమ 4–83] |
| చెడు | చెఱుచు | [హర 3–23] |

4.8.2.4 అకర్మక ధాతువుయొక్క తొలియచ్చుమీది వర్ణములన్నియు లోపించి –ంచు, చ్చు అను సకర్మక రూపాంతర ప్రత్యయము చేరి యీ క్రింది రూపములు సకర్మకములుగా పరిగణింపబడుచున్నవి.

| | | |
|---|---|---|
| 1. –ంచు: చిరుగు | చించు | [శృ నై 8–122] |
| డిగ్గు | డించు | [కాశీ 2–75] |
| | దించు | [ప.పీ 92] |
| తెగు | తెంచు | [కాశీ 1–51] |
| | త్రెంచు | [ప.పీ 102] |
| నొచ్చు | నొంచు | [హర 7–100] |
| పెరుగు | పెంచు | [కాశీ 1–116] |
| మునుఁగు | ముంచు | [కాశీ 1–51] |

| అకర్మక ధాతువులు | సకర్మక ధాతువులు | |
|---|---|---|
| 2. చ్చు : వ్రయ్యు | వ్రచ్చు | [కాశీ 7_80] |

రూపాంతరితమైన సర్వాదిష్ట ప్రాతిపదిక. (suppletive stem)

483 _గు చు, _డు, _యు అంతమందుగల అకర్మక క్రియా ప్రాతిపదికలకు సకర్మక ప్రత్యయమైన '_పు వర్ణమాదేశముగ వచ్చును

| | | |
|---|---|---|
| 1. _గు : ఉడుగు | ఉడుపు | [శృ.నై 5_53] |
| ఊఁగు | ఊఁపు | [శృ.నై 5_137] |
| చాఁగు | చాఁపు | [శృ.నై 1_79] |
| జరుగు | జరుపు | [కాశీ 3_175] |
| రేఁగు | రేఁపు | [శివ 3_69] |
| 2. _చు : కడచు | కడపు | [భీమ 4_151] |
| నడచు | నడపు | [కాశీ 6_75] |
| నిలుచు | నిలుపు | [కాశీ 3_81] |
| చూచు | చూపు | [కాశీ 2_5] |
| 3. _డు : నిండు | నింపు | [భీమ 3_198] |
| 4. _యు: నెరయు | నెరపు | [శృ.నై 7_9] |
| నెఱయు | నెఱపు | [కాశీ 2_11] |
| పాయు | పాపు | [కాశీ 2_11] |
| మేయు | మేపు | [శృ నై 8_29] |
| కలయు | కలపు | [శృ నై 6_120] |
| మాయు | మాపు | [హర 7_154] |

5. అకర్మక ధాతువునందలి 'ఇ' వర్ణము సకర్మకమున 'ఉ' వర్ణముగా మార్పు చెందినది.

| | | |
|---|---|---|
| తడియు | తడుపు | [భీమ 3_4] |

| అకర్మక ధాతువులు | సకర్మక ధాతువులు | |
|---|---|---|
| తనియు | తనుపు | [భీమ 6–26] |
| తెలియు | తెలుపు | [శృ.నై 1–49] |

6. ఈ క్రింది రూపములలో క్రియా ప్రాతిపదిక సకర్మకత్వమున పర్యాయరూపత చెందుట కలదు

| | | |
|---|---|---|
| కొను | కొలుపు | [భీమ 1–96] |
| చను | చలుపు | [శృ.నై 5–45] |
| చచ్చు | చంపు | [శివ 3–88] |
| చొచ్చు | చొనుపు | [కాశీ 4–121] |

7. కొన్ని అకర్మక ధాతువులకు 'ప్పు' అను సకర్మక రూపాంతర ప్రత్యయము చేరునపుడు ధాతువు వర్ణ వ్యత్యయమును పొందును.

| | | |
|---|---|---|
| తిరుగు | త్రిప్పు | [హర 7–49] |

4.8.4 1 ఈ క్రింది అకర్మక క్రియాప్రాతిపదికలకు '–ఇంచు' అను సకర్మక ప్రత్యయముచేరి సకర్మకత్వము పొందుట కలదు. ఈ మూడు ప్రత్యయములలోను 'ఇంచు' చేరిన రూపములే ఎక్కువగా గోచరించును అందు 240 అకర్మక క్రియలలో 85 క్రియలు 'ఇంచు' చేరిక వలన ఏర్పడినవి. అందు 8 ధాతువులకు ద్వైరూప్యము కలదు.

| | | |
|---|---|---|
| కుదియు | కుదియించు | [హర 3–82] |
| కురియు | కురియించు | [శృ.నై 7–24] |
| నిండు | నిండించు | [శివ 2–49] |
| పుట్టు | పుట్టించు | [శృ.నై 5–63] |

4.8.4.2 ఈ క్రింది ధాతువులు సకర్మకత్వమున ద్వైరూప్యము నొందుచున్నవి.

| | | |
|---|---|---|
| అడఁగు | అడఁచు | [భీమ 5–71] |
| | అడఁగించు | [హర 7–186] |
| అణఁగు | అణఁచు | [భీమ 6–35] |
| | అణఁగించు | [శృ.నై 4–38] |

| అకర్మక ధాతువులు | సకర్మక ధాతువులు | |
|---|---|---|
| అదలు | అదల్చు<br>అదలించు | [శృ.నై 7-191]<br>[హర 7-165] |
| అమరు | అమర్చు<br>అమరించు | [శృ నై 4-11]<br>[ప.వి 44] |
| అలవడు | అలవఱుచు<br>అలవరించు | [శృ నై 6-57]<br>[కాశీ 3-116] |
| ఆడు | ఆర్చు<br>ఆడించు | [కాశీ 6-270]<br>[శృ.నై 6-77] |
| ఏర్పడు | ఏర్పఱుచు<br>ఏర్పరించు | [భీమ 4-83]<br>[కాశీ 7-179] |
| ఒనరు | ఒనరుచు<br>ఒనరించు | [శృ.నై 8-191]<br>[శృ.నై 7-128] |

4.8.4.3 ఈ క్రింది అకర్మక క్రియాధాతువు సకర్మకత్వము పొందునపుడు రూపాంతరమును పొందుచున్నది.

| | | |
|---|---|---|
| అగు | కావించు | [శృ నై 7-128] |
| వచ్చు | రావించు | [హర 5-11] |

4.8.4.4 ఈ క్రింది ధాతువులు శ్రీనాథుని భాషయందు సకర్మక క్రియలుగానే ప్రయుక్తమైనవి.

| | | | |
|---|---|---|---|
| అగల్చు | [హర 6-45] | అలమరించు | [శివ 2-166] |
| అలంచు | [కాశీ 3-10] | ఇచ్చు | [కాశీ 1-48] |
| ఊడ్చు | [భీమ 3-62] | కమర్చు | [శివ2-71] |
| కెరపు | [కాశీ 6-176] | చికిలించు | [హర 4-91] |
| త్రుంచు | [కాశీ 6-244] | నాన్చు | [కాశీ 3-138] |
| వేల్చు | [కాశీ 5-221] | ప్రేల్చు | [కాశీ 1-160] |

## 4-8.5 ప్రేరణార్థకములు (Causatives)

ఇంతకు పూర్వమే చెప్పబడినటుల సాధారణముగా సకర్మక ధాతురూపములకు '-ఇంచు' ప్రత్యయము చేర్పగా ప్రేరణార్థకము లేర్పడుచున్నవి. ఒక క్రియను

ఒకరిచే చేయించుట ప్రేరణము. కావున అర్థమును బట్టి యెచ్చట ప్రేరణమున్నదో చెప్పుట కష్టముకాదు.

ప్రేరణార్థక క్రియకు రెండేసి కర్మపదములుండు నవకాశము కలదు. 'నేను వానిని పుస్తకమును కొనుమంటిని' అని యన్నపుడు 'వానిని' అనునదియు 'పుస్తకమును' అనునదియు కర్మములే ఇట్టి ద్వికర్మక వాక్యములు ద్రావిడభాషలలో నుండ వచ్చును కాని, కొన్నియెడల ఒక కర్మమును తగ్గించి వాడుటకూడ అలవాటులో కలదు. 'ఇంటిని కట్టించితిని' అన్నప్పుడు పురుష వాచకమైన కర్మము అధ్యాహరమైనది ఒకప్పుడు తృతీయాంతముగా పురుష వాచకమును నిబంధించి అస్పష్టతను తొలగించు ప్రయత్నము కనిపించును. 'అతనిచేత నేనింటిని కట్టించితిని'. సంస్కృతాభ్యాసము వలన నిట్టి యలవాటు కలిగెను. ఇట్టి ప్రయోగములు క్వాచిత్కముగా కన్పించును.[2]

| అకర్మకక్రియ | సకర్మక క్రియ | ప్రేరణార్థకము | |
|---|---|---|---|
| కదలు | కదల్చు | కదలించు | [హర 6-45] |
| కరఁగు | కరఁచు | కరగించు | [శృ.నై 7-185] |
| కలఁగు | కలఁచు | కలఁగించు | [శృ.నై 5-174] |
| క్రాఁగు | క్రాఁచు | క్రాగించు | [శివ 4-61] |
| చచ్చు | చంపు | చంపించు | [శివ 3-129] |

4.8.5 1 -చు వర్ణాంతమైన సకర్మక ధాతు రూపములకు ప్రేరణార్థక ప్రత్యయమైన -ఇంచు చేరినపుడు '-పు' వర్ణమాదేశము కాగా సంధిగతమైన మార్పును పొందును.

| సకర్మక క్రియ | ప్రేరణార్థకము | |
|---|---|---|
| త్రోచు | త్రోపించు | [భీమ 4-13] |
| మెచ్చు | మెచ్చించు | [హర 7-64] |
| | మెప్పించు | [కాశీ 6-165] |
| పిలుచు | పిలిపించు | [భీమ 1-22] |
| వలచు | వలపించు | [కాశీ 6-206] |

4.8.5 2 'కురియు' మున్నగు అంతర్గర్భిత ప్రేరణార్థకములు కొన్ని శ్రీనాథుని యందు కనిపించును. 'వర్షము కురిసెను' ఇచ్చట క్రియ స్వార్థమున నున్నది.

2. స్ఫూర్తిశ్రీ: తెలుగు భాషాచరిత్ర, పుట 345-346.

'ఘనాఘనంబులు పుష్పవర్షంబులు కురిసె [కాశీ 4-10]
ఇచ్చట క్రియ ప్రేరణార్థమున నున్నది.

4.8.5.3 'అన్వాదులగు' ధాతువులకు '-ఇపించు' చేరిన ప్రేరణార్థక ధాతువులగును.

| సకర్మక క్రియ | ప్రేరణార్థకము |
|---|---|
| కను | కనిపించు [కాశీ 6-27] |
| విను | వినిపించు [భీమ 3-213] |

4.8.5.4 'పనుచు' అను ధాతువు అన్నంత ధాతువున కనుప్రయుక్తమై ప్రేరణార్థకమగుచున్నది.

నన్నుం బిలువంబంచి [పిలిపించి] [కాశీ 1-11]



## 4.9.0 అ న మా ప క క్రి య లు (Non–Finite Verbs)

శ్రీనాథుని భాషలో కన్పించు సమాపకక్రియా ప్రత్యయములు ఈ దిగువ పొందుపరుప బడినవి.

### 4.9.1 క్త్వార్థకము : (Past Participle)

4.9.1.1 భూతకాలికాసమాపక క్రియలకు క్త్వార్థకములని వైయాకరణులు పేరిడిరి. క్త్వార్థకమున ధాతువునకు 'ఇ' అను ప్రత్యయము చేరును.

పిలిచి [భీమ 2–118] చూచి [శృ.నై 1–67]

4.9.1.2 యకారాంత ధాతువులకు 'ఇ' ప్రత్యయము చేరునపుడు 'స'కారము ఆదేశముగా నగును.

చేయు + ఇ : చేసి [భీమ 4–24]
తెలియు + ఇ : తెలిసి [శృ.నై 3–141]

4.9.1.3 అనుబంధ ధాతువైన 'కొను' యొక్క క్త్వార్థక రూపమునకు 'క' వర్ణ మాదేశముగ శ్రీనాథుని భాషలో కన్పించుచున్నది.

క్రిందనంటు–క– సంతరించి [హర 2–116]
పట్టు–క–రాగ [ప వీ 5]
పేరుపెట్టు–క [ప.వీ 94]

### 4.9.2 వ్యతిరేక క్త్వార్థకము : (Negative participle)

4.9.2.1 ధాతువునకు 'అక' అను ప్రత్యయము చేరగా వ్యతిరేక క్త్వార్థకమగును. ఏకస్వర ధాతువులపై నిందలి అకారము లోపించును.

విను + అక : వినక [హర 2–101] రా + అక : రాక [శృ నై 5–142]

4.9.2.2 బిందుపూర్వక చువర్ణాంత ధాతువులపై వ్యతిరేక క్త్వార్థక 'అక' ప్రత్యయము చేరునపుడు చకారమునకు పకారమాదేశమగును

అనుమానించు + అక : అనుమానింపక [శృ నై 4–70]
సైరించు + అక : సైరింపక [హర 7–134]

4.9 2.3 చువర్ణాంత ధాతువులపై వ్యతిరేక క్త్వార్థక 'అక' ప్రత్యయము చేరునపుడు చకారమునకు వకారమాదేశమగును.

ఓర్చు + అక : ఓర్వక [శివ 1-78]

4.9.2.4 'చ్చు' అంతమందుగల ధాతువుల వ్యతిరేక క్త్వార్థక రూపములు వివిధములుగ నుండును.

ఇచ్చు + అక : ఇవ్వక [వ.వి 31] ఈయక [వ.వి 42]
ఈక [శృ నై 2-73]
చచ్చు + అక : చావక [శివ 3-76] చాక [శివ 4-63]
నొచ్చు + అక : నొవ్వక [శివ 4-63]
వచ్చు + అక : రాక [శృ.నై 4-117]

4.9.2 5 వ్యతిరేకక్త్వార్థక ప్రత్యయము చేరునపుడీ క్రింది ధాతువులు రూప పరిణతి నొందుచున్నవి

అగు + అక : కాక [కాశీ 6-137]
అను + అక : అనక [శృ నై 8-48] వర్ణవ్యత్యయముచే: నాక
కను + అక : కానక [హర 2-47] ప్రథమాచ్చునకు దీర్ఘము వచ్చినది.
నేర్చు + అక ; నేరక [శృ నై 4-99]
పోవు + అక ; పోవక [కాశీ 4-12] పోక [కాశీ 2-111]
వెలుచు + అక : వెలుక [కాశీ 4-227]

4.9.2.5 వారక [శృ.నై 2-114], ఊరక [[భీమ 3-46], మిన్నక [హర 2-60] మొదలగు నవ్యయములు *వారు *ఊరు *మిన్ను మొదలగు నష్ట ధాతువుల నుండి పుట్టి యుండునని యూహింప వచ్చును.

4.9.2.7 వ్యతిరేక క్త్వార్థక రూపములొకప్పుడు ద్రుతాంతముగా కూడ కనిపించుచున్నవి.

కరుణలేకను [శివ 2-33]

## 4.9.3 శత్రర్థకము :(Present Participle)

4.9.3 1 ధాతువుపై '-చున్' ప్రత్యయము చేరుట వలన శత్రర్థక మేర్పడును,

అను + చున్ : అనుచున్ [శృ.నై 1-57]
చేయు + చున్ : చేయుచున్ [శృ.నై 5-27]

4.9.3.2 అన్ని యసమాపక క్రియా రూపములందును 'పోవు' ధాతువు 'వు' వర్ణము లోపించినను శత్రర్థక చువర్ణము చేరినపుడు మాత్రము లోపింపదు.

పోవు+చున్ : పోవుచున్ [క్రీడా 237]

4.9.3.3 అన్వాదులపై శత్రర్థక చువర్ణము చేరినపుడు ధాతువు తుది యుత్వము వైకల్పికముగ లోపించును. అట్లేర్పడిన 'న్చు' ను 'ంచు' గ వ్రాయుటయు గలదు 'న్చు' అని వ్రాసినను 'ంచు' అని వ్రాసినను దాని యుచ్చారణము 'ఞ్చు' అనునదియే.

భిక్షాందేహి యటంచు [హర 5-52]
వీణావాద్యంబులు వించు [భీమ 5-191]
కుచద్వయంబారసి కొంచున్ [శృ.నై 7-167]

'చను' ధాతువీపరిణామమును పొందదు.

## 4.9.4 అన్నంతము : (Infinitive)

4.9.4.1 '-అన్' ప్రత్యయము ధాతువునకు చేరగా అన్నంత రూపమేర్పడును.

చేయు + అన్ : చేయన్ [భీమ 1-89]
మెచ్చు + అన్ : మెచ్చన్ [హర పీ 10]

4.9.4.2 అను + అన్ : అనన్ [హర 2-22] ఇందలి మొదటి అచ్చునకు వర్ణ వ్యత్యయము కలుగగా : నాన్ [భీమ 3-15]

4.9.4.3 పోవు + అన్ : పోవన్ [శృ.నై 7-74] పోన్ [కాశీ 6-257]

4.9.4.4 అన్నంతములు మరియొక ధాతువునకు పూర్వాంగములుగా వ్యవహరించును.

దిగు + అన్ : దిగన్ + పడు దిగఁబడు [భీమ 4-68]
దిగన్ + జాఱు దిగజాఱు [కాశీ 5-167]
దిగన్ + మ్రింగు దిగమ్రింగు [చా మ 1-127]

4.9 4.5 కొన్ని నష్టధాతువుల అన్నంత రూపములపై నితర ధాతువులు చేరగా క్రొత్త ధాతువులేర్పడును.

ఒడన్ + కూడు : ఒడఁగూడు [శృ నై 6_20]
ఒడన్ + కూర్చు : ఒడఁగూర్చు [హర 2_123]
ఒడన్ + పడు : ఒడఁబడు [హర 3_61]

4.9 4.6 ప్రేరణార్థకముల తుది చువర్ణమునకు, బిందువు మీది చువర్ణమునకు ఆదేశముగా పవర్ణమగును.

ఒనరుచు + అన్ · ఒనర్పన్ [కాశీ 1_70]
తురఁగలించు + అన్ : తురఁగలింపన్ [హర 7_139]

4.9 4.7 కొన్ని చువర్ణాంత ధాతువుల చకారమునకు వకారమాదేశమగును.

నడుచు + అన్ : నడువన్ [శివ 2_67]
మొలచు + అన్ : మొలవన్ [శృ నై 7_178]
త్రోచు + అన్ : త్రోవన్ [శృ.నై 7_58]
మోచు + అన్ . మోవన్ [కాశీ 5_318]
మిడుచు + అన్ : మిడువన్ [హర 5_30]
తఱుచు + అన్ : తఱువన్ [శృ నై 8_6]
గెలుచు + అన్ : గెలువన్ [భీమ 1_90]

4.9 4 8 '-చ్చు' అంతమందుగల ధాతువులపై -అన్ ప్రత్యయము చేరునపుడు రూపములు వివిధములుగ కలుగు చుండును.

తెచ్చు + అన్ . తేరన్ } [కాశీ 4_142]
తేన్ } [శివ 3_114]

4.9 4 9 'తెంచు' నకును 'తేరన్' అనునదియే అన్నంత రూపము.

అరుగుదెంచు + అన్ : అరుగుదేరన్ [హర 7_41]
పుత్తెంచు + అన్ : పుత్తేరన్ [శృ.నై 4_19]

4.9.4.10 'వచ్చు' నకు 'రాన్' అనునదియే అన్నంత రూపము

కొలిచివచ్చు + అన్ : కొలిచిరాన్ } [కాశీ 5-279]
కొల్చిరాన్ } [శృ నై 7-43]

4.9 4.11 'అగు' నకు 'కాన్' అనునదియే అన్నంత రూపము
-కాన్ అనునది షష్ఠీ రూపముల మీద :
నాకుఁగా నుద్ధరింపుము [శృ.నై 4-63]

-కాన్ అనునది 'కన్' అనియు నగును ఇదియును 'కాన్' వలెనే యుపయోగింపబడును.

లోనుగన్ [కాశీ 5-232] పన్నుగన్ [భీమ 6-50]
కాఁగన్ [శృ నై 1-98] పొద్మగన్ [హర 6-63]

4.9.4.12 కొన్ని గువర్ణాంత ధాతువుల తుది హల్లునకు -అన్ పరమగునపుడు వకార ద్విత్వము కలుగును.

ౘెగు + అన్ · ౘెవ్వన్ [భీమ 6-60]
నగు + అన్ . నవ్వన్ [శృ.నై 6-111]

4.9.4.13 బెగ్గిలన్ [హర 3-66] మొదలంటన్ [భీమ 3-212] మొదలగు నన్నంత రూపములును కేవలావ్యయములుగ ప్రయోగింపఁ బడినవి

## 4.9.5 అనంతర్యార్థకము : (Post-action) (meaning : after)

4.9.5.1 ధాతువుపై '-డున్' అను ప్రత్యయము చేరుట వలన అనంతర్యార్థక మేర్పడును.

కావించు + డున్ ; కావించుడున్ [శృ.నై 7-181]

4.9.5 2 భావార్థకముపై 'ఉను' అను సముచ్చయార్థకము చేరుటచే అనంతర్యార్థక మేర్పడును.

వరంబు వేడుమనుట-యు [హర 7-23]
నందనున్ బ్రసాదింపు మనుట-యు [కాశీ 3-221]
సాంగత్యంబు వహించెనని చెప్పుట-యు [కాశీ 7-262]

## 4.9.6 చేదర్థకము : (Conditional) అప్యర్థకము : (Concessive)

4.9.6.1 ధాతువుపై '-ఇనన్' అను ప్రత్యయము చేరుటచేత తెలుగున అప్యర్థక చేదర్థకములేర్పడుచున్నవి.

అడుగు + ఇనన్ : అడిగినన్ [శృ.నై 7_191]
చెప్పు + ఇనన్ : చెప్పినన్ [హర 7_23]

4 9.6.2 నకార, డకారాంత ధాతువులకు 'ఇనన్' పరమగునపుడు తుది హల్లునకు ద్విత్వము పాక్షికముగా నగును. అప్పుడు సపదాంశము '-అన్' అని యగును.

అను + ఇనన్ : అనినన్ [హర 2_50] అన్నన్ [శివ 4_54]
పడు + ఇనన్ : పడినన్ [శృ.నై 3_61] పడ్డన్ [శృ.నై 1_76]

4.9.6.3 భూతకాలిక సమాపక క్రియకు -ఏని ప్రత్యయము చేరుటచేత చేదర్థక మేర్పడ వచ్చును.

చిచ్చుఱికెన్ + ఏని : చిచ్చుఱికెనేని [కాశీ 2_91]
కలిగెన్ + ఏనియు : కలిగెనేనియు [భీమ 6_101]
చేసెన్ + ఏని : చేసెనేని [కాశీ 6_43]

4.9.6.4 'చోన్' అను అవ్యయము క్రియాజన్య విశేషణములపై చేరి చేదర్థక మగును.

చేసాచినచో నవ్వక యుండవలయు [కాశీ 1-109]

## 4.9.7 భూతార్థక ధాతుజ విశేషణము : (past adjective)

4.9.7.1 ధాతువుపై '-ఇన' అను ప్రత్యయము చేరుట వలన భూతార్థక ధాతుజ విశేషణ మేర్పడును. [ఇది ప్రాథమికముగా భూతకాలికమైన '-ఇన్', విశేషణ చిహ్నమైన 'అ' అను రెండు సపదాంశముల సంయోగముచేత నేర్పడినది.

వచ్చు + ఇన : వచ్చిన [హర 2_46]
అడుగు + ఇన : అడిగిన [భీమ 1-122]

4.9.7.2 అగు, పోవు ధాతువులపై '-ఇన' ప్రత్యయము చేరునపుడు వాని తుది వర్ణము యకారముగా మారును.

అగు + ఇన : అయిన [శృ.నై 1-79]
పోవు + ఇన : పోయిన [హర 3-83]

4.9.7.3 యువర్ణాంత ధాతువులపై '-ఇన' చేరినపుడా యవర్ణమునకు సకారమాదేశమగును.

చేయు + ఇన : చేసిన [కాశీ 2-11]

4.9.7.4 -ను, -డు అను వర్ణములతో నంతమగు ధాతువులకు భూతకాలిక విశేషణ ప్రత్యయమైన అకారము చేరినపుడు తుది హల్లునకు ద్విత్వమగును. సపదాంశమైన -ఇన చేరినపుడు ద్విత్వము కాదు.

పడు + అ : పడ్డ [పడిన] [హర 2-45]
చెడు + అ : చెడ్డ [చెడిన] [శివ 3-55]
ఇడు + అ : ఇడ్డ [ఇడిన] [శృ.నై 2-125]
అను + అ : అన్న [అనిన] [కాశీ 7-164]
కొను + అ : కొన్న [కొనిన] [శృ.నై 5-63]
తిను + అ : తిన్న [తినిన] [శృ నై 7-128]

## 4.9.8 తద్ధర్మార్థక ధాతుజ విశేషణము : (Habitual adjective)

4.9.8 1 -ఎడు/-ఎడి/-$\phi$ అనునవి తద్ధర్మార్థక ధాతుజ విశేషణ ప్రత్యయములు. ఈ మూడు ప్రత్యయములు పర్యాయ ప్రవృత్తి నొందును.

ఒప్పు + ఎడు : ఒప్పెడు [హర 3-73]
వచ్చు + ఎడి : వచ్చెడి [శృ.నై 4-11]
వచ్చు + $\phi$ : వచ్చు [కాశీ 2-107]

4 9.8.2 ధాతువునకు -ఎడు అను తద్ధర్మార్థక విశేషణము పరమైనను, కాకున్నను పరపదము అజాదిగా నున్నయెడల -న్- ఆగమముగా వచ్చును

వచ్చు + ఎడు + అప్పుడు : వచ్చెడునప్పుడు [ప.పీ 74]

వచ్చు + $\phi$ + అతడు : వచ్చునతడు [శృ.నై 5-173]

-ఎడు తోడి ప్రయోగములు పల్నాటి వీరచరిత్రయందే కన్పించుచున్నవి.

## 4.9.9 వర్తమానార్థక ధాతుజ విశేషణము :

(Bound present participle)

4.9.9.1 ధాతువుపై '-చున్న' అను ప్రత్యయము చేరుట వలన వర్తమానార్థక ధాతుజ విశేషణమేర్పడును

పోవు + చున్న : పోవుచున్న [శృ.నై 7-98]

చేయు + చున్న : చేయుచున్న [శృ నై 4-69]

4.9.9.2 'చున్న' అనుదానిలో ' చు' వర్ణమే వర్తమానార్థమును దెలుపు చున్నది. 'ఉన్న' యనునది కేవలమనుబంధము. [చ్ + ఉన్న : చున్న]

ఏడుచు చున్నవాఁడవు [భీమ 2-116]

## 4.9.10 వ్యతిరేకార్థక విశేషణము : (Negative adjective)

4.9.10.1 ధాతువునకు '-అని' అను ప్రత్యయము చేరి వ్యతిరేకార్థక ధాతుజ విశేషణము ఏర్పడుచున్నది. ఏకస్వరధాతువులపై నిందలి అకారము లోపించును.

చూడు + అని : చూడని [శివ 2-94]

రాలు + అని : రాలని [కాశీ 1-93]

రా + అని : రాని [శృ.నై 2-3]

4.9.10.2 చువర్ణాంత ధాతువులకు వ్యతిరేకార్థక 'అ' ప్రత్యయము చేరునపుడు చకారమునకు పాక్షికముగ వకారమగును.

సంధ్యవార్చు + అని : సంధ్యవార్వని [కాశీ 5-214]

4.9.10.3 '-చ్చు' అంతమందుగల ధాతువుల వ్యతిరేకార్థక ధాతుజ విశేషణ రూపములు వివిధములుగ నుండును.

తెచ్చు + అని : తేని [శివునిఁదో ద్తేని యొక్క యొచ్చంబు- [కాశీ 7-57]
ఇచ్చు + అని : ఈయని [ప.పీ 12]
ఈని [భీమ 2-55]

4.9.10.4 వ్యతిరేకార్థక ధాతుజ విశేషణ ప్రత్యయ మీక్రింది ధాతువులకు చేరి రూప పరిణతిని గలిగించు చున్నది.

అగు + అని : కాని [శృ.నై 1-57]
కను + అని : కానని [భీమ 3-13]
పోవు + అని : పోవని [శృ.నై 5-170]
పోని [శృ.నై 1-72]



## 4.10.0 క్రియా విశేషణములు (Adverbs)

నామము యొక్క విశేషమును తెల్పునది నామ విశేషణము. దీనినే విశేషణము (adjective) అని వ్యవహరింతుము. క్రియ యొక్క విశేషమును తెల్పునది క్రియావిశేషణము (adverb). మన వ్యాకర్తలెవ్వరును క్రియావిశేషణము లను వేరుగా పరిగణించి వ్యవహరించుట జరుగలేదు నామవిశేషణములకును, క్రియా విశేషణములకును, రూపమునను, స్వభావమునను ఒక భేదమేర్పడి వాని రూప నిష్పాదన ప్రక్రియలో కొంత వైలక్షణ్యముండుటచే నా రెంటిని వేరు జాతులుగా పరిగణింపవలసి వచ్చినది.

కాల్డ్వెల్ క్రియా విశేషణములను గురించి వ్రాయుచు ద్రావిడ భాషలలో క్రియా విశేషణము లనబడు నొక జాతి పదములు లేవు. అట్టి క్రియావిశేషణములుగా వాడబడుచున్న పదములన్నియును, సవిభక్తకములో లేక అవిభక్తములో అయిన నామములుగాని ధాతు రూపములు గాని, తుమున్నాద్యర్థ రూపములుగాని అయి యున్నవి[1]; అని నిర్ణయించుట గమనింపదగినది. కావున ప్రత్యేకముగా క్రియా విశేషణములని వ్యవహరింపదగిన పదములు లేవని స్పష్టమగుచున్నది. అయినను భాషయందు క్రియా విశేషణములస్థానమున ఉపయోగింపబడు పదములను గూర్చి యోజించుట ఆవశ్యకము.

క్రియా విశేషణములు పదనిర్మాణానుసారముగ (morphologically) నామ లక్షణములను, కారక సంబంధముగ (syntactically) క్రియా లక్షణములను కలిగియున్నవి.

క్రియా విశేషణములను మొత్తము మీద కాల వాచకములు, స్థల వాచకములు, పరిమాణ వాచకములు, ప్రకార వాచకములు – అని స్థూలముగా విభజింపవచ్చును. పెక్కు క్రియా విశేషణములు నిర్దేశాత్మక సర్వనామముల నాధారముగా చేసికొని యేర్పడినవే యన్న సంగతిని గుర్తించుకొనుట యవసరము.

---

1. "The Dravidian Languages have no adverbs at all. Every word that is used as an adverb in the Dravidian languages is either a noun, declinable or indeclinable or a verbal theme, or the infinitive or gerund of a verb" – C G D, 1961.P 553-554.

4.10.1 శ్రీనాథుని భాషయందలి క్రియా విశేషణము లీక్రింది విధముగ విభజింపబడినవి

4.10.1.1 ఆ, ఈ, ఉ. ఏ – అను సర్వనామ ప్రాతిపదికల నుండి ఏర్పడినవి.

| | | కాలవాచకము | | స్థలవాచకము | |
|---|---|---|---|---|---|
| 1. నిర్దేశాత్మక దూరవర్తి : | అ– | అపుడు | [హర 2–11] | అక్కడ | [హర 2–89] |
| | | అప్పుడు | [హర 3–60] | అందు | [హర 5–21] |
| | | | | అచట | [భీమ 3–55] |
| | | | | అచ్చట | [శృ.నై 5–60] |
| | | | | అచ్చో | [కాశీ 7–142] |
| | | | | అట | [హర 4–72] |
| 2. నిర్దేశాత్మక సమీపవర్తి : | ఇ– | ఇప్పుడు | [భీమ 5–46] | ఇక్కడ | [హర 6–98] |
| | | ఇప్పుడు | [భీమ 2–90] | ఇందు | [హర 7–183] |
| | | | | ఇచట | [భీమ 6–11] |
| | | | | ఇచ్చట | [భీమ 3–44] |
| | | | | ఇచ్చో | [శివ 3–126] |
| | | | | ఇట | [హర 1–24] |
| 3. నిర్దేశాత్మక మధ్యవర్తి : | ఉ– | | | ఉల్ల | [కాశీ 7–244] |
| 4. ప్రశ్నవాచకము : | ఎ– | ఎపుడు | [భీమ 5–185] | ఎక్కడ | [హర 4–6] |
| | | ఎప్పుడు | [హర 2–55] | ఎందు | [హర 2 66] |
| | | ఎన్నడు | [హర 7–78] | ఎచ్చట | [భీమ 4–9] |
| | | | | ఎచ్చో | [కాశీ 5–74] |
| | | | | ఎట | [హర 7–173] |
| 5. ప్రకారార్థకము : | | అట్లు | [హర 7–10] | | |
| | | ఇట్లు | [హర 1–26] | | |
| | | ఎట్లు | [హర 3–90] | | |

**6.** పరిణామ వాచకములు :

| | | | |
|---|---|---|---|
| అంత | [శృ.నై 4-92] | అన్ని | [కాశీ 7-16] |
| ఇంత | [కాశీ 6-24] | ఇన్ని | [కాశీ 2-34] |
| ఎంత | [శృ.నై 8-148] | ఎన్ని | [శృ నై 8-148] |

పైన చెప్పినట్లు త్రికము మూలభూతముగా నేర్పడిన రూపములేకాక

**4.10.2.1** కాలవాచకములు :

| | | | |
|---|---|---|---|
| నేఁడు | [హర 2-13] | రేపు | [కాశీ 6-147] |
| నిన్న | [శృ.నై 8-44] | ముందు | [భీమ 6-52] |
| వెనుక | [శృ నై 1-109] | మొదట | [ప వి 45] |
| చివర | [ప వి 85] | | |

మున్నగు పదములు క్రియా విశేషణములుగా ప్రయుక్తము లగుచున్నవి.

**4.10.2.2** స్థలవాచకములు :

| | | | |
|---|---|---|---|
| ముందు | [ప వి 4] | వెనుక | [భీమ 4-178] |
| ప్రక్క | [కాశీ 3-98] | వెంట | [కాశీ 2-90] |
| క్రింద | [హర 2-90] | లోపల | [కాశీ 1-114] |
| బయట | [శృ.నై 2-42] | దగ్గర | [కాశీ 6-42] |
| దూరము | [హర 7-123] | | |

మున్నగునవి క్రియా విశేషణములు.

**4.10.2.3** పరిమాణ వాచకములు :

| | | | |
|---|---|---|---|
| తక్కువ | [భీమ 1-118] | ఎక్కువ | [క్రీడా 226] |
| పెక్కు | [భీమ 1-17] | పలు | [ప.వి 88] |
| చాల | [శృ.నై 2-76] | కొంచెము | [శృ నై 8-171] |
| కొంత | [శృ.నై 6-5] | | |

మున్నగునవి క్రియా విశేషణములు.

4.10.2.4 అప్పుడు, ఇప్పుడు, - మున్నగు వానిని విభక్తుల యపేక్ష లేకుండగనే యుపయోగించుట జరుగు చున్నది. నిన్న, మొన్న, వెనుక, ముందు -మున్నగునవి ద్వితీయాంతములుగా కాని, సప్తమ్యంతములుగా గాని యుపయోగపడుచున్నవి

4.10.2.5 స్థలవాచకములయిన అక్కడ, ఇక్కడ మున్నగునవి కూడ సప్తమ్యంతములుగానే యుపయుక్తము లగుచున్నవి. పరిమాణవాచకములు ఈ విధమగు యేపమునకు లోనగుట లేదు

4.10.3.1 నామముల నుండి క్రియా విశేషణములను నిష్పన్నము చేయుటకు 'అగు' ధాతు వన్నంత రూపము 'కాన్' చేర్పబడుచున్నది

-కాన్ > -గాన్, కన్, గన్

| | | | |
|---|---|---|---|
| ఇంపు-గ | [శృ.నై 7-146] | ఎట్టు-గన్ | [శివ 4-56] |
| ఎదురు-గాన్ | [శృ నై 6-84] | ఎదురు-గన్ | [శృ నై 7-17] |
| దవ్వు-గాన్ | [కాశీ 6-297] | తెల్లంబు-గ | [హర 6-31] |
| ఇమ్ము-గన్ | [హర 7-156] | ఊఁచముట్టు-గ | [కాశీ 2-59] |
| చూఁడ-గాన్ | [శృ నై 6-29] | మాను-గ | [భీమ 3-140] |
| పది-గన్ | [హర 4-32] | | |

4.10.3.2 క్వాచిత్కముగా శ్రీనాథుని భాషలో నామము నీ సహాయక క్రియా రూపములేకయే క్రియా విశేషణముగా వాడుట కనబడు చున్నది.

| | |
|---|---|
| అతిముఖేఁ జుట్టుకొని | [కాశీ 4-102] |
| మోమడ్డంబు గదల్చి | [హర 2-57] |
| క్రిమికంఠ కుహర మార్గమున కడ్డము దొట్టె | [శివ 4-52] |
| భారంబుగా విర్చి వే కట్టెన్ మోపు | [హర 2-8] |
| కెలని వాకిళ్ల రెండు వేగిరము మూసి | [కాశీ 7-221] |
| వేగ విచ్చేయు గేహ ప్రవేశమునకు | [కాశీ 7-221] |

4.10.3.3 విశేషణ రూపములపై -కాన్ చేరి క్రియా విశేషణము లగుచున్నవి.

| | | | |
|---|---|---|---|
| మంచి-గ | [హర 2-106] | కమ్మఁగాఁ గాఁచిన | [భీమ 1-61] |
| ప్రన్నఁగాఁ బెనగొన్న బ్రహ్మ సూత్రంబుల- | | | [భీమ 4-90] |

4.10.3.4 అన్నంత రూపములు క్రియా విశేషణములుగా నున్న రూపములు.

కమియయివిచ్చిన గేదంగి కన్నెపువ్వు [పూర్ణముగా] [శృ.నై 1-92]
చయ్యన నేఁగిరి [శీఘ్రముగా] [భీమ 4-96]
చేయన్ వచ్చున్ [శృ నై 5-111]
చేరన్ [హర 3-53] తేరన్ [హర 2-43]

4.10.4.1 -అగు ధాతువు యొక్క క్త్వార్థకమైన 'అయి/ఐ' నామవాచకములకు అదనముగా చేరి క్రియావిశేషణము లగుచున్నవి

ఆనందమాధ్వీమత్తుండయి చొక్కి [శృ.నై 2-105]
దక్షిణ దిశాభిముఖుండయి చనియెన్ [కాశీ 2-164]
నిస్పృహుండయి యుండంగ [భీమ 5-177]
చల్లనై యుండు [కాశీ 7-77]
అరుదై వచ్చితిమి [శృ.నై 3-46]
అడ్డమై చనుడు [శృ నై 3-95]
అచ్చెరువై వచ్చు [హర 1-73]

4 10 4 2 క్త్వార్థకములు క్రియా విశేషణములుగా రూపొందింపబడుట

కొనకొని రమ్మని [ప వీ 29]
పేర్చి యార్చినం గోపించి [శివ 4-83]
పదంపడి నిట్టూర్పు నిగిడించి [శృ నై 4-80]
మిగిలి జల్లుకొని వచ్చె [హర 7-38]

4.10.5 1 అవ్యయములు క్రియా విశేషణములుగా వాడుట

ఇంచుక [శృ.నై 4-4] తద్ద [శృ.నై 3-66]
పెల్లు [హర 6-137] మిన్నక [శివ 3-15]
బిట్టు [శృ.నై 2-1?3] క్రచ్చఱన్ [కాశీ 6-236]

కరమున్, ఇఁకన్, ఇంకన్, ఎల్లన్, ఒగిన్, కడున్, కతనన్, గ్రక్కునన్, పైన్, పోలెన్, మఱి, మాడ్కిన్, వలెన్, మొగి, నెమ్మి, పరువడి, శాసనములలో నిట్టివి కనబడవు.

4.10.5.2 ఔపమ్యమును బోధించు అవ్యయములు క్రియా విశేషణములుగా వాడుట కలదు.

| | | | |
|---|---|---|---|
| అట్లు | [శృ.నై 2-3] | లాగు | [శృ.నై 4-74] |
| పోలె | [కాశీ 2-49] | వలె | [శృ నై 6-10] |
| చందము | [శృ.నై 2-58] | వడి | [హర 6-96] |
| వంటి | [కాశీ 3-123] | పోని | [శృ.నై 1-72] |
| పోల్కి | [శృ.నై 2-44] | కైవడి | [శృ.నై 6-131] |
| మాడ్కి | [శృ నై 7-193] | వడువున | [హర 1-168] |
| కరణి | [శివ 2-13] | | |

2. రెండేసి ఔపమ్య రూపములను కూర్చి చెప్పుట శ్రీనాథునిలో నీక్రింది ప్రయోగమున తప్ప మరెక్కడను లేదు

అట్లవోలె [భీమ 5-181, 182]

నన్నెచోడునిలో : అట్లువోలె, కరణివోలె, చాడ్పునవోలె, భంగివోలె, మాడ్కివోలె, వడువువోలె, వలుపువోలె మొదలైనవి కన్పించును.

4.10.6.1 ధ్వన్యనుకరణ రూపములు (Onomatopoeia Forms) క్రియా విశేషణములుగా వాడుట గలదు.

| | | | |
|---|---|---|---|
| అసురుసురంచు | [ప వీ 53] | ఉస్సురని | [కాశీ 7 45] |
| ఉష్షని | [కాశీ 6-228] | ఒయ్యన | [హర 3-36] |
| కొంగొంగురనగ | [హర 5-16] | కొలకొలమంచున్ | [శృ.నై 3-13] |
| కోయని | [ప.వీ 37] | ఖంగని | [క్రీడా 275] |
| ఖణిల్లున | [కాశీ 3-23] | చయ్యన | [శృ.నై 8-154] |
| చిటుకన్ననుం | [క్రీడా 280] | చుఱ్ఱుమని | [శృ నై 6-130] |
| జిఱ్ఱున | [భీమ 6-65] | జివ్వంచు | [శృ.నై 2-119] |
| తమ్మనుచు | [శివ 4-42] | తటాలని | [క్రీడా 275] |
| త్రుస్సనన్ | [భీమ 5-119] | దడదడమని | [ప.వీ 47] |
| దిగుల్లని | [శివ 3-128] | భగ్గన | [కాశీ 7-76] |
| బుగ్గన | [శృ.నై 8-108] | బుస్సుమంచున్ | [హర 4-27] |
| మిలమిలని | [కాశీ 1-118] | మొఱోయని | [కాశీ 7-90] |
| వడవడ వడంకెన్ | [హర 7-78] | | |

పై రూపములందలి రెండవ భాగము 'అను' అను అసమాపక క్రియా రూపముతో సహజముగ గుర్తింపవచ్చును.

4.10.6.2 కొన్ని ధ్వన్యనుకరణ శబ్దముల వాడుక జాతియము అనవలయును.

వడవడ వడంకుచు నొంటికంట కనుఁగొనక [శృ.నై 2-35]
ఘల్లు ఘల్లనుచు [క్రీడా 223]
గిటగిటనగు వెన్నడుములు [చా మ 1-129]
గోలు గోలునన్ [శృ నై 1-110]
గ్రుక్కు గుక్కుకు [హర 6-126]
పిటిలు పిటిల్లనం [హర 2-22]

ఇట్టి వాడుక సర్వత్ర ఉన్నది. కొన్ని కొన్ని వాడుకలు మాత్రము ఇప్పుడు మారినవి.

4.10.6.3 కొన్ని ద్విరుక్త రూపములను క్రియా విశేషణములుగా వాడుట కలదు

అల్లనల్లన-పీచె[శృ.నై 4-133] అల్లల్లన [నడిచి పెట్టె][శృ.నై 1-102]
కరకర[బొద్దువాడిచె][హర7-139] చెచ్చెరన్ [హర 2-74]
తరతరమె [యుద్ధవిల్లంగఁదల్ల డిలుచు] [శృ నై 7 123]
దిగదిగన్ [భీమ 2-128] చుఱచుఱ [జూచి] [క్రీడా 235]
తరతరమ [భీమ 4-94] దిర్దిరం [దిరుగు] [భీమ 4-60]
వెలవెలం [బోయి] [శివ 4-83]
మెయి మెయిం [గబళించి] [కాశీ 4-68]
మెత్త మెత్త [నఱచేత నొత్తుకొనుచు] [హర 2-95]

4.10.7.1 నామరూపములు క్రియా విశేషణములుగా ఉపయోగింప బడినవి

అదరిపాటెవ్వడీక్షించు (అకస్మాత్తుగా) [కాశీ 5-257]
అల్లన సంచరింపనుంజాలక (మెల్లగా) [శృ.నై 2-112]
ఎస.... యెక్కించు మందాక్షమున్ (అత్యంతము,మిక్కిలి) [శృ నై 5-156]
ఎలగోలు వర్షించు నెన్నఁడేని (పెద్దరొదతో) [కాశీ 2-5]

దండడి గౌరిజల తాఁకున (అధికముగా) [హర 7-45]
బిట్టు మేల్కాంచి (తటాలున) [శృ.నై 1-101]
వెస మంచె సురేంద్రనందన (శీఘ్రముగా) [హర 7-70]
వేగిరము మూసి (త్వరితముగా) [కాశీ 2-121]

4.10.7.2 కొన్ని విశేషణములను క్రియా విశేషణములుగా వాడుట కలదు.

అలవోకయును బోలె నార్పఁగలిగె [కాశీ 6-96]
అల్ల నగి [శృ.నై 3-28]
ఏరాళంబు వికృతులెన్నేని యావిష్కరించె
(అసంఖ్యాకముగా) [శివ 3-71]
గొడ్డేటు కలఁక పట్టె (వ్యర్థముగా) [క్రీడా 248]
తటుకున... కాలధర్మము నొందెన్ (శీఘ్రముగా) [కాశీ 3-130]
మిక్కిలి గౌరవించుచున్ (అధికముగా) [శృ నై 6-31]
మెల్ల మెల్లన (మందముగా) [చా.మ 1-122]
విడ జాఱఁ జంచు లొకించు కాకుంచితముగ (కొంచెముగా) [శృ నై 1-98]
సరి నాచెఱకుల్ భరించి (సమానముగా) [హర 1-21]

4.10.7.3 కొన్ని నామములకు '-న్' '-న' '-నన్' అదనముగా చేరి క్రియా విశేషణములగుచున్నవి

-న్ : కరణి-న్ [హర 6-71] కడు-న్ [భీమ 2-102]
మరల-న్ [భీమ 4-163] క్రచ్చఱ-న్ [భీమ 3-160]
బిగ్గ-న్ (చుట్టిన) [హర 7-79] చయ్యనం-న్ (ఏగిరి) [భీమ 4-96]
పెల్చ-న్ (రండు) [భీమ 2-123] సరగ-న్ (చేసి) [శృ నై 6-46]
దిగదిగ-న్ [భీమ 2-128]

-న : గ్రక్కున (వైచె) [శృ.నై 3-98] మెల్లన [కాశీ 5-236]
మెత్తమెత్తన [హర 2-95]

-నన్ : చిరాలునన్ (పట్టి) [క్రీ.పీ 53] దబ్బ-నన్ పడియెన్ [శ్రీ.శృం. 34]

4 10 7 4 ఈ క్రింది ప్రయోగము తృతీయాంతముగనుండి క్రియా విశేషణమగు చున్నది.

వ్రాసెనొక్క లతాంగి .... దోడుతో మషీవర్ణములుగ (శీఘ్రముగా)
[శృ.నై 3-99]

4.10.8 1 ఈ క్రింది శబ్ద పల్లవ క్రియలందు పూర్వాంగమైన 'ఆరన్' అను నన్నంతము క్రియా విశేషణమగుచున్నది

అరఁగూరి · అప్పుడనలావరుద్ధత నారఁగూరి (చక్కగాపొంది) [శృ.నై 1-72]

అరఁగబండిన. పానపాత్రయును నారఁగఁబండిన
మాతులుంగమున్ (బాగుగా పండిన) [భీమ 2-57]

అఱఁ బండిన : పలుకంబాతి యాఱఁబండిన మారేడు [హర 3-23]

అర విచ్చఁగన్: విటతండము గుండియలారవిచ్చఁగన్ (బాగుగా) [చామ 1-133]

ఇది సమస్తమైనపుడే 'బాగుగా, చక్కగా' అను నర్థములందు కన్పించుచు క్రియా విశేషణముగా నున్నది. కాని 'ఆరన్/అరఁగన్/అఱన్/అర - అను వ్యస్తపదములకు ప్రత్యేకముగా నర్థమున్నట్లు తోచుట లేదు.

4.10.8.2 నామవాచకములు, సర్వనామములు, విశేషణములు, అవ్యయములు, అన్నియు క్రియా విశేషణములుగా వ్యవహరించుటకు యోగ్యములై యున్నవి. విభక్తి రహితములై యుండుటయే సాధారణ లక్షణమైనను క్వాచిత్కముగ విభక్తి సహితములై కూడ కనిపించు చున్న విషయము పైని చూపిన ప్రయోగములను బట్టి గుర్తింపవచ్చును.



## 4.11.0 పదకల్పములు (Clitics)

పదములకు గాని పదబంధములకు గాని పరమందు చేర్పబడు ప్రత్యయ రహిత శబ్దముల జాతిని పదకల్పములందురు[1] ఒకటి రెండక్షరముల ప్రమాణము కలిగి పదములతో, పద బంధములతో, ఉపవాక్యములతో నిర్మాణాత్మక సంబంధము కలిగి కారక సాధకములైన శబ్దముల జాతిని పదకల్పములని యందురు.[2] వీనిని అపదము లనియు వ్యవహరింతురు. అవి ధ్వన్యాత్మకములుగా అస్వతంత్రములే యైనను వానికి పదస్థితి కలదు కేవలము నిర్దిష్టములైన ప్రాతిపదికల వర్గములకు మాత్రమే నియతములై యుండునట్టి ఉత్పాదక పదాంశములకుగాని, నిష్పాదక పదాంశములకుగాని ఇట్టి పదస్థితి లేదు ఇవి అనేక విధములైన భావ భంగులను సూచించును ఇవి వేరువేరు భావభంగులను సూచించునపుడు పదములకు పరమందు చేరును ఇవి ప్రత్యయములు కా;వు పదతుల్య ప్రత్యయములు ప్రత్యయములు సాధారణముగా నిర్దిష్టములైన ప్రాతిపదికలమీదనే చేరవలసి యుండును. ఇవి అవిషయమున స్వచ్ఛందములై యుండును. వీనికి విస్తృతమైన అవకాశము కలదు. కాని స్వతంత్ర ప్రయోగార్హత లేదు

భిన్న పదములకు నీపదకల్పములు చేరుటచే కలుగు విశేషార్థముల ననుసరించివీనిని క్రింది విధముగ విభజింప వచ్చును

1 ఏవార్థకము (Emphatic particle)
2 ప్రశ్నార్థకము (Interrogative particle)
3. సందేహార్థకము (Expressive of doubt or surprise)
4. సముచ్చయార్థకము (Conjunctive particle)
5. కిలార్థకము (Assertive particle)
6. కొన్ని అవ్యయములు (Indeclinables)

---

1. "Clitics are a class of uninflected words which are suffixed to words or phrases" – William Bright : An outline of Colloquial Kannada, P.45.

2. Prof. Bh Krishnamurti: Konda or a Dravidian Language, P. 327.

ఈ క్రింద చూపబడిన పదకల్పములు శ్రీనాధుని కావ్యభాషలో భిన్నార్థములలో ప్రయోగింపబడినవి

### 4.11.1 ఏవార్థకము : (Emphatic particle)

11-12 శతాబ్దులలో ఏవార్థక పదకల్పము 'అ'. నన్నయలో ఇదియే ఉన్నది. నన్నెచోడునిలో 'అ' తో పాటు కొన్ని ప్రయోగములలో 'ఏ' అను పద కల్పముకూడ కనబడుచున్నది. సమకాలపు శాసనములలో అ/ఏ లు ప్రక్కప్రక్కన వాడబడి ఉండుటనుబట్టి ఈరెండు పదకల్పములు ఆనాడు వ్యవహారములో నున్నవని తెలియును. క్రమముగా నాధునిక భాషలో ఏకారమునకు వ్యాప్తి హెచ్చి అకారము లోపించినది.

శ్రీనాథునిలో -అ, -ఎ/-ఏ అను పదకల్పములంతమున చేరి ఏవార్థకము లగుచున్నవి.

4.11.1.1 -అ : నామములకు, సర్వనామములకు, పదబంధములకు, అవ్యయములకు క్రియాపదములకు చివర -అ చేరును [480]

హింస నీకు వేడ్కయగునేని [శృ నై 1-107]
అనంతరంబ [హర 2-107]
తనకు దానవారికి [హర 6-104] చెప్పిరేని [హర 6-108]
దివ్యపో జ్ఞానమంత్రుడు [కాశీ 3-69] నీ [illegible] [భీమ 4-76]
యుద్ధము సేయఁజాలకయ [శివ 4-62] అడంగిన [భీమ 4-193]
ఇదియును నాఁడువరంబలిన [కాశీ 4-112] మూర్ఛిలిన [క్రీడా 123]
వాసవు కోదండంబు సంధ [భీమ -110]
తారచేసిరి [భీమ 4-197]
నీవ ప్రమాణంబు [కాశీ 2-98] పిలుచిన [శృ నై 2-46]
నేన యీ యర్థము [కాశీ 7-247] వచ్చినప్పుడ [శృ నై 2-124]
వారపో ధన్యపుతులు [భీమ 3-173] ఈతండ [శృ నై 5-67]
కృష్ణద్వైపాయనుతోడిద లోకము [భీమ 4-14]
లేకయ [కాశీ 5-320]

తనుంగనిన నీశ్వరుండంచు[భీమ 5-45]
ఇచ్చోటనయుండుదుంజుమీ[శృ.నై 2-35] ధరించియు [శృ నై 3-118]
వేఱ చెప్పంగ వలయునే [శృ.నై 3-130]
అతఁడ యంతటఁ బోవ [శృ.నై 3-158]
అట్లుపలు తెఁగఁచెన నానిఱుపేద [శృ.నై 4-73]

4.11.1.2 -ఎ/-ఏ : నామములకు, సర్వనామములకు, అవ్యయములకు, క్రియా పదములకు చివర చేరును.

-ఎ : చక్కఁకుండుదురె [శృ నై 2-47] గుణంబె [శృ నై 2-109]
వీరె సఖులు వచ్చుచున్నవారు [శృ.నై 2-98]
ఖలుఁడు వీఁడె [శృ.నై 2-122]
వచ్చునె వానిఁగానఁగాన్ [శృ నై 3-23] ఇదె [శృ నై 4-82]
ఏము నేరమె వంచింప [శృ.నై 4-59] పొగడఁదరమె [హర 5-20]
తుదిదాఁకుఁట గాదెఁ [శృ.నై 5-21] శక్యంబె [భీమ 1-93]
ఏలవలదె తనకు [భీమ 3-9] ఆరగించితె [కాశీ 7-190]
ఇతఁడె [శృ.నై 6-69] వాఁడె [హర 7-113]

-ఏ : నీ భాగ్యంబు సామాన్యమే[శృ.నై 1-18]వేంచేసెనే [హర 3-131]
తగవే కులకన్యలకును [శృ.నై 4-61] బ్రహ్మకు వశమే [భీమ 3-30]
అద్దేకాక విభూతియందుకొని[హర 2-8] నాకెఱింగింపవే [భీమ 4-47]
శివుఁడే విశ్వము [కాశీ 2-58] కావఁడే [కాశీ 4-40]
రక్షింపఁడే [కాశీ 4-40] ఇతఁడే [శృ.నై 3-42]

## 4.11.2 ప్రశ్నార్థకము : (Interrogative particle)

నన్నయ భాషలో ప్రశ్నార్థకమున -ఎ/-ఏ అను పదకల్పములును, నన్నెచోడునిలో నీపదకల్పములకు తోడు -అయ్య అను పూజ్యార్థకానుబంధమును చేరుచున్నవి. 13వ శతాబ్ది నుండి ప్రశ్నార్థకమున -ఎ/-ఏ అను పదకల్పమునకు తోడు, -ఆ అను పదకల్పమును వాడుకలోనికి వచ్చినది. క్రమముగా నిది వ్యాప్తిచెంది 'ఎ' లోపించినది నన్నయ, నన్నెచోడులలో -ఎ అను పదకల్పము తిక్కన శ్రీనాథులలో -ఎ/-ఏ లతోపాటు -ఆ కూడ వాడబడినది.

**4.11.2.1** -ఎ/-ఏ; -ఆ అను పదకల్పములు నామవాచకములకు, క్రియలకు చేరును. స్వర భేదము చేత ప్రశ్నించిన విషయము యొక్క వ్యతిరేక నిశ్చయమును కాక్వర్థమును తెలుపును.

-ఎ : బేలవె ? ననున్ శక్యంబె పట్టంగ [శృ నై 2-47]
ముగ్ధలకు గలదె ? [శృ నై 4-3]
ఇవ్విధంబున్న లోకంబులెల్ల నగరె ? [హరి 4-28]
స్నానమాడెనె ? [కాశీ 4-86]
కానని తీర్థముల్ గలవె ? [భీమ 3-13]
ఎక్కడలేరె వేల్పులు ? [హర 4-6]
కంటికి నిద్రవచ్చునె ? [కాశీ 1-108] దివికిరావించిన దిక్కుగలదె ? [శృ నై 4-85]
తీర్థములు పెక్కులాడినతీర్థమగునె? [కాశీ 3-76]
మమ్మాదరించిన తెఱంగె ? యనఘ [శృ నై 4-59]
ఓగిరముగ సుతునిఁజంపుటుచితమె? [హర 2-98]

ఏ- : అతిక్రమింప వచ్చునే ? [శృ.నై 8-90] మీతండ్రియే ? [హర 3-74]
సుఖంబగనే రతికేళి ? [కాశీ 1-108] ఒరునన్వేషించునే? [హర 4-24]
అన్యాయముసేయునే ? [శివ 3-91] వార్చునే ? సంధ్య [కాశీ 4-86]
ప్రసిద్ధంబు కాదే ? [భీమ 3-14] పుట్టకుండునే ? [కాశీ 4-201]

-ఆ : అతనికెయ్యది దెప్పచెప్పుమా ? [శృ.నై 2-59]
లెస్సలా ? పూవుఁబోఁడి [కాశీ 2-71]

## 4.11.3 సందేహార్థకము : (Expressive of doubt or surprise)

**4.11.3.1** నామములకు, క్రియలకు -ఒ/-ఓ అను పదకల్పములు చేరగా సందేహార్థకము లేర్పడుచున్నవి

-ఒ : అతని కీఁదగుదునో తగనో యంచించు కించుక [శృ.నై 1-70]
బలుఁడవో, యైలబిలుకూర్మి యాత్మజుఁడవో
పంచబాణుండవో దేవపతి సుతుఁడవో
నిజము దప్పక చెప్పుము నిషధపతివో [శృ.నై 4-8]

నిజమొ కల్లయొ కాని [హర 2-97]
ఎల్లన్ శిష్యులఁ గొంచు వత్తునో [భీమ 2-120]
అప్పగింపిరో లేదో యధిపుఁగూర్చి [కాశీ 2-86]
పరించెదవో [శృ.నై 4-48]
రాత్రియొ [శృ నై 6-137]
చెట్టవట్టెదవో [శృ.నై 4-48]
ఉన్నారా [కాశీ 7-76]

-ఓ . చంద్రుండో ౹ యుపేంద్రుండో ౹ కంతుండో ౹
జయంతుఁడో ౹ యని [శృ.నై 4 2]
మీనకేతనుని దివ్యశరంబులు పువ్వుమొగ్గలో [శృ.నై 2-36]
ఒనుగవ ఘనమో జఘనమో ఘనమో [శృ నై 5-16]
అది దాక్షారామ మహిమ మగునో కాదో [భీమ 1-113]
శూద్రుఁడో ? బ్రాహ్మణుండో [కాశీ 7-49]
ఎఱుఁగుదో ? యెఱుఁగవో [కాశీ 7-59]

**4.11.3.2** -ఒకొ/-ఒకో, -ఒక్కొ/ఒక్కో - అను పదకల్పములు నామములకు క్రియలకు చేరుటచే సందేహార్థక. ప్రశ్నార్థక, ఆశ్చర్యార్థక, సంభావనార్థకము లగును.

**-ఒకొ :**

సందేహార్థకము : హరిహయుఁడేమి యయ్యెనొకొ [శృ నై 4-65]
ప్రశ్నార్థకము : ఎవ్వరొకొ ? వీరు [కాశీ 3-168]
ఎక్కడఁబోయెనొకొ ? [కాశీ 6-280]
సంభావన ఎక్కడ బోయె నొకొ [కాశీ 6-28]
ఎంతభాగ్యమొకొ [హర 2-88]

**-ఒకో :**

సందేహార్థకము : మాసపేంద్రుం డెవ్వండొకో యని [శృ నై 3-20]
ఇదియేమి ఘోషంబొకోయని [శృ.నై 3-50]
ప్రశ్నార్థకము : పేరొకందొకనితోఁగలహింప సహించి తెట్లొకో ?
[శృ.నై 8-133]

అర్థ్వుండొకో ? యయ్యా [కాశీ 7-74]
ఆశ్చర్యార్థకము : శిరములకు విరులు కల్పించునొకో [భీమ 2-8]
సంభావన : ఏమని తలఁతురొకో [శృ నై 4-93]

-ఒక్కొ :

సందేహార్థకము : ఎటుసేసెనొక్కొ తా సీతపంబు [కాశీ 4-148]
ఎవ్వరొక్కొ వీరు [కాశీ 3-138]
ప్రశ్నార్థకము : నిషధనాధుని కెవ్వతెయొక్కొ భార్య [శృ.నై 2-58]
వరుఁడెవ్వఁడొక్కొ? యీతలిరుఁబోఁడికి [కాశీ 5 328]
సంభావన : ఎవ్వతెయొక్కొ యీయిందు బింబానన [కాశీ 4- 49]
ఫలమేమియొక్కొ యీపటుసాహసమునకు [శృ నై 4-8]

-ఒక్కో :

ప్రశ్నార్థకము : నిర్వ్యథన కలన మదియెట్లొక్కో ? [శృ నై 3-187]
సంభావన : ప్రకృతి విరోధంబె వెంట గలిగెనొక్కో [శృ నై 8-196]

## 4.11.4 సముచ్చయార్థకము : (Conjunctive particle)

నన్నయలో -ఉన్ సముచ్చయార్థకము పదకల్పము. -ను, ని వాని రూపాంతరములు. సముచ్చయ నకారము లోపించి పూర్వ స్వరమునకు దీర్ఘము వచ్చుట శాసనములలో 11వ శతాబ్ది నుండి, కావ్యభాషలో 13వ శతాబ్ది నుండి కనబడు చున్నది.[3]

తిక్కనలో : నమ్మి నమ్మని [భార.శాంతి 2-351]
శ్రీనాధుని చాటువులలో : చల్లాయంబలి ద్రావితిన్

4 11.4 1 శ్రీనాథుని భాషలోని సముచ్చయార్థకము లీక్రింది విధముగ నున్నవి.

1. అదిదంత నామములకు, క్రియలకు -ఉన్, -ఉను, -ఉనున్ అనియు, ఉదంతనామములకు -న్, -నున్, అనియు సముచ్చయ పదకల్పములు చేరును.

---

3. తె. మహాదేవశాస్త్రి : 'కావ్య భాషా పరిణామము' తెలుగు భాషా చరిత్ర, 1974 పుట-231.

-ఉన్ : నీడయున్ [కాశీ 4-246] సమృద్ధియున్ [హర 2-142]
వనజముఖియున్ [శివ 2-94]
-ఉను : వినియును [కాశీ 2-113]
-ఉనున్ : అదియును నొక [హర 2-67] అంగనయునున్ [శివ 2-94]
ముద్దియయునున్ [శివ 2-94] విద్రుమాధరయునున్ [శివ 2-94]
-ను : సిరియాలుఁడును [హర 2-30] మగఁడును [కాశీ 6-29]
-న్ : మాంసంబులున్ ( )
-నున్ : కన్నునున్ [శివ 2-30] వినినునున్ [హర 2-142]
హుతవహుండునున్ [శృ.నై 5-173)

2. -ఉన్ : అను సముచ్చయము ఈ క్రింది రూపములో అత్యంతార్థము (emphasis) నందు ప్రయోగింపబడినది.

నానేర్పొప్పగా నెంతయున్ నీకై పూజయొనర్తు [హర 7-96]
ఇన్నియు నట్లుండనిమ్ము (కాశీ 6-89)

3. -ఉన్ అను సముచ్చయము 'ఏని' అను పదకల్పముతో కలిసి చేదరకమున ప్రయోగింప బడినది.

తన్నును దియ్యదనంబు
వాసనాయోగము గల్గెనేనియు (కూడ అనునర్థము) (శృ.నై 2-82)
ఇంచుకయేనియుఁదాల్మి లేక- (కాశీ 7-181)
ఒకించు కేనియున్ (శృ.నై 8-79)
ఎబ్బంగి ప్రాణ ముపేక్షించితేనియు వైవస్వతునికబ్బువాంఛితంబు
(అయినప్పటికి) (శృ.నై 4-75,
ఎక్కడకేనియున్ (కాశీ 6-92)

4. -ఉన్ అను సముచ్చయము ఈ క్రింది రూపములలో అప్యర్థము నందు ప్రయోగింప బడినది.

భూమిపాలకునిచే నాశ్లిష్టమయ్యున్మదిన్ (శృ.నై 3-114)
వైదర్భి కాముకుండయ్యును నయ్యాది గర్వైశ్వరుండు (శృ నై 3-73)

5. -ఉన్ అను సముచ్చయమునకు అయ్యు (<అయి : అగు క్త్వార్థకము) చేరి 'అయినప్పటికి' అనునర్థము నిచ్చును.

వీర రస గర్భితంబయ్యు వి స్తరిల్లె (హర 7-10)

6. -ఉన్ అను సముచ్చయార్థకము నందలి -ఉన్ అను పదకల్పము మీద తిరిగి -ఉన్ అనునది ఆగమమగుచున్నది.

ఇదియునుంగాక (హర 7-61)
అనుకరించునదియునుంబోలె (శృ నై 2-46)

4.11.4.2 'ఏని' అను పదకల్పము భిన్నార్థములలో ప్రయోగింపబడుచున్నది.

1. 'ఏని' అను పదకల్పము సాధారణముగా చేదర్థకమును సూచించును.

ఇచ్చగలదేని గూర్చుండుమిందు వచ్చి (యెడల అని అర్థము) (శృ నై 4-6)
వేలార్చితేని (భీమ 4-68) చేసెదవేని (హర 7-20)
రజ్జువల్లరి మీఁద బ్రణయంబు గలదేని యంతరిక్షంబేలు (శృ.నై 4-7)
ఇందఱుఁగొని పోయితేని వత్తు (హర 2-139)
వింటేని (శివ 2-106)

2. కొన్నియెడల నామమునకు విశేషణమునకు మధ్య 'ఏని' వాడుటచే విశేషణము యొక్క అర్థమునకు ఆధిక్యము కలుగుచున్నది.

పెద్దగాలమేనిఁ దపము చేసిన (కాశీ 4-171)
పెద్ద యేనిఁ దడవు (శృ.నై 4-117)

3 ప్రశ్నార్థక సర్వనామములకు 'ఏని' అను పదకల్పము చేరి అనిర్దిష్టార్థము నిచ్చుచున్నది.

ఎందేని : ఎందేనియుం జనువాడ (ఏ ప్రదేశమునకైనను) (కాశీ 4-110)
ప్రవహించు నెందేని భాగీరథీ గంగ (కాశీ 7-147)
నారదుం డెందేనియుం జనియె (కాశీ 1-105)
ఎందేని జనుట యొప్పు (భీమ 1-14)
ఎక్కడికేని : ఎక్కడికేనియుం జనుదురు (కాశీ 2-79)

ఎంతేని : కొడుకు శపియింప దిబ్బంగి గ్రూర బుద్ధి (కాశీ 4-269)
శీతకాలంబెంతేనియు నిద్రవోదురు (శివ 4-27)
నిశల్ సంభోగ లీలావధిన్
లేవడి యెంతేని జీవనంబు (శృ.నై 1-109)
ఎన్నేని : వరములెన్నేని యా పతివ్రతల కొసఁగి (భీమ 5-55)
ఇంచుకేని: అంతరంగములఁ బ్రత్యయమొంద రోకించుకేనియున్ (శృ.నై 3-115)

4 'ఒండు' శబ్దములతో కూడిన ఏని వికల్పార్థమును తెల్పును.
విహారాపేక్ష నొండేని ధర్మ నిరాసంబున (కాశీ 5-45)
అష్టమీ భానువాసరంబందు నొండె నొండెనేని చతుర్దశి (భీమ 6-72)

5 'ఏని' అను పదకల్పము అనిశ్చయార్థము నిచ్చుచున్నది
ఎద్దియేనియొక రంధ్రం బబ్బెడుం గాక (కాశీ 7-118)

4.11.4 3 వచ్ ధాతువైన 'అను' కు క్త్వార్థక రూపము 'అని'. రెండు వాక్యము లను కొన్ని విశేషార్థములలో అనుసంధించుటకు ఈ 'అని' శబ్దము పదకల్పముగా ప్రయుక్త మగును.

1. పలికి, చెప్పి అను నర్థములలో :
పాతెడు నీళ్ళకుం గట్ట పెట్టం బనియేమి ?
పొదంపు పొదం దని పోయిరి (శృ.నై 7-122)
అప్పరమేశ్వరు నిట్లని స్తుతియించిరి (హర 6-72)
చూడుండని మఱియు నిట్లనియె (కాశీ 2 10)

2. అవయవ సూచకముగ 'అని' వ్యవహరించును. ఇక్కడ ఇది క్రియ కాదు క్రియఅయినచో సాధారణముగా కర్త ఉండును. ప్రముఖమైన సొంత అర్థమేమి లేక వ్యాకరణ నిర్మాణ బోధను ప్రధాన ప్రయోజన ముగ గల శబ్దములు అవయవసూచకములు.[4] (Costructicn marker)
సురలు మునులు
రాక్షస కృతావరోధ సంరంభమింకఁ

---

1 ప్రొ॥ చేకూరి రామారావు : తెలుగులో 'అని చేసేపని' - అక్షరాభ్యాస - 1972 పుట 253.

దమకు లేదని తెలిసిరి తత్త్వ బుద్ధి [భీమ 4-157]
ఇక్కడ 'అని' కి వచ్యర్థము లేదు. అసలిక్కడ ఇది క్రియకాదు.

3. అనుకరణము సందును. ధ్వన్యనుకరణము నందును 'అని' అనుబంధముగా ప్రయోగింపబడును.

అతండుస్సురని నిజస్థానంబునకుం బోయి [కాశీ 7-45]
చుఱ్ఱుమని మూర్ధములు దాఁకి [శృ.నై 6-130]
మిలమిలని జిలుగు వలిపంపు వలువల [భీమ 1-118]
నెమలి పల్కెడుఁ గేఁగో యని [క్రీడా 51]
మొఱోయని యుచ్చైర్ధ్వనిఁ గూఁత వెట్ట [కాశీ 7-90]

4. హేత్వర్థము :

వినత యేమికారణమున దాస్యంబువహింఁచెనని యడుగుటయు [కాశీ 6-15]
తగవుగాదని రాదయ్యెఁదాత వేల్పు [శృ నై 4-129]

5. ఉద్దేశార్థము :

మాదివ్యత్వము నీకునిత్తుమని సంభావింప [శృ నై 4-43]
దీనిస్థానమున 'అంచు' అనియు కలదు.
అంబిక కంచుఁదెచ్చిన మహామణి సంఘము ప్రోగుపోసి [కాశీ 6-167]

## 4.11.5 కిలార్థకము : (Assertive particle)

4.11.5.1 .ఇందు -కద/-కదా, -కదె/-కదే, -కాదె/-కాదే, -కదమ్మ, -కదయ్య, -కదవె/-కదవే, -కదరా, -కదవయ్య - అను పదకల్పములు సందర్భానుసారముగా ప్రసిద్ధి నిశ్చయుము, సంతాపము, ప్రార్థనము, ప్రశ్న మున్నగు వానిని సూచించును.

-కద : నిశ్చయమునకు : దారపరిగ్రహమే కద సారపుధర్మములకెల్ల [హర 4-44]

ప్రసిద్ధికి : కలవాడు మీరలేగద [ప పీ 31]

-కదా : సంతాపమునకు : వైరి మదకుంభి కుంభ వి
దారణ దారుణ కృపాణ ధారలు పరిఘా

కారములు కందమూలో
ద్ధారములకు బాలుపడెఁగదా నీకరముల్ [హర 7-18]
నిశ్చయమునకు ; భక్తులకు భస్మమే కదా ప్రాణరక్ష [హర 2-85]
ప్రశ్నమునకు : ఏదిహేతువు దప్ప నొడంగదా ? [శృ.నై 4-91]
ప్రసిద్ధికి . ఈ శరీరంబు పరోపకారార్థము గదా [శృ.నై 2-57]
ఆశ్చర్యార్థకము . పుట్టించినవాడు కుసుమశరుడు కదా ! [హర 3-91]

-కదె : ప్రార్థనమునకు : మేలుకొనఁగదె రాజన్యమీనలక్ష్మ [శృ.నై 8-13]
-కదే : ఆశ్చర్యము : నీవెంతేదవ్వగ నేఁగుదెంచితి గదేయేలమ్మ ! [శృ.నై 2-47]
-కాదె : ప్రశ్నమునకు : ఓరిమపైనుంట నీకొప్పు గాదె ? [శృ.నై 3-126]
గరుడుండు మోమోటఁగాదె? [శృ.నై 2-107]
-కాదే : నిశ్చయము : సర్వకార్యహరమగుఁగాదే [హర 6-26]
-కదమ్మ : ప్రసిద్ధి : గోదావరి తల్లి సం
పాదింతుగదమ్మ నీవు భవ్యశుభంబుల్ [భీమ 4-169]
-కదయ్య: ప్రార్థనము : కృపఁదలంపగ దయ్య యోనృపవరేణ్య [శృ.నై 1-169]
ప్రశ్నము : ఆదనుఁదప్పిన దలఁగి యంతంత నున్న
వారు లేరు గదయ్య మీవంగడమున? [కాశీ 7-191]
-కదవె : ప్రార్థనము : నన్ను గౌగలింపంగఁగదవె [క్రీడా 95]
-కదవే : ప్రార్థనము : అనుగ్రహింపఁగదవే ! నీరేజపత్రేక్షణా ! [శృ.నై 8-52]
-కదరా : సంబోధనార్థకము ; గాలెఱుకున గొఱఁతిడి యిట జీటంబున
వేడ్కయెల్లఁజెఱచితి కదరా [హర 7-52]
-కదవయ్య : ప్రార్థనమునకు: కావఁగదవయ్య యర్థార్థి కల్పశాఖి[శృ.నై 1-109]

## 4.11.6 కొన్ని ఇతర అవ్యయములు : (Indeclinable)

4.11.6.1 -కాక/-కాని యను నవ్యయములకు వ్యంజకత్వము పెక్కురీతులుగా కనిపించును.

4.11 6.2 -కాక అను నవ్యయమ్ము అగు ధాతువు యొక్క వ్యతిరేక క్త్వార్థకరూపము. ఇది సందర్భానుసారముగ పెక్కు విధముల ప్రయోగింప బడుచున్నది.

1. వికల్పార్థము : వరము వేడిన వేఁడవచ్చుఁగాకిబ్బంగి [కాశీ 3.224]

2. కాని అను అర్థము : పురావిహిత కర్మం బెట్టిదో కాక లక్షణ
కాలుష్యము రాజయక్ష్మమును జిక్కం
బెట్ట లేఁడయ్యెడున్ [శృ.నై 8-185]
నీలకంఠుఁడింత చేసెనుగాక కూడేమిప్రాఁతి
[భీమ 2-114]

3. అంతమాత్రమే కాని అనునర్థమును దెలుపును. : కొందఱు, నియమ పరులు పాదసరసిజ
యుగళ ప్రసాదమాత్రమచ్చెదరుగాక
మనభాగ్య మల్పమగునె [హర 2-42]

4. ఆశీర్వాదమును తెలుపును. : ఉత్తర కర్మంబవిఘ్నంబగుంగాక [శృ.నై 4-110]
కుసుమ వర్షంబు మీమీద కురియుఁగాక
[శృ.నై 2-94]

5 శాపమును తెలుపును : మూఁడు తరములఁజెదుఁగాక
మోక్ష లక్ష్మి [కాశీ 7-158]

6. అన్యార్థ నిషేధమును తెలుపును : ఆలుమగదును నొక కుత్తుకై నఁగాక
యిట్టి ధర్మంబు మిన్నక యేలకలుగు [హర 2-60]

7. నిశ్చయమును తెలుపును : భూభుజుల తప్పె యది వారిఁబొందియున్న
ధరణిసామ్రాజ్యభూతంబు తప్పుగాక? [కాశీ 4-202]

8. లక్ష్యపెట్టక అనునర్థమున : లావునను గూడి పాణిపల్లవయుగమున
నొత్తిపట్టిన సరకుగాకుల్లసమున [శృ నై 7-179]

10. అదనముగానను నర్థమున : ఎవ్వనికే మనోవికారంబు పుట్టకుండునే ?
అదియునుంగాగ [కాశీ 4-201]

11. కాకేమి-నిశ్చయాత్మకము : ఏమన్న ననియెఁగాకేమి మీయేలిక [కాశీ 6-221]

4.11.6.3 -కాని అను అవ్యయము అగు ధాతువు యొక్క వ్యతిరేకార్థక విశేషణము

1. సంభవింపని, తగని మొదలగు నర్థములను దెలుపును.
కాశి మనబోంట్ల కెల్లను కాని బ్రతుకు [తగని బ్రతుకు][భీమ 2-159]

2. తక్క అను నర్థమును తెలుపును. దీనికి తరువాత వచ్చు క్రియ వ్యతిరేకార్థముగ నుండును.

చక్రఘోషమున నించుక యించుకగాని యంతయేర్పడ
వినవైతి [శృ.నై 2-58]

అనేక లోకంబులు గడచికాని వైకుంఠపురంబునకుంబోవరాదు
[కాశీ 3-138]

3. పూర్వోక్త విరుద్ధమగు నర్థమును స్ఫురింప చేయును.
జలద కాళిమంబాపంగఁ జాలెఁగాని
సహజ కాళిమబామంగఁ జాల దయ్యె [శృ.నై 8-187]

4. కానీ : వికల్పార్థమును తెలుపును.
ననుఁగానీ శంభు గానీ రమేశ్వరు గానీ.. [కాశీ 2-9]



# 5. వాక్య విజ్ఞానము (SYNTAX)

5.1.0 భాషయందు మిక్కిలి ప్రధానమైనది వాక్యము. వాక్యము వలననే మన భావములను స్పష్టముగా నొకనికి తెలియజెప్పుటకును, ఇంకొకని భావములను మనము తెలిసికొనుటకును అవకాశము కలుగు చున్నది. కేవలము వర్ణముల వలనగాని, శబ్దములవలనగాని భావ బోధ జరుగదు వాక్యము వలననే సమగ్ర భావబోధకు అవకాశము కలదు.[1] కావున వాక్యమును భాషా శాస్త్రము నందు పరమప్రమాణముగా గ్రహింతురు.

తెలుగు వ్యాకరణములు వాక్య నిర్మాణమునకు కావలసిన అంశముల నన్నింటిని విడివిడిగా పేర్కొన్నవి. కాని వాక్యస్వరూపమును నిరూపించుటకు పూనుకొనలేదు. ప్రౌఢవ్యాకరణము 'వాక్యపరిచ్ఛేదము' అనుపేర నొక ప్రకరణమునే చేర్చుకొన్నది.

ప్రతిభాషకు ఒక సంప్రదాయముండును. ఆ సంప్రదాయము ననుసరించి వాక్య నిర్మాణము సాగుచుండును. మాతృభాష యందు మాటాడువాడు అప్రయత్న సిద్ధముగనే ఆయారీతులను గ్రహింపగల్గును విషయ ప్రధానమైనది వాక్యము.[2] విషయము ఉద్దేశ్యము విధేయము నని రెండు విధములు. విధేయము కొన్ని యెడల నామ మాత్రమై యుండును. కొన్నియెడల సమాపక క్రియాత్మకమై యుండును. 'వాక్యమున్నా యోగ్యతాకాంక్షా సహితంబగు నర్థముగల యాసత్తి యుక్త పద సముదాయంబు' అని ప్రౌఢ వ్యాకర్త నిర్వచనము. [వాక్య –1]

ఆంగ్ల ప్రక్రియననుసరించి వాక్యమును మూడు విధములుగా పరిగణింప వచ్చును.

1. సామాన్యము (Simple)
2. సంశ్లిష్టము (Comlex)
3. సంయుక్తము (Compound)

## 5.1.1 సామాన్యవాక్యము : (Simple sentence)

ఒక సమాపక క్రియను మాత్రమే కలిగి యుండి అసమాపక క్రియలకు అవకాశము లేని వాక్యమును సామాన్య వాక్యము అని యనవచ్చును. సామాన్య

1. స్ఫూర్తి శ్రీ: తెలుగు భాషా చరిత్ర, పుట - 373.
2. ప్రౌఢ : వాక్యపరిచ్ఛేదము 5

వాక్యములలో ఒకే అఖ్యాతము (Predicate) ఉండును. సామాన్య వాక్యములో అంతర్గతమైన భేదము లున్నవి. వానిలో నతిసామాన్యమైన దానిని నిశ్చయార్థక మందురు. సామాన్య వాక్యమును కొన్ని మార్పులు చేయుట వలన వ్యతిరేక, ప్రశ్న, కర్మణి మొదలైన వాక్య భేదములను సాధింప వచ్చును ఇదికాక విధి, సంప్రార్థ నాద్యర్థక వాక్యములు కూడ ఉన్నవి. ఒక వాక్యమునకు కిల, సంబుద్ధ్యాద్యర్థక ప్రత్యయములు చేర్చుట వలన సామాన్య వాక్యములో మరికొన్ని అర్థభేదము లేర్పడును తెలుగులో కొన్ని వాక్యములు క్రియా రహితములు, కొన్ని క్రియా రహితములు. క్రియారహిత వాక్యములలో కొన్ని సహజముగా క్రియలేని వాక్య ములు. మరికొన్ని క్రియ లోపించిన వాక్యములు ఉండును.[3] క్రియలేని వాక్యములలో రెండు నామబంధము లుండును. అందులో ఒకటి ఉద్దేశ్యము మరొకటి విధేయము. ఉద్దేశ్యవిధేయ నామములు రెండును ఏక వస్తు బోధకములు ఉద్దేశ్యనామములు ఏనామములైనను కావచ్చు. సర్వనామములు కూడ కావచ్చు. విధేయ నామములు సిద్ధ నామములు, విశేష్యములనుండి సాధించిన నామములుగా నుండును. ఉద్దేశ్య, విధేయ నామములు రెండును విశేషణ పదపూర్వకమై ఉండవచ్చును.

శ్రీనాథుని భాషయందు గల సామాన్య వాక్యములీక్రింద ఉదాహరింపబడినవి.

నీవు తుంబురుండవు. శిరియాలుండు కుమారస్వామి
తిరువెంగనాంచి యచ్చర. [హర 2-138]

అవ్వీర మహేశ్వరు నాకుం జూడవలయు. [హర 2-14]

## 5.1.2 సంశ్లిష్ట వాక్యము : (Complex Sentence)

ఒకవాక్యములో నిర్దిష్టమైన స్థానములో నింకొక వాక్యమును చేర్చిన యెడల సంశ్లిష్ట వాక్యమేర్పడును. లేదా ఒక సామాన్య వాక్యమునకు అసమాపక క్రియా రూపములున్న ఉపవాక్యములను చేర్చుట వలన సంశ్లిష్ట వాక్యములు ఏర్ప డును. కొన్నింటిలో క్రియ భావార్థక నామముగాని, క్రియాజన్య విశేషణముగానియై యుండును. కాలబోధ ప్రధానక్రియ ననుసరించి ఉండును. క్రియాజన్య విశేషణములో కాలబోధ ఉండును ప్రధాన వాక్యమును గర్భివాక్యముగను ఉపవాక్యములు గర్భ వాక్యములుగను భాషా శాస్త్రములో వ్యవహరించెదరు.

---

3. ప్రొ॥ చేకూరి రామారావు : తెలుగువాక్యాలు, పుట-1

1. 'జీవన్ భద్రాణి పశ్యతి' యను వేదవచనంబవలంబించి [హర 2-77]

2 భూభువనంబు భరియింపనినాఁడు భుజంగపు శేఖరుండు
మృణాల పేశలంబగు ఫణామండలంబుననిడి భరింప సమర్థుండగునే
[హర 4-63]

3 అని పలుకుచు సంభ్రమించు సఖీజనంబుల కలకలంబాలించి, యిదియేమి కోలాహలంబని భీమ భూపాలుండు దేవీ సహితుండై యడుగ, దద్వయస్యా జనంబులు దారెఱిగిన తెఱంగెల్లను విన్నవింప నన్నరనాథుండు ముద్దుగూఁతు మనోభిలాషంబునకు ననుకూలంబుగా జగంబునందెల్ల స్వయంవరంబుఁ జాటింపంబంచిన [శృ.నై 2-142]

## 5.1.3 సంయుక్త వాక్యము : (Compound sentence)

రెండుకాని, అంతకంటె నెక్కువకాని వాక్యములు సంబద్ధములై యేకాన్వయము కలిగి యున్నయెడల ఆ వాక్యముల సముదాయమును సంయుక్తవాక్యమని యందురు లేదా కొన్ని సమాన ప్రతిపత్తిగల వాక్యములు కలిసి ఒక వాక్యముగ ఏర్పడి సంయుక్త వాక్యమగును 'లేకున్న' 'కావున' మున్నగు సముచ్చయములు పూర్వపర వాక్యములను సన్నిహితము గావించును. కొన్నియెడల అట్టివి లేకుండగనే అన్వయము కలుగును.

'నామై సెమర్చుటకుం గారణంబు సెప్పెద నా కర్ణింపుము.[హర 1-28]

## 6.2.0 పదక్రమము : (Word order)

తెలుగు వాక్యములో సాధారణముగా నుండు పదక్రమముకర్త-కర్మ-క్రియ.
'పారాశర్యుండు వాతాపి దపనున కిట్లనియె' [భీమ 2-94]

5 2 1 కర్తకు విశేషణములైనవి కర్తకు ముందుగను, కర్మకు విశేషణములైనవి కర్మకు ముందుగను, క్రియకు విశేషణములైనవి క్రియకు ముందుగను వచ్చును.

'ఏనిక మోము తాల్పెలుక నెక్కిన రావుతురాజు సౌరసే
నాని యనుంగుఁబెద్దన వినాయక దేవుఁడు కర్ణతాళ ఝుం
ఝూనిల తాడనంబున నిరంతరమున్ బ్రబలాంతరాయసం
తాన మహా ఘనాఘన కదంబములన్ విదళించుఁగావుతన్' [భీమ 1-2]

5.2 2 క్రియాపదము లింగ విభక్తి వచనముల యందు కర్తకు అనురూపమై యుండును.

'తరికొనియెం జగత్త్రియము, తల్లడమందిరి నెమ్మనంబులన్
సురగరుడోరగామరులు, స్రుక్కెఁ బితామహుఁడంబుజాక్షుఁడా
తురత వహించె, దిక్పతులు తూలిరి, మూర్ఛిలె నేడు వాయులున్'

[హర 6-65]

5 2 3 కర్మార్థక వాక్యము నందు క్రియా పదము కర్తతో కాక, కర్మతో అన్వయము నొందును. కావున దాని కనురూపముగా నుండును.

'త్వదంఘ్రి నఖ చంద్రమండల జ్యోత్స్నా సమున్మేషణంబునం
దమః కాండంబును ఖండింపఁబడియె' [కాశీ 1-100]

5 2 4 కొన్నియెడల పదక్రమము నందలి మార్పు వలన అర్థము నందును మార్పు గోచరించును పదక్రమము నియతముగా లేకున్నను పదముల క్రమమును మార్చుట వలన ఊనిక నొకచోట నుండి మరొక చోటికి మార్చుట వలన భావభేదము కలుగును.

'మాటలు వేయు నేమిటికి మంగళ లక్షణ లక్ష్మియైన యీ
బోటికి భర్త కాఁగలఁడు సోమకిరీటుఁడు సర్వదేవతా
కోటి కిరీట కోటి పరికుంచిత దివ్య మణి ద్యుతిచ్ఛటా
పాటలపాద పీఠుఁడగునట్టి కృతార్థుఁడ వైతి భూధరా' [హర 3-26]

5 2 5. కొన్ని భావములకు ప్రస్ఫుటముగా చెప్పదలచినపుడు పద్యరచనలో ఛందః ప్రయోజనము ననుసరించి తరచుగా పదక్రమము మార్పు నొందుచుండును

'బాలిక మోము మత్తవన బర్హి కిశోరక లాస్య లీలఁ బై
వాలిచి పచ్చ కప్పురపు వాసన తోడి ముఖారవింద తాం
బూలపు మోవి మోవి పయి మోపుచు రాధకు నిచ్చు ధూర్తగో
పాలుఁడు ప్రోచుఁగావుత మపార కృపామతి మంత్రియన్నవిన్'

[భీమ 1-3]

వాక్య నిర్మాణము పద్యములోను గద్యములోను రెంటిలోను ఉండును ప్రధానాంశములలో పద్య గద్యములకు భేద ముండదు గణానుకూలమైన పదక్రమములోను, కొన్ని ప్రత్యయాదుల లోపము వల్లను పద్యములో భేదము అధికముగా నుండును. వాక్యములలో వివిధ పదముల మధ్యనున్న వ్యాకరణ సంబంధములలో

గద్య పద్యములు భేదించవు. అందువలన వాక్య నిర్మాణమునకు ప్రధానముగ గద్యమునే లక్ష్యముగా గ్రహించి విశేషములు విశ్లేషించుట జరిగినది.

## 5.3.0 సమానాధికరణ నిర్మాణము :

(Appositional construction)

5 3 1. ఇట్టి వాక్య నిర్మాణము ప్రాజ్నన్నయ యుగపు శాసన భాషలో విరివిగాను, నన్నయ రచనలో క్వాచిత్కముగాను తదనంతర సాహిత్యమున సహజముగను కలదు

'వీరె సిద్ధ సాధ్య మరుత్కిన్నర కింపురుష గంధర్వ
విద్యాధరులగు దేవయోనులు.' [కాశీ 2-93]
'కుపుత్త్రిత్వంబు కంటె నపుత్త్రిత్వంబు మేలు' [కాశీ 4-110]

'అలంతి నవ్వు ప్రగల్భతాహంకరణము
కాదు కాదంట వాచా విగర్హణంబు
పలుక కుంట తిరస్కార కలన ముద్ర
కానఁ బ్రత్యుత్తరం బిచ్చుదాన నీకు' [శృ నై 4-67]

5 3 2 శ్రీనాథుని భాషలో కాననగు క్రియా రహిత వాక్యము లీక్రింద ఉదాహరింపబడినవి. వీనిని సమీకరణ వాక్యములందురు. (equative sentences) ఈ రకమైన వాక్యములు అన్ని భాషలలోను ఉన్నను తెలుగులో క్రియారహితముగా ప్రయోగించుట విశేషము.

'ఇది చంద్రలోక మాహాత్మ్యంబు' [కాశీ 4-185]
'ఇది తారకాలోక వృత్తాంతంబు' [కాశీ 4-190]
'అధిక తరులైనఁగాని దిశాధిపతులు
కౌతుకము నాకు నీ వంశ కథలయందె
దప్పికొన్నట్టివారికాదప్పి దీఱ
సలిలపూరంబు హితవొ ? యాజ్యంబు హితవొ ?' [శృ.నై 4 52]
'వీరె మునులు' [కాశీ 2-98]

5.3.3 విశేష్య నిర్దేశము చేయకయే విశేషణములతో కూర్చిన వాక్యములు.

'కంఠీరవ విక్రమున క
కుంర ప్రతిభునకు దానగుణ సురభికి శ్రీ
కంఠాంఘ్రి కమల నయనో
త్కంఠా వైకుంఠునకు నఖండిత ధృతికిన్' [భీమ 1-83]

5.3.4 విశేషణములు విశేష్యముతో ఆనుపూర్వి కలిగియుండుట.

'విశ్వ భర్తకుఁ గాశికాధీశ్వరునకు
నిందుమౌళికి నినుఁగాఁచు టెంత భరము' [కాశీ 4-40]

5.3.5 విశేష్యము ముందు విశేషణము తరువాత వచ్చు పద్ధతి శ్రీనాథునిలో కలదు.

'....కాంపిల్య పురము నందు
యజ్ఞ దత్తాఖ్యుఁడొక్క బ్రాహ్మణుఁడు కలఁడు
వేద వేదాంగ వేదార్థ విత్తముండు
యజ్ఞ విద్యా విశారదుం డా ద్విజుండు' [కాశీ 4-78]

5.3.6 విశేషణ విశేష్యములకు 'ఐన'తోడి సంబంధము.

'అవినయ నిదానంబైన స్వాతంత్ర్యంబునను, కుతూహల బహుళంబైన స్వభావంబునను ధైర్య ప్రతిపక్షంబైన యౌవనారంభమునను'
[కాశీ 4-201]

5.3.7 'అగు'తో విశేషణ విశేష్యములకు అన్వయముండుట. ఇట్టియెడల విశేషణము ప్రథమావిభక్తియందుండును.

'కటుకమగు విషము విషధర
కటకంబగు కేలఁబూని కౌతూహలియై' [హర 6-70]
'వీరె సిద్ధ సాధ్య మరుత్కిన్నర కింపురుష గంధర్వ
విద్యాధరులగు దేవయోనులు,' [కాశీ 2-98]

5.3.8 మహద్వాచక బహువచనము లోపింప జేసి దాని స్థానమున మహతీతరా మహద్వాచక ప్రథమ పురుషైక వచన ముపయోగింపబడినది.

'ఇండ్ల మొదలను నీరెండ నిరికలను
ననుఁగుఁదమ్ముఁడు నన్నయు నాట లాడు

న త్తయును గోడలును గుమ్మలాడుఁగుమ్మ
గాఁచు చోటికి వంకర సంక్రాన్తివేళ' [శివ 4-31]

5.3.9 పెక్కు విశేషణముల నొక్క సమాసమున గూర్చుచు, అర్థమునకు పుష్టి గల్గించు వాక్య నిర్మాణము శ్రీనాథుని భాషయందు కలదు.

'ప్రతి దినంబును ప్రాతారారంభవేళ
నిర్నిబంధన నిరుపాధి నిరవ గాధ
నిర్నిరోధ నిరాఘాట నిరుపమాన
భక్తి సంభజియెంతురీ పద్మబంధు' [కాశీ 3-175]

5.3.10 విభక్తి ఆనురూప్యమును పొందిన వాక్యములు శ్రీనాథుని భాషలో కలవు.

భువనైక ధన్విచేఁ బుష్పాయుధుని చేతఁ
బ్రసవాస్త్రమున నేటు పడని వాఁడు' [కాశీ 4-203]
'మత్పితామహుఁగవి పితామహునిఁదలఁతుఁ
గలిత కావ్య కళాలాభుఁ గమల నాభుఁ
జంద్ర చందన మందార సదృశకీర్తి
సరస సాహిత్య సామ్రాజ్య చక్రవర్తి' [కాశీ 1-20]

5.3.11 సమాంతర వాక్య నిర్మాణము శ్రీనాథుని భాషలో కలదు

' అక్షధూర్తులలోన నీయనుఁగుఁగొడుకు
దొరయు నంతటి యక్ష ధూర్తుండు లేఁడు
క్షితి తలంబున యాగదీక్షితులలోనఁ
గీర్తి నీయట్టి యాగదీక్షితుఁడు లేఁడు [కాశీ 4-101]

5.3.12 మొత్తము వాక్యమంతయు కర్మగానే ప్రయోగించుట శ్రీనాథునిలో కలదు
'ఇలు వరుసఁజంద్ర శేఖరు
నిలయంబున దీపకళిక నిలుపని వారిన్' [కాశీ 4-136]

5.3.13 ప్రస్ఫుట భావ వ్యక్తీకరణమునకై వాక్యారంభముననే సమాపక క్రియ వచ్చుచున్నది.

'కాంచెన్ గాంచన గర్భ సంభవుడు' [కాశీ 1-87]

'ఆలోకించె మహా మునీంద్రుడు గుమారారామమున్' [భీమ 2-61]

'రోయుండో కించుకేనియు మరుత్పతి' [శృం.నై 8-76]

## 5.4.0 ప్రత్యక్ష కథిత వాక్యము : (Direct speech)

ఉన్నవి ఉన్నట్లుగా అనుకరించి చెప్పిన ప్రత్యక్ష కధిత మందురు విషయమును అనుకృతాంశములో మాత్రమే అనుకరించి చెప్పునది పరోక్ష కథిత వాక్యమని యందురు. (Indirect speech). ఇది సర్వ భాషా సామాన్య లక్షణము. అనుకృతిని శబ్దమునకు మాత్రమే పరిమితము చేసినచో ప్రత్యక్ష కథితమును, శబ్ద ప్రధానమని (code centred) పరోక్ష కథితమును అర్థ ప్రధానమని (information centred) చెప్పఁకొన వచ్చును [4] దేశ, కాల, శబ్ద, భాషా నిరవధికత ప్రత్యక్ష కథితమునకు వర్తించును. తెలుగులోను, ఇతర భాషలలోను ఏప్యర్థ ధాతు నిష్పన్నమైన ఒక అవ్యయమును అనుకారకముగా ప్రయోగించెదరు తెలుగులో ప్రత్యక్ష, పరోక్ష కథితములు రెండింటిలోను 'అని' అను రూపము ప్రయుక్తమగును. ఇది అనుధాతువు నుండి నిష్పన్నమైన క్త్వార్థక క్రియతో సమానము కాని ప్రయోగములో రెండిటిని వేరు చేయవచ్చును

## 5.4.1 పరోక్షకథిత వాక్యము : (Indirect speech)

'తల్లిబిడి కొల్లి చట్టంచు నుల్లసంబు
లాడుదురు నన్ను గూర్చి నిన్నహరహంబు
దుర్ణయంబెల్ల నామీఁదఁద్రోచి జనులు
దబ్బఱలు పల్కువారి కద్దంబు గలదె? [కాశీ 4-96]

## 5.4.2 ప్రత్యక్ష కథిత వాక్యములు : (Direct speech)

1 'అంతక మున్న గుణనిధి తండ్రి కోపంబెఱింగి యింటికింబోవక యెందేనియుం జనువాఁడనని మనంబున నిట్లనివితర్కించె' [కాశీ 4-1.0]

2 'అని యంతఃపుర చరుల 'దీని నభ్యంతరంబునకుంగొని పొం' దని పలికినం గళవళింపక కాళరాత్రి రాత్రించరేశ్వరున కిట్లనియె '
[కాశీ 6-222]

4. ప్రొ॥ చేకూరి రామారావు : తెలుగువాక్యము, పుట - 71

3. 'అని పలుకుచు సంభ్రమించి, సఖీజనంబుల కలకలంబాలించి, యిదియేమి కోలాహలంబని, భీమ భూపాలుండు దేవీ సహితుండై యడుగఁ దద్వయస్యా జనంబులు దారెఱింగిన తెఱంగెల్లను విన్నవింప, నన్నరనాథుండు ముద్దుఁగూతు మనోభిలాషంబునకు ననుకూలంబుగా జగంబునందెల్ల స్వయంవరంబుఁ జాటంబంచిన [శృ నై 2-142]

## 5.5.0 సంబంధ బోధక సర్వనామము (Relative pronoun)

యత్తదర్థక శబ్దములును సంబంధ బోధక సర్వనామమును, తెలుగునందు యదాద్యర్థక శబ్దములు ప్రత్యేకముగా లేవు కావున ప్రశ్నార్థక సర్వనామమునే సంబంధ బోధక సర్వనామములుగా శ్రీనాథుని భాషలో కన్పించుచున్నవి ఇవి సంస్కృతానుకరణము కావచ్చును.

5.5.1 ఎవ్వఁడు - అతఁడు :

ఎవ్వఁ డుపదేశ మొనరించె నింద్రుఁగూర్చి,
తపము సేయుము నీవంచు దయదలిర్ప
నాతఁడెఱుఁ గఁడు' .... [హర 7-21]

'ఎవ్వండేని మత్కులంబున గుహూయోగంబునఁ జంద్రోదయ వారి నభిషిక్తుండై అన్నఁడు పితృ ప్రసాదంబు పడయు' [కాశీ 4-183]

5.5.2 ఎప్పుడు - అప్పుడు :

'ఎప్పుడు పెండ్లియాడు పరమేశ్వరుఁ డద్రి తనూజ పేడ్కతో
నప్పుడు లబ్ధ సౌఖ్యుఁడయి యంబిక....' [హర 3-96]

5.5.3 ఎవ్వాఁడు - వాఁడు

'ఎవ్వాని చిత్తంబున నీవు వర్తింతువు వాఁడు కృతార్థుండు గదా' [హర 4-46]

5.5.4 ఎచ్చోట - అచ్చోట :

'ఎచ్చోట నుండు నిందిర, యచ్చోటనె యుండు' [హర 6-23]

5.5.5 ఏవారు - ఆవారు :

'ఏవారు వరించిరేని నెలమియు నాయు

శ్రీవృద్ధులఁగాంతురు వి
ద్యావత్తయు యశముఁ గల్గు నావారలకున్' [హర 6-133]

5.5.6 ఎన్ని - అన్ని :

'శివలింగ స్థానంబులెన్నిగల వన్నియు దర్శించిన' [భీమ 3-173]

5.5.7 ఎంత - అంత :

'క్లేశపంచకం బెంత కాలం బనువర్తించు నంతకాలంబునకు' [కాశీ 2-143]

5.5.8 ఎందు - అందు :

'ఎందుండును విశ్వేశ్వరు
డిందుకళాధరుఁడు గిరి దుహితృ సహితుండై
యందుండు భుక్తి ముక్తులు' [కాశీ 3-232]

5.5.9 ఏ - ఆ :

'కన్నులు కల్గియేని నే మానవుఁ డమ్మనుష్యునకు
మాసములాఱు' [కాశీ 5-250]

5.5.10 ఎట్లు - అట్లు :

'నాతో నీవిపుడెట్లులాడితి... నాతో నట్లనయాడె' [కాశీ 1-103]

5.5.11 ఎద్ది-అట్టి :

'ప్రత్యహంబు నవత్వంబు పడయు నెద్ది
యట్టి చింతాజ్వరంబు తన్నలము కొనియె' [కాశీ 1-111]

## 5.6.0 కర్మణ్యర్థకము : (Passive Voice)

అన్నంతముపై -పడు చేరి ప్రయోగింపబడు పదబంధము ప్రాఙ్నన్నయ యుగపు భాషయందు విరళము. అందు మనకు రెండు ఉదాహరణలు మాత్రమే లభ్యము. నన్నయ యందు కర్మణ్యర్థక ప్రయోగములు చాల కలవు.. అవియును అనువాదమున సంస్కృత రూపము ననుకరించుటను స్పష్ట పఱచును సాధారణముగ

తెలుగు కర్త్రర్థక (active voice) వాక్య నిర్మాణము కలిగి యుండును. శ్రీనాథుని కృతులలో కర్మణ్యర్థక ప్రయోగములను పచ్చునకు కొన్ని ఉదాహరణములు.

1. 'పుష్కర ద్వీప పతి యాస్య పుష్కరమునఁ....
కార్ష్ణ్యధామ మీక్షింపఁబడియె' [శృ.నై 5-39]

2. 'పరిపాలింపంబడిరి' [కాశీ 6-88]

3. 'సిద్ధుల చేతఁ బ్రతిష్ఠింపంబడి' [భీమ 3-111]

4. 'జ్యోత్స్నా సమున్మేషణంబునం దమః కాండంబును
ఖండింపఁబడియె' [కాశీ 1-100]

5.7.0 వాక్య నిర్మాణమున శ్రీనాథుని భాషయందు కాననగు కొన్ని విశేషములు.

5.7.1 సంబుద్ధియందు అరగాగమము లోపించుట :

'వినుఁడీ నాదు ప్రతిజ్ఞ మీరు హృదయోద్వేగంబు వర్జించియో
జనయిత్రీజనకుల్ ! గురుల్ !' [కాశీ 4-38]

5.7.2 సహార్థమునకు బదులు సముచ్చయార్థకమును ప్రయోగించిన వాక్యము.

'ఊఁచ ముట్టుగ నీవు నీ యొంటి కొడుకు
బాడు చేసితి గృహము నిర్భాగ్యురాల !' [కాశీ 4-108]

ఇందు బహువచనము వాడక ఏక వచనమునే ప్రయోగించుట కలదు.

5.7.3 అన్నంతముపై -వలయు నను న్యూనక్రియతో కూడిన వాక్యము.

'ఈ పుణ్య – శ్లోకునిఁ గరుణార్ద్రఁ దృష్టిఁజూడఁగ వలయున్'
[కాశీ 4-155]

5.7.4 తద్ధర్మార్థకముపై 'కాక' అను న్యూన క్రియను వాడుటచే శాపము, వరమునను నర్థముల ప్రయుక్తము.

'ఎడమలోచనము గ్రుడ్డెగసి గవ్వయుఁబోలె
నుట్టూఁత లూఁగంగ నుండుఁగాక
కుడికన్ను తారకా గోళంబు పల్లమై
యొండు లోచనముతో నొరయుఁగాక

యీశుండు కృప చేసి యిచ్చి నట్టి వరంబు
అట్లయొఁగాక ... ....
నాయొప్పిదమున కసూయ సేసితి గాన
నభిధఁగుబేరుండవగుదు గాక' [కాశీ 4-158]

5.7.5 వికల్పార్థమున 'కాని' ప్రయుక్తము.

'ప్రతిబింబమో కాని రజని వల్లభున క
ధ్యాహారమోకాని యమృత రుచికి....' [కాశీ 4-191]

5.7.6. పూర్వార్థమునకు విపద్ధారమును చెప్పునపుడు 'కాక' వాడుట జరిగినది.

'అలయక యోగి బుద్ధి పరమాణువుఁగాంచినఁ గాంచుఁగాక కేవలము,
దదంతరస్థమగు వస్తువు గానఁగ నెట్లు నేర్చు ?' [శృ నై 3-23]

5.7.7 నిర్లక్ష్యమున 'కాకేమి' అను వాడుక కలదు

'ఏమన్న ననియెఁగాకేమి మీ యేలిక
సాని వచ్చితి వీవ చాలు మాకు' [కాశీ 4-221]

5.7.8 భవిష్యత్కథన ప్రారంభమునకు 'ఇట్లనియె' [శృ.నై 5-62] అనియు కథన పరిసమాప్తికి 'అనుటయు, అని పలికిన' [శృ నై 3-66] అనిసూచన చేయుట కలదు

5.7.9 ప్రశంసార్థమున 'సాధు, సాధు' అనియు 'ఒకో' అనియు వాడుట కలదు.

సాధు! సాధు . 'సంతసంబయ్యె సురరాజ! సాధు! సాధు!
సర్వకాలంబు నీవ యిజ్జగములేలు....' [శృ నై 3-16]

ఒకో : 'ఈ సుదతి శిరీష కుసుమ
కేసర సుకుమార, దీనిఁ గృతిమతి నెట్లుఁ
జేసెనొకో నలుప.... ....' [శృ.నై 5-15]

5.7.10. చేదర్థకముతోడి ప్రయోగము.

'అన్న ! మీ తండ్రి కోపగాఁడౌనొ కాఁడొ ?
యీవు పొనరించు దుర్వృత్త మెఱిఁగె నేని' [కాశీ 4-90]

'హారి కల్పవృక్షంబుఁ బ్రార్థించి నినుఁగోరి
దివికి రావించిన, దిక్కు గలదె?' [కృ వై 4-85]

5.7.11 అనుకరణ విరహితముగ 'జయ' శబ్దమును వాడుట కలదు.

'జయ విరూపాక్ష! యీశ్వర! దివ్యలోచన! జయ వజ్రహస్త....
జయ నమస్తే నమస్తే ప్రసన్న మూర్తి! [హర 6-73]

5.7.12 ప్రార్థనావ్యక్తమైన ఈకారము వచ్చుట.

'భిక్ష కఱపయ్యెం జూడుమీ కుంభజా' [భీమ 2-98]

5.7.13 'అయ్యె' అని చేరుటచే వ్యతిరేక క్రియాపదము భూతకాలమందు నిశ్చితమైనది.

'ఆహారము పెట్టదయ్యె' [పెట్టినది కాదు] [భీమ 2-97]

5.7.14 ఒకే అర్థమును గలిగిన క్రియాపదములు పునఃపునరావృత్తములై అత్యంతార్థమును సూచించును

'పరిభ్రమించి, విసికి, విసివాలి, వేసరి, యలసి, యారటఁబొంది, సొలసి, జూఁకించి, తూలి, దూఁపటిలి యుల్లంబునఁ గ్రోధంబుద్భవించిన' [భీమ 2-101]

5.7.15 కర్తృపదము రెండు నామముల సంయోజనమైనచో క్రియాపదము బహువచనముగా నుండవలయును

ఉదా :- 'రాముడు, సీత వచ్చిరి' అనవలయును. 'వచ్చెను' అనుట భాషా సమ్మతము కాదు. అయినను 'తాను' అన్నశబ్దము ప్రయుక్తమైనప్పుడు క్రియ దేనిలోనే అన్వయించును.

'మలయ దర్దుర గిరి మహామందిరుండు
తామ్రపర్ణీ జలస్నాన ధౌతమలుఁడు
కలుషితాంభః ప్రసాదైక కతక ఫలము
కోమలియుఁ దాను నేతెంచెఁ గుంభ జుండు' [భీమ 2-78]

5.7.16 కొన్నియెడల కర్తృపదము ప్రథమావిభక్తి యందుండవలసి యుండగా షష్ఠీ విభక్తి యందుండి తరువాతి ధాతుజన్య విశేషణముతో సమసించును.

'నానేర్చిన విధంబున సుధారసంబు వడ్డించెద' [హర 6-116]

5.7.17 బహువచనము కర్త అయినను అంగవాచకములు ఏకవచనముగా ప్రయోగించుట

'అత్తెత్తి చూచిరి యాకాశమండలా, స్థాన రత్నంబు....
అంబుజాక్షియు నిషధ దేశాధిపతియు.. [శృ నై 6-101]

5 7.18 కర్తృపదము పునరుక్తమగుట.

'పండితుఁడాత డాతఁడు ప్రభావ సమగ్రుఁడతండు శూరుఁడా
తండు వివేకి యాతఁడు వదాన్యుఁ డతండు మహాకులీనుఁడా
తండు కళా విదుండతఁడు ధన్యుఁడతండు మనోజ్ఞమూర్తి' [కాశీ 3-45]

శ్రీనాథుని భాషయందలి వాక్యనిర్మాణమునుగూర్చి స్థాలీపులాకముగనే ఇచ్చట వివరించుట జరిగినది



# 6. లోకోక్తులు, నుడికారము

## (PROVERBS, IDIOM & USAGE)

### 6.1.0 లోకోక్తులు[1] (Proverbs)

జనవ్యవహారములో ఒకానొక సందర్భమునకు అనువుగా అవతరించి తరువాత ఆనోట ఆనోట బడి నలిగి ప్రచుర ప్రచారములోనున్నదు సూక్తిని లోకోక్తి యనవచ్చును ఏ లోకోక్తిని, ఏ సందర్భమున, ఎవరు రూపొందించిరో చెప్పుట సాహసకార్యమే. కొన్ని సూక్తులుగ, కొన్ని దృష్టాంతములుగ, కొన్ని సాదృశ్యములుగ, కొన్ని నిదర్శనములుగ, కొన్ని అర్థాంతరన్యాసములుగ. కొన్ని ఏ గాథనో జానపద గేయమునో సన్నివేశమునో పురస్కరించుకొని ప్రచారములోనికి వచ్చి ఉండవచ్చును.

'ఒక సంగతికి దృష్టాంతముగా లోకులు వాడుకగా చెప్పేమాట లోకోక్తి'- అని ప్రౌఢ్యమున నున్నది.[2] సంస్కృతమున లోకోక్తులు, న్యాయములు అనువానిని తెలుగున సామెతలు అందురు 'లోక ప్రవాదాను కృతిర్లోకోక్త రితి కథ్యతే'- విశేష లోకానుభవముగల పెద్దలమాట యని లోకోక్తి నిర్వచనము. సామెత అనునది ఈ లోకోక్తికి పర్యాయమైన అచ్చ తెనుగు పదము సమతా శబ్దభవము సామెత యని ప్రౌఢ్యము నానుడి యను మాట పైతము కలదు నానుడి యనగా నందఱి నోటను నానెడి వాక్యము లేక జనశ్రుతి యని కొందర వ్యాఖ్యానము, దేశీయమైన పలుకు బడియను నర్థములో 'నాడు + నుడి' యే 'నాడ్ + నుడి', 'నాణ్ + నుడి' యై నానుడిగా మారినది. కన్నడములో 'నాణ్ణుడి' అందురు

భాషను జీవన స్రవంతి వలె ప్రవహింప జేయునవి అందులో నంతర్గర్భితములైనవి లోకోక్తులు. మాటలశక్తి, నుడికారపు సొంపులు, సంఘస్థితి, భావనా సంపద మొదలయిన సంస్కృతి విశేషము లెక్కువగా వీనియందు గోచరించుచుండును. మన జాతికి, మతమునకు, సంప్రదాయమునకు, సాహిత్యమునకు, చరిత్రకు, సంస్కృతికి, సాంఘికవ్యవస్థలోని సమస్తాంతర్భాగములకు నీ లోకోక్తులు

1. డా॥నేతి అనంతరామ శాస్త్రి : శ్రీనాథుని సామెతలు - వ్యాసపూర్ణిమ-పుట. 25-45
2. ప్రౌఢ్య తెలుగు నిఘంటువు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు, 1966. పుట - 1027.

దర్పణము వంటివి. శ్రీ నాథుని కావ్యములందుగల లోకోక్తులు సాంప్రదాయికములు వానిలో ముఖ్యమైన కొన్నింటిని వివరించుటకే ప్రకృత ప్రకరణ మారంభింప బడినది.

6.1.1 1. 'ఆడఁగ బోవు తీర్థ మెదురైన విధంబున నెల్లి యేను' [హర 7-124]

ఏ పుణ్యతీర్థమున స్నానమాడి పుణ్యము నార్జింపఁ గోరుదుమో యా తీర్థమే యెదురు వచ్చిన అంతకన్నఁ గావలసినదేమున్నది? తామేది కోరిన నదియే యప్రయత్నముగా లభించిన సందర్భమున దీనిని వాడుదురు

2. 'ఆవగింజంత భూతి మైఁ బలదికొనిన వెలఁది గుమ్మడికాయంత వెఱ్ఱిపుట్టు' [హర 2-99]

ఇది మతపరమైనదిగ గోచరించును. శైవ సంప్రదాయమునకు సంబంధించినది కొంచెము విభూతి శరీరమునందు రాచికొన్నను నెక్కువగా వెఱ్ఱి యెత్తునని యర్థము. అనగా వీర్ల సివమెత్తుట ఒడలు తెలియని ఆవేశము కలుగుట.

3. 'ఇంటిలో భోజనంబిచ్చుకురాక పరుల యెంగిలి కాసపడితిని గాదె' [వ.వీ 67]

ఇంటివద్దున పంచభక్ష్య పరమాన్నములున్నను వానిని గాదని, పొరుగింటి యెంగిలి కూటి కాసపడువాడు మూర్ఖుఁడు మాత్రమే కాదు దుర్మార్గుడును. అట్లే స్వీయను గాదని పెడదారులు త్రొక్కువాడును, ఎంగిలి కాశపడుటనగా నన్యలయందు గాని, సామాన్యలయందు గాని యాసక్తుఁడగుట.

4. 'ఉడుము నడిఁకిన నడుఁకునే బడితెపెట్టు?' [కాశీ 2-144]

ఉడుము కంపించిన దుడ్డు కఱ్ఱ దెబ్బ కంపించునా? యని భావము. సామర్థ్యమునందలి తారతమ్యమే దీనికి కారణము. అట్లే బలవంతులదే యెల్లప్పుడును మేలు చేయి యగునని భావము.

5. 'ఉన్నయూరుఁ గన్నతల్లియు నొక్కరూపన్న రీతి?' [కాశీ 7-164]

కన్నతల్లి యెట్లు వాత్సల్యముతోఁ జూచునో యట్లే యున్న యూరు కాపాడునని యర్థము కన్నతల్లి నెట్లు గౌరవింతుమో యట్లే యున్నయూరును మన్నింపవలెనను సందర్భమున వాడుక

'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అని కదా సూక్తి.

6. 'ఎవ్వాని సొమ్ము జయాజయములు ?' [శృ నై 7 ‌68]

జయాప జయములు దైవాధీనములు. అవి ఎవరి సొత్తును గావు మానవునకు జయాపజయములపై నధికారము లేదు దైవనిర్ణయమును బట్టి యవి నిర్ణయింపబడును. కావున విఱ్ఱవీఁగుట తగదని భావం.

7. 'కుట్టియా చూడగ దోసకాయలె విశోధ్ధ యశోధన యస్య చిత్తముల్' [హర 2-63]

పదబంధ పారిజాతమున 'కుట్టిచూచుటకు దోసకాయలా ?' అని పద బంధము నిచ్చి 'తెలిసికోలేము అని అంతర్యం' అని వివరణ చేయబడినది. ఇక్కడ 'కుట్టి అచూచుట' కు బదులు 'కుట్టి మూచూచుట' కు అని ఒక పాఠాంతరము కలదు 'కుట్టి మూచూచుట' అనగా కోసిన దానిని ముక్కుతో వాసన చూచుట యని యర్థము. ఇతరుల మనస్సులలో నేమేమి కలవో యెవరూ తెలిసి కొనుట కష్టమని పై లోకోక్తి భావము అదెట్లన భౌతికమైన రూపము మనస్సునకు లేదు. ఆలోచనలకును లేదు మనస్సు దోసకాయవంటి వస్తువు కాదు గదా ! దానిని కోసి దానిలో నేమేమి తలపులున్నవో తెలిసికొనుటకు

8. 'కొసర కాఁబోతు నాఁబోతు క్రుమ్ములాడ
నడిమి లేఁబెయ్యగతి వచ్చె నాకు నిపుడు' [కాశీ 2-104]

"అబోతు లాబోతులు కుమ్ములాడి లేగల కాళ్లు విరుగ దొక్కినట్లు"- అని లోకోక్తి.

ఆవులుగాని, అబోతులుగాని కుమ్ములాడినచో ఆ త్రొక్కిడిలో నలిగి విరుగునవి లేగలకాళ్లు. లేగలనగా లేత దూడలు అప్పుడు వానికి ప్రాణాపాయ స్థితి వచ్చును. అట్లే పెద్దలు పోట్లాడు కొనిన వారికి వచ్చు నష్టము తక్కువ. కాని వారి మధ్యనున్న పిన్నలు ఆ యాఘాతములకు తట్టుకొనలేక నష్టపడుదురు.

9. 'గుడిలో నుండియు గుడితాళ్లను దీయుట' [క్రీడా 246]

పవిత్రమగు గుడిలోపల నుండియు. గుడి తాళ్లను క్రమముగా తీసి యా తాళ్లను తనకై యుపయోగించు కొనువాఁడు గుడిని ధ్వంసము చేయు భక్తుడు. కృతఘ్నుడనుట తిన్నయింటి వాసములు లెక్క పెట్టుట వంటిది ఆశ్రయ మిచ్చిన వారికి హాని తలపెట్టుట యిట్టిదే.

10. 'గొఱ్ఱె క్రొవ్విన యంత సెలగట్టె గోఁకి నట్లు' [భీమ 4-53]

మదించిన గొఱ్ఱె సెలకోలనే కొఱుక ప్రయత్నించును. అట్లే మూర్ఖులు తమ శక్తిని ఎదిరి శక్తి నెఱుగక యెదిరి నెదిరించెదరు. యుక్తాయుక్త వివేచనము గొఱ్ఱె కుండదు. అందును మదించిన దానికి మునుపే యుండదు.

11. 'చెరువుఁ జూడఁగాఁ బోయిన తూఁడు తీఁగె క్రియను' [కాశీ 6-29]

ఇందు 'తూఁటి తీఁగె' యనగా నీటిలోనుండు నొక తీఁగ. తూఁటి తీఁగె చెఱువును జూచుటకు పోయినదనగా తన నివాసమున కత్యంత యోగ్యమైన నీటిని చూడగనే దానియందే యుండ నిశ్చయించును. కాని తిరిగిరాదు పుట్టింటికి పోయి యచటనే సుఖముగా నుండిపోవుట వంటిది శివుడు బ్రహ్మను కాశికి వంపు సందర్భములోనిది.

12. 'చేల పంటలఁ గొయ్యలు చెప్పఁ గాదె' [కాశీ 7-144]

పంట ఎంత పండినదో చేనిలోని కొయ్యలను చూచిన తెలియ గలదు. వరి మొదలగు పంటలను కోయగా మిగిలిన మ్రోళ్ళు కొయ్యలు వీని ఏపునుచూచిన యెడల, పంట చేనియందు లేకపోయినను పంట విషయము తెలియును. కావున తక్కువ యేపుగా నున్న తక్కువ పంటయు నెక్కువ యేపుగా నున్న నెక్కువ పంటయు పండినట్లు తెలిసికొనగలము. ప్రస్తుత సందర్భమున శిష్యుల ముఖముల కవళికలను బట్టి వ్యాసుడు వారికి భిక్షాన్నము లభ్యమైనదియు లేనిదియు తెలిసికొన గలిగెనని భావము.

13. 'డబ్బుఱలు పల్కు వారి కడ్డంబు గలదె?' [కాశీ 4-96]

చెడును మాటాడు వారి కడ్డమేమి కలదని అర్థము వారి నోటికి వచ్చి నట్లెల్ల మాటాడుదురే కాని సత్యాసత్యములను పరికింపరు. ఇది లోక సహజము.

లోకము చెడును మాటాడి నంతగా మంచిని గూర్చి మాటాడదు. లోకులు పలుగాకులని వాడుక.

14. 'తల్లిబడి కొల్లి చట్టంచు నుల్లసంబు లాడుదురు' [కాశీ 4–96]

తల్లివలెనే కొల్లి చెట్టునుండును. అనఁగా మొదట పుట్టిన చెట్టు ఏ రూపమున నుండునో, దానినుండి పుట్టిన చెట్టును అట్లే యుండును. లోకములో ప్రాయికముగా తల్లి పోలికలు గల బిడ్డలు, తల్లియొక్క గుణములే వచ్చునని భావము. తల్లిబిడి యనగా తల్లి నిజముగా కొల్లి చట్టు అనగా కొల్లిబండ. కొల్లి చెట్టుకు సంబంధించిన బండ మారదని అర్థము ప్రస్తుత సందర్భమున గుణనిధి దుర్గుణములను బట్టి అతని తల్లి 'తల్లిని బట్టి కొడుకని' తన్నుకూడ అందురని వాపోవుచున్నది.

15. 'తాత కట్టిన చెఱువంచుఁ దగునె మునుఁగ' [కాశీ 6–294]

తాతలు కట్టిన చెఱువైనను దానియందు మునిగిరేని చచ్చుట నిక్కము. చచ్చినను, చెఱువు మాదియని దానియందే మునిగెదనను వాడు మూర్ఖుడు కనుక స్వజనులనుండి వచ్చిన కీడు కీడు కాదనుట తగదు.

"తాతస్య కూపోయమితి బ్రువాణాః
క్షారం జలం కాపురుషాః పిబంతి" అనునది పై దానికి సరియైన సంస్కృత లోకోక్తి.

16. 'తా రుగల్గినఁ బదివేలు దనుకుఁ గలవు' [శృ.నై 7–81]

తమక్షేమమే తమకు కావలసినదని కొందరు భావింతురు. తన కొరకే లోకమనుకొను వారు గలరు. తామున్ననే లోకము గాని తమకు గాని లోకము నాశనమైనను చలింపరు వారిది స్వార్థబుద్ధి తను పనియే తమకు పదివేలు. తాము బ్రతికి యున్న వేయి విధముల కీర్తి సంపాదించు కొనవచ్చును.

17. 'దేశభాషలందుఁ దెలుగులెస్స' [క్రీడా 37]

సర్వ భారతదేశీయ భాషల యందును తెలుగే శ్రేష్ఠమగు భాషయనుట. తెలుగజంత భాష యగుటచే నెక్కుడు మధురముగా నుండుట సర్వ జన విదితము.

అన్నిభాషల వారికిని తమ భాష చక్కని భాష యనిపించును ఎవరి బిడ్డ వారికి ముద్దు.

18. 'ధర్మ సాధనములందు నాద్యమగు సాధనంబ్బుదేహంబకాదె'
[హర 4_18]

'శరీర మాద్యం ఖలు ధర్మ సాధనమ్' – అను సంస్కృత లోకోక్తి మూలము. శరీరముండుట వలస సర్వ ధర్మ కార్యములను నెఱవేర్చు చున్నాము అది లేనిదే ధర్మ కార్య నిర్వహణ యొక్క ప్రసక్తియే రాదు కనుక ధర్మ సాధనమునకు నిశ్చయముగా శరీరమే మొదటి సాధనమగు చున్నదని యర్థము

19 'సరికితే జంపులు నడిమికి తెగవు' [ప.పీ 68]

నీటిని మధ్యమ కత్తితో నరికినను నది వెంటనే కలిసి పోవును అట్లే సంబంధ బాంధవ్యముల త్రెంపివేనుట కష్టము. నీళ్ళను నరికిన నడిమికి తెగవు అనుట

20 'నిండుబండికిం జేట భరంబే?' [శృ.నై 7-76]

పూర్తిగా నిండిన బండికి నొక చేట యధిక భారము కానేరదు. అట్లే యెన్నిటినో యనుభవించు వాడు మతొక్కదాని ననుభవింప గలడు. చాలబాధ్యతలున్న వారికి మతొక్క బాధ్యత వచ్చుట కష్టమనిపింపదు. కాని సామాన్యముగా నీ యర్థమున వాడుకలోలేదు. నిండు బండికి చేట బరువా? అనునది గాక నిండిన బండికి చేట బరువు అనియే భావము. బరువుచే క్రుంగిపోవుచున్న వానికి చిన్నదైనను నొక్కొక్క బరువు పూర్తిగా క్రుంగదీయ గలదని యర్థము.

21. 'నిఱుపేద యభాగ్యతందలు
పిలిచియుంగ నిడుగాక చొరంగ నిచ్చునె దానిన్' [శృ.నై 4-7?]

భాగ్య దేవత తన యింటి కరుదెంచినను నిర్భాగ్యుడు తన యింటి తలుపు లోనికి పోవుటకు వీలులేకుండ ఇఱుకగునట్లుగా గట్టిగ మూసియుంచునే గాని యాహ్వానింప లేడు. అది యాతని దౌర్భాగ్యము. అట్టి యాతనిని బాగు చేయగల వారులేరు. సిరిరామోకాలొడ్డువాడు అనివాడుక.

22. 'పాణి యాహార కబళంబుఁ బాఱవైచి
కూర్పరము నాకు పిస వెట్టి కూళవోలె' [కాశీ 2-110]

చేతిలోని ఆహారమును బుద్ధి పూర్వకముగ పారవైచి, మోచేతిని నాకు వాడు వెట్టివాడని యర్థము తనకు లభ్యమైన ఆహారమును విసర్జించి దానికై ప్రాకులాడు వాడు వట్టి అవివేకి. కావున స్వయంకృతాపరాధమునకు వగచి ప్రయోజనము లేదని భావము.

23. 'పువ్వుఁ గుడిచి పిస పురవీధి భూమియందు
గట్టె మోవంగ వలసిన కారణమున' [భీమ 2-10]

పువ్వులు ముడిచి, విలాసముగ సంచరించిన వీధులయందే కట్టెలమ్ముకొను నికృష్ట జీవనమును వహించుట కష్టమును కల్గించును. జీవితము తారుమారైన కారణమున నిట్టి సంభవించును ఉచ్చజీవనమును గడపిన చోటనే నీచముగా జీవించుట కష్టము.

24. 'పెసర గింజకుఁ దక్కువే పెసరగింజ' [కాశీ 6-286]

స్థూలముగా చూచిన సజాతీయులొకరి కొకరు తీసిపోరని భావము పెసర గింజ చిన్నది పై పెచ్చు విలువ తక్కువ. అన్నిట ఆ పెసరగింజ తత్తుల్యమైన మఱొక పెసరగింజకు తీసిపోవదు. అట్లే యొక జాతి వారిలో నున్న తరతమ భేదములు గణింపరాదు పెసరగింజ పోలిక వలన 'కొఱగాని' అను నర్థమును స్ఫురించును.

25. 'బొందితోడ కైలాసమున కరిగెదవు' [కాశీ 6-90]

బొందితోడనె కైలాసమున కరుగుట దుస్సాధము. తనువు త్యజించిననే కైలాసమునకేగుట సాధ్యము కావచ్చును. కాని యట్టి కార్యమునైనను చేయగల్గెద వనుట. శైవులకు కైలాసము పరమలోకము ఇక్కడ సందర్భము కుదిరినది కాని దుస్సాధమును సాధ్యము చేయ ప్రయత్నించుట యవివేకమనునదియు కలదు.

26. 'మనుజుడొక్కటిఁ దలంప దైవ మొక్కటి తలఁచు'
[కాశీ 2-103]

మానవుని యూహను బట్టియే సర్వము జరుగదని భావము. అనాగత విషయము లనన్నింటి నూహింపగల శక్తిగాని, నిర్ణయింపగల శక్తిగాని మానవునకు

లేదని దీనియర్థము. మానవుని తలంపుకంటె దైవ నిర్ణయము వేఱనుటను సూచించును. తానొకటి దలచిన దైవమొకటి తలచును అని లోకవ్యవహారమున ప్రచురముగ గలదు

37. 'ముగురం గూర్చిన ముండదైవముగాదకునొ్క్కమోట లేదో సుమీ' [భీమ 3-6]

దౌర్భాగ్యము కలవారు ఒకేచోట కూడిన ఇట్టి లోకోక్తినే ప్రయోగింతురు దైవ వైపరీత్యమున, మనమిచ్చట చేరితిమి అను విషయము చెప్పునపుడు విశేషముగా దీనిని వాడుదురు ముగ్గురే కాక అనేకులు చేరిన చోటనైనను వాడుక. దీని సజాతీయమైనదే సంస్కృతమున "మూఢో మూర్ఖో గార్ధభశ్చైకరాశిః" అను సూక్తి కలదు.

28 'రత్నం బొరునిచే నన్వేషింపఁబడుఁ గాని యొరున న్వేషించునే' [హర 4-24]

రత్నమును వెదకుచు, రత్నము కావలసిన వారు రావలెనే కాని రత్నము వారికై వెదకుచుబోదు. అట్లే శ్రేష్ఠులను వెదుకుచు సామాన్యులు రావలెనే గాని, శ్రేష్ఠులే తమను గూర్చి చెప్పుకొనుచు నితరుల యొద్దకు బోరు. 'నరత్న మన్విష్యతి మృగ్యతే హికితత్' - అను సంస్కృత సూక్తి పై లోకోక్తికి మూలమై యున్నది. కవి స్వతంత్రముగ నిర్మించినదే కాని జనవ్యవహారమునుండి కావ్యములోనికి వచ్చినటుల లేదు.

29. 'సంబంధంబు సాప్తపదీనంబు' [హర 4-22]

'సఖ్యం సాప్త పదీనమ్' అను సంస్కృతలోకోక్తి దీనికి మూలము. శ్రీనాధుడు సంస్కృతమున ప్రయోగించిన దానిని యథాతథముగా అనువదించినాడు. ఏడుమాటలు కలిపి మాటాడినను, ఏడడుగులు కలిసి నడిచినను స్నేహము కలుగునని భావము. కొలది తడవు మాటాడినను నడచినను నొకరి నొకరర్థము చేసికొని స్నిగ్ధులగుదురు. ఏడడుగులు కలిసి వేయు వైవాహిక కర్మ సప్తపదిని బట్టియు నిది యేర్పడి యుండవచ్చును.

30. 'సనెకల్దొంచిన పెండ్లి మానునొకొ' [కాశీ 5-31]

అప్రధానమైన విషయములకై ప్రధానవిషయము లాగిపోవు అని భావము. వివాహమునందు సన్నెకంటిని త్రొక్కించు నాచారమును బట్టి యేర్పడినది.

కాని సన్నెకంటిని త్రొక్కించుట లేకపోయినను వివాహమగదు. అది వైదిక కర్మ కాదు.

ఇట్టి లోకోక్తులు శ్రీనాథుని కావ్యములనిండ కలవు. అందు వివరణాపేక్ష లేని కొన్నింటిని ఉదాహరింతును.

1. 'అడుసులోపలఁ దాటిపం దదిమినట్లు అదుముదునే'. [కాశీ 1-114]
2. 'పగవారి పగవారు చుట్టలగుట' [కాశీ 5-293]
3. 'దయ్యము నెత్తికోలు తుది దాఁకఁగ' [హర 2-26]
4. 'పుల్కడుగం బడ్డ నిశాత ఖడ్గము క్రియం గన్పట్టె' [హర 2-26]
5 'అవంతియే కంచి నీకు నడుగాపడయే' [హర 2-64]
6. 'పాలలోఁ బడిన బల్లుల కైవడి' [హర 3-15]
7. 'విషవృక్ష మేనియు వృద్ధిబొందగాఁ జేసి తనకు. తాఁబెఱుకుట తగవు కాదు' [హర 3-18]
8. 'వధ్యుఁ దివియంగఁ బాతిన వాఁడికొఱ్ఱు యూపసత్క్రియ కర్హమైయున్నె చెపుమ' [హర 4-131]
9. 'నీరు దప్పికి నేయునుం బోలె' [హర 7-127]
10. 'వార కాంతాజనములకు వావి గలదె' [హర 7-128]

6.1.2 శ్రీనాథుడు తెలుగు లోకోక్తులనే గాక సంస్కృత లోకోక్తులను గూడ తన రచనలలో యధాతధముగ స్వీకరించినాడు. మచ్చునకు కొన్నిఁటి నిక్కడ వివరింతును

1. 'ఆత్మవత్సర్వ భూతాని' [శృ.నై 4-33]

తన్ను జూచుకొన్నటులే సర్వజీవులను జూచికొనుట శ్రేష్ఠమను నీతిని సూచించుచున్నది. తనవలెనే సర్వ భూతములు నని భావము.

2. 'జీవన్ భద్రాణి పశ్యతి' [హర 2-78]

బ్రతికి యుండిన శుభములు పడయవచ్చునని దీని యర్థము. శుభములను పొందుట జీవించు వారికే గాని, చనిపోయిన వారికి కలుగనేరవు గదా!

3. 'పరోపకారార్థ మిదం శరీరమ్' [హర 2-79]

నీ శరీరము పరుల యుపయోగార్థమే కాని స్వార్థము కొరకు కాదనుచు నిస్వార్థ సేవయందు సర్వస్వమును సమర్పణ చేయవలెనను నీతిని వెల్లడించు

చున్నది. మొత్తము పైన శ్రీనాథుడు తన కాలమున మరుగుబడి జనవ్యవహారములో నున్న లోకోక్తులను కొన్నింటిని, సంస్కృత లోకోక్తులను యథాతథముగ గ్రహించి మరికొన్నింటిని, పేకరించి తీయని తెలుగు పలుకుబడితో కూడి యర్థ స్ఫూర్తి కలిగి సందర్భమునకు నతికినటుల సరిపోవు నట్లుగా వాడి తన మెలకువను చూపినాడు.

ఇంతేగాక లోకోక్తులను గూర్చిన పరిశ్రమ సర్వంకషముగ, కూలంకష ముగ, సఫలీకృతమైనచో నాంధ్ర జాతీయజ్యోతి అభ్రంకషముగ భాసించును. జన సామాన్యమున ప్రచారములో నున్న లోకోక్తులు శక్తిమంతములు వానికి ప్రసిద్ధ మైన రూపు, నిర్దిష్టమైన జీవము కలదు. అట్టి వానిని ఉచితజ్ఞతతో కవి ప్రయోగించి నపుడు రచన అర్థగౌరవము కలిగి రసవంతముగా నుండును.

## 6.2.0 నుడికారము[2] : (Idiom & Usage)

నుడికారమునే, పలుకుబడి – జాతీయము – పదబంధము అను పర్యాయ పదములతో పేర్కొనుట కలదు. నుడికారమునకు పలుకుబడికిని భేదము పదముల అర్థమునందైనను లేదు జాతీయము భాషా సంప్రదాయ సిద్ధమని యర్థము. పద బంధము పదముల విశిష్ట బంధమును నర్థమునే యిచ్చును. కాని దానిని కూడ నుడికారమునకు తుల్యముగ నేడు వాడుచున్నారు నుడికారమును భాషా సంప్ర దాయమునే కాదు, జాతియొక్క సంప్రదాయమును కూడ తెలియపర్చును లోకోక్తుల వలెనే నుడికారములును భాషకు ప్రవాహ శీలమును ప్రసాదించును సాంప్రదాయిక మైన సముజ్జ్వలత్వమును సమకూర్చును.

ప్రతి మానవుడు తన మనోభావముల నన్నింటిని ఎదుటి వానికి చెప్పుటకు ప్రయత్నించును. తన భాష చేవ గలదైనపుడు క్రొత్తమాటలు క్రొత్త భావచ్ఛాయలు ఏర్పడుచుండును. విడిగా పొడి మాటలవలె నున్నవే అపూర్వ సమ్మేళనమున అపూర్వ భావ వ్యక్తీకరణకు మూలములై విశిష్ట పదబంధములుగా భాషలో నిలిచి పోవును. వానినే పదబంధములని, నుడికారములని, పలుకుబడులని, జాతీయములని పేర్కొను చున్నాము. శ్రీనాథుని కావ్యములలో సంతరింపబడిన నుడికారమును వివరించుట కొక ప్రత్యేక గ్రంథము చాలదు. కావున ముఖ్యమైన కొన్ని నుడికారములను గూర్చి యిట వివరించుట జరిగినది

2. నేతి అనంతరామశాస్త్రి : వ్యాసపూర్ణిమ- శ్రీనాథునిభాష- నుడికారము పు. 403-414

6.2.1 1. అందని ద్రాక్షల పండ్లకుఁ గోయఁగఁ జూచుట: [శృ నై 2-63]

వృథా ప్రయాస పడుట యని యర్థము, నిష్ప్రయోజనము.

2. అడుసు లోపలఁ దాటి పండదుముట : [కా శి 1-114]

తడిమట్టియందు తాటి పండు నదిమి త్రొక్కుట యెంత తేలికయో, యంత తేలికగా నణగ ద్రొక్కుట

3. అత్తు కడుపును జల్లగా నభిలషించుట : [భీమ 4-82]

దీవించుట యని యర్థము అభ్యంగన స్నాన సమయమున తలపై నూనె పెట్టుచు' నియమ్మ కడుపు చల్లగా నీయత్త కడుపు చల్లగా....' అని శుభము నభిలషించు నాచారమును బట్టి యేర్పడినది. ఇక్కడ 'కాలకూటాగ్ని సంహారకారి యభవు' నుద్దేశించి పరమేశ్వరుని కడుపు చల్లగా నభిలషించుట జరిగినది. అనగా 'లోస్సకామస్తా స్సుఖినోభవన్తు' అని స్వస్తిపలుకుట

4. ఆవగింజలు తాటికాయలుగ నాడుట : [శృ.నై 7-119]

లేనిపోనివి కల్పించి అతిశయముగా చెప్పుట యని యర్థము. ఆవగింజంత యున్న విషయమైనను దానికెన్నోరెట్లు కల్పించి పెద్దదైన తాటికాయవలె పెంచి చెప్పుట. గోరంతలు కొండంతలు చేయుట

5. ఇరు చెవి యెఱుఁగకుండ [భీమ 4-50]

అత్యంత రహస్యముగ అని యర్థము రెండవ కంటివానికి తెలియకుండ నని నేటి వాడుక.

6. ఈఁగకే నీవి యిడదు : [శృ.నై 7-53]

చాల లోభియని యర్థము. ఈవియిడు - అనగా ఎంగిలి మెతుకులు విదలించుట. ఈఁగను దాపైన నైనను వ్రాలనీనంతటి లోభియని పై నుడికారమున కర్థము.

7. ఈఁగకు బోఁక యిడినట్లు : [క్రీడా 246]

ఆసక్తి లేకుండుట. ఈఁగలు పోఁకలపై ముసరవు. కారణము పోఁక యీఁగకు కొరుకుడు పడదు కావున.

8. ఈల గ్రద్ద : [శృం.నై 7-107]

ఈలగ్రద్ద యనగా క్రూరుఁడు. ఒకసారి యిచ్చియు, లోభమువలన దానిని తిరిగి క్రూరముగా లాగికొనువాడు. ఈలగ్రద్ద యనగా నీలవేసెడి యొక జాతి గ్రద్ద. గ్రద్దలకు క్రౌర్యము ప్రధాన గుణము ఆ గ్రద్దవలె క్రూరుడు, లోభియని సూచి, పదబంధ పారిజాతమున పేర్కొనబడినది. కాని గ్రద్దలకు, డేగలకు క్రౌర్యము ప్రధాన గుణము ఆ క్రౌర్యము తగుల్కొనుటకు కారణము నిస్సంశయముగా లోభమే. కావున లోభము వలన క్రూరముగా లాగికొనుట యని యర్థము చెప్పవచ్చును.

9. ఉదారు మిడుకు[3] . [హర 5-10]

దుర్మార్గుడు, భయపెట్టుచు మిడుకుచుండువాడు, లేదా మిడుకుచు భయపెట్టువాడు. దుశ్చర్యలచే భయము కలుగఁజేయువాడు

10. ఎముక లేఱుట : [శృ నై 7-81]

చంపుట శవదహనము తర్వాత నస్థి సంచయమునకు సంబంధించినది

11. ఏ మొగమున : [కాశీ 5-324]

సిగ్గుపడుట తాను కూడని పనిచేసిన గాని, చేయదగునది చేయకపోయిన గాని, తన మొగమును కావలసిన వారికి చూపకుండుట జరుగును. అప్పుడు ఎదుటివారేమందురోయని మొగము చాటుచేసికొని. ఏ మొగముతో వారి యొద్దకు పోగలను అని. అనగా ఈ ముఖమును చూపించజాలనని భావము.

12. ఒక కుత్తుకయగు : [హర 2-60]

'ఏకగ్రీవము' అను దాని కనువాదము కావచ్చు ఏకాభిప్రాయమునకు వచ్చు. ఒకేమాటపై నుండునని యర్థము

13. ఒట్టుపెట్టిన యట్లు : [కాశీ 7-136]

ఒట్టనఁగా ప్రమాణము. సాధారణమగు పలుకుగాక, దానికి కొంత యెక్కువ విలువ నిచ్చుట. ప్రమాణమును సచుకూర్చునది సామాన్యపు శక్తిగాక యసాధారణశక్తి.

---

3 అదిరిపడేవాడు, ఒకతిట్టు - పదబంధపారిజాతము - ప్రథమ సంపుటి,

14. ఓంకార మాచరించుట : [కృ.నై 2-69]

అంగీకరించుట. సంస్కృత భాషయందు అంగీకారమును సూచించుటకు 'ఓ' మ్మని యనుట సంప్రదాయము.

15. కడుపారసిపెట్టు : [శివ 3-19]

కడుపు చూచిపెట్టు ఆకలి తీరునంత దనుక ఆదరముతో భోజనము పెట్టుట.

16. కనుఁగాపు : [హర 3-11]

దాసానుదాసుడు. కనుసైగను గ్రహించి పనిచేయు సేవకుడు.

17. కన్ను మొఱఁగు : [భీమ 1-111]

మోసగించు. కనుచాటు చేసికొని కనిపింపకుండ మోసము చేయుట.

18. కాటఁగలియుట : [హర 2-99]

నాశనమగుట 'కాడు' అనగా స్మశానపనియు, అడవి యనియు నర్థము. కనుక కాటియందు కలియుట యనగా మరణించుట యని భావము

19. కానకకన్న సంతానము [కృ.నై 1-108]

లేకలేక పుట్టినబిడ్డ

2 . కుక్కలుం బడని పాటులు : [హర 3-15]

చాల యగచాట్లు పడుట కుక్కలను నీచముగా చూచు పద్ధతిపై నేర్పడిన పలుకుబడి కావచ్చును.

21. కూపమండూకము : [భీమ 1-13]

ప్రపంచము తెలియనివాడు నూతిలోని కప్పకు తానున్న నూయియు, పైనున్న ఆకాశమును కాక యితరములెట్లు తెలియవో యట్లేయని భావము ఆ కప్ప ప్రపంచమంతయు నింతియ యనుకొనును అట్లే అల్పపరిజ్ఞానము కలవాడును తెలియక యిట్లే అనుకొనును. కూపస్థమండూక మని వాడుక.

22. కొంగు బంగారము : [క్రీడా 52]

సులభసాధ్యమైనది. మిక్కిలి అందుబాటులో గలది.

23. కొండపట్టుట : [కాశీ 6-21]

దేశాంతరగతుడగుట. తలదాచుకొనుటకై తిప్పలు పడుట.

24. కొయ్యతనము : [కాశీ 4-94]

దుడుకు పనులు చేయుట దయలేక దుడుకుగా ప్రవర్తించి ధూర్తతతో పనులు చేయుట.

25. గర్భయాచకులు : [హర 3-15]

పుట్టిన నాటినుండి బిచ్చగాండ్రు. ఆగర్భ శ్రీమంతుడు, గర్భదరిద్రుడు గర్భశత్రువు మొదలగు వానివలె నీపలుకుబడి కూడ ఏర్పడినది.

26. గుమ్మడి మూటా కట్టుట : [క్రీడా 45]

గుమ్మడి పండు నాకారములో నున్నమూట. గుండ్రముగా నున్నమూట

27. గొడ్డువీగుట [కాశీ 4-87]

సంతానము కలుగుట. వంధ్యాత్వము పోయిన దనుట.

28. చంకదుడ్డు శరణార్థి [హర 7-17]

అననురూప ప్రవర్తన. పైకి అభయమును కోరుచు వచ్చినటుల నటించుచున్నను వీలుచిక్కినచో కొట్టుటకు చంకలో కఱ్ఱను దాచికొని వచ్చినటుల ప్రవర్తించుట.

29. చంకల బంటిగా మెసవుట : [క్రీడా 56]

ఎక్కువగా తినుట. ఉదరము బాహుమూలముల వరకు వచ్చునట్లుగా తినుట. గొంతువఱకు తినుట అనుపలుకుబడి వాడుకలో గలదు

30. చందమామఘుటికి : [శివ 2-135]

అలభ్యమగునది యని అర్థము చందమామను చూపుచు వట్టి ప్రేశ్చు నోటిలో పెట్టగా వారు చప్పరించెదరని యర్థము. చందమామనే గుళికగా భావించి దానిని మ్రింగ ప్రయత్నించు వారికది యలభ్యము. అట్టివాడు గుటకలు మ్రింగ వలసినదే

31. చచ్చి బ్రదుకు : [శృం.నై 2-138]

చచ్చినంతటి ప్రమాదము వచ్చియు గండము గడచి జీవించుట. పునర్జన్మ సదృశమగుట. 'ఈ జబ్బులో నాయన 'చచ్చి బ్రతికినాడు' అని వాడుక.

32. చిలుబంటి పసుపాడు : [భీమ 2-28]

స్నానము చేయుట. గాఢమైన చాయగల ఒకవిధమగు బంతిపూల చాయ పసుపని యర్థము. స్త్రీలు స్నాన సమయమునఁ బూసికొను పసుపు పూఁత.

33. చిప్పకుఁ జేయిసాఁచుట : [కాశీ 6-180]

యుద్ధమును గోరుట. కలహమాహ్వానించుచు చేయి సాచుట. కయ్యమునకు కాలు ద్రవ్వుట వంటిది.

34. చెట్టునఁ బుడికినట్లుండుట : [కాశీ 7-234]

అచ్చముగా నుండుట. చెట్టునఁగోసిన దెబ్బ మార్పులు లేకుండ నచ్చమై యుండునో యట్లే యుండుట. కృత్రిమ వేషమైనను సహజముగా నున్నదా యను నట్లుండుట. చెక్కను చెక్కినట్లుండుట - అని పదబంధ పారిజాతము

35. చెడ్డి[illegible] చెదారము : [కాశీ 4-91]

ఎవరి పోషణ లేక తనకు తానుగా పెరుగు వ్యక్తి

36. జలంబు పాలగుట [శృం.నై 8-79]

నశించుట వరదపాలగుట

37. డస్సి దట్టమగు : [కాశీ 6-44]

చచ్చినంత పనియగు, పూర్తిగా అలసిపోవు చర్మకారులు పశువుల చర్మమును దట్టమని వ్యవహరింతురు జీవకళలు లేక వట్టి తోలు మాత్రము మిగిలినదని యనుట.

38. తిలలు పైకెత్తి చల్లిన దిగువబడని యంతటందడి :

[శృం.నై 4-123]

జనము చాల క్రిక్కిరిసి యుండుట. 'ఇసుక చల్లిన రాలని' అని వాడుక.

39. ట్రాడువడుట : [భీమ 4-107]

నిస్సత్త్వమగుట వివశతవలన నిస్సత్త్వమగుట. త్రాటివలె సన్నవడి బలహీనపడి చైతన్యము తరుగుట.

40. దర్శనమిచ్చుట : [కాశీ 4-66]

కానుక సమర్పించుట. రాజులు మొదలగు పెద్దలనుగాని పసిబాలురనుగాని చూచుటకు పోవునపుడు వట్టి చేతులతో పోకూడదు. కనుక వారికేదైన బహుమానమును తీసికొని పోవుటను బట్టి దర్శనమునకు కానుక యను నర్థ మేర్పడి యుండును.

41. నట్టేట ముంచుట : [ప.వి 110]

నాశనము చేయుట నట్టేటిలోనికి తీసికొనిపోయి యచట ముంచిన చచ్చుట నిక్కము. అట్లే యేదేని వ్యవహారమున మధ్యలో మోసగించుట

42. నీడతోంచుట : [హర 4_52]

నిర్మలముగా నుండుట. ప్రతిబింబము కనిపించునంతగా తేటయుండుట.

43. నెత్తిం జేతులిడుట : [కాశీ 2-156]

చాల దుఃఖించుట. నెత్తిమీఁదఁ జేతులిడుకొనుట దుఃఖసూచన నేడు నెత్తిన జేతులిడుట అనగా మోసమువలన, నాశనము చేయుటకు వాడుచున్నాము

44. నోరుమాలిన జంతువు : [కాశీ 5_335]

మూగ జీవమనుట. మానవేతరములగు జీవములు మాటాడలేవు. దానినే యొత్తిచెప్పుట యిచ్చట జరిగినది.

45. పండ్లు గొఱుకుట : [శృ.నై 7-130]

కోపోద్రేకము కలుగుట. కోపాతిరేకమున పండ్లు కొఱుకుటను బట్టి యేర్పడిన నుడికారము.

46. పాఱెడు నీళ్ళకుఁ గట్టపెట్టుట : [కాశీ 7-122]

ప్రయోజనకారి కాదనుట, అట్టిపనిచేయ బూనుట అవివేకము.

47 పులియుట : [కాశీ 7–133]

విఱ్ఱవీఁగుట. పులిసినవస్తువెట్లు మత్తును కలిగించునో యట్లే మదించి విఱ్ఱవీఁగుట.

48. మాయలేడినిబట్టి కట్టుట : [హర 3–145]

దుర్ఘట కార్యము. రామాయణములోని మాయలేడినుండి యేర్పడిన నుడికారము.

49. ముక్కు మొగము చూచుట : [భీమ 3–8]

మోమోటపడుట.

50. మూడుకాళ్ల ముసలి : [శృ నై 1–108]

చాలముసలి యనుట. ఊతకోల లేనిదే యడుగిడలేని స్థితి. ఆలంబన యష్టియే మూడవకాలు.

51. మగవాఁడో ద్రిమ్మరో : [హర 2–100]

మొరటు స్వభావము కలవాడని యర్థము ద్రిమ్మరివలె నెట్టి సుఖదుఃఖములు కలుగక యుండునని యనుట. వట్టి మొద్దు అని భావము.

52. విభూతి వెొసఁగుట : [హర పీ 14]

భోజనమునకు లెమ్మనుట. గంధాక్షతలు భోజన సందర్భమున నిచ్చినట్లే శైవులు విభూతి నిత్తురు

53. విస్తరి బండికన్నగుట : [ప.పీ 91]

పెద్దదిగా కనిపించుట విస్తరివంటి చిన్నవస్తువైనను బండిచక్రమువలె పెద్దదియైనట్లు కనిపించుట. భయంకరముగా నుండుట.

54. శివార్చన చేయుట : [హర 2–47]

భోజనము చేయుట. దేవతార్చనయైన తరువాత భోజనము చేయుట శిష్టుల పద్ధతి. ఇట శైవులు కనుక స్పష్టార్థప్రతిపత్తికై శివార్చన చేయుట

55. శివశివా : [భీమ 3–126]

ఎంతో యదృష్టము కలిగెనని అభినందించుట. వేటికాలమున 'శివశివా !' 'రామరామ !' అని పలుకుట కష్టసమయముననే.

**56.** సంచకరము : [శివ 3-68]

వెల నిర్ణయింప బడిన తర్వాత, వ్యవహారమును గట్టిచేసికొనుటకై యిచ్చి పుచ్చుకొనెడి సొమ్ము (advance).

ఇట్టి నుడికారములు శ్రీనాధుని కవితలో అసంఖ్యాకములుగ నున్నవి. అందు వివరణాపేక్ష లేని కొన్నింటిని ఉదాహరింతును.

1. 'పేలగింజయుం బెద్దయయ్యెనే' [శృ.నై 1-110]
2. 'కన్నులు చల్లగా' [శృ.నై 2-86]
3. 'ఒడలెల్లఁగన్నులై' [శృ.నై 6-66]
4. 'దరహాసము ఔప్పలఁ దొంగలింపగాన్' [శృ.నై 6-10]
5. మిండతుమ్మెద పదువులు [శృ.నై 2-54]
6. 'పూటకాపు' [శృ.నై 2-86]
7. వినుకలిఁ గూర్మి [శృ.నై 2-54]
8. వాలికమించుఁ గన్గొనలు [శృ.నై 2-112]

తామర తంపరయైన ఈ తెనుగు పలుకుబడి నుడికారములన్నియు శ్రీనాధుని కావ్యోద్యానమున పూల జొంపములై కుసుమించి గుబాళించు చుండును. శ్రీనాధుడనిన ప్రతిభా వ్యుత్పత్తులు రెండును కరగఁ బోసిన రూపము కవితా బాహ్య రూపమైన పద్యరచనలు, పదగుంఫనము, నుడికారపుసొంపు, భావశిల్పములలో ఈతని మార్గమొక యనన్య సాధారణమైనది.



# సింహావలోకనము (SUMMARY)

శ్రీనాథ భాషాపరిశీలనయందలి సారాంశమిందు ప్రదర్శితము

## 1. వర్ణ విజ్ఞానము : (Phonology)

1 శ్రీనాథుని భాషను దేశ్య తద్భవ పద ఘటకములయిన వర్ణములు, తత్సమపద ఘటకములయిన వర్ణములని రెండు విభాగములుగ విభజింప వచ్చును. [1-0]

2. 24 హల్లులు, 10 అచ్చులతో కూడిన దేశ్య తద్భవ వర్ణమాల ఉన్నది. [1-1]

3 మహా ప్రాణములైన స్పర్శములు, ఊష్మములు, హకారము తత్సమపద ఘటకములుగా ప్రయోగవశమున తెలుగులోనికి ప్రవేశించినవి [1-1-1]

4. ఙ-, య-, శ- వర్ణములు తప్ప మిగిలిన హల్లులన్నియు పదాది యందు వచ్చును అచ్చుల మధ్య హల్లులన్నియు వచ్చును పదాది దీర్ఘాచ్చులలో ఊ/కు తప్ప మిగిలిన వానికి పరముగా ద్విరుక్త హల్లులు లేవు. /ఙ/ వర్ణము తప్ప మిగిలిన హల్లులన్నియు పద మధ్యమున ద్విత్వము పొందును. /ట/, /స/, /ఞ/, /ఙ/, /శ/, /ఱ/ వర్ణములలో హల్సంయోగము లేదు. [1-1-2]

5. సకార ద్విత్వము తోడి రూపములు అరుదుగా కనిపించు చున్నవి. [1-1-2-1]

6. శ్రీనాథుని భాషలో స్పర్శము + తాడితము, ఊష్మము + తాడితము, అనునాసికము + తాడితము, అంతస్థము + తాడితము లో కూడిన హల్వర్ణములతో రేఫము పదాదియందు సంయుక్తత పొందును [1-1-2-2]

7. శ్రీనాథుడు ఋ, ర లకు ప్రాస స్థానమున, ఋ, రి లకు యతిస్థానమున మైత్రిని ప్రదర్శించెను [1-1-5]

8 శ్రీనాథుని కాలము నాటికి శకట రేఫ జ్ఞానము కొందరు పండితుల గ్రంథముల యందును, కవుల గ్రంథముల యందును, కొలదిగా నిలచినది. శ్రీనాథుడు రేఫ శకట రేఫలను యతి ప్రాసలలో ప్రత్యేకముగా వాడెను.

సాధురేఫమునకు, శకట రేఫమునకు ప్రాస వేయుటకు కూడ శ్రీనాథునకు అభ్యంతరము లేదు. శకటరేఫము తరువాతి హల్లుతో సంయోగము చెందినపుడు సాధురేఫ మగుటకు లక్ష్యములు లభించు చున్నవి. [1-1-6]

9. హకారాదిగా వాడబడిన పదములు దేశ్యేతరములందు కలవు. ప్రతిపదోక్తావ్యయము లందు హకారము పదమధ్యమునందును పదాంతమందును గోచరించును. [1-1-7]

10 సార్థ బిందు నిర్బిందు ప్రాసను శ్రీనాథుడు వాడెను. [1-1-8]

11. 'ఏని' శబ్దము ద్రుత ప్రకృతిముగను, కళగను కూడ వాడినటుల తెలియు చున్నది [1-1-9]

12. తద్భవ రూపమును బట్టి జ్ఞకారమునకు 'క' కారముతో యతి వేసెను. [1-1-10]

13 వర్ణ విజ్ఞాన విషయమున శ్రీనాథుని భాషలో గుర్తించిన విశిష్ట ప్రయోగము సూచితము. [1-1-11]

14. అచ్చుల దీర్ఘత యందలి రూపాంతరత [1-2-1], అచ్చుల గుణము ననుసరించి రూపాంతరత [1-2-2] హల్లుల యందలి రూపాంతరత [1-2-3] శబ్దరూప వైవిధ్యమును గూర్చి సోదాహరణముగ వివరింపబడినది. [1-2-4 – 1-2-21]

## 2. సంధి విజ్ఞానము : (Morpho-Phonemics)

15 అచ్చు + అచ్చు, అచ్చు + హల్లు, హల్లు + అచ్చు, హల్లు + హల్లు – అని నాలుగు విధములుగ సంధులలో వచ్చు మార్పులు వర్గీకరింపబడినవి. [2-1-0]

16. శ్రీనాథుని కావ్యభాషలో వాక్యాంతము పాదాంతమగునపుడు సంధిలేకపోవుట గమనింపదగిన విషయము. [2-1-2]

17 సంస్కృత సమములయందలి అత్తునకు సంధి జరుగుట ప్రత్యేకత [2-1-3]

18. అవ్వి, ఇవ్వి, అను సర్వనామములతో కూడి సంధి కావింపబడిన ప్రయోగములు కానరాలేదు. [2-1-4]

19. మధ్యమ పురుషేకార సంధి వైకల్పికముగ జరుగుచున్న సన్నివేశములు కలవు. [2-1-4-5]

20. క్త్వార్థకేకార సంధి వైకల్పికత్వము నొందు ప్రయోగము కలదు. [2-1-4-6]

21 తత్సమ శబ్దములందలి ఇత్తునకు అచ్చు పరమగునపుడు శ్రీనాథుని భాషలో సంధి నిత్యముగా నగుచున్నది [2-1-4-10]

22 -గ, -ట, -డ, వర్ణములతో [త్రికసంధి విషయమున] ద్విత్వము నొందిన రూపములు లేవు. [2-2-1-2]

23 బహువచన శ్లిష్టమైన ళువర్ణము కొన్నియెడల ఉత్వద్విత్వములను, కోల్పోవుట గలదు. [2-2-2]

24. గ స డ దవాదేశ సంధి యందు 'ట' కారము 'డ' కారముగా మారిన ప్రయోగములు లేవు. [2-2-3-1]

25. గ స డ దవాదేశ సంధి యందు సాంస్కృతిక 'ప' కారమునకు 'వ' కారమాదేశమగుట కలదు. [2-2-3-2]

26. 'ఎల్లన్ శిష్యులు' అని ద్రుతముతో విశేష్యమునకు ముందు ప్రయోగము కలదు. [2-3-6]

27 ధ్వన్యనుకరణము నందు శబ్దము పునరుక్తమగును. అట్టి యెడల పూర్వాంగము తుది యచ్చునకు దీర్ఘము వచ్చిన రూపములు కలవు. [2-3-8]

28. అనుకృతిని ఔకారము సంస్కృతములో వలెనే 'అవ్' అని మారుట శ్రీనాథునిలో నొకచోట కనిపించు చున్నది [2-3-13]

29. -న, -ము, -టు, -పు, -రు, -అలి ఆగమములగు చున్నవి. [2-5-0]

30. షష్ఠీ సమాసమునందలి పదాంతమైన ఉత్తునకు అచ్చుపరమైనను నకారము రాదు. [2-5-1-2]

31 ఉదంతములకు కొన్నియెడల -కున్ ప్రత్యయము పరమగుచున్నను నగాగమము వచ్చుట లేదు. [2-4-1 6]

32. -వు, -ంపు. -ట్టు, -ంప/-ప, -ట్ట అను వర్ణములు ఆదేశములుగా వచ్చును. [2-6-0]

33 ద్విరుక్త టకారాదేశమున 'కుఱు' తోడి ప్రయోగము మృగ్యము. నిట్టుపాసము[భీమ 2- 06] అను ప్రయోగము అపవాదము. [2-6-2]

## 3. నామరూప విజ్ఞానము : (Noun Morphology)

34. 52 క్రియాధాతువులెట్టి మార్పును లేకయే నామవాచకములుగా వాడబడినవి [3-1-2-1]

35 -ఇకి -క, -టు, -త. -పు, -ి, -వు అను ప్రత్యయములు ఆదేశములు గను. మిగిలినవి ఆగమములుగను వచ్చి 36 కృత్ప్రత్యయములు ఏర్పడి నవి. [3-1-2-3]

36 35 ప్రత్యయముల చేరికచే త్వార్థ, స్వార్థ, భావార్థ, పరిమాణార్థ,మతుబర్థ దఘ్నార్థములయందు తద్ధిత రూపము లేర్పడినవి. [3-1-2-4]

37. ప్రాతిపదిక ఎట్టిమార్పును చెందని రూపము, ఉత్వము చేరి మహద్వాచక ప్రత్యయమైన -ండు/-డు చేరని రూపములు [3-2-1-1] ప్రాతిపది కకు మహద్వాచక ప్రత్యయము చేరియు, చేరకయు నేర్పడిన రూపములు గలవు. [3-2-1-1]

38. 'ముద్' 'సంపద్' అను దకారాది ప్రాతిపదికములగు శబ్దములు రెండే కలవు [3-2-2-6]

39. గీష్పతి, ముష్టాముష్టి, బాహాబాహి కానినేయుడు, గ్రహయాళువు, పతయాళువు, బాలకి, ప్రౌఢిమ, గాణాపత్యము మున్నగు అపాణినీయ తత్సమ రూపములు కలవు. [3-2-3]

40. శ్రీనాథుని కభీష్టములైన విశిష్ట తత్సమ ప్రయోగములు వేరుగా ప్రదర్శింప బడినవి. [3-2-3-1]

41. అమహద్వాచకములకు లింగబోధక ప్రత్యయమైన -ము వర్ణము లోపించు చున్న విశిష్టరూపములు చూపుట జరిగినది [3-2 3-2]

42 పుంలింగ మహద్వాచక రూపములకు బహువచనము పరమగునపుడు 'వు' వర్ణము లోపించిన ప్రయోగములు గలవు [3-2-3-3]

43. శ్రీనాథుడు కొన్ని రూపములను తనకాలమునాటి వ్యావహారిక భాషనుండి గ్రహించి యథాతథముగ ప్రయోగించెను. [3-2-3-4]

44. ప్రాకృతసమ ప్రాకృతభవముల ధ్వనిపరిణామములందు : పదాది స్వర వర్ణముల [3-3-1-1] అపదాది స్వరవర్ణముల [3-3-1-2] పదాది వ్యంజనవర్ణముల [3-3-1-3] అపదాది వ్యంజనవర్ణముల [3 3-1-4] అపదాది అనునాసికయుక్త స్పర్శవ్యంజనవర్ణముల [3-3-1-5] అపదాది ద్విరుక్త వ్యంజనవర్ణముల [3-3-1-6] ధ్వనిపరిణామములు సోదాహరణముగ వివరింపబడినవి

45 పదాది వ్యంజనములైన గ- < ఘ- ల మధ్య, ప- < భ- ల మధ్య ధ్వనిపరిణామము చాల అరుదు పరిమిత పదములందు మాత్రమిది ప్రవర్తితము [3-3-1-3]

46 సమీప ప్రాకృత యందు సకార ద్విత్వమున్నను దానిని సకార ద్విత్వముగా మార్చి వైకృతముగా రూపొందించుట ప్రాచీన భాషా స్థితికి ముఖ్య లక్షణము. కాని సంస్కృత ప్రభావము గాఢమయిన శ్రీనాథుని దశలో సకార ద్విత్వ ఘటిత రూపములను యధాతథముగా వైకృతములయినవి. [3-3-1-3] [IV]

47 బ- < వ- ల మధ్య ధ్వని పరిణామము తెలుగున కన్నడ ప్రభావము వలనను ప్రత్యేకముగను ఏర్పడి యుండ వచ్చును. [3-3-1-3]

48 -త- < -త- ల మధ్య అల్పధ్వనిగా 'త' నిలుచుట ప్రాకృతమున విపరీతము కావున ఈ ధ్వని పరిణామము చాల అరుదు. [3-3-1-4]

49 సంస్కృత భవముల ధ్వనిపరిణామమునందు . పదాది స్వరవర్ణముల [3-3-2-1] పదాది వ్యంజనవర్ణముల [3-3-2-2] అపదాది వ్యంజన

వర్ణముల [3-3-2-3] అపదాది అనునాసికయుక్త వర్ణముల [3-3-2-4] ధ్వనిపరిణామములు సోదాహరణములు వివరింపబడినవి.

50 సంస్కృత భవములలో పదాది రేఫఘటిత, సంయుక్తత యందలి రేఫము లోపించుట విభాష. [3-3-2-3] [2]

51. శ్రీనాథుని కాలము నుండి అన్యదేశ్య పదజాలము మన కావ్యములలో ఎక్కువగా వాడుకలోనికి వచ్చినది. అన్యదేశ్య ప్రయుక్తియందు శ్రీనాథుడు ప్రథముడు కాకపోయినను ప్రముఖుడు. [3-4-0]

52. శ్రీనాథ ప్రయుక్త అన్యదేశ్యములు 69. వాని రూపాంతరములు 7 మొత్తము ఆరోపములు 76 [3-4-1]

53. అరబ్బీ పారశీకాద్యన్యసీమలలోని భాషలకు నిసర్గములయి ప్రత్యక్షముగా పారసి నుండిగాని, పరోక్షముగా మరాఠీ భాషాముఖమున గాని ఎరవు పదములుగా తెలుగునకు వచ్చినవి 43. [3-4-2]

54. మరాఠీ భాషకు నిసర్గములయి తెలుగున ఆదేయములగు అన్య దేశ్యములు 13. [3-4-3]

55. మరాఠీ, పారసీ, అరబీభాషలలో ప్రవర్తితములై తెలుగులో ప్రవేశించి శ్రీనాథప్రయుక్తమైన అఱువది అన్యదేశ్యములకు వ్యుత్పత్తి వివరణము లీయబడినవి. [3-4-5]

56. కప్పలి, గోవ, జలనోంగి, జాళవా, జోఁగు, ఢిల్లి, తరుణాసీరి, తవాయి, పంజార, పండువా, భోట, యాంప, రమణా, వలికా, వల్లి మొదలగు అన్యదేశ్యములకు వ్యుత్పత్తి వివరణము లీయబడినవి. [3-4-6]

57. అన్యదేశ్యములలో కొన్ని పదముల ధ్వని పరిణామము ప్రదర్శితము. [3-4-7-0]

58. సమాసములలో నొకయంగము గా అన్యదేశ్యముండుట వివరింపబడినది. [3-4-7-4]

59. సజాతీయ సోదర భాషలగు కన్నడ, తమిళముల నుండి ఎరవు తెచ్చిన పదములు శ్రీనాథునిలో కలవు. వాని వివరణ మీయబడినది. [3-4-8-1, 3-4-8-2]

60 దీనారము, దివాణము. పోటి, దేహారము, మొదలగు అన్యదేశ్యములకు ఆశ్రయములు మృగ్యములు. [3-4-9]

61 నేను శబ్దము ఏను శబ్దము కంటె పెక్కు పర్యాయములు ప్రయోగించి నను, నిర్ధారక ప్రయోగము లేమి ఏను శబ్దమునే శ్రీనాథుడు ప్రయోగించె ననుట సమ్మతము. [3-5-5-1]

62. యుష్మదర్థక ప్రథమా బహువచనమున 'ఈరు' అనురూపముతో ఒకే ఒక ప్రయోగము కలదు. [3-5-5-2]

63. మీరు, వారు, వీరు, తాము - అనునవి బహువచనములైనను వానికి పూజ్యార్థమున మీరలు, వారలు, వీరలు, తమరు అను ద్విగుణిత బహు వచనముతోడి ప్రయోగములు కలవు. గౌరవ వాచకమున ఏకవచనమునకు బదులు బహువచనము వాడబడినది. [3-5-5-7]

64. ప్రథమ పురుష మహద్వాచక బహువచనమున 'వాండ్రు' అను రూపము ఒకే పర్యాయము ప్రయుక్తము. [3-5-5-9]

66 మహద్వాచక ప్రథమ పురుషైక వచన సర్వనామములైన 'వాఁడు, వీఁడు, ఎవ్వఁడు,' మహతీవాచకము నందలి 'అది' మొదలగు రూపములు ఆధునిక భాషలోనైనట్లు అగౌరవ సూచకములు కావు. [3-5-5-10]

66. ఎవ్వఁడు, ఎవ్వరు అను ప్రశ్నార్థక సర్వనామములు ద్విత్వ రహితముగ శ్రీనాథునిలో రెండు సందర్భములలో ప్రయుక్తము [3-5-5 14]

67. ప్రశ్నార్థక సర్వనామమైన 'వేరు' అను రూపము 'ఎవరు' అను నర్థమున శ్రీనాథునిలో కన్పించుచున్నది [3-5-5-15]

68 కొన్నియెడల మహద్వాచకముగా 'అది' అను సర్వనామము ప్రయుక్తమై కన్పట్టు చున్నది. [3-5-5-18]

69. మధ్యవర్తి నిర్దేశించు సర్వనామమైన 'ఉల్ల' తోడి ప్రయోగము శ్రీనాథునిలో కలదు. [3-5-5-19]

70. ప్రాథమిక సంఖ్యావాచకములన్నియు నమహత్తుల నుండి నిష్పన్నము లైనవి. [3-6-0]

71. 'ఒండెన్' అనునది ద్రుతాంతమగు నవ్యయము దీనికి 'వికల్పము' నని యర్థము. ఇట్టి యర్థమున తొలుత శ్రీనాథుడే 'ఒండేనిన్' అని వాడినాడు 'ఒండెను' ప్రత్యేకముగా గూడ ప్రయోగింపబడెను ఇట్టి ప్రయోగము భారత కవులలో లేదు. [3-6-1-5]

72. సంకలనముచే, గుణకారముచే సంయుక్త సంఖ్యావాచకములేర్పడుచున్నవి [3-6-2]

73 'ఉన్' చేరక 'పదియేను' అను రూపము, పదేను అను రూపము శ్రీనాథుని భాషలో కలవు. [3-6-2-1]

74. ఒకట్ల స్థానమందలి సంఖ్యావాచకములు గుణకారము నొందుట శ్రీనాథునిలో తక్కువ. [3-6-2-2] [1]

75 నాలుగేన్ (4 లేక 5) ఆతేడు (6 లేక 7) అనిర్ధారకముగ శ్రీనాథుడు ప్రయోగించెను. [3-6-2-2] [3]

76. కుఱుచ రూపముగల సంఖ్యావాచకములకు -వురు, -గురు/ -రు అను ప్రత్యయములు చేరుటచే శ్రీనాథుని భాషలో వచనముతో కూడిన అనుబంధ నామము లేర్పడుచున్నవి. [3-6-4]

77. సార్వనామిక విశేషణ ప్రత్యయములైన -అగు, -ఔ/అవు/అప చేరుటచే సార్వనామిక విశేషణ సంఖ్యావాచకములు ఏర్పడుచున్నవి. శ్రీనాథుని యందు 'ఓ' తో కూడిన రూపములు లేవు. 'అవ' తో కూడిన రూపములు కలవు. [3-6-5]

78. -ఏసి అను ప్రత్యయము చేరి విభాజక సంఖ్యావాచక మేర్పడుచున్నది. [3-6-6]

79. స్వతస్సిద్ధ విశేషణములు, నిష్పన్న విశేషణములని విశేషణములు రెండు విధములు. [3-7-1]

80. స్వతస్సిద్ధ విశేషణములు గుణవాచక, నిర్దేశాత్మక, ప్రశ్నవాచక, సంఖ్యావాచక, పరిమాణాత్మక, ప్రకారార్థక, పరిగణనార్థక, అనిశ్చిత విశేషణములుగ విభజింప బడినవి. [3-7-2]

81. కాల, స్థాన, ఆకార, వర్ణ, దశా గుణాది భేదములచే గుణవాచక విశేషణములు విభజింపబడినవి. [3-7-2-1]

83. నామ, క్రియా ధాతు ప్రాతిపదికలకు కొన్ని ప్రత్యయములు చేరి విశేషణము లగుచున్నవి. [3-7-3-2]

83 కొన్ని నామధాతువులకు మహద్వాచకమున -ండు/-డు, మహతీవాచకమున -అలి, -అలు, -ఆడి, -ఆలు, -ఉక, -కత్తె/-కత్తియ, -త/-తి/-తె/-తు అమహద్వాచకమున -ంబు, -ము, -మ్ము అను లింగవచన బోధక ప్రత్యయములు చేరుచున్నవి. [3-8-0]

84 -ము, -బు, -రు/-ండ్రు, -లు బహువచనమున వచ్చు ప్రత్యయములు. [3-8-3]

85. 'దంపతి' అనునది సంస్కృతమున ద్వివచనము. తెలుగున సాధారణముగా 'లు' వర్ణమును చేర్చి వాడుదురు. శ్రీనాథుడు సంస్కృత సంప్రదాయము ననుసరించి లువర్ణము చేర్పకయే ప్రయోగించెను. [3-8-3-4] [19]

86. పేరటాండ్రు-రు, పెక్కండ్రు-రు, ఇల్లాండ్రు-రు అను ద్విగుణిత బహువచన.. లు గలవు. [3-8-3-4] [20]

87 లోహవాచకమైన 'బంగారము' నిత్యైకవచనాంతము. అయినను శ్రీనాథుడు బహువచనమున వాడినాడు. [3-8-3-6] [3]

88. శ్రీనాథునిలో క్రీడా విశేషమైన 'బొమ్మ పెండిలి' ఏకవచనాంతముగ ప్రయుక్తము. [3-8-3-7] [3]

89. ఔపవిభక్తికముల చేరికచే శ్రీనాథునిభాషలోని ప్రయోగములలో ఏర్పడిన మార్పు సూచింపబడినది [3-9-1-1]

90. ద్వితీయాది విభక్తుల నిర్మాణము [3-9-2]

91. -గురించి, -గుఱించి, -గుఱియించి, అను ద్వితీయా విభక్తి ప్రత్యయములు విశిష్టముగా గలవు. [3-9-2-1]

92 కూర్చితోడి ప్రయోగము నన్నయ, నన్నెచోడుల యందు లేదు తిక్కనలో ఒక పర్యాయమే ప్రయుక్తము కాగా శ్రీనాథునిలో 57 సన్నివేశములలో ప్రయోగములు కలవు. [3-9-2-1]

